సరస్వతీగ్రంథమండలి: ౪

# కాత్యాయని

(ఆఖ్యాయిక)

కావ్యపురాణతీర్థ విద్వాన్
జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ
ప్రధాన ఆంధ్రోపాధ్యాయులు, స్థానికోన్నతపాఠశాల, కడప




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా !

ఈయాఖ్యాయిక సంఘసంస్కారణ బోధకము, మాతృకహిందీభాష యందుఁ గలదు. హిందీభాషయం దుపన్యాసగ్రంథములను పేర నాఖ్యాయికలు (నవలలు) మెండుగనున్నవి. వీనిని గూర్చి మన్మిత్రులు పితృతుల్యులగు బ్రహ్మశ్రీ రాచకొండ అన్నయ్యశాస్త్రులుగారు శ్రీకాశీపురమున 1916 లో నేను విద్యనభ్యసించునపుడు తెలుపుచుండువారు. నా పురోవృద్ధిని వాంఛించు వీరు తత్కల్పనాచమత్కృతిని గుఱించి మఱి మఱి తెల్పుచుఁ గాశీపురిని వదలి వచ్చిన యనంతరము "గిరికుమారి" యను పేరున నుండు నీయాఖ్యాయిక యందలి కథాసంగ్రహమును వ్రాసి విస్తరించి వ్రాయనభిలషించిరి. తదాదేశము ననుసరించి యీయాఖ్యాయికను "కాత్యాయని" యను పేరున శక్తికొలఁది రచించితిని. ఇందు సంఘముననుండు మర్యాదలు వివరింపఁ బడినవి. ఇవి వ్యక్తిగతములుగా భావింపరాదు.

కేవలము సాంఘికమగు నీయుపన్యాస గ్రంథము స్త్రీవిద్య, పతిభక్తి, సదాచారతత్పరత, యువయువతీ విద్యాభ్యసనము, యాత్రలు, అనునవి ముఖ్యముగా నిందు వివరింపఁబడినవి. కుటిలవర్తనములు, వంచనములు, అసభ్యచరితములు ఆదృతిపాత్రములుగావని యిందుఁ దేలఁగల విషయము.

ఈయాఖ్యాయిక వ్రాసి ముప్పదివత్సరములు దాఁటినను ముద్రించి లోకమున కందించు నదృష్టము నాకుఁ బట్టకయుండినది. భగవతీ కరుణవలన శ్రీరాజమహేంద్రపురవాస్తవ్యులు, నాయభ్యుదయమును వాంఛించు గురుతుల్యులు కళాభివర్ధనీపరిషత్సంస్థాపకులు బహుగ్రంథవేత్తలు, బహుగ్రంథ రచయితలు, ఆంధ్రగీర్వాణభాషావిశారదులునగు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు ప్రసంగవశంబునఁ గావించిన నా మనవిని విని యాదృతిమెయి యీయాఖ్యాయికను బ్రకటింప నుద్దేశించి వారిమిత్రులును, భాషాపోషకులును, నిరంతరగ్రంథ నిబంధనాసక్తులును, కవిపండితపోషకులును, సుప్రసిద్ధ వితరణశీలురును నగు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికిఁ దెలిపి ప్రోత్సహించి, ముద్రించి ప్రకటింపనంగీకరింపఁ జేసిరి. శ్రీశాస్త్రులుగారి యుపకృతియు, శ్రీసరస్వతీ పవరు ప్రెస్సు యజమానుల యాదరాభిమానములును విస్మరింపరానివి. సర్వదా సర్వథావారికి నాకృతజ్ఞతను దెల్పుచున్నాఁడను.

శ్రీసరస్వతీ ముద్రాక్షరశాల యజమానులగు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారు ఈయాఖ్యాయికను సంపూర్ణముగఁ బఠించి ననుసత్కరించిరి. ముద్రించి ప్రకటింపఁ బూనుకొనిరి, ఈ కార్యము కడుంగడుఁ బ్రశంసింపఁదగిన విషయము.

"యత్ర దాతా గృహీతా చ స్వయం కుశికనందనః" యన్నట్లు సంబంధమును గుదిరించిన శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి కృషి యనవరతము సంస్మరింప దగినది.

ఈయాఖ్యాయిక యందలి విషయము పాఠకలోకము గణుతించి యనుభవమున నుంచుకొనుటయే మద్వాంఛితము.

ఈగ్రంథమును పాఠ్యగ్రంథ నిర్ణాయకసభవారు ఉత్తమ కక్ష్యవారికిఁ గళాశాలలయందుఁ బాఠ్యముగ నిర్ణయింతురనియు, నా కృషికి నెంతయుఁ దోడ్పడిన శ్రీ సరస్వతీ ముద్రాలయమువారికిఁ గృతార్థత క్గలింతురనియుఁ బ్రార్థించువాఁడ.

శ్రీ శాస్త్రులుగారికి ముద్రాపకులకు నాధన్యవాదముల నర్పించుచు భగవతి సర్వకాలము ఆయురారోగ్యభాగ్యయశస్సుల ననుగ్రహించుఁగాక యని యభిలషించుచున్నాఁడ.

నిందతునందతు వాసన్నసూయు, రనసూయు రత్రకింతేన
యత్సన్మానస గమనార్హై వేయంమమతు పాథేయమ్.

శ్రీ లలితా విలాసము
కడప
హేమలంబ ఆషాఢ శుద్ధ ఏకాదశి

ఇట్లు విన్నవించు భాషాసేవకుఁడు
పండిత వశంవదుఁడు
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

# కాత్యాయని

సమయము సూర్యాస్తమయమున కించుక వ్యవధానము గలదియై యుండెను. యమునానది వంతెన కిరువంకలఁ గల దృశ్యము మిగుల మనోహరముగ నొప్పుచుండెను. పశ్చిమ దిశారమణీ పరిరంభణోత్సుకత నస్తాద్రి గుహాంతరంగముఁ జొరనరుగుచున్న సహస్రకిరణుని యరుణకిరణరేఖలు యమునానదీజల తరంగములమీఁదఁ బడి యోలలాడుచుండెను. వాయుసేవనమున కరుదెంచి వంతెన మీఁద నందందు నిలిచిన నరనారీమణుల సమూహములు చిన్నచిన్న జాతరలుగఁ జూపట్టుచుండెను. వంతెన మీఁద నుండువారలెల్లరును నచ్చట నాసమయమునఁ జూపట్టు మనోహర దృశ్యమును గని యపరిమితానందముతోఁ గూడిన మనస్సు గలవారగుచుండిరి. కాని యందిరువురు నవయౌవన విరాజితులు, చూచుటకు నుచ్చవంశజులుగను, భాగ్యవంతులుగను, ఆంగ్లవిద్యాసంపన్నులుగను, గనంబడుచున్నవారలు. ఒక యేకాంత స్థానమునందు నుపవిష్టులై, గాంభీర్యవదనులై యిట్లు ప్రసంశ మొనర్చుచుండిరి. అందొకని నామము ఆనందస్వరూపుఁడు. వేఱొకని నామము ప్రసిద్ధ నారాయణుఁడు.

ఆనందస్వరూ: ప్రసిద్ధా! లక్షణములు విలక్షణములుగఁ గానంగఁబడుచుండెను. లజ్జాసంకోచముల కిఁక నొక నమస్కారమిడవలసివచ్చు సమయ మాసన్నవర్తిగా నుండెను. మనజనకు లొరులు చెప్పుమాటలవంక ధ్యానము నిడువారు కారు. వారు పట్టినకుందేటికి మూఁడే కాళ్లనువారు. నాఁడు శ్యామాచరణుని తండ్రి 'నీకొడుకు తన యిచ్చవచ్చిన కన్నియఁ బరిణయమగుట కభిలషించుచుండిన నీకుఁ బ్రతిబంధక మేదియుఁ గలుగనేరదు' అని పరిపరివిధముల నా తండ్రికి బోధించి చెప్పెను. కాని, యీబోధన లాతనిమనమున కెక్కవయ్యెను. మన యిరువురి తండ్రులు నొక్కతీరువారు. ఇఁక మనము మన యభిప్రాయములను, నిర్భయముగ నిస్సంశయముగా మనతండ్రుల కెఱిఁగించుటకుఁదక్క వేఱొక యవలంబనీయమార్గము గోచరింపకుండెను. అపుడుకూడ వారి మనస్సులు మరలక యుండినచో వారి ప్రయత్నములకు విరోధము ప్రకటింపవలసినవారము కావలయును. ఇది నా నిశ్చయము. కాఁబట్టి నేను స్వయముగ నాజనకుని సమ్ముఖమునఁ గుముదవిహారీలాలు పుత్రికను వివాహము చేసికొనెదనని చెప్పెదను. ఆ మాట కాతఁడంగీకారము చూపనినాఁ డాజన్మాంతముగ నవివాహితుఁడనై యుండెదను. బ్రహ్మచర్యవ్రతము చేకొనియెదను. నీపుత్రికను బెండ్లి చేసికొనెదనని కుముదవిహారీలాలుతో శపథపూర్వకముగఁ బలికి

యున్నాఁడ. దానికి వ్యతిరేకముగా వేఱొకతెను జేపట్టుటకంటె బ్రహ్మచర్యవ్రత పరిపాలనమున జీవితమును ముగించుట శ్రేయస్కరముగఁ దోఁచుచున్నది. ఈ సందర్భమున నింతకు మిగిలిన యుపాయ మెద్దియు నాకు గోచరింపదయ్యె. నీకేదైన నుపాయాంతరము తోఁచినయెడఁ జెప్పుము.

ప్రసిద్ధనారాయణ: ఏమి చెప్పఁగలను. ఏమియుఁ దోఁచకయున్నది. ఇరువురొకే విధమగు రోగముచేఁ బీడితులగుచున్నపుడు, అందొకఁడు మఱొకనికిఁ జికిత్సా విషయమును, రోగ నిర్మూలనోపాయమును జెప్పుటకు సమర్థుఁడు కాఁగలుగునా? నీవు నాకంటె ననుకూల పరిస్థితులలో నున్నవాఁడ వనుటకు సందియములేదు. నీ తలిదండ్రులు నా తలిదండ్రులవలెఁ దమకుఁ దోఁచినట్లు చేయుటకుఁ గృతనిశ్చయు లైన వారు కారు. నీవిషయము విస్పష్టము. నీవు నీనిశ్చితాభిప్రాయమును నీజనకుని సమ్ముఖమున సవినయముగ విశదీకరించినయెడ నీ యభిప్రాయమున కాతఁడు ప్రతికూలముఁ జూపనొల్లఁడు. కాని, నా విషయమే శోచనీయము. నా జనకుని మాటకేమి, యది యటుండనిమ్ము. అతఁడొకప్పుడు నామాట నంగీకరించిన నంగీకరింపవచ్చును. కాని, నా జనని యమాయకురాలు. ఆమె యాధూర్తపండితుని మాయమాటల యెడ దృఢ విశ్వాస మూనియున్నది. రామచరణుని కూఁతును నేను పెండ్లియాడనినాఁడు నిజముగ నామె యాత్మహత్య గావించుకొనెదనని స్పష్టముగఁ జెప్పుచున్నయది. ఈ సందర్భములో నేనేమి చేయవలయునో చెప్పుము.

ఆనంద: చెప్పుటకేమియున్నది? మిత్రమా! తలిదండ్రులు తమ పుత్త్రీపుత్త్రుల వివాహ విషయములలో వారివారి యభిప్రాయముల గ్రహింపక, తమ యిచ్ఛానుసార మొనర్చుటకుఁ బ్రాబల్యము వహించుటకు బద్ధకంకణులగు చుండుటకేల బాధ్యులు కావలయునో, నేను గ్రహింపఁజాలక యున్నాఁడను. వారలకుఁ జేకూర్చు సంబంధ మాజన్మాంతమగునది యని తలంపరు. వారి జీవితములను నేరితోఁ గడపవలయునో, వారిని, వారి యిచ్ఛానుసారముగ నెన్నుకొననీయరు. అనభిలషితములు, నననుకూలములు, నసంబంధములు, నసాదృశ్యములు నగు వివాహములు సలుపు భారమును, నిర్నిమిత్తముగ, నిరాలోచితముగఁ, దమపై వైచుకొనెదరు. తదనుభవమునకుఁ బరులఁబాలు గావించెదరు. వారేమి చిరంజీవులు కారు గదా? వారి యిష్టము వచ్చినటులు వారి పిల్లలకుఁ బెండ్లిచేసి వారి జీవితముయొక్క శేషమును ముగించుకొని వారి మార్గమున వారు వెళ్లుదురు. వారు సలిపిన వివాహముల ఫలముల ననుభవించువారు వారి పుత్రులు, వారి పుత్త్రికలు. వారి భాగ్యవశమున వారి కనుకూలురు అగు

వారలు సంప్రాప్తులయినవార లగుదురేని వారి జన్మములు సాఫల్యము లగును. లేదా దౌర్భాగ్యవశమునఁ బ్రతికూలురు ప్రాప్తులయిన విఫలములగును.

ప్రసిద్ధ : నీనా విచారణమువలన నీవిషయము యథార్థమైనదేయగు. కాని, సమాజమీవిషయమున ధ్యానమిడనినాఁడు, ఒక్కవ్యక్తిమాట యేరెచెవిని బడును? ఏరి హృదయము నాకర్షించును? రుంజవాయిద్యము ముందు సన్నాయి స్వరమును బోలినదిగాక మఱేమికాఁగలదు? ఈ విచారణకలవారలెల్లరుఁగూడి యొక్క ప్రబలసంస్థ నేర్పడి, వ్యాప్తిగావింపకయుండు నంతదనుక, ఈ విషయము కార్యరూపమునఁ బరిణతముగావింపఁ దలఁచుట కనువుపడదు. అట్లు తలంచుట బుద్ధిమంతుని లక్షణముగాదు. ఈ విషయమున నీవును నేనును జేరి యీ విషయమును బహిర్గతమొనర్చి కార్యరంగమున నిలువఁబడుటకును, కార్యముఖమున నిడుటకును, దలఁచిన వారమయిన, లోకులు "ఈ యవివేకులిరువురును నింగ్లీషు చదువువలన భ్రష్టులైనారు. విమతస్వీకృతులైనారు. తల్లిదండ్రుల లక్ష్యము సేయకున్నారు" అని పలుకఁ జూతురు. దూషింపఁ బ్రారంభింతురు. దాన సమాజమందుఁ గళంకితులమగుదుము. అట్లగుట న్యాయభిమతముగాదు. సమాజమున కనుకూలమగు వర్తనమును గలవారలమైయుండి ఈ విచారణమును, కాలానుగుణముగఁ గ్రియాత్మక రూపమునఁ బ్రకటితము గావింపవలయును. తల్లిదండ్రులు తమతమ పిల్లల వివాహములను, వారి యిష్టానిష్టములను బరిగణింపక, తమయిష్టానుసరణముగఁ గావించినయెడఁ, దద్వివాహములు, బహుసంఖ్యాకములు. అననుకూలములు, అనర్థకములు, విపద్భూయిష్ఠములు నగుచున్నవని సోదాహరణముగఁ జూపవలయు. అట్లగునేని యయ్యది యధికప్రభావశాలియగునది యగును. అంతేయ కాని, కేవలము, మన యిద్దఱవలన నోటిమాటవలన ... ...

ఆనంద : (ప్రసిద్ధునిమాట కడ్డము తగిలి) అయిననో, మనతలిదండ్రులు, మనయిష్టములకుఁ బ్రతికూలురును, వారి యిష్టముల కనుకూలురును, నగు కన్యలఁ దెచ్చి పెండ్లిచేసినచో, మనము కిక్కురు మనక పెండ్లియాడవలయుఁగదా? ఆ పెండ్లి యనుకూలముగానైనది గానినాఁడు, తన్మూలమున సంఘటితమగు భీషణపరిణామమును, మనఃపూర్వకముగఁ దలనిడుకొని, యనుభవింప సంసిద్ధపడవలయును. మన యనుభవమును లోకులకు గుణపాఠముగఁ జూపవలయుననియా నీ యాశయము. అటులయిన నయ్యది విస్పష్టముగ విశ్వాసఘాతుకము. దాన నొకనిర్దోషియగు కన్యను, బుద్ధిపూర్వకముగ, విపత్పరంపరలకు, జీవిత నష్టమునకుఁ బాలుగావింపవలయువారల మగుటకాక మఱేమగును?

ప్రసిద్ధ : కాదు కాదు. స్వప్నమందైనను నా యుద్దేశమది కాదు. అవివేకులును అశిక్షితలునైన స్త్రీలను, వివేకినులను, శిక్షితలను, గావించుటకుఁ దత్పతులు సర్వవిధములఁదగు పరిస్థితులు నేర్పఱుపవలయు. వారివలనఁ గలుగు కష్టముల ననుభవించుచు, వారి యవగుణములను బాఱఁద్రోలుటకుఁ గడంగవలయు. అప్పటికిని వారు చక్కఁబడనినాఁడు, మానవోచితవర్తనులు కాని నాఁడు, ఏదైననొక భీషణ సంఘటనము, సంఘటిత మగుట సంభవమగు. అపుడు తద్భీషణ సంఘటనా ప్రభావము, మహా ప్రభావశాలియై, సమాజ మందంతటను, వ్యాప్తమై లోకుల హృదయములను మార్మిక వేదనమునకుఁ బాలుగావించును. దాన లోకదూషణము కలుగఁ జాలదు. సరియేకదా? లోక సానుభూతి సంప్రాప్తమగు. జను లవివేకవతియగు నా యువతిని శిక్షితఁ గావించుటకుఁ, బాపము, తత్పతి పలుకష్టముల ననుభవించుచుఁ బలుయత్నము లొనర్చియుండె. కాని విఫలుఁడయ్యెను. పతి యెంత యోగ్యుఁడైనను, ఎంత మేధావియైనను, ఎంత భాగ్యవంతుఁడైనను, సతి యయోగ్యమగునేని, వాని జీవనము, కంటకావృతమగుటయే కాదు, నిరర్థకమైనదియు నగును. ఈడు జోడులను బరిశీలింపక చేయుపెండ్లిండ్లు విపన్మూలకములగుననుట కిదియే నిదర్శనము. కాఁబట్టి యిఁకముందు ఈడు జోడు లేని వివాహములు సాగనీయకుండుటకై తగిన యత్నమొనరింపవలయునని తమలోఁ దాము తలపోయఁ దొడంగుదురు. ఇట్టి సంఘటనలు రెండు మూఁడు సంఘటితములైనచోఁ, తత్ప్రభావ మంధసమాజమునకు హృదయవిదారకమగునది యగుటయే కాక, సమాజమందు సర్వవ్యాప్తి గనియున్న నిర్బంధవైవాహిక ప్రథారూపమగు ఘోరవ్యాధిని నిర్మూలనమొనర్చుటకు సిద్ధౌషదముగూడ నగును. నీవు వివరించిన చికిత్సావిధానమొకపుడు, రోగ ప్రాబల్యమునకు నిరోధము కల్గించుటకు శక్తికలదియగునేమో, కాని, రోగనిర్మూలన శక్తి గలుగఁగలది యెన్నటికిని గాలేదు.

ఆనంద : సరే, కాకపోవచ్చును. కాని, యింతవఱకు మనవిచారములు మతభేదమును కలిగియుండినవికావు. సమాజమందేదియైన నొక యుత్తమ ప్రథను, నయ్యది క్రాంతికారి యగునెడ, నద్దానిని, స్వయముగ నుపస్థితమొనర్చి ప్రచలితము గావింపఁదగదను నిప్పటి నీవిచారణము భీరోచితముగాని ధీరోచితముగాదు. లోకపరిహాసమునకు వెఱచి తత్ప్రథను, బ్రచలితము గావించుటయందు వెనుకంజ నిడఁ జొచ్చుట, మనోదౌర్బల్యమును బ్రకటితము గావించును. వేయిమంది వేయి విధములఁ బరిహసింపనిమ్ము. సమాజమునందుఁ బ్రకృతము ప్రచలితములై యరిష్టములను జేకూర్చుచున్న కురీతులను, నవశ్యముగఁ, బ్రకటిత రూపమున, బహిరంగముగఁ, బ్రబలఖండ

నము గావించుటకు, నున్ముఖుఁడ నయ్యెదను. నాయంతఃకరణమున, నుచితముగను లాభకారిగను దోఁచిన ప్రథ నెద్దానినైనను స్వయముగఁ బ్రచలితము గావించెదను. ఒక రాచరించునంతదనుకఁ దదాచరణమునకు వేఁచియుండను. పరాచరణము నభిలషింపను. ఇది నా సిద్ధాంతము. నా నిశ్చితము, నా కర్తవ్యము. నీయందు వలెనే నాయందును భీరుత్వము తనయధికారమును నెలకొల్పియున్నది. కాని, తదధికారమునకుఁ బ్రస్తుతపుఁ బరిస్థితిని, బ్రకృతపు వాతావరణమును, బరికించి యొక నమస్కారమిడి యందుండి వెలివడితిని. ఇఁక లోకు లనెదరని కాని, యాడెదరని కాని, పరిహసింతురని కాని వెనుదీయువాఁడను గాను. నేను సంకోచమును వీడి, సందియములను బోఁద్రోలి సవినయముగ, నా జనకునితో, పండిత కుముదవిహారి పుత్త్రికను వివాహము చేసికొనుటకు నిశ్చయమూని యున్నాఁడనని మనవి చేసికొనుటకుఁ దలఁచి యున్నాఁడను. ఇఁకఁ బ్రసిద్ధా! నీవిషయమును గూర్చి నే చెప్పునది ధ్యాన పూర్వకముగ నాలింపుము. ఆలించి తదనుసరణ మొనరింపుము. చూడుము. సమాజము పరిహసించు ననియెంచి క్రాంతికరుఁడ వగుటకు వెఱచి, జీవితనష్టమున కున్ముఖుండవు గావలదు. “రామచరణుని కన్య, వివేకహీన, అసభ్య. అయ్యది ద్విపాదపశువనుటకు నిసుమంతయును సందియములేదు. కాబట్టి నాకద్దానిని బెండ్లిచేయవలదు. మీరు వృద్ధులు. మూఁడుకాళ్ల ముదుసలులు. మీ త్రోవనుబట్టి, మీరు చన నున్నవారలు. అట్టి సమయమున నా బండను నా మెడకుఁ దగిలించుటకేల యింత పట్టును బట్టుచున్నారు. మీరు నాకుఁ దగిలించు బండయొక్క సంబంధము, నేఁడో రేపో వీడి పోవునది యగును, గాని, నా కన్ననో, నాజీవిత మున్నంతవఱకు వీడునది కాదు. కాబట్టి నన్ను దుర్భరమును, దుస్సహమును, నగు నా వివాహబంధమునకు నిర్బంధ పూర్వకముగ లోను గావింపకుఁ” డని నీ తల్లికి బోధించి చెప్పి, యామె మనసును మరలింపఁ బ్రయత్నింపుము. ఈ విషయముల నామెకు విస్పష్టముగ వివరించి చెప్పుము.

తెలుపుము. తడయకుము. నా చెప్పిన మార్గము ననుసరింపుము. మన మిరువురమును గలిసి సమాజమందలి నవయువకులలో, వారి యిష్టానుసారము, వారి కిచ్ఛయున్న చోట, వారికి సమ్మతమైన కన్యను, వారు పెండ్లియాడువారలగుదురేని వారి గార్హస్థ్య జీవనము సుఖదమైన దగును. గానివారి తలిదండ్రుల కిష్టమగు కన్యకను, పెండ్లియాడువార లగుదు రేని, వారి గార్హస్థ్యజీవనము, నిర్బంధముగ మెడకుఁ దగిలింపబడిన, బండకొయ్యలాగున, నిర్భరమై, దుస్సహమై, సుఖదమెన్నటికిని గానేరదని ప్రచలితము గావింతము. సంఘమందు నేదైన నొక సంస్కారము, నొక నూతన పథావలంబనము, అత్యంతావశ్యకము సంభవమైనపుడు, కర్తవ్యపరాఙ్ముఖత్వమూని తదవస

రమును, తత్సమయమును, సమాజమే గ్రహించి, సమాజమే సంఘమందుఁ దత్ప్రచారమును గాలింపఁగల దనియెడి యాశ యడియాసయేగాని వేఱొండుకాదు. అట్లెన్నఁడును జరుగనేరదు. సంఘసంస్కారము, సమాజసుధారకము, దేశహితము. ఎప్పుడును వ్యక్తిమూలకముగనే, యొకరిద్దరి వలననే సాధితము కాఁగలదు. సతీదాహనిరోధము (సహగమన నిర్బంధము) వ్యక్తిమూలకముగ సాధితమైనదనియు, సమాజము మూలముగ సాధిత మయినదనియుఁ, జూడనగును. నూతన ప్రథ నైద్దాని సైనను, నెంతటి శ్రేయోదాయకమయిన దయినను, ప్రచలితము గావించునపుడు, తత్ప్రచారకు లెంతఘనులైనను, నెంతటి మహనీయులైనను. వారిని ప్రథమమున సమాజము ద్రోహులుగనే పరిగణించును. గాని, పర్యాయమునఁ గీర్తిపాత్రులుగ నెంచఁగలదు. పూజ్యులుగను భావించును. ఇది మన మెఱింగిన విషయమే. ఇందుకు, బుద్ధుఁడు, రామమోహనుఁడు మొదలగు సంస్కారులే ప్రబల సాక్షులు. కాబట్టి ప్రసిద్ధా! నీ యభిమతమేమి? అడుగుచున్నాను. చెప్పుము.

ప్రసిద్ధ: ఇందరి మత సంబంధ మెద్దియును లేదు. ఇయ్యది వారివారి సిద్ధాంతాను సరణముగు. నిశ్చితానుకరణముగు. నీవిచారణములు నీకు విశ్వాస పాత్రములు. పాలనయోగ్యములు. నావిచారణములు నాకు విశ్వసనీయములు. పాలనయోగ్యములు. కాఁబట్టి నీసిద్ధాంతములను నీవిచారణములను ననుకరించి సామాజిక జీవనమున నీవుప్రవేశింపుము. నాసిద్ధాంతములను, నావిచారణములను ననుకరించి నేను ప్రవేశింతును. ఇదియే నాయభిమతము. ఈవిధముగ మన మిరువురమును, ప్రకృతసంఘమందుఁ బ్రచలితమయియున్న నిర్బంధవివాహరూపక దుష్కృత్యమును రూపడంచుటకునై చెరియొక మార్గమును గొని చెరియొక వంక కరుగుదుము. ఇం దేమార్గము, సుగమమును, సుకరమును సుఖదమును, హితకరమును, నగునది యగునో యామార్గము సమాజమునకుఁ బ్రదర్శింతము.

ప్రసిద్ధనారాయణుఁ డిట్లు మాట్లాడుచుండెను. అంతలో వంతెన మీఁదికి ధూమశకటము గడగడ నదురునట్లుగ నరుదెంచెను. అంతవంతెన మీఁద రైలు పడకవలనఁ గలిగిన మహాధ్వని యాయిరువురి కర్ణములు గింగురుపోవునట్లు చేయఁ జొచ్చెను. ఆధ్వని దుస్సహమగుటచేఁ బ్రసిద్ధ నారాయణుఁడు కర్ణకుహరములు మూఁతపడునట్లంగుళులఁ జెనుపుకొని "సోదరా! ఈధ్వని చెవులు బ్రద్దలుచేయుచున్నవి. సహింపనశక్యమగు చున్నది. లెమ్ము. వంతెన దిగుదము. చీఁకట్లు క్రమ్ముచున్నవి. ఇంటికి వెళ్ళుదము పద," మని పలికెను. ఆపలుకుల నాలించి యానంద స్వరూపుఁడు తనఘ్నులోచనములను సవరించుకొనుచులేచి నిలిచి, 'నిజమే

సోదరా! అంధకారారంభ మగుచున్నది. ఇల్లుచేరవలసిన సమయమేకదా !' యని ముందున కడుగిడెను.

చీఁకటు లలముకొనసాగెను. రాత్రి యెక్కువయయ్యెను. చుక్కలు మినుకు మినుకు మనుచుఁ గ్రమముగఁ గాంతివంతములు కాఁజొచ్చెను. వాయు సేవనమునకు నరుదెంచిన వారెల్లరును, దత్ప్రాంతమును వీడి తమతమ నివాసములకు వెడలిపోయి యుండిరి. మిత్రులిరువురును వంతెనపైనుండి దిగివచ్చి, యందుఁ దమకొఱకుఁ బ్రతీక్షించు చుండిన గుఱ్ఱపు బగ్గీనెక్కి కూర్చుండి తమతమ నివేశములకుఁ బ్రస్థితులైరి.

* * * * *

పండిత సతీప్రసాదు అలహాబాదులోని యొక గొప్ప సంపన్న గృహస్థు. శ్రీమంతుఁడు. వర్తకుఁడు. అహమ్మదాబాదు. బొంబాయి, సోలాపూరు, నగరముల యందాతనికిఁ బెక్కు కర్మాగారములు, వర్తక నిలయములు గలవు. అలహాబాదు నందాతనికొక బట్టలయడితి కలదు. బట్టలయంగడి యంతయు నాతని చేతిలో నిమిడియుండెను. ఆతని వర్తకము, వ్యాపారము, కోటిగుణిత మని లోకవాదము.

పండిత సతీప్రసాదు ఘూర్జరదేశస్థుఁడు. నాగర బ్రాహ్మణుఁడు. ఆతని తండ్రినాఁటి కాలము సామాన్యము. బాల్యజీవనము దారిద్ర్యావస్థలోనే ఘూర్జర దేశమునందు వ్యతీతమయ్యెను. ఆతని వివాహము అలహాబాదునందు సుసంపన్నతఁ గనియెను. ఆతని శ్వశురుఁ డయోధ్యావిహారీలాలు. అతఁ డలహాబాదులోని యొక ప్రఖ్యాత సంపన్న గృహస్థుఁడు. ఆతని కొక పుత్రికకంటె నతిరిక్తమగు సంతాన మెద్దియును లేదు. వివాహానంతర మాతని శ్వశురుఁడు, తన కూఁతును, నల్లునిఁ దన యింటనే యుంచుకొనియెను. అప్పటినుండియుఁ బండిత సతీప్రసాదు అలహాబాదు నందే నివాసమేర్పఱచుకొని వసించుచుండెను. పండిత సతీప్రసాదు శ్వశురుని వ్యాపారము ప్రథమమునుండియు సాగుచుండెను. అద్దాని నాతఁడరుదెంచి వృద్ధి యొనరించెను. అహమదాబాదు, బొంబాయి, షోలాపూరు నగరముల యందలి కర్మాగారముల యందలి కర్మాగార, వర్తక నిలయప్రతిష్ఠాపనములు ఆతనిచే సంపాదితములు.

పండిత సతీప్రసాదు వివాహితుఁడై యలహాబాదు నివాసమును గ్రహించుటకుఁ బూర్వము నుండియు నాతని శ్వశురుఁడు వ్యాధిగ్రస్తుఁడై యుండెను. వ్యాధి క్రమక్రమముగఁ బ్రబలమయ్యెను. సతీప్రసాదు తనమామగారికి స్వస్థతఁ జేకూర్ప వలయునని పలుపాట్లు పడియెను. పలు చికిత్సలు చేయించెను. కలకత్తా, కాశీ,

లక్నో మొదలగు నగరములలోని సుప్రసిద్ధులగు వైద్యులలో నాతనికిఁ జికిత్స చేయుటయం దేరును కొంటవడినవారులేరు. అతని మామగారు రోగమువలన నేడు సంవత్సరములు నిరంతర పీడితులై కష్టసహిష్ణుఁడై వ్యతీత మొనరించెను. గాని, పిమ్మట బ్రదుకునందు విముఖుఁ డయ్యెను. రోగనివారకములగు నౌషధ సేవనమాది గాఁగల ప్రక్రియల నన్నింటిని బోఁద్రోచి ముక్తిదమగు కాశీక్షేత్రమును జేరి భగవ న్నామ స్మరణయే శరణ్యముగఁ గొని యందు వసింపసాగెను. అతఁడు సంయోగ వశమున శ్రీ కాశీ వాసమున కరుదెంచిన నెల దినములలోనే ముక్తపదముఁ జూఱఁ గొనియెను. తన మామగారు కైలాసవాసమును గ్రహింపఁగనే యాతనికిఁ బండిత సతీప్రసాదు విపులమగు ధనమును వెచ్చించి విద్యుక్తముగ నూర్ధ్వదైహిక క్రియలను బూర్తియొనరించెను. శ్రీకాశీ, ప్రయాగ, గయ మొదలగు పుణ్యక్షేత్రములలో నాతని యాత్మతృప్తికై బ్రాహ్మణ సమారాధనములఁ గావించెను. ప్రజలు పండిత సతీప్రసాదు తన మామగారి యాత్మశాంతికై అతని కక్ష్యలోక సుఖ మలవఱచు టకునై యాతఁ డొనరించిన క్రియాకలాపములను, దాన ధర్మములను గని యాతని బహుభంగులఁ బ్రస్తుతుల నొనరించిరి. అయోధ్యావిహారిలాలు సతీప్రసాదుని పుత్ర ప్రాయముగఁ జేకొని నందులకు సాఫల్యముగ సతీప్రసాదాతని నుచితరీతిని నుద్ధరిం చెనని యాబాల గోపాలము చెప్పుకొనఁజొచ్చెను.

మామగారి యూర్ధ్వదైహిక క్రియా కలాపములు ముగిసినపిదపఁ బండిత సతీప్రసాదు, తత్సంపదనంతయుఁ దన వశమొనర్చుకొని తద్వ్యవహారమునంతటిని, దన నామమున యథాపూర్వముగ నడుపఁజొచ్చెను. పండిత సతీ ప్రసాదునకుఁ బుత్త్రుఁడే యానంద స్వరూపుఁడు.

*　　*　　*　　*　　*

లాలా వింధ్యవాసినీ ప్రసాదు పండితసతీప్రసాదుని కడఁ బ్రధానోద్యోగిగ నుండెను. అతఁడు ఋజువర్తనుఁడు విశ్వసనీయుఁడు. సతీప్రసాదుని వ్యవహార మంతయు నాతని శిరమునఁనే నిలిచియున్నయది. క్రయవిక్రయములు, ఇచ్చి పుచ్చు కొనుటలు, మొదలగు వ్యాపారధర్మము లన్నియు నాతని యధీనములు. అతని యాచరణమునకుఁ బండితసతీప్రసాదు కేవలము తన స్వీకృతిని నొసంగుచుండును. ఎటుఁగని వా రెల్లరును లాలావింధ్యవాసినీప్రసాదునే యజమానుఁడని తలంచు చుందురు.

ప్రసిద్ధనారాయణుఁడు లాలావింధ్యవాసినీప్రసాదున కేకైకపుత్త్రుఁడు. చిన్న తనమునుండియుఁ బ్రసిద్ధనారాయణుఁడు తనజనకుని వెంబడి పండిత సత్తిప్రసాదుని వార్ధక్యమునకుఁ జనుచు, నాతని పుత్త్రుఁడు తన యీడువాఁడగు నానందస్వరూపునిఁగూడి యాట పాటలయందును, వ్రాఁత కోఁతలయందును, చదువు సంధ్యల యందును, గలసి మెలసి యుండెడివాఁడు. ఆనందస్వరూప ప్రసిద్ధనారాయణుల మైత్త్రి వారి ప్రాయముతోఁబాటు క్రమక్రమముగఁ బ్రవృద్ధము కాఁజొచ్చెను. ఇరువురు నొక క్షణమైనను నొకరినొకరు విడిచిపడక కూడియుందురు. ఎడబాటులేకయుం దురు. ఎడబాటు నోపక యుందురు. ఇరువురకును విద్యఁ గఱపుట కొక్కఁడే ఉపాధ్యాయుఁడు నియమితుఁ డయ్యెను. ఇరువురును గలిసియే విద్యాభ్యాస మొనర్చుచుండిరి. కొలఁది కాలమగు నంత నిరువురు నొకే పర్యాయ మొకే పాఠశాలలో నొకే తరగతి యందుఁ బ్రవేశముఁ గనిరి. ఇరువురు నాబాల్యమిత్రులై సహాధ్యాయులై మెలఁగుచుండిరి. ఇయ్యది పండితసత్తిప్రసాదు, లాలా వింధ్య వాసినీ ప్రసాదుల పరివారములకుఁగల సంక్షిప్త పరిచయము.

## రెండవ ప్రకరణము

డాక్టరు కుముదవిహారి, బార్-అట్-లా, పాటలీపుత్ర (పాట్నా)మండలిసుప్ర సిద్ధుఁడగు నొక బారిష్టరు (న్యాయవాది). ప్రముఖములును క్లిష్టములును నగు వ్యాజ్య ములను బెక్కింటిని నతిసూక్ష్మముగ సులభముగ నిగ్రహించి, జయము చేకూర్చి యున్నవాఁడగుటవలన బీహారు ప్రాంతమందెల్లయెడల నాతని నామము సుప్రసిద్ధమై యుండెను. అతఁడు బారిష్టరీ పరీక్షకుఁ జదువుటకునై యూరోపుఖండమందు, అందు విశేషముగ నింగ్లండునందుఁ దన జీవితకాలమునందలి పెక్కు సంవత్సర ములు గడపియుండెను. జాతికి బ్రాహ్మణుఁడై యుండెను గాని, యాంగ్లభూమి యందు బహు సంవత్సరములు వసించియున్న కారణమున, నాంగ్ల నాగరికతయు, నాంగ్ల సభ్యతయు, నాతనియం దావేశితములై సంపూర్ణ ప్రభావ మూనియుండెను. దాన నాతఁడు హైందవ నాగరికతయందును, హైందవ సభ్యతయందును, ఘృణి తుఁడై యుండెను. స్వదేశపు రీతులను, వాసవైఖరులను, మర్యాదలను, ఆచార విచారములను, దుష్టములని దూషించుచుండెను. అతఁడు తనకుఁ బుత్త్రుఁడు కల్గి నచో నా పుత్త్రునిఁ జిన్నతనముననే యాంగ్లదేశమున కనిపి యందే యాతనికి విద్యా బుద్ధులఁ గఱపించుటకుఁ గృతనిశ్చయుఁడుగా నుండెను. కాని, దైవయోగమున పుత్త్రికా సంతానమునకు వ్యతిరిక్తముగఁ బుత్రసంతానము భించకుండెను

ఆ పుత్త్రికాసంతతియైనను, నొక కన్యకంటె నెక్కుడు లేదయ్యెను. అతఁడా యేక పుత్త్రికకే పాశ్చాత్యరీతులను, సంపూర్ణముగా నలవఱచి, తన్మూలమున సామాజిక బంధనములను విదళనము గావించి తన మనోరథమును బూర్తి యొనరించుటకు నువ్విళు లూరుచుఁ దదృక్న్నమున మెలఁగు చుండెను. డాక్టరు కుముదవిహారి పుత్రిక నామము శైలకుమారి.

శైలకుమారి బాల్యజీవితము మిక్కిలి గారాబముతోఁ గడచినది. సప్తమ వర్షము రాఁగానే యామెకు విద్యఁగఱుప నొక యుపాధ్యాయుఁడు నియమితుఁ డయ్యెను. శైలకుమారి పుట్టినది బారిష్టరు కడుపునఁ గావునఁ బులికడుపునఁ బుట్టు నది పులిపిల్లయే యగును గాని, పిల్లిపిల్ల కాఁజాలదుగదా? అలాగుననే బారిష్టరు కడుపునఁ బుట్టిన శైలకుమారియుఁ దద్గుణగణములతోఁ గూడియుండునని వేఱుగఁ జెప్ప నవసరము. ఆపిల్లబుద్ధి యతిసూక్ష్మమైనది. ఆమె జ్ఞాపకశక్తి యత్యద్భుతము. అత్యధికము. గ్రహణశక్తి యత్యుత్తమము. విషయ మెంతటి క్లిష్టమయినను సరియే, యొకపర్యాయ మామె వినినచో నద్దానిని శీఘ్రముగఁ జక్కఁగ గ్రహించును. గ్రహించిన విషయమును మఱచుట యనునది యెన్నండును నెఱుఁగదు, తనతీక్ష్ణ బుద్ధి కారణముగ శైలకుమారి శిక్షకుని వలన రెండు సంవత్సరములలో నింగ్లీషు, గణిత ము, భూగోళము, ఇతిహాసము, మొదలుగాఁగల విషయములయందుఁ జక్కని ప్రవేశ ముఁగని యయిదవ తరగతికిఁ దగుయోగ్యతఁబడసిన దయ్యెను. దాన హర్షితుఁడై పండిత కుముద విహారి తనపుత్త్రికను నవమవర్షమున నడుగిడుటఁ దడవుగ బాలికా పాఠశాలయందుఁ బ్రవిష్టఁ గావించెను.

శైలకుమారి పాఠశాలయందును, నింటియందును, నియమిత సమయములలో విద్యఁ గఱచుటయుఁ దదితరసమయముల యందు నాటపాటలలోఁ బ్రొద్దుపుచ్చు టయుఁ దప్పగృహసంబంధమగు పనులయం దిసుమంతయైనను మనసును జొనుపు చుండెడిది కాదు. ప్రాతః కాలమం దాఱుగంటలకు శిక్షకుఁడు చదివించుట కింటికి నరుదెంచును. అతనికడ రెండు గంటలు పాఠముల నభ్యసించును. అనంతరము స్నానపానములు, భోజనభాజనములు, వేషభూషలు నిర్వర్తించుకొని సరిగాఁ దొమ్మిదిగంటలకుఁ బాఠశాల చేరును. సాయంకాలము మూఁడున్నర గంటలకుఁ పాఠశాలనుండి యింటికరుదెంచి, యల్పాహారము గొనుట మొదలగు కృత్యముల యందొక యరగంట కాలము నడపును. నాలుగు మొదలు అయిదున్నరగంటల వఱకు వేఱొక శిక్షకుని కడఁ జదువు నేర్చును. ఆఱుగంటలగుటయే తడవుగ గుఱ్ఱపు బండి ద్వారముకడ సంసిద్ధమై నిలిచియుండును. అందుజనకునితోఁ గూడఁ గూరు

చుండి వాయుసేవనమున కరుగును. అందందతనితోఁ బాటు విహారము నొనర్చి యేడున్నరగంటల కింటి కరుదెంచును. అనంతరము భోజనాది కృత్యములఁ దీర్చు కొనును. తొమ్మిదిగంటలవఱకు నిటునటు తిరుగులాడుచు బిమ్మట నిద్రించును. ఇది శైలకుమారికి నియమబద్ధమగు దినచర్య.

పండిత కుముదవిహారి తన కూఁతునకు శైలకుమారికి విద్యావిషయక శిక్షణ మునకుఁ దప్ప, గృహస్థ సాంబంధిక శిక్షనుగూర్చి, యెవ్విధమగు ప్రబంధమును నిర్మించి యున్నవాఁడు కాడు. అందువలన. గృహ కృత్యములందుఁ గాని గృహ కార్య నిర్వహణమునందుఁ గాని యాబాలిక మనసును జొనుపక యుండుటయే గాక దృష్టియయిన నిడకుండెను. తల్లి యరుంధతికి మాత్రము శైలకుమారి యీవిధముగ గృహకృత్యముల యందుఁ బరాఙ్ముఖత్వమును జేకొనియుండుట దుస్సహ మగు చుండెను. ఇంటిలోఁ బలువురు దాసదాసీజను లుపస్థితులైయున్నవారు. వారు గృహ కృత్యముల నిర్వహించుచుందురు. అందువలన గృహకృత్య నిర్వహణము శైల కవ సరములేదు. అయినను నామె చదువు సంధ్యలతోఁ బాటు, వ్రాఁత కోఁతలతోఁ బాటు గృహకృత్యములయందుఁగూడ నేర్పరియై యుండుట శ్రేయమని యరుంధతి యాశయము. దాన శైల గృహకృత్యముల యెడ ధ్యాన మిడవలయునని యామె యీ ప్సితము. అందువలన నామె శైలను నిరంతరము బెదిరించుచుండును. అరుంధతి శైలను బెదిరించునపుడును, మందలించునపుడును, పండిత కుమదవిహారి యుప స్థితుఁడై యుండెనేని, యాతఁడు శైలను మందలించినందుల కరుంధతిపై కుపితుఁ డగుచుండును. అరుంధతి యాకార్యమునకుఁ గినియుచు 'మీరే శైలను గృహ కృత్యములయం దిసుమంతయు ధ్యానమిడకుండఁ జేయుచున్నవారు. దాన దానికిఁ గడుననర్థముఁ జేకూర్చు వారలగుచున్నవారు. అది యెల్లకాలము మనయింట నుండు నదికాదు. మనము దానిని నింటనునుచుకొను వారమును గాము. ఆఁడుపిల్ల యత్తవారింట నుండవలసినది యగును గాని పుట్టినింట నుండదగినదికాదు. అందు వలన నేఁడో రేపో యొక యయ్యచేతిలో బెట్టి పెండ్లిచేయఁదలఁచి యున్నవారము. దానిని బెండ్లియాడునతఁడు మీవలె ధవసంపన్నుఁడు కానినాఁడు శైలకు గృహ కృత్యములు నిర్వహింపవలసి వచ్చును. అప్పుడు శైల నేర్చియుండనిచో నెటులఁ జేయఁగలఁదు ? కచేరిలోఁ గూర్చుండి వ్రాఁత కోఁతలు సలుపు పని కాదు. అత్తవా రింటి కరిగినపుడు, ప్రొయ్యియూఁదు విధముఁ గూడఁ దెలియక యుండినచో, దాని యత్తగారు నామొగముమీఁద నుమియుదురు. శైలకు దుర్గతిఁ గలుగఁ జేయును. ఆ సమయమున మీరేగి నన్నిపుడు మందలించినటుల గాని యత్తగారిని మందలించి

వత్తురా యేమి ? యని పలుకుచుండును. ఒక్క సమయమునఁ బండిత కుముద విహారి తన సహభాగిని యగు నరుంధతి యిట్లే శైలను మందలించుచుండఁగా దానట కరుఁజించి తగిన సమాధానమును లోలోన నాలోచన యొనర్చుకొని యామె మాట లన్నియు ముగిసిన వెంటనే "నాశైల ప్రౌయ్యయాదు నింటి కెన్నఁడును నరుగు నది కాదు సుమా ! నేను శైలకు నుత్తమ పరీక్షయందు త్తీర్ణుఁడై నవాఁడును, నీ కాలము నకుఁ దగిన వేషభాషాచరణములు (Up to date fashion) గల వాఁడును నగు వరుని వెదకి పెండ్లిచేయుదును. అట్టివాఁడు తన భార్యకడ తా నేతీరుగ మెలఁగ వలయునో తనకడ తనభార్య యేతీరున మెలఁగవలయునో తెలిసి మెలఁగువాఁడగును. అంతియ కాని రాజులచేతి నిమ్మపండువలెఁ జూడఁబడుచు నింత గారాబముతోఁ బెరిగినదియు, నింత చదువు చదివినదియు నగు శైల ప్రౌయ్య యూఁదవలసిన యింటి కరుగునని తలంచుచున్న దానవా ? అట్లు తలఁపకుము. వందల కొలఁది సేవకులు, బంట్రోతులు, కల యింటికే యరుగునని తలంపుము. నీవు విశ్వసించినను విశ్వసింపకపోయినను సరే, కానిశైల కట్టి వరునే వెదకితెచ్చి చేపట్టియుంచినవాఁడ అలహాబాదులో నివసించు పండిత సతీప్రసాదునిగూర్చి నీవవస్యము వినియే యుం దువు. అతని కానంద స్వరూపుఁడను కొమరుఁ డొకఁడు ... ... ...

అరుంధతి: హా ! హా ! వినుటయే గాదు. బాగుగా నెఱుఁగుదును. అతఁడు నా అన్న భార్యకు సోదరి పుత్త్రుఁడు. కాని యాతఁ డార్యసామాజికుఁడే.

కుముద: ఆఁ. అవును. అర్యసామాజికుఁడే, అయిననేమి ? మీ బోంట్ల తలంపులే విపరీతములు. బుద్ధిమంతులు. సాహసికులు. ఏదైన సనాతన ధర్మమార్గ ముల లోని యరిష్టములును, విన్మూలకములను నగు మార్గములఁ గనిపెట్టి, వానికిఁ బ్రత్యంతరములుగ, సుఖదములును, సంపన్మూలకములును నగు మార్గములఁ బ్రతి ష్ఠించి, తన్మార్గంబులఁ జేకొనుఁడని బోధించి చెప్పిన యెడ, వారలు, ఆర్య సామాజికులుగను, బ్రహ్మసమాజికులుగను, వర్ణసంకరులుగను, దోఁచుచుందురు. ఈమాటల నేరు లెక్కచేయుదురు ? పిల్లవాఁడు చదువుకొన్నవాఁడు. ఇంత కలిగినవాఁడు. పదిమందికిఁ బెట్టుటకును, దా ననుభవించుటకును, సమర్థత గల వాఁడు. బహు యోగ్యుఁడు. నేనింతవఱకు వివాహితుడనియే తలంచి యూరకుంటిని. కాని, మొన్నటి "లీడరు" పత్త్రికలోఁ బ్రకటితమైన "కన్య కావలెను" అను విజ్ఞాపనమును దిలకించి, వాని కింకను వివాహము కాలేదని గ్రహించితిని. అతఁడును, ఉన్నత శిక్షాయుత యగు కన్యనే వివాహమాడునట్టి కోరిక కలిగి

యున్నవాఁడు. కాబట్టి మనశైలను వానికిచ్చి పెండ్లిఁజేయఁ దలచితిని. ఇందు నీ యభిమతమేమి ?

అరుంధతి : నేను మీ కొక లెక్కలోని దాననా ? నామాటలను జెవి నిడుదురా నా యభిప్రాయమును జేకొనుదురా ? వట్టిమాట. నే నఱచుచునే యుందును. మీరు మీకుఁ దోఁచినటులఁ జేయుచునే యుందురు. ఏమయినను నన్నడిగినారు కాఁబట్టి చెప్పుచున్నాను. బాగుగనే యున్నది. కానిండు. కుటుంబమా మంచిది. పిల్లవాఁడు యోగ్యుఁడుగనే చూపట్టుచున్నాఁడు. వాని యందు దుర్గుణము లెవ్వియుఁ గానరావు. శైలను వానికిచ్చి పెండ్లిచేయుట కభ్యంతర మెద్దియుఁ బొడసూపదు. కాని యాతఁడెంతటి లక్షాధికారి కానిఁడు. ఎంత కోటీశ్వరుఁడు కానిండు. ఎంత చదువుకొన్నవాఁడు కానిండు. శైలకు గృహకృత్యముల నిర్వహింపలయు నవసరమెంతయుని లేకపోనిండు. కాని, అది యెత్తినది యాఁడు జన్మము. ఎన్నిటికైన గృహిణి యని యనిపించుకొననున్న యది. కాఁబట్టి గృహిణి యని యనిపించుకొనుటకుఁ దగినట్టి విద్య, గృహకృత్యములయందు నేర్పు గలిగియుండుట యత్యంతావశ్యకము. శ్రేయస్కరము. గృహ కృత్యముల నిర్వహించుటకు గృహములో నెందరు సేవకులు, ఉపచారకులు, నుండినప్పటికిని, ముఖ్యములు, ప్రాధాన్యములు నగు కృత్యములను స్వయముగఁ దనచేతులతోఁ జేసికొనుటయే గృహిణికిఁ బరమధర్మము. ఏపనియుఁ దనచేతులతోఁ జేసికొనవలయు నవసరమెన్నఁడును దటస్థింపనేరదని యెంతటివారును, దలంచుటకు వలను పడదు. ఎప్పుడైన నేదియైనఁ గొద్దిదియో గొప్పదియో యగుపని తన చేతులతోఁ జేసికొనవలసిన సమయము తటస్థించును. ఏదైన నవసరమగుపని నవశ్యముగఁ జేయవలసివచ్చినపుడు శైల యెట్లు చేయఁగలదు ? చేయనేరదుగదా ? అపుడు నలుగురిలో నగుబాట్లకుఁ బాలగును. తనచేతగాని తనమునకు గ్లానిచెంద వలసినది యగును. మీరీవిషయమున నిసుమంతయు ధ్యానముననుంచరు. సరియేకదా ? నేను దాని ధ్యాన మీ వంకకు మరల్చుచున్నపుడు కూడ వ్యతిరిక్తములగు పలుకుల నడ్డఁకులు పలుకుచుందురు. మిముఁబోలు తల్లిదండ్రుల శిక్షాదీక్షలు కారణముగఁ జదువు సంధ్యలు నేర్చు కన్యలు గూడ మనోవృత్తులు విశృంఖలములు కాఁగాఁ దారుమారగుదురు. వారి హృదయములు గృహకృత్యములయందు ఘృణితములగు చున్నయవి. 'కన్యలు చదువు సంధ్యలు వ్రాఁతకోఁతలు నేర్వరాదు ' అని నా యుద్దేశము కాదు. అట్లు చెప్పుటయును లేదు. బాలురకువలె బాలికలకును చదువుసంధ్యలు, వ్రాఁతకోతలు నత్యంతావశ్యకములే. కాఁబట్టి తల్లిదండ్రులు తమపుత్త్రికలకుఁ జదువు

నేర్పించుట మిక్కిలి యావశ్యకము. అవసరము, ఉచితము. కాని, గృహకృత్యములయందున నేవగింపు నుదయింపఁజేయుటయు, నుదయించుట కవకాశమును గలుగఁజేయుటయు నుచితములు కావని నా యభిప్రాయము. కాఁబట్టి బాలికలకుఁ జదువు సంధ్యలయందువలె గృహకృత్యములయందును గూడ యోగ్యత నొడఁగూర్చుట యత్యావశ్యకమని గ్రహించి దానికిఁ గూడ నుచితశిక్షణము నొసంగుటకుఁ దల్లిదండ్రులు ప్రవృత్తులగుచుండవలయు. అట్లగునెడ 'బంగారమునకిడు వెలిగారమువలె' వారి జీవితము ప్రకాశవంతముగ నగును. అట్లుగాక మీ వంటివారు తలంచురీతిని బాలికలు శిక్షిత లగుదురేని, తదభ్యాసమువలన వారల కిసుమంతయు మేలొనఁగూడనేరదు సరేగదా కీడును సమకూడును. మీరనుకొనుచున్న శిక్ష 'పామునకుఁ బాలుపోసినట్లు దుర్వృత్తిని విశృంఖలత్వమును నేర్పించుట యగును. హానికరము నగును. దుర్గుణముల కాకరమును గాఁగలదు. విపత్పాతమున కవకాశ మిడుటయు నగును.

పండిత కుముద విహారి యరుంధతి ప్రసంగమును దృణీకరించెను. పెదచెవులఁ బెట్టెను. తుదకాతఁడు పరిహసించుచు "నీవు చెప్పుమాటలు పూర్వపుఁ గృతయుగము నాఁటి మాటలును, నాఁటి బాలికల కుపయుక్తములును, యనుకరణీయములును నైయున్నవిగాని, యిప్పటి కలియుగపు బాలికల కుపయుక్తములును, ననుకరణీయములును గావు. వెనుకటి కాలము వేఱు, ఇప్పటి కాలము వేఱు. వెనుకటి కాలపు బాలికలవలె నిప్పటి కాలపు బాలికలు అత్తింటఁ బనిపాటలొనర్చువారు కారని నీ వెఱుంగవా? కాలము మాఱినది. పనులు మాఱినవి. ఇప్పటి యువతులు దాసీలవలె నింటిపనుల నేలచేయవలయునని తలంచుచుందురు. మన దేశపు స్త్రీలు, వృద్ధవనితలు, విద్యావిహీనలు, జ్ఞానశూన్యలు. అందువలన వారు తమ పుత్త్రికలు పుత్త్రవధువులు. చదువు నేర్చుటయు, సుఖజీవనమును బడయుటయును జూచి సహింప నోపక యీర్ష్యాళువు లగుచున్నవారలు. వారి విద్యాభ్యాసమునకుఁ బ్రతికూల వర్తనులగుచున్నవారలు. బద్ధవైరలగుచున్నవారలు." అని పలికెను. ఆ మాటల నాలించి యరుంధతి "మీరలు పాశ్చాత్య సభ్యతా వ్యామోహమునఁ బడియుండుట కారణమున మతి విభ్రమమును జెందియున్నవారలు. మీకు నా మాట లేవియును రుచ్యములు కాఁజాలవు. అయినను విన్నవించుచున్నాను మదియందుంపుఁడు. మన దేశము ఆంగ్లదేశము కాదు. భారతదేశము. ఆర్ష సాంప్రదాయము గలది. మన సభ్యత ఆంగ్లసభ్యత కాదు. భారతీయ సభ్యత. ఆర్ష సభ్యత. ఆంగ్లేయ సభ్యతకును, మహోన్నతమగు భారతసభ్యతకును సహస్రాంశ మంతరమున్న

యది. అంతియేకాదు. హస్తిమశకాంతర మున్నయది యని చెప్పవచ్చును. భారతీయ సభ్యతయే వేఱు. అందువలన భారతీయు లాంగ్లేయ సభ్యతను ననుకరిం చుట, యనుకరింపనెంచుట పరిహాసాస్పదము. పులినిజూచి నక్క వాతలిడుకొనుట వంటిది. అయ్యది మనకుఁ దగదు. ఆంగ్లేయ సభ్యతానుకరణము కారణముగ, భార తీయులు తమ పుత్త్రికలను, విపత్పాతమునకు, భీషణపతనమునకుఁబాలు గావించు చున్నారు. వారి జీవితభంగమునకు వారి తలిదండ్రులే హేతుభూతు లగుచున్నారని గ్రహింపవలయును.” అని పలికెను.

శైల ప్రక్కగదిలో నిలిచి మాతాపితలకు జరుగుచుండు ప్రసంగమును విను చుండెను. మాతృవాక్యమునకు ఖేదమును, పితృవాక్యమునకు మోదమును జెందు చుండెను. జనకుఁడు తనపక్షమును గ్రహించి యుండుటఁగని మిక్కిలి సంతసమును బొందఁ జొచ్చెను. జననీజనకులు తమ ప్రసంగమును సమాప్తమొందించి గదినుండి బయల్వెడలి వచ్చుచుండుటఁ గని శైల తాను నెమ్మదిగఁ దన గదిలోనికిఁ జని యందు మేజాబల్లకడ నుండు ఆసనము ( కుర్చీ ) పైఁ గూర్చుండి యేమియు నెఱు గనిదానివలె నొక పుస్తకమును జేతఁబట్టుకొని పఠించుచున్నట్టులుండెను.

## మూఁ డ వ ప్ర క ర ణ ము

గ్రీష్మఋతువు. వేసఁగి యత్యుత్కటమై యుండెను. రాత్రి తొమ్మిదిన్నర గంటల సమయమయ్యెను, బగ లంతయు నెండవేడిమి చేతను, వడగాడ్పులచేతను, బీడుతులైన మనుజులకు స్థిమిత మలవడలేదు. ఉప్పరిగలపై నున్నతస్థానములమీఁద నమర్పఁబడిన శయ్యలపై హిమజలములఁ జిలకరించుకొని వాతాయనయంత్రముల నమర్చుకొని ధనవంతులును, బాదములఁ జాపి పండుకొనుటకైనఁ జాలు నంత వైశా ల్యములేని యిఱుకు టిండ్లలో నిరుపేదలును, నొక్కతీరుగ నొకానొక గ్రీష్మకాలపు రేయియందు, నాభీషణ భూయిష్ఠంబగు నిశీథియందు నిదురలేక వేగుచుండిరి. కాలస్వరూపుఁడగు పరమేశ్వరున కెల్లజీవులు నొకటే కదా ? భేదదృష్టి యావం తయులేదు. అట్టి యా వేసవి సమయమున బాబూ ఆనందస్వరూపు తన హర్మ్యము నకుఁ జేరువగ నానుకొనియున్న యుద్యానమునందు ఘనిష్ఠమును హిమసమశీతల మునునై యొప్పుచుండు నొక నికుంజమునఁ గూర్చుండి విద్యుద్వీజన (Electric fan) పంచాలనోదిత వాయుపుంజమును సేవించుచుండెను.

బాబూ ఆనందస్వరూపుని ప్రాయ మిరువదిరెండు లేక యిరువదిమూఁడు వత్సరములయి యుండును. అతని బాల్యస్నేహితుని ప్రగాఢమిత్రుని వయస్సు కూడ

నొకటి రెండు వర్షము లధికమో లేక సమమో యను నట్లుండెను. మిత్రులిరువురును, ఎం. ఏ. పరీక్షయందు త్తీర్ణులై న్యాయవాద పరీక్షనొసఁగు యత్నమున నుండిరి. బాబూ అనందస్వరూపునకుఁగల మిత్రుఁ డొక్కఁ ప్రసిద్ధనారాయణుఁడే కాదు. ఇంకను బలుఁవురు మిత్రులున్నారు. కాని ప్రసిద్ధునిఁబోలువారు కారు. ఆ మిత్ర మండలిలో ఆనందస్వరూపుఁడే యోగ్యుఁడుగను శ్రేష్ఠుఁడుగను పరిగణింపఁబడు చుండెను. అనందుడు లక్ష్మీకటాక్షమునకుఁ బాత్రుఁడై యుండెనని కాని యాతని గుఱ్ఱపుబండిలో నాతని మోటారులో నాతనితోఁ గూడనేగి వాయు సంసేవన మొనర్పవలయుననుతలంపునఁగాని యాతనిమిత్రు లాతనిని గౌరవాదరదృష్టులఁజూచు చుండుటలేదు. ఆతనియందు వినయము, శీలము, బుద్ధికౌశలము సద్వర్తనము మొదలగు సుగుణములు మాత్రాధికములై యొప్పుచుండెను. ఆతని యాదర్శ మత్యుచ్ఛయము. ఆతనియందు సాంఘిక సేవయు, దేశప్రేమయుఁ, బరోపకార పారీణతయు నమిత ములు. ఆతఁడు తన మిత్రులకీ కార్యములయందుఁ బ్రవిష్టులగుటకుఁ బ్రోత్సాహ మొసంగుచుండును. అందువలన నానందుని, నా మిత్రులు తమకు నేత (Leader) యని యెన్నుఁ జొచ్చిరి. నేఁడు బాబూ అనందస్వరూపుఁడు తన మిత్రమండలి యందుఁ, దనయొక్కయుఁ, దన బాల్యమిత్రుని ప్రసిద్ధ నారాయణుని యొక్కయు వివాహవిషయ ప్రస్తావనము నుపపాదన మొనర్పనెంచి యుండెను. అందువలన మిత్రుల నిమంత్రితులఁ గావించెను. సమయము రాత్రి తొమ్మిదిన్నర గంటలట నిర్ణ యింపఁబడెను. స్థానమానందస్వరూని యుద్యానవనములోని పూనికుంజము. అందు వలన నా నికుంజమునందు మిత్రుల సమావేశముగా నున్నందున నందు మేజాబల్లలు కుర్చీలు నమర్పఁబడి యుండెను. మధ్యప్రదేశమున నమర్పఁబడియున్న చంద్ర కాంత శిలాఫలక శోభితమగు మేజాబల్లపై నారంగి, ద్రాక్ష, ఖర్జూరకదళీ, ఫలములు, ఇక్షుఖండములు, మామిడిపండ్లు, నిండియుండు పళ్లెరము లమర్పఁబడి యుండెను. పలువిధములగు పానకములు కాచపాత్రములలో నొప్పుచుండెను. బల్లకు నలుపై పుల నాలుగు కుర్చీలమర్పఁబడి యుండెను. బాబూ ఆనందస్వరూపుఁడు తన చేతిగడి యారపుముల్లు తొమ్మిదిన్నర గంటల కాలమును సూచించు నంకెపైఁ బడుటయె తడవుగ నియమిత స్థానమున కరుదెంచెను. అం దునుపఁబడిన కుర్చీలలో నొక దానియం దాసీనుఁడై (Evolution of marriage) నామక గ్రంథమును బఠింపఁ జొచ్చెను. మఱియొకవంక నాతని మిత్రులు వినయకుమారుఁడు, చాంద నారాయ ణుఁడు అను నిరువురుచెరియొక కుర్చీలోఁ గూర్చుండి యుండిరి. అందు వినయ కుమారుఁడు 'నేషను' నామక సమాచార పత్రికను బఠించుచుండెను. చాందవా

రాయణుఁడు కుర్చీ వెనుక భాగమున శిరమును జేర్చి, యేవిషయమును గూర్చియో యెఱుక పడదు గాని దీర్ఘాలోచన చేయుచుండెను.

నేషను పత్రిక నొక్కింత తడవు పఠించి, యనంతరము వినయకుమారుఁడు తనచేతి గడియారముపై దృష్టి నిడుచు, "సోదరా! ఆనందా! పదిన్నరగంటలు కావచ్చినది. ఇంతవఱకుఁ బ్రసిద్ధుఁడు రాలేదు. వచ్చుజాడయుఁ గానరాలేదు. అతఁడు వచ్చిన వెనుకనైనను వాదప్రతివాదములలో, ఖండనమండనములలో నెంత లేదన్నను గనీసము మూఁడు గంటల కాలము పట్టును. అందువలన నేఁటిరాత్రి మనకు శివ రాత్రియే యగు నని తోఁచుచున్నది. కాఁబట్టి ... ... ... చాందనారా యణుఁడు వినయకుమారుని మాట కడ్డము తగిలి "నీవెపుడును నిద్రో ౹నిద్రో యని రోదన మొనర్చుచుందువు. చూడఁజూడఁ గుంభకర్ణుని కృపాదృష్టి పాత్రుఁడవై యున్నట్లు తేలుచున్నది. ఇదే! చూడుము. ఈ యితుఖండములను నమలుము. చింతిలకుము. నిద్రకొఱకీరాత్రి కాలమే కాదు. రేపు భానువాసరము గాన రేపటి యిరువదినాలుగుగంటల కాలము నీనామమున లిఖితపూర్వకముగ నిర్దిష్టమై యున్నయది.

వినయ: "తమ్ముఁడా! నీవిటు లనవలసినదే. నీసతీతిలక మింటిలో లేదు. నీకేమి తొందఱ? నీకేటి జడుపు? రాత్రియంతయు నిచ్చటనే యొకదానిపై నొకటి చొప్పున నీపళ్లెరములోని నారంగిపండ్లను సంపూర్ణముగాఁ బొట్టలోఁ బడవేయుచు నుండినను నుండఁగలవు. నిన్నడుగువారును, నాడికొనువారును లేరు. నేనుమాత్రము పాతిక తక్కువగఁ బదునొకండు గఁటలైన తర్వాత నొక క్షణమయిన నిలువ నోపను. నిలువను" అని పలికెను.

అంతట "మహాశయా! ఏల కుపితుఁడ వయ్యెదవు. నేనిదె నీపాద సేవసేయ నరుదెంచుచున్నవాఁడను" అని పలుకుచుఁ బ్రసిద్ధుఁ డరుదెంచి యొక కుర్చీలోఁ గూరుచుండెను. అట్లు కూరుచుండిన ప్రసిద్ధనారాయణునిఁ గాంచి యానందస్వరూపుఁడు వ్యంగ్యముగ, "ఏమి! యింత శీఘ్రముగ నరుదెంచితివి? తొమ్మిది గఁటలైనఁగాలేదు కదా?" అని యనియెను. అందులకు బ్రసిద్ధుఁడు. "ఏమిచెప్పఁ గలను? ఇంటినుండి సకాలమున ద్విచక్రశకటముపై నెనిమిదిన్నర గంటలకే బయలు వెడలితిని. వచ్చునపుడు మార్గమధ్యమున నొక యావశ్యక కార్యములోఁ దగులు కొంటిని. గవర్నమెంటు హైస్కూలును సమీపించు సరికి, నచ్చట బాటయందు జనులు గుంపులు గుంపులుగఁ బ్రోగై యుండిరి. దాన శకటమును ముందుకు నడపుట

కవకాశము కలుగకుండెను. అంత శకటమునుండి దిగి దారిఁ బడయుటకై ఘంటా నాదమును గావించితిని. నాశకటముయొక్క ఘంటానాదమును విని యందలివార లెల్లరు నావంకఁ జూడఁ జొచ్చిరి. అందుండి యిరువురు మనుజులు నాకడకరుదెంచి, "ప్రభువులవారికి జయంకలుగుఁగాక! మారాజులు దేవరా! మాతట్టు చూడండి. మమ్ము కరునించండి. బీదవాళ్లము. మాగోడును వినండి." అని పలుకుచు నచట నిలిచియున్న యిరువురు రక్షకభటులఁ జూపుచు "బాబూ! యీ యేడి కాలంలో ప్రతినిత్యం మామీద దాడిసాగిస్తారు. ఈప్రొద్దూ మేము ప్రతిదినంలాగనే యిచ్చట మంచమేసుకొని పండుకొన్నాము. ఈయయ్యగారువచ్చి మమ్ము మంచాలనుండి కిందికి పడదోసి మామంచాలను పారేశారు. ఇక్కడ పండుకోవద్దంటారు. చూడండిదేవరా! మీరు నాయం విచారించాలె. మాకు సాయంచేయండి. ఈ యుడుకులో మా పానాలుండుటెట్లో తెలియదు. మా గుడిసెల్లోదూరి మే మెట్ల పండుకోగలం దేవరా! మాకేదిదారి? సెలవీయండి బాబూ." అని పలుకుచు నా కాళ్లమీఁదఁ బడిరి. వారలఁ జూచినంతనే నాకు వారియందు జాలి కలిగినది. రక్షకభటులను బెదిరించి "వీరలనేల బాధించుచున్నారు" అని యడిగితిని. అందుకు పోలీసు జవానులు "బాబూ! రహదారిలో నెవరిని పండుకొననియ్య రాదని పురపాలకసంఘమువారి యుత్తరువైనది. దానిని మేము కాదనలేముకదా? వారి యుత్తర్వును పాలించుచున్నాము. లేనిచో మా కూటిలో రాయి పడవేయుదురు. మేమేమి చేయఁగలము. మా విధి మేము నెరవేర్చుచున్నాము." అని సవినయముగఁ బ్రత్యుత్తరమిచ్చిరి. "ఆహా! ఏమిచెప్పఁగలను? అచటి బీదల దుఃఖదావస్థ. వారిని జూచినంతనే నా హృదయము నీరయ్యెను. అందు స్త్రీలు, పిల్లలు, ముసలులు, పడుచువారు, రోగులు, ఎల్లరును వేడిమికి వేఁగిపోవుచున్నారు. మగవారికేమి, వారి వాఁకిండ్ల ముంగిటనో, తదితర బహిరంగ ప్రదేశములలోనో మంచములువైచుకొని యందు మేనుజేర్చి యెట్లో రాత్రుల వెళ్లఁబుచ్చఁగలరు, గాని, పాపము, లోకలజ్జితలు స్త్రీలు. వారలు పురుషులనడుమఁ బండుకొననేరరు. అపుడు పురపాలక, పురాభివర్ధక సంఘములవారు (Municipal Board and Town Improvement Trust) ఎన్నఁడైన నీ బీదలకు సాయముఁజేయ వారియెడ దృష్టులఁ బఱపు పుణ్యమును గట్టుకొందురా? వీరి కష్టము లెన్నఁడైనఁ గట్టెక్కునా? అని నామనము కలవరమందఁజొచ్చెను. కేవల మధికారులకును, నైశ్వర్యవంతులకును, సౌకర్యముల నొడఁగూర్చుటకే యీ పురపాలక సంఘమువారు గాని, పురాభివర్ధక సంఘమువారు గాని, యీ బీదలకొఱకై యీ నిర్ధనులకొఱకై నగరములలో నాలుగు

ప్రక్కల నాలుగేసి వందల గజములు వైశాల్యముగల ప్రదేశములయందుఁ జిచ్చికను జిన్నచిన్న పూలమొక్కలను నాటి, ఆ ప్రదేశములను విశ్రమస్థానములుగ, విహార సీమలుగ (Parks) నేర్పరించి, స్త్రీ పురుషులకుఁ బ్రత్యేకావరణములు నిర్మించినచో, సంనిరుదు పేదలు, శ్రమజీవులు, కార్మికులు మొదలగువారు దినమంతయు విరామము లేకుండఁ గడపి, శ్రమపడిన పరిశ్రమను బాపుకొని సుఖనిద్రఁ జెందఁ గలవారలగుదురు. వారీ భీషణోష్ణమునఁబడి, మలమల మాడి, మశూచి, విశూచి మొదలగు భయంకర వ్యాధులకు గురికాకుండుట కనువేర్పడును. నేను రేపు మునిసిపల్ కమిషనరును, డాక్టరు హేమేంద్రకుమారునిఁ గలిసి యీ సమస్యను మునిసిపల్ సంఘమువారి యారామిక సమావేశమం దుపపాదింప నాతనిఁ బ్రార్థించెదను.

చాంద: యథార్థముగ నీ భీషణ గ్రీష్మమువలనఁ బాపము, నిరుపేదలకుఁ గలుగుకష్ట మింతింత యని చెప్పుట కలవిగాదు. పురపాలకసంఘము వారిచేత నీ కార్యము నవశ్యముగఁ జేయింపవలయు. పురపాలక సంఘము మొదలుగాఁ గల సంస్థలు నగరనివాసులకు సౌకర్యము లొనఁగూర్చుచు సంఘసేవ సలుపు నభిప్రాయముతో నేర్పఱుపఁబడినయవి కాని వేఱొండు కాదు.

ఆనంద: డాక్టరు హేమచంద్ర కుమారుఁడు ప్రాయః మునిసిపల్ కమిషనరు లందఱిలోను, నెక్కువ ప్రాశస్త్యమును గని యున్నాఁడు. అతఁడీ ప్రస్తావనమును బోర్డులో నుపపాదించినచో నంగీకృతమగుటకు సందియములేదు. కానిచోఁ (ప్రసిద్ధు నుద్దేశించి) గలవరమేల? రాఁబోవు వత్సరములో నీవు వకాలతు పరీక్షయందు త్తీర్ణుఁడవ వగుదువు. ఆరామికపు టెన్నికలలో నిన్ను మ్యునిసిపల్ సభ్యునిగ నెన్నుకొన జేసెదను. నగరములోని యెన్నికదారులలో సగమున కెక్కుడుగ నెన్నికదారులు నా చేతిలోనివారు. అపుడు మనము మ్యునిసిపల్ బోర్డులోఁ జేరి యథాశక్యముగ నగర నివాసులకు సేవసలుపుదము.

మిగిలిన యిరువురు మిత్రులలోఁ జాందనారాయణుఁ డీ విషయమును గూర్చి పూర్ణవిచారమును సల్పుచుండెను తుదకాతఁ డసహిష్ణుఁడై "ప్రసిద్ధా! ఇది యేటి ప్రసంగము? అనవసరమగు దానిని దెచ్చిపెట్టితివి. యీ వ్యాఖ్యానమునందే గంటల కొలఁది కాలము వ్యతీతమగుచుండెను. పిమ్మటఁ బ్రస్తావోప ప్రస్తావములు శాఖాచంక్రణములుగ నుపపాదితము లగును. వాద ప్రతివాదములు, ఖండనమండనములు సాగవలయు. అపుడు సిద్ధాంత మేర్పడవలయును. అన్నియు నగుసరికిఁ దెల్లవాఱును. కాఁబట్టి (ఆనందు నుద్దేశించి) మహాశయా! ఇఁక నే నడుగవలయు, ఇఁక

నీ ప్రస్తావమును భగవంతుని మీదున రేపటికునిచి నేఁడు మమ్మేపని నిమిత్తము రావించితివో యాపనినిఁ బూర్తియొనరింపుము. ప్రకృతమనుసరామః పాయసంభక్షయామః" అనుట తెలియదా ?

చాంద : ఈతని కేమి ? ఈతఁడు చంద్రమండలములోఁ బ్రసంగ మొనర్పఁగల యుప్పరి గలపై నిదురించెడివాఁడు. నిరుపేదల కష్ట నిష్ఠురములు ఈతని కేమి యెఱుక ? వారి దుఃఖములు వారి రోదనములు నీతని చెవులకెట్టులింపులగు. ఆ! రాఘవేంద్రరావునకు ఓటు నిప్పించు సమయ ముపస్థితమైనపుడు వారల నుపలాలన మొనర్చును. వారలకు సౌకర్యముల నొడఁగూర్తుమని ప్రగల్భములు పలుకును. అనంతరము తమ యవసరము తీఱినంతనే "కార్యాంతే విసర్జయేత్" అను న్యాయము చేకొని, వారలను గన్నెత్తి యాయినఁ జూడఁడు. చూడ నొల్లఁడు.

ప్రసిద్ధ : (వినయకుమారునితో) క్షమింపుము. అవునవును. నీకు నాకారణమున శ్రమకలిగెను. అందులకుఁ బశ్చాత్తప్తుఁడ నగుచున్నాను. ఇఁక నుద్విగ్నుఁడవు కావలదు. వచ్చినపనికిఁ బూనుదము.

చాంద : వహ్వా ! ఉద్విగ్నుఁడేల కాకూడదు ? నేఁటికి భగవంతుని కృపవలన భాగ్యవశమున, మీ రుభయులును, వివాహితులగుట కంగీకృతులు కాఁజొచ్చితిరి. సంతస మగుచుండెను. కాని మీమీ వివాహ విషయములలో అనురూప కన్యాన్వేషణములలో మీమీ తలిదండ్రుల యభిమతములు మీమీ యభిప్రాయములకు భిన్నములగుచుండుటఁ జూడ విషాద మొదవుచుండెను. అందువలన వారి యభిప్రాయముల వాస్తవికతా విషయముఁ గూర్చియుఁ బర్యాలోచనము చేయుట యిపు డత్యంతావశ్యకమై యున్నది. నిన్నటి దినమున నాతో విజయుఁడు, ఆనందుని జనకుఁడు ఆనందునకుఁ జదువుసంధ్య, వ్రాఁత మున్నగునవి నేర్చిన కన్యఁగూర్చి పెండ్లి సేయుట కెంత మాత్రము నంగీకరింపనని మిగుల విస్పష్టముగఁ బలికి యున్నట్టు చెప్పినాఁడు. అయ్యది యథార్థ మయినదియే యగునేని యాతని యభిమతము, నాతని యాజ్ఞ మన్నింపఁ దగినది కాదని స్పష్టముగ, బహిరంగముగఁ జెప్పుచున్నాను.

ప్రసిద్ధ : చాందనారాయణునితో, ఆనందుని జనకుఁడు చెప్పుమాటలలోని యాథార్థ్యమును గ్రహింపకుండఁగనే, యాతని యుద్దేశమును బ్రతిఘటించుటయే సమయ మని చెప్పుటకు సంసిద్ధుఁడ వగుచున్నావు. అతఁడు చెప్పునది యేమనగా : ప్రస్తుత కాలపుఁ జదువునేర్చిన స్త్రీలు పాశ్చాత్య నాగరికతను నవలంబనముగఁ గొని సంపూర్ణరూపమున దొరసానులగు కోరికను బూని యున్నారు. కోరికను బూని

యుండుటయే కాదు, తదనుసరణవర్తను లగుచున్నవారు. భయభక్తులఁ బోఁద్రోయు చున్నారు. గురుజనతిరస్కారము గలవారగుచున్నారు. గృహకృత్యములయందు ఘృణితు లగుచున్నారు. వంటచేయుట బానిసకృత్యమనియు, నత్యంత హైన్య మనియుఁ దలంచు చున్నవారు. తుదకుఁ దేయాకు నీటిని సిద్ధమొనరించుటకును వంటవారల నభిలషించు చున్నారు. అంతియకాక ... ...

వినయుఁడు : ప్రసిద్ధు నిమాట కడ్డమువచ్చి, అది యథార్థము. ఆనందు ని జనకుఁడు తెలివితక్కువవాఁడు. ఆలోచనా హీనుఁడు. వయసు చెల్లినవాఁడు. అనుభవము కల వాఁడు. కాలమహిమను గుర్తెఱింగిననాఁడు. అతఁడు చెప్పునది యథార్థము, అని సమ ర్థించెదను. నేను నా ప్రత్యక్షానుభవములో నున్నాఁడను. నాయింటి వంటకత్తె యెన్నఁ డైన రాఁజాలక పోయినన్నో, నానాఁడు నాహైఫ్, దొరసాని, వంటచేసి యా దిన మంతయు నూటిమాటలాడుచు, నన్ను వేధించుచుండును. ప్రసిద్ధా! చదువునేర్చిన భార్యతోడి సౌభాగ్యము, సాంసారిక సౌఖ్యము ననుభవించుచున్నాఁడను గనుకఁ జెప్పుచున్నవాఁడను. ఆనందబాబు వివాహము, పాశ్చాత్యనారీమణులను, నాగరి కతాగ్ర గణ్యలను పేరుపొందినవారిని ప్రోసి రాజనఁదగు కన్యకతో సంపన్నము కావలయును. తత్ఫలిత మాతని యనుభవములోనికి రావలయును.

ఆనంద : మంచిది. ఇంతకును, ఈ ప్రసంగమువలనఁ దేలిన సారాంశము, చదువునేర్చిన కన్యలను వివాహమాడఁగూడదనియు, వారలను బహిష్కృతలఁ జేయవలయుననియు, నందుతోబాటు, నిఁకముందుఁ దమపుత్రికలను జదువు ప్రాఁతల కామడదూరములో నునుచుటకు వారి తలిదండ్రుల బాధ్యులఁజేయుట తగుననియు, సమాజమునందుఁ బ్రచారమును సాగింపవలయుననియేనా? ఒక వంక స్త్రీ శిక్షావశ్యకతఁ గూర్చి ప్రచారమొనర్పవలయునని బొబ్బలిడుచుండవలెను. వేఱొక వంక నుచ్చ శిక్షాప్రాప్తలగు కన్యలను వివాహమాడకుండ నుండవలెను. ఇది మంచి యాలోచనము. మీ కెటులఁ దోచినదో యని సందియ మగుచున్నయది.

వినయుఁడు : స్త్రీశిక్ష దూష్యమని, శిక్షితలు వివాహానర్హలని నా యభి ప్రాయము కాదు. భారతీయ సభ్యతను, భారతీయాదర్శమును, రూపడంచు విధా నము దూష్యమని, తత్కారణముగ భారతీయాచార విచారవ్యవహార వర్తనాదులకు దూరలగు వారితోడి వివాహము సుఖదము కానేరదని నాయాశయము.

చాంద : సరే! ఏమైన నేమి? శిక్షితలయందు దోషారోపణము చేయు చున్నాఁడవు. కాని యిందు శిక్షితలదేటి దోషము? దోషము వర్తమాన శిక్షా

ప్రణాళికను (Present system of Education) జెందియున్నది. ఆంగ్ల శిక్షా ప్రణాళిక ననుకరించి కన్యలను శిక్షితలఁజేయుచున్నారు. దాన వారి హృదయములయందు, ఆంగ్లేయసభ్యత (English Culture) లోని చెడుగులు చొరఁబడుచున్నయవి. అందువలన భారతీయ సభ్యతయందు ఘృణితలగుచున్నవారు. అందు ననర్థము కలుగుచున్నయది. కాఁబట్టి విషవృక్షమును రూపుమాపఁ దలంచెడి బుద్ధిమంతులు, ఆద్దానియాకులను, చిలువలను, పలవలను, కొమ్మలను, రెమ్మలను. బోలెను, నఱకుట కుదుర్యుక్తులగుటకంటె మొట్టమొదటఁ గూఁకటివేరును బెల్లగించుట కుదుర్యుక్తులగుట సమంజసముకదా? నల్లుల కారణముగ మంచమును దగులఁబెట్టుట బుద్ధిలక్షణముకాదు. శిక్షాప్రణాళిక యందలి దోషములను గారణముగఁ గొని, చదువువారలు చదువు వ్రాఁతలునేర్చిన కన్యలను బహిష్కృతలఁగావించుటయును, దద్బహిష్కారమునకు దూరగతలంగావించుటకునై కన్యకలకుఁ జదువు వ్రాఁతలు గఱపింపక యునుచుటకుఁ బ్రయత్నము సలుపుటకంటె శిక్షాప్రణాళికనేల సంస్కరింపఁజేయ యత్నమొనర్పరాదు?

విజయునికడ సంభవతః ఈమాటల కుత్తరమెద్దియును లేదు. అతఁడు చాందనారాయణుని మాటలను ద్రోసిపుచ్చి, యానందునితో "సరే. ఈ సంగతిఁ జెప్పుము. నీవు వరింపనెంచిన రాణీసాహెబాయొక్క రూపరేఖలెట్టివి? నీ వామెతోఁ బత్రవ్యవహారమును నెఱపి యుంటివా? లేక తలిదండ్రుల కెదురాడి యైనను, దనకు నచ్చిన కన్యనె వివాహమాడు ప్రథకుఁ బోలె వివాహానంతర మన్యోన్యమనుకూల ముదయింపనిచో, విడాకు లొసంగు ప్రథకుఁ గూడ నీవే సమాజమునకు మార్గదర్శకుఁడవుగా నుంటివా?

అనంద : కేవలము ప్రాజ్ఞునిఁబోలె మాటలాడు చున్నావు. నీచదువు నీ తెలివితేటలు నేగంగలోఁ గలిసినవి? ఇరువురు నంగీకృతులు-కాకుండ నెచ్చటనైన నిటువంటి వివాహములు జరుగఁగలవా? ముందుఁ బండితకుముదవిహారి శైలయొక్క ప్రత్యాకృతిఁ (Photo) బంపి యుండెను. పిమ్మట వివాహప్రస్తావనము నుపపాదించె. శైల తనస్వీకృతిని బ్రకటించెను.

చాంద : (అనందునితో) సరే! తల్లిదండ్రులకు సమ్మతము కాకపోయినను దన యిచ్ఛకువచ్చిన కన్యను వివాహమాడు ప్రథకు నీవు విఘ్నేశ్వరపూజఁ గావింపుము. చదువు సంజలు నేర్చిన స్త్రీలందఱును నొక తీరువారు కానేరరు. కొంతవఱకుఁ వర్తనవర్తనమును, దదోక్షధనమును, వారి సుగుణదుర్గుణములకుఁ గారణము

లగుచుండును. ఇంత యెందుకు ? నాభార్యస్థితిని బరిశీలింపుఁడు. ఆమె తనతండ్రి జీవిత కాలములోనే మెట్రిక్ పరీక్ష ప్యాసైనది. పితృమరణానంతరము పినతండ్రి చదువు మానిపించి నాకిచ్చి పెండ్లిచేసెను. ఆమె పితరుఁడే సజీవుఁడై యుండె నేని, నావంటి సాధారణుని కట్టి స్త్రీరత్నము లభ్యమగుననుట కడు నసంభవము. ఇఁక నాయింటి కరుదెంచినది మొదలు చూడుము. ఇంటిలోని చిన్న పెద్ద పను లన్నియుఁ దానె స్వయముగఁ దనచేతులతోఁ జేసికొనుచుఁ గాలేజీకరిగి చదువు కొనుచున్నయది. ప్రకృతము, బి. ఏ. పరీక్షకుఁ గఠినపరిశ్రమము సలుపుచున్నయది యని నీవెఱింగియే యున్నాఁడవు గద. "ఇంక నీవు పరీక్షకొఱకుఁ గఠినపరిశ్రమ సలుపనగు నవసరము సామీప్యమునకు వచ్చినది. అందువలన నింటిపనులు సలుపుట కొఱకొకదాసిని, నియమించెదనని" యెన్నియోసారులు చెప్పియుంటిని. కాని, యందులకామె యంగీకారమును జూపుటలేదు. నాసతి వర్తనము ననుకరించి చూచిన శైలయు నట్టి సుగుణమండితయే యుండునని నాయూహ. అందువలన శైలను దప్పక పెండ్లిచేసుకొనుమనియే నేను హితమొసంగెదను.

ఇట్లొక గంటకాల మానలువురు మిత్రులకు వాదోపవాదములు జరిగిన పిమ్మట నానందుఁడు శైలను బెండ్లాడవలెనని సర్వసమ్మతముగ నిశ్చితమయ్యెను

తన వ్యాజము తీరుమాన మయిన యనంతరము ఆనందుఁడు ప్రసిద్ధుని వివాహముఁ గూర్చిన సమస్య యత్యంత జటిలము ... ....... ... ఆనందునిమాట ముగియకుండఁగనే. వినయుఁడు "ప్రసిద్ధునితండ్రి మిక్కిలి పట్టుదల మనిషి. తన మాటయేకాని యొకరిమాటను జెవినిబడనీయఁడు. తలఁచినంతపనిని దప్పక చేసి తీరువాఁడు. అతఁడు మహాజన రామచరణునికన్యఁగూర్చి పెండ్లిచేయ నిశ్చయించి యున్నాఁడు. అట్లు చేసియే తీరును. సముద్రమింకినను సరే, భూమి తలక్రిందు లైననుసరే, మానఁడు. ఒకరిమాట వినఁడు. తనబుద్ధిని మరల్పఁడు. ఇదియే యాతనియందుఁ గల యద్భుత గుణము. ప్రసిద్ధున కిరువదిరెండు సంవత్సరము లగుచున్నవి. ఇంకను బెండ్లిచేయలేదు. ఎంత ఆశ్చర్యము! అగరవాలులు ఎనిమిది తొమ్మిది వత్సరముల ప్రాయముననే తమ పుత్రులకుఁ బెండ్లిండ్లు చేయుదురు.

ఆనందు : ప్రసిద్ధున కింతదనుకఁ బెండ్లి చేయకుండుట కొక కారణమున్నది. తమకుటుంబములోని మగపిల్లలకు నిరువదిరెండేండ్లు నిండినఁగాని, బెండ్లిండ్లు చేయ రాదని వారియింటి 'సతీశాసన' మని చెప్పుచున్నాఁడు. అట్టి శాసనమే లేనిచో, అతఁడిట్లు పెండ్లిచేయకుండ నుండువాఁడేనా ? బనియాలలో నేడవ సంవత్సరమున

మగపిల్లవాండ్లకు, అయిదవవత్సరమున నాఁడుపిల్లలకును బెండ్లిండ్లు చేయుదురు. ఇది వారి మర్యాద.

చాంద: ప్రసిద్ధుఁడు వట్టి అవతవక మనిషి. నేనెన్నిసారులో "రామచరణుని పుత్త్రిక నిరక్షరకుక్షి, అసభ్య, దాని నెంతమాత్రమును బెండ్లియాడ" నని మీతండ్రితో స్పష్టముగఁజెప్పుమని బోధించి చెప్పితిని. కాని నాబోధలను దల కెక్కించు కొనఁడు.

వినయుఁడు: తలకెక్కించుకొనకపోవుట కాదు. ప్రసిద్ధుఁ డానందునివలెఁ దండ్రి కెదురాడుట కిష్టపడుటలేదు.

చాంద: ఏమి ప్రసిద్ధా! వాస్తవముగ నీయుద్దేశ మదియేనా?

ప్రసిద్ధు: ఆఁ. అవును. కొన్ని విషయములలో నాయుద్దేశ మదియే. నాతండ్రి వాస్తవముగ నొక ధూర్తపండితుఁడుపన్నిన మాయాజాలములోఁ దగులుకొని, నన్ను సర్వనాశనమునకు గురిచేయఁబోవుచున్నాఁడు. అయ్యది నిశ్చయము. హరదత్తపండితుఁ డెంతటి ధూర్తుఁడో మీరే యెఱుఁగుదురు. అతఁడు నగరమంతయుఁ దెలిసియున్నవాఁడు. అతఁడు కడులోభి. కడు స్వార్థి. లోభస్వార్థములకు లోనైనజీవనమును నాశన మొనర్చుచున్నవాఁడు. ఆనీచుఁడు మాకుఁ గులపురోహితుఁడై యున్నవాఁడు. రామచరణుఁడు తన కూఁతును నాకిచ్చి పెండ్లిచేయుట కుత్సుకుఁడై యున్నవాఁడని యెఱింగి యాతనికడకేఁగి "నాకు నేనూఱురూప్యములు బహుమతి నొసంగితివేని యవశ్యము నీకూఁతునకుఁ బ్రసిద్ధునిఁగూర్చి పెండ్లిచేయించెద" నని చెప్పెను. అంతట రామచరణుని మనోరథము సఫలతఁగనుట కాధార మలవడెను. అతఁడాజిత్తులమారి పండితునకు నైదు వందల రూప్యములు సమర్పించెను. నాతండ్రి నాకుఁ బెండ్లిచేయ నిశ్చయించి పలువురు కన్యకల జన్మపత్రికలను సమకూర్చి, దానిని విచారణార్థము హరదత్తుని చేత నిడియెను. ఆపత్రిక లెవ్వియు వాని విచారణమున ననుకూలము లగుటలేదు. రామచరణుని కూఁతుః జన్మపత్రికలోని గ్రహములును నాజన్మపత్రికలోని గ్రహములును, అన్యోన్యానుకూల్యముఁగని ముప్పదియాఱు గుణముల నొకదాని కొకటి యీడుదీయక యొప్పుచున్నవని చెప్పెను. అంతియకాదు. రామచరణునికూఁతు తోడిదియుఁ గానేరదని, యాకన్యఁజేపట్టిన పురుషుఁడు త్తరక్షణమునఁ గోటీశ్వరుఁ డగునని నాతండ్రి చెవులఁ నింపెను. సరి. ఇంకేమున్నది? నాతండ్రియానందము మేఱమీఱినది. ఒరులొసంగు లక్షరూప్యములకంటె రామచరణుఁడొసంగు నయిదు

వేల కట్లమే యెక్కుడైన దని నిశ్చయించెను. రామచరణుని కూఁతునే ప్రసిద్ధునకుఁ బెండ్లిచేసెదను. గాని తదితరులను బెండ్లిచేయ నని భీష్మించుకొని యుండెను. నాకీరహస్యము తెలిసినంతనె నీహారదత్తుని కుతంత్రమును నాద్యంతము నాతండ్రితోఁ జెప్పితిని. అంత నాతండ్రి నాపై నుగ్రుఁడై "ఇంగ్లీషు చదివినందుకు సార్థకమయినది. బ్రాహ్మణునిపైఁ గళంకమును దోషమును నారోపింపఁ దొడంగితివి. ప్రసిద్ధుఁడింగ్లీషుచదువు చదివినయెడ విమతుఁడగునని చెప్పు మీయమ్మమాటలు నిక్కములైనయవి" అని పలికెను. ఈపరిస్థితులలో, జన్మపత్రికను నింకొక పండితునకుఁ జూపుఁడని చెప్పితినేని యదియు వ్యర్థమైనదియే యగును. గ్రహచక్ర మాధూర్తుని చేతిలో నిమిడి యుండిన దగుటచే, నాచెప్పెడి మాటల కనుకూల మగునటుల నాజన్మపత్రికను మొదలే సిద్ధముచేసి యున్నవాఁడు. కాఁబట్టి యేరికిఁ జూపినను, జూచువారెల్లరు యోగజాతకుని, అత్యనుకూలమగు దాంపత్యమగునని యనుటకన్న వేఱే మనఁగలరు? అందువలన జాతకముల నింకొకరికిఁ జూపుటవలన లాభమేమియుఁ గలుగనేరదు. అందువలన నానిశ్చయము నిదివఱకే యానందునికెఱిఁగించి యున్నాను. అటులనే నడచెదను. అంతకన్న వేఱొండు మార్గము నాకుఁ జూపట్టుటలేదు. నాసతి నా కడ కరుదెంచిన పిమ్మట దానిని మార్గమునకుఁ దెచ్చుటకు శక్తివంచనము చేయక పలువిధములగు యత్నములు సలిపెదను. నాయత్నములు సార్థకము లగునవి యగునేని నయ్యవి మార్గప్రదర్శకములు కాఁగలవు. మార్గప్రదర్శక మెట్లగునని యందురా? నాయత్నములఁ బరికించి కన్యలెంత యవివేక వతులైనను, నెంత యసభ్యమైనను, సద్యత్నమునఁ జక్కఁబడఁ గలవని యట్టివారిని వివాహమాడుట కేరును వెనుదీయకుందురు. ఒకవేళ సార్థకములు గాక విపరీత పరిణామమును బ్రదర్శించునవి యైనచో నద్దాని వలనఁ గూడ లోకమునకు శిక్ష యలవడఁ గలదు. అందువలన నేను నాశరీరమును, నా జీవనమును నామనఃపూర్వకముగ నాతండ్రి మనోరథము నీడేర్చుటకు సమర్పించుటకు సంసిద్ధుఁడ నగుచున్నాఁడను.

ప్రసిద్ధుని మాటలను సమర్థించుటకునై వినయుఁ డుద్యుక్తుఁ డగుచుండెను. కాని, యంతట హృదయవిదారకమగు ననాథ యువతి యార్తనాద మొండు, వారి ధ్యానములను దనవంక కాకర్షితము గావించు కొనుటవలన, వారు నలువురు నాయార్తనాద మరుదెంచు వలనుకు సత్వరముగ నరుగవలసిన వారైరి.

# నాలుగవ ప్రకరణము

పండితకుముద విహారి కులమునకు బ్రాహ్మణుఁడే. కాని, యాతఁ డింగ్లండున కరిగి బ్రాహ్మణత్వమున కొక నమస్కారమును హైందవాచారములకుఁ దిలాంజలియు నొసఁగి యున్నవాఁడు. నిత్యము, ప్రాతఃకాలము, తేయాకు పానముతోఁ బాటు కుక్కుటాండ భక్షణమునకుఁ గూడ నలవాటు పడియుండెను. ముసల్మానుల యొక్కయు, ఆంగ్లేయుల యొక్కయు భోజన పదార్థములను పాకము చేయుట కాతనికడ బావర్చీలును, బొట్లరులును గూడ సేవకులుగ నుండిరి. కుముదవిహారి తన యభక్ష్యభక్షణమును, దన భ్రష్టవర్తనమును, నతి గుప్తముగ బంధుజనుల కండ్లు గప్పి సలుపుచుండెను. అతఁడు సర్వభక్షకుఁ డను విషయమును దుద కాతని సహధర్మచారిణి యర్ధాంగి యరుంధతి కూడ నెఱుంగదు. అరుంధతి యప్పుడప్పుడు ఈబావర్చీలను నీబొట్లరులను నేల సేవకులుగ నునిచి యున్నారని ప్రశ్నించుచుండును. అట్టి ప్రశ్న మూయ మైనపుడెల్ల నాతఁ డామెకు సాంత్వన మొసఁగుచుఁ గుక్కలకును బక్షులకును మాంసము పచనము చేయుటకును, వానిని సంరక్షణము చేయుటకును నునిచితినని జమలొసంగుచుండు. కాని యాతని వర్తనము శైలకడ దాగి యుండినది కాదు. అందువలన నామె ప్రతి నిత్యమును, తేనీటి పానమందును, దఁడ్రి పంక్తినిఁ జేరుచుండును. ఎన్నఁడైన బావర్చి రాఁజాల నపుడు కుక్కుటాండ భక్షణమును పీడియుండఁ గలుగును గాని, శైలకుఁ దద్భక్షణ మలవడని దినము దుర్దినమగుచుండును. అంతే కాదు. దుస్స్వహముగను నగుచుండును. అందువలన బావర్చి రాని నాఁడు పండిత కుముద విహారి స్వయముగ నండములను బచనము నుజేసి శైలకు నొసంగుచుండును. కుముద విహారి శైలయెడ నత్యధికమగు ప్రేమను, వాత్సల్యమును బూనియుండెను. అందువలన శైల యాడినది యాటయుఁ, బాడినది పాటయు నగుచుండెను. దినమున కధమము నాలుగైదు సారులు దుస్తులను మార్చుచుండును. ఒకప్పుడు అచ్చముగ దొరసాని వేషమును వేయును. ఇంకొకప్పుడు ఫారసీ యువతి యాకృతిని దాల్చును. మఱొకప్పుడు బంగాళీసుదతి రూపమును ధరించును. వేఱొకపుడు మదరాసు నారి పోలికను జేకొనును. పూఁటకు బది పదిరెండు సారులు ముఖమును సబ్బుతో రుద్దుచుఁ బౌడరుతో నలంకరించుచుండును. శైల కొఱకుఁ గేవలము లవండరు సెంట్లు, ఫేసుపౌడర్లు, నిమిత్తము నెలకు, నించుమించుగ ముప్పది రూప్యములు వ్యయ మగుచుండెను. సృష్టికర్త కూడ శైల సౌందర్యమునకుఁ బ్రాధాన్యము నొసంగుట యందత్యధికమగు నౌదార్యమును జూపియుండెను. శైల

వేషభూషల ధరించి ఫీచెనులోఁ గూర్చుండి సాయంకాలము వాయుసేవనమున కరుగునపుడు, ఆమెఁ బరికించు యువకులకుఁ, జరిత్ర వంతులలోఁ జరిత్ర వంతులకు, దుర్భావము లుత్పన్నము లగుచుండునన్న నతిశయోక్తి కాఁజాలదు. కామాగ్ని ప్రదీపనమునకుఁ దగు సాధన సామగ్రులు పార్శ్వవర్తులై వర్తించు చుండునపుడు, శైల చంచలహృదయ గాకుండినచో నయ్యది మిగుల నాశ్చర్యకరమగు విషయమగు టకు సందియము లేదు.

ఏనాఁడు మిస్ శైలకుమారి బి. ఏ. క్లాసులోఁ జేరుటకు క్వీన్సు కాలేజీ కరిగియుండెనో, యానాఁడే కాలేజీ విద్యార్థులలో గలవర ముదయమయ్యెను. విద్యార్థులలో నధికసంఖ్యాకులు శైలను నిర్నిమేషలోచనులై తిలకింపఁ జొచ్చిరి. శైలల్యాండూ (ఒక విధమగు గుఱ్ఱపుబండి) కాలేజీనుండి మరలి స్వగృహమున కరుగునపుడు, వందలకొలది ద్విచక్ర శకటములు ఆల్యాండోను వెను దగిలి చనఁ జొచ్చెను. మొదటనే శైలస్వభావ మతి చంచలమైనది. అందువలన నామె కావిద్యార్థుల వర్తనము ప్రసన్నతఁ జేకూర్చునదిగ నొప్పుచుండెను. కళాశాలనుండి వెడలినది మొదలు స్వగృహముఁ జేరువరకు విద్యార్థులు శైల ల్యాండోను వెనుదగిలి చనుదెంచుచు, వారిలో వారు వ్యంగ్యరూపమగు హాస్యప్రసంగములు సలుపుకొనుచుందురు. ఆప్రసంగములను విని శైల సుస్మితవదనయైనపుడు తత్ప్రభావము విద్యార్థుల హృదయమునకు మఱింత కలవరమును జేకూర్చుచుండును.

మిస్ శైల ల్యాండోను ననుసరించి చనుచుండు విద్యార్థులును, సహపాఠులును, లెక్కకు మిక్కిలియై యొప్పుచుండిరి. కాని, యీ యనుసృతు లందఱిలోను మిస్టర్ హర్షదేవుఁడు శైలదృక్కులను సంపూర్ణముగ నాకర్షితుఁడై యుండినవాఁడు. హర్షదేవుఁడును, శైలమనోభావమును గ్రహించియుండెను. ఆతఁడు ఒడ్డు పొడుగుగల సుఘటిత శరీరము గలవాఁడు. గౌరవర్ణుఁడు. విశాల నేత్రుఁడు. సుందరవిగ్రహుఁడనఁదగియున్నవాఁడు. ఏవర్ణమున కేజాతికిఁ జెందియున్నవాఁడో తెలియఁబడదు గాని, చూచుటకుఁ గాశ్మీరదేశస్థుఁడుగఁ గనఁబడుచుండెను. ఆతని వేషభూషలు, భాషణము, ఉనికి, వర్తనము గమనింపఁగఁ గోటీశ్వరుని తనయుఁడుగఁ జాటుచుండును. వేయేల? అప్-టు-డేట్ జంటిల్ మెన్, అయి యున్నవాఁడు. ఆతనిఁబోలువాఁడు మఱియొకండున్నవాఁడని చెప్పవలనుపడదు. ఆతఁని కాతఁడే సాటియైయుండెను.

మిస్ శైల మిస్టర్ హర్షదేవులనడుమ వర్తిలుచుండు రహస్యవర్తనము, పరస్పర భావ ప్రకటనములు, అన్యోన్యనయన సాంకేతికములు మందస్మితములు కొలఁది

దినములలోనే వారి హృదయసీమలఁ బ్రేమరస బీజారోపణమున కాధారభూతము లయ్యెను. ఏమయినను, వారికిరువురకును, సాధారణరూపమగు సంభాషణమున కెట్టివిధమగు నడ్డంకియును గలుగక యున్నను, పలువురు సహచరులగు యువకు లుండుట వలనను, శైలననుసరించియుండు నొకవృద్ధజమీందారుని తీక్ష్ణదృష్టి శైలపైఁబడి యుండుటచేతను, ప్రకటరూపమున వారికిరువురకును ప్రేమాలాపము లాడు కొనుటకును, దుస్కరమగుచుండెను. శైలశకటసారధి, శైలనుజూచి కళాశాలా విద్యార్థులు సలుపు పరిహాసములఁగూర్చి యేనాఁడు కుముదవిహారితో వివరించిచెప్పెనో, యానాఁడు మొదలాతఁడు, ఆవృద్ధు, జమీందారుని శైల యను సరణమున నియోగించెను. శైలాహర్ష దేవుల ప్రేమాలాపములు దుర్ఘటములు నసంభవములు నగునటుల వృద్ధ జమీదాంర డడ్డంకియై యుండినను, నన్యోన్యహృద యముల నంకురితములయిన ప్రేమాంకురములు ప్రవృద్ధములు కాఁజొచ్చెను. పరస్ప రావలోకనము లభింపనిదినమునందా ప్రేమరస పూరితవ్యక్తిద్వయము ఘోరవిపత్తునఁ గూలినటుల శోకవివశులై యశ్రుధారలఁ బ్రవహింపఁ జేసికొనుచుండిరి.

వృద్ధజమీందారు కారణముగఁ బ్రేమి ప్రేమికులు, ఆంగ్లభాషా ప్రసంగము గావించుకొనఁ జొచ్చిరి. వృద్ధజమీందారుఁ డాంగ్లభాషా పరిచితుడు కానందున వారి ప్రసంగోదంతమును గ్రహింపఁ జాలకపోయినను, బుద్ధి కుశలుఁడును, ననుభ వజ్ఞుఁడు నైనందున వారి ప్రసంగ సందర్భమునఁ బ్రదర్శితము లగుచుండు మందస్మి తములను. హావభావ విలాసములఁ బట్టి వారి ప్రసంగము నందలి భావమును గ్రహి యించి శైలను మందలించుచుండె. శైలవర్తనము కళంకితము కాఁదగు సూచనలు చూపట్టుచుండెను. "తడవు సలిపినయెడఁ దచ్చరిత్రము దోషభూయిష్ఠ మగును. నగుబాట్లకుఁ గారణమగును. కాబట్టి తత్స్వాతంత్ర్యము, తద్వర్తనము నరికట్టుట శ్రేయము. లేనిచో మించిన పిమ్మటఁ జేతులు పిసిగి కొనవలసి వచ్చును. సాటి వారిలోఁ దలవంచు కొనవలసి వచ్చును" అని కుముదవిహారితో నా జమీందా రుఁడు చెప్పుచుండెను. కాని కుముదవిహారి యాజమీందారు హితవచనములను వృద్ధ ప్రలాపములుగఁ దలఁచి సరకుఁ గొనకుండెను.

వృద్ధ జమీందారుప్రతిదినమును, శైలసలుపు చేష్టలను గనిపెట్టుచునేయుండెను. కాని యేమియు నెఱుంగని వానివలెనే వర్తిలుచుండెను. అయ్యది యనుకూలము గనే తలఁచి శైల యొకనాఁడు, కళాశాలనుండి యింటికి మరలి చనుచుండినపుడు తన ల్యాండోలోనుండి క్రిందికి దిగి హర్ష దేవు ననుసరించి యాతనితోఁ బ్రసంగ మొనర్చుచుఁ గాలినడకఁ జనఁ జొచ్చెను. అప్పుడు హర్ష దేవుఁడు ప్రసంగమున

మధ్యమధ్య శైలహస్తమును గ్రహించి పట్టుకొనుచుండుటఁ గనిపెట్టి యావృద్ధుఁడు దుస్సహుఁడై కోపారుణిత నేత్రుడై శైలాహర్ష దేవుల నిరువురను, నిష్ఠురముగ మందలించుచు, శైల నుద్దేశించి "మిస్సమ్మా! చాలుఁ జాలు. ఇంక దయచేసి బండిలోఁ గూర్చుండుము. ఇంటికిఁ జనుదము. పితాజీ యీ వర్తనమును వినినయెడ నెంతగఁ గినియునో తలపోసి చూడుము. అమ్మాజీ యేమిచేయునో యెఱుఁగవు గాఁబోలు." అని కఠినముగఁ బలికెను.

వృద్ధజమీందారు కుముదవిహారి తాతదండ్రులనాటి సేవకుఁడు. అతడు వారి యింటి సేవయందే, వారికుటుంబసేవయందే తన జీవితమును వినియోగించుచున్నవాఁడు. పండితున కనన్యశుభ చింతకుఁడు. ఋజువర్తనుఁడు. విశ్వాసపాత్రుఁడు. కుముదవిహారి యింగ్లాండులోనున్న సమయమునఁగూడ నాతఁడే గృహకార్య నిర్వహణ మొనర్చుచుండినవాఁడు. ఆ కారణమున నాతనియెడఁ బండితఁకుముదవిహారి భక్తి ప్రపత్తులను, నాదర గౌరవములను, నతిశయముగఁ గలిగి యున్నవాఁడు. వృద్ధునకుఁ బండితుని యింటి యందుఁ బలుకుబడి యెక్కువ. సేవకులు మున్నగు వారననేమి? కుముదవిహారి కతిరిక్తముగ నింటి పరివారములోని యెల్లవారును, దుద కాతనిభార్య యరుంధతియుఁ గూడ నాతని శాసనమును శిరోధార్య మొనరింపవలసినవారలే. అందు వలన నావృద్ధుఁడు శైలను మందలించుటకును, బండిలోని కరిగి కూర్చుండుమని శాసించుటకును, నిసుమంతయు జంకని వాఁడై యుండెను. వృద్ధుని శాసనమునుమీఱి వర్తిలుటకుఁ దగు సాహసము శైల యందుఁ బొడసూపఁ జాలనందునఁ దత్క్షణమే యామె బండిలోని కరిగి కూర్చుండెను. హర్షదేవుఁడు హతచేతస్కుఁడై "ప్రియే! శైలే! నీప్రేమమార్గమున దుర్గమముగఁ నడ్డంకియై నిలిచియున్న యీనారకీయ కంటకము నవశ్యముగ రూపడఁగింపవలయును." అని యింగ్లీషులోఁ బలికెను. ఆపలుకుల నాలించి శైల కన్నుల నీరుఁగార్చుచు "ఈనిర్దయుని, నీవృద్ధునిఁ దలనుండి దింపుకొనుట కడునసంభవము. వీనిమూలమున మన సుఖదినములు, మన ప్రేమాలాపములు, తుదకు మన ముఖావలోకనములు కూడ నంతమొందె నని తలంపుము. కాని, యందుల కుపాయాంతర మొండవశ్యముగ నరసెదను." అని యింగ్లీషులోనే ప్రత్యుత్తర మిచ్చెను. అనంతరము శైల గ్రుడ్లనీరు నిండఁగా హర్షదేవుని వంకఁ జూచెను. హర్షదేవుఁడును నీయాఘాతమునకు, నీవియోగమునకు, నామెహృదయమున కంటెఁ దనహృదయము సహింపనేరక యెక్కుడుగ విదీర్ణమయ్యెనని సనిదర్శనముగ నెఱుకపఱుపనెంచి కాఁబోలు నయనయుగమునుండి కన్నీరు

ప్రవహింప శైలముఖమువంకకుఁ గాతరదృష్టులఁబఱపుచు, దీర్ఘనిశ్వాసమును బుచ్చుచుఁ దనసైకిలును వేఱొక మార్గమునకు మరల్చి చనుచుండెను. శైల ల్యాండ్లోలో నొకప్రక్క కానుకొని కూర్చుండి ఖిన్నవదనయై కన్నులనీరు గార్చుచు స్వగృహమున కరిగెను.

## అయిదవ ప్రకరణము

బాబూ ఋషీశ్వరనాథుఁడు ఆగ్రానగరములోని యొక ప్రఖ్యాత పురుషుఁడు ఆతఁడు నగరములో నాబాలవృద్ధముగ నెల్లరచే నత్యంతాదరదృష్టిఁ జూడఁబడు చుండును. ఆతఁడు నగరములలో రాజమార్గముననే కాదు, ఏసందు గొందు మార్గమున బయల్వెడలినను, జూపరులు గుర్తించు 'నమస్తే' 'ఆదాబో ఆర్జ్' 'జయరామ్‌జీకి' 'బందగీఆర్జ్', 'పాలాగన్' మొదలుగాఁ గల యభివందనాత్మకములగు శబ్దవర్షమునఁ దడియుచుండును. ఋషీశ్వరనాథుఁడు సర్వజన మాన్యుఁడు ఆతని మాట కేరును జవదాటనేరరు. ఆతఁడేమిపనిఁ జెప్పినను జేయుట కెల్లరును సంసిద్ధు లగుచుందురు. ఆతని పరిచయమును బడయుటకు, నాతనితో ముచ్చటించుటకును, నెల్లరు నుత్సుకు లగుచుందురు. అంతియ కాదు. బాబూ సాహెబు పరిచయమును నభిలషించి, యాతఁడు తమకేపైనఁ బని నియోగించు భాగ్యముఁ గోరి నాగరికులు వాని ననుసరించుచుఁ [illegible] ఒకవేష్టించి యుందురు. అందులకుఁ గారణము ఋషీశ్వరనాథుఁ [illegible]. స్వార్థరహితుఁడు. ఆర్తజన శరణ్యుఁడు. పరోపకార పారీణుఁడు, సమాజ సేవకుఁడు. ఆతని ప్రయత్నముల వలననే, యాగ్రా నగరములో "హ్యూమన్ సర్వీస్ లీగ్" విధవాశ్రమము, అనాథాలయము, సేవాసమితి. మొదలుగాఁ గల సంఘసేవా[illegible]ములగు సంస్థలు పెక్కు లుదితములైనవి. ఆతఁడే యాసంస్థలనెల్లను, [illegible], మంత్రి, ప్రధానమంత్రి, అధ్యక్షుఁడు ఉపాధ్యక్ష మొదలుగాఁ గల పదవు లలంకరించి పరిచాలన మొనర్చుచుండెను, తదతిరిక్తముగ నెన్నియో నిర్ధన కుటుంబములకు గుప్తదాన మొసంగుచు రక్షించుచుండెను. బీద విద్యార్థులకెందఱకో విద్యాదాన మొసఁగుచుండెను. నిరుద్యోగుల కుద్యోగములు కల్పించుచుండెను. బాబూ ఋషీశ్వరనాథుఁ డాంగ్ల వైద్యమునను, నాయుర్వేద వైద్యముల రెండిటి యందును, నసామాన్య ప్రావీణ్యమును గని, యున్నవాఁడు. బీదల కెందఱకో యుచితముగ నౌషధములు పథ్యపానము లొసఁగుచుఁ బ్రాణరక్షణ మొసఁగుచుండెను. ఆ కారణమున నాగ్రా లోని స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, వారువీరననేల నెల్లరును, ఋషీశ్వరనాథునకై ప్రాణముల నైన

నర్పించుటకు సంసిద్ధులై యుందురు. పరహిత చింతకునిఁ బరోపకారపరాయణునిఁ జిరకాలము మననీయకుండుట ప్రకృతికి నియమమై యుండును గదా? మంచివారిని నీశ్వరుఁడు సత్వరముగఁ దన చెంతకు రావించుకొని సెంచుచుండును. దాన "సుకృతీ గతాయుః" అను వాక్యము సిద్ధవాక్యమనుటకు సందియము లేదు. విచారించి చూచినచో నా వాక్యమునందలి వాస్తవికత యవశ్యము చూపట్టును. వర్తమానమునఁ బ్రపంచమునందు సాధుపురుషుల సంఖ్య యల్ప సంఖ్యగ నొప్పుచున్న యది. దానికిఁ దార్కాణముగ సృష్టియందుఁ బాపము, అత్యాచారము, దుఃఖము, మొదలగు ననంగితములు ప్రబలములై యున్నయవి. సుకృతము, శాంతి, సుఖము, అను నవి శబ్దమాత్రశిష్టములే కాదు, శూన్యసదృశములునై యున్నయవి.

బాబూ ఋషీశ్వరనాథుని సతియు, నేకపుత్త్రుఁడును తొమ్మిది సంవత్సరముల క్రిందట నొక్కసారిగనే విశూచి జాడ్యమునకుగురియై స్వర్లోకమున కరిగి యుండిరి. ఋషీశ్వరునిఁ డాధ్యాత్మికవిచారుఁ డగుటవలన సతీసుతుల యాకస్మిక వియోగమునకు శోకాకులచిత్తుఁడు కాఁడయ్యెను. సతీసుతులు స్వర్లోకమున కరిగినది మొదలు తన యేక మాత్ర పుత్త్రికయగు కాత్యాయనిని నధిక ప్రేమఁ బెనుచుచుండెను. అతఁడు స్త్రీ సమాజ సుధారకమునందు నెక్కుడు పక్షపాతము నందు నెక్కువ పక్షపాతమును గలిగి యున్నవాఁడు. అందువలనఁ గాత్యాయనికి నింగ్లీషునందు, ఉచ్చశిక్షఁ గఱపించుటకుఁ గృతనిశ్చయుఁడై యుండెను.

తల్లి దండ్రుల ప్రకృతి లక్షణములు తత్సంతానమునందుఁ బ్రతిబింబితములగు నసెడు ప్రచలితోక్తి సిద్ధోక్తి యనుటకుఁ గాత్యాయనియే తార్కాణము. అయ్యుక్తి కాత్యాయని యెడఁ బూర్ణరూపమునఁ జరితార్థముఁ గనియెను. కాత్యాయనియందుఁ దత్పితరుని గుణగణము లన్నియు, నక్షరముల విద్యమానములు. కాత్యాయని తండ్రి కంటె నెక్కుడు సదయహృదయ. ఆమెఁ జూచు వారెల్లరును, సచ్చరిత్రయు, విమర్శిమణియుఁ బరోపకార పారీణయు, సంఘసేవాపరాయణయు నగునని వాకొను చుండిరి. కాత్యాయని దినదినాభివృద్ధిఁ గనుచు శిక్షఁ బడయు చుండిన కొలఁది నామెయందను యుక్త కోరికలు వికసితములు కాఁజొచ్చుచుండెను. కూఁతు సద్వర్తనమును సల్లక్షణములను గని ఋషీశ్వరుఁడు ముగ్ధహృదయుఁ డగుచు, నామె తన యాస్సితములను బూర్తిమొనరించునది యగు నను విశ్వాసమును దృఢముగ నొనర్చుకొనుచుండె. కాత్యాయని పదుమూఁడు వత్సరముల ప్రాయమందే హిందీ ప్రథమ పరీక్షయందును, దానితోఁ బాటు నింగ్లీషు ప్రవేశ పరీక్షయందునుఁ బ్రథమ శ్రేణిలో నుత్తీర్ణయయ్యె. ఋషీశ్వరుఁడు తన కూఁతున కలవడిన యీ సఫలతకుఁ

ప్రసన్న హృదయుఁ డయ్యెను. తదుపలక్ష్యముగ విధవాశ్రమమునకు వేయి రూప్య ములు దాన మొసంగెను. కాత్యాయని ద్విగుణితోత్సాహయై, విద్యాభ్యాసమం దెక్కుడభిరుచిఁ గలదియై కళాశాలలోఁ బ్రవేశించి యత్యాసక్తితో నతి శ్రద్ధతోఁ గృషి సలుపఁ జొచ్చెను. కాని, తానొకటి తలఁచిన దైవము వేఱొకటి తలఁచు నని కదా యార్యోక్తి.

మనుజుని యభిలషితము లన్నియు నెపుడును బూరితములు కానేరవు. మాన వేప్సితములు పూర్ణములేయగుచుండునేని సృష్టిలోనేరును బరమేశ్వరునిఁ గలలో నైనఁ దలంప నొల్లరనుట లోకప్రసిద్ధము. ఋషీశ్వరుఁడు తానాఁటిన వృక్షము యొక్క ఫలము తన యనుభవమునకు రాఁజాలదని స్వప్నము నందైనఁ దలంచి యెఱుంగఁడు. ఇన్ఫ్లుయెంజా యొక్క సర్వతోముఖాక్రమణమున నా సంవత్సర మాగ్రా నగరము గుఱియయ్యెను. తదాక్రమణమునకు ఋషీశ్వరుఁడు లోనై మృత్యు ముఖమును గనియెను. ఋషీశ్వరున కిన్ఫ్లుయెంజా జ్వర మంకురితమయ్యెనను వార్త నాలించినంతనే నగరమంతయు శోకాకులిత మయ్యెను. ప్రముఖులగు డాక్టర్లు, ఆయుర్వేదవైద్యులు వినానిమంత్రణముగ ఋషీశ్వరునకుఁ జికిత్స సలుప నరుదెంచు చుండిరి. నాగరికు లెల్లరు ఋషీశ్వరుఁడు తమ కొనర్చిన యుపకారమునకుఁ గృత జ్ఞులై యనృణులగుటకుఁ బ్రబల యత్నములు సల్పఁజొచ్చిరి. ఒకరు డాక్టర్ల బిలుచుట కును, నింకొకరు తగిన యౌషధములఁ గొనివచ్చుటకును, మఱియొక రౌషధములఁ ద్రావించుటకును, వేఱొక రుపచారములు చేయుటకును, దత్పర హృదయులగు చుండిరి. వేయేల పట్టణమునందలి యెల్లవారును నెవరికేపని యలవడిన వారాపని యందుఁ బ్రవర్తితులగుచుండిరి. బాబూ ఋషీశ్వరనాథుని గృహమునందుఁ బరిచా రకులు, సేవకులు పలువురుండి యున్నను, దదన్యులా సమయమునఁ దత్సేవా పరతంత్రులై, తమ కృతజ్ఞతను, దమ సానుభూతిని, బ్రకటింపఁ దొడంగిరి. బాబూ సాహేబున కయ్యది యసమ్మత మగు చుండెను. కాని, యేమి చేయఁగలఁడు? వివశుఁ డగుట తప్ప వలదనిన మాను వారెవరు?

అమావాస్య! అభాగ్యమును, నంధకారబంధురమునునగు నాఁటి నిశీథమునఁ బ్రాణప్రియయగు కూఁతును, గాత్యాయనిని దుస్సహ దురంత దుఃఖసాగరములోఁ గూలఁద్రోసి ఋషీశ్వరుఁడు పాంచభౌతిక శరీరమును బరిత్యజించి యమరతనువు గ్రహించెను. ఋషీశ్వరుని స్వర్గయానవార్త నగరమునందంతట వ్యాపించి హాహాకా రము లుప్పతిల్లఁజేసెను. నాగరికులెల్లను శోకసంతప్తులఁగావించెను. వందల కొలఁది పతివిహీనలగు యువతులకును, ననాథులగు బాలబాలికలకును, వేలకొలఁది

విద్యార్థులకును, గాత్యాయని కలవడిన దుఃఖమునకంటె నెక్కుడు దుఃఖముకాక పోయినను, సమానదుఃఖము సంభవించెను. ఎందఱో యనాథలు, ఎందఱో బీదలు, నేఁడు ఋషీశ్వరుని మరణమువలన సర్వోపహతులు కాఁబడిరి, మఱు నాఁడు పఱువాత వేలకొలఁది జనులు వెంబడిఁజనుదేర, ఋషీశ్వరుని మృతశరీర మును గృహమునుండి బయలువెడల్చి శ్మశానవాటికకుఁ గొంపోయిరి. తద్ధన సాహాయ్యమున జీవననిర్వహణ మొనర్చుకొను పలువురు స్త్రీలు, బాలురు, బాలకులు గొంతెత్తి బిట్టుగ నేడ్వఁదొడంగిరి. ఋషీశ్వరుని కనిష్ఠసోదరుఁడు మహేశ్వర నాథుఁడు విలపించుచు నాతని కంత్యేష్టిసంస్కారము నొనరించెను.

ఋషీశ్వరుఁడు ధనకుబేరుఁడు. దానాగ్రేసరుఁడు. సద్వ్యవహర్త. ఆతఁడు మరణకాలమం దేసత్కార్యమును గాని, యే సంస్థా సంచాలనమునుగూర్చి గాని, తుదకుఁ గాత్యాయనిఁగూర్చిగాని శాసనమూలకమగు ప్రబంధము నెద్దియు నిర్మించి యుండలేదు. ఆతని కంకురితమైన జ్వరము ప్రాణోపద్రవమును గలుఁగజేయునది కాదని యాతని విశ్వాసము. కాని రుగ్ణతావస్థయందు నిద్దరు ముగ్గురు మిత్రుల సమక్షమునఁ దనసోదరుఁడు మహేశ్వరనాథునితో, "నీకు నేఁబదిలక్షల రూప్యముల నొసంగుచున్నాను. గ్రహింపుము. మిగిలినసొమ్మును కాత్యాయని నామమున బ్యాంకిలో నిలువచేయుము. ప్రాజ్ఞురాలైన పిమ్మట దాని యిచ్ఛచొప్పున వినియోగించుకొనును." అని నోటమాటచెప్పి యుండెను. అనాథాలయమునకును, విధవాశ్రమమునకును, బీదవిద్యార్థులకును, నొసంగుసాయమును, గులీనులగు సతీమతల్లులకొసంగు గుప్తదానములను, నిర్విఘ్నముగ సలుపు చుండుమనియును నొక్కినొక్కి చెప్పియుండెను. కాని, ప్రపంచము, కామక్రోధ లోభ మోహమద మాత్సర్యములకుఁ గేళీగృహమై విరాజిల్లుచున్న యది. అందు జరుగు దుష్కృత్య పరిమాణములో సుకృత్యపరిమాణము సహస్రాంశమైనను జరుగుచుండుట లేదయ్యెను. అందువలన నత్యాశ ఘోరరూపిణియై సర్వత్ర స్వేచ్ఛా విహారమొనర్చుచుండెను. అయ్యది, అన్నదమ్ములను, దండ్రికొడుకులను, దల్లిబిడ్డలను, విడఁదీయుచున్నది. మహేశ్వరనాథుని యెడ ఋషీశ్వరనాథుఁ డాత్యంతికామిత వాత్సల్యమును, నమిత విశ్వాసమును బూని యున్నవాఁడు. ఆతఁడు మహేశ్వరునకు విద్యాబుద్ధులు గఱపించెను. పెండ్లిచేసెను. తండ్రి కంటెనెక్కువగు పోషకుఁడు రక్షకుఁడు నయ్యెను. మహేశ్వరుఁడును జ్యేష్ఠసోదరునియెడ మిక్కిలి భక్తిప్రపత్తులు గలిగి, యాతని యాజ్ఞ మేఱకు జవదాటనివాఁడై యుండెను. అట్టి మహేశ్వరుఁ డిప్పుడు జ్యేష్ఠసోదరుఁడు స్వర్గస్థుఁడైనంతనే ధనలాభమునకు లోనై ద్రోహమునకు

విశ్వాసఘాతుకమునకు నడుముకట్టి సంసిద్ధుఁడయ్యెను. ఋషీశ్వరునకుఁ బైతృక సంపత్తి యెద్దియును లేదు. అతని బాల్యజీవనము దారిద్ర్య పూరితము. కష్టభూయిష్ఠము. అతఁడు సద్వర్తనమువలన స్వయంకృషివలన, స్వప్రయోజకత్వము వలన నమిత సంపత్తున కధినాథుఁడయ్యెను. స్వార్జితమని తలంపక మహేశ్వరునఁ కేబదిలక్షల రూప్యముల నొసంగెను. కాని, యాత డంతటితోఁ సంతృప్తుఁడు కాఁజాలఁడయ్యెను. సోదరసంపత్తినంతను దానొక్కఁడే దిగమ్రింగ నెంచి కూర్చుండెను. విధవాశ్రమమునకును, ననాథాలయమునకును. దిండిలేక కృశించుచుండెడి కుల స్త్రీలకును నొసంగెడి సాయము నరికట్టెను. సోదర సంపత్తు నంతను, దన నామమున నొనర్చుకొని, కాత్యాయనికిఁగూడ నంగుళిఁజూపెను!!

కాత్యాయనికిఁ బినతండ్రి దుర్వర్తన మత్యంత దుస్సహమయ్యెను. ఆమెకు వాస్తవముగఁ గన్నతండ్రి మృతికంటెఁ బినతండ్రిదుర్వర్తనము మిక్కిలిపైకల్యము నొడఁగూర్చిన దయ్యెను. ఆమె పదునైదు వత్సరముల ప్రాయముఁ గనినయది. ప్రాజ్ఞతఁ బడసినయది. ఆమెకు స్వవిషయముఁగూర్చినచింత యిసుమంతయును లేదుగాని సాయ మలవడమిని మానమార్యాదలఁ గోలుపోవుచున్న సతీమతల్లులఁ గూర్చిన, విద్యావంచితులగుచున్న బీదవిద్యార్థులఁ గూర్చిన, నామావశిష్టము లగుచున్న విధవాశ్రమానాథాలయములఁ గూర్చిన చింత యెక్కుడయ్యెను. హృదయ విదారక మయ్యెను. అందువలన నామె యొకనాఁడు పినతండ్రికడ కరిగి యేకాంతమున.

"పినతండ్రీ! మరణశయ్యఁబరుండియుండి నాయనగారు మీతోఁ గొన్ని మాటలు చెప్పియున్నారు. వానిని మరచితిరి కాఁబోలు. వారియాజ్ఞను బరిపాలన మొనర్చుచుండుటలేదు. అందువలన నాకుఁ గడు దుఃఖమగుచున్నయది.

మహే: ఏమి చెప్పిరి? వారు నాతోఁ జెప్పిన మాటలేవి? నే నేమి మరచితిని?

కాత్యా: వారేమియుఁ జెప్పనేలేదా? మీరేమియు మరచుటయే లేదా? ఏమియు నెఱుంగని యటుల నటింతురేల? మీ రపకీర్తికిఁ బాలగుచున్నవారలని యెఱుంగరు కాఁబోలు. నగరములోని వారెల్లరును, మిమ్ముఁ బేరొక్కొని మీ పేరు పెట్టి బిట్టుగ దూషించుచున్నవారు. నాయనగారు చెప్పినమాట లెవ్వియును లేవా? పండిత రేవతీనారాయణుని మున్షీ కాళికాప్రసాదుని సమక్షమున మీతోఁ, 'నీవు ఏఁబదిలక్షల రూప్యములను దీసికొని మిగిలిన సంపత్తును గాత్యాయనిపేర

బ్యాంకియందుంచి విధవాశ్రమము, అనాథాలయము, మొదలగు సంస్థలకును, గుల స్త్రీలకును, విద్యార్థులకును నొసంగుచుండుసాయమును నిర్నిరోధముగఁ గొనసాగఁ జేయుమని చెప్పియుండలేదా? అంతరాత్మనడుగుము.

కాత్యాయనిమాటలు కర్ణపుటములఁబడినంతనె మహేశ్వరనాథుఁ డవనత వదనుఁడై యుండెను. విదీర్ణహృదయుఁడయ్యెను. విగతచేతనుఁడయ్యెను. మౌన ముద్రా ముద్రితుఁడయ్యెను. కొంతవడికి మనస్సును గుదురుపఱచుకొని, ధైర్యముఁ జిక్కఁబట్టి, లేదు, లేదు, నాతో నెవ్వరు దేనినిఁగూర్చియు, నెవరినిగూర్చియు, నేవిషయమును గూర్చియుఁ జెప్పియుండలేదు. నన్నాతఁడు పుత్త్రునిగ భావించెను. పుత్త్రునిగఁ బాలించెను. నేనాతనిఁ దండ్రియని యెంచితిని. తండ్రియని సేవించితిని. అట్టిస్థితిలో నేనుండఁగ నన్నుఁగాదని తన సంపత్తును నన్యాయ త్తమేల చేయనెంచును? ఏ విధముగఁ జేయ నెంచును? అట్లు చేయనెంచుట కాతఁడు వ్యవహారజ్ఞానహీనుఁడా? అతఁడట్లు చేయుట కెన్నఁడును, గలలోనైనఁ దలఁచి యుండినవాఁడు కాఁడు. ఆతనికోరిక యట్టిదే యగునెడ మరణశాసన (will) మేల వ్రాసియుండఁడు? వ్రాయకుండుట కతని నిరోధించినవారెవరు?

కాత్యాయని పినతండ్రి యిట్టి దుర్ణయ దురాశాపూరితమగు నుత్తర మొసంగు నని యెన్నఁడును దలంచి యుండలేదు. మహేశ్వరుని ప్రత్యుత్తరము దురంత దుస్సహ పరితాపమున కామెను లోనొనర్చెను. అంత నామె శిరమునఁ జేతులఁ జేర్చుకొని యొకచోఁ గూలఁబడియెను. మహేశ్వరుఁడామె యెదుటనుండి లేచి తోఁకముడుచుకొని పరుగిడఁ జొచ్చెను. అంతటఁ గాత్యాయిని వెడలిపోకుఁడు. నాకొకమాటకుఁ బ్రత్యుత్తర మొసంగి మఱి ... ... ...

మహే: ఏ మాటకు?

కాత్యా: చిన్ననాయనా! తమ రీవిధముగఁ గండ్లలో దుమ్ముకొట్టుదురని నే నెన్నఁడును గలలోనైనను ననుకొని యెఱుంగను. నేనీ విధముగ నిర్భయముగ నిస్సంకోచముగ మీతో మాటలాడవలసి వచ్చినందులకు నెంతయుఁ జింతిల్లుచున్న దానను. కాని, ఏమి చేయుదును? తప్పనిసరి వచ్చినది. నా కర్తవ్యము నన్నట్లు ప్రేరేపించుచున్నయది. యథార్థముగఁ జెప్పుచున్నాను. వినుఁడు. విని జ్ఞాపక ముంచుకొనుఁడు. నేను నా విషయముఁ గూర్చి యిసుమంతయుఁ జింతిల్లుచున్న దానను గాను, కాని, యథార్థముగ ననాశ్రితలు, దుఃఖితలు నగు కులసతులునుఁ నిస్సహాయులును, నిరాధారులును నగు బాలకులు నాహృదయమును విస్తీర్ణ విదీర్ణము,

గావించుచున్నవారు. అందుకై చింతిలుచున్న దానను. వారలకు నాయనగా రొసంగు సాయమే జీవనాధారము. నాకీయవలయు సొత్తును నాకీయ నక్కఱలేదు. మనఃపూర్వకముగాఁ జెప్పుచున్నాను. మీరు స్వీకరింపుఁడు. నేను వలదనను. కాని, భగవంతునకు వెఱచియైనను, మానుషత్వమును దలఁచియైనను, నసహాయ లగు యువతులకును, ననాథ బాలకులకును నాయనగా రొసంగు చుండిన సాయమును నిర్విఘ్నముగ సాగింపుఁడు. దాని నరికట్టకుఁడు. కులసతులు, మానమర్యాదలను వీడ నొల్లరు. తత్కారణముగఁ బరులను జేరి వేఁడ నేరరు. దాసీవృత్తి నవలంబన ముగఁ జేకొనఁ జాలరు. వారి జీవన నిర్వహణమున కేక మాత్రాధారమగు నీతోడ్పాటును నరికట్టి ఘోరపాతకమున కొడిఁగట్టుకొన వలదని నాప్రార్థనము. నేఁ జెప్పవలయునది యింతే. దీనికంటె నతిరిక్తముగఁ జెప్పనదేదియును లేదు.

మహే: నీవు చెప్పవలసిన దెద్దియో చెప్పితివి గదా! సరే! ఆలోచించెద. అని ప్రత్యుత్తర మొసంగుచు నందుండి వెడలి కాత్యాయని దృక్కులకు దూరగతుఁ డయ్యెను.

## ఆరవ ప్రకరణము

అర్థరాత్రి సమయము — నిద్రాదేవి మానవకోటినే కాక పశుపక్షి సంతతులఁ గూడ వశ మొనర్చుకొని, వానిపైఁ దన నిరంకుశాధికారమును బ్రకటించు చుండెను. నదీ తరంగములు స్థైర్యమూని యుండెను. శాంతము, నిశ్శబ్దము, సర్వవ్యాప్తిఁ గని యుండెను. కాని, కాత్యాయనికి మాత్రము కంటికిఁ గూర్కుగాని, మనమునకు స్థైర్యము గాని, హృదయమునకు శాంతి గాని చేకూఱకుండెను. ఋషీశ్వరనాథుఁడు స్వర్గస్థుఁడైన దాది మహేశ్వరనాథుఁడు, దురాశా పీడితుఁడై వర్తిలుచుండెను. కాత్యాయని తండ్రి మరణమును, పినతండ్రి దుర్వర్తనమును దలంచు కొనుచుఁ గడుంగడు దుఃఖిత యగుచుఁ గాల మంతయుఁ బుచ్చుచుండును. రాత్రులయందు మధ్యమధ్య నే యొకటి రెండు గడియలు కన్నులు మొగుడ్చునో కాని, దీర్ఘాలోచ నమునందే మునుక లిడుచుండును. ఆమె యాలోచన యేమేటిదో యెరికిని తెలుకపడదు. నేఁడు రాత్రి రెండవయామము నతిక్రమించి మూఁడవ యామము నతిక్రమించి మూఁడవయామము నందడుగిడెను. ఆ సమయమునఁ గాత్యాయని తన గదిలో నొకచో గూర్చుండి పొంగిపొంగి పొరలివచ్చు దుఃఖవేగమునకు సహింప నేరక విలపింపఁ దొడంగెను. దుర్వర్తనుఁడును, దుష్టస్వభావుఁడును నగు పినతండ్రి

తనకేమి యుపద్రవముఁ జేకూర్ప నుండెనో యని శంకింపఁ దొడంగెను. ప్రపంచ మునఁ బాపాత్ములైశ్వర్యవంతులై పుష్పఫల సమృద్ధులై వఱలు చుండుటఁ గని కుపిత యగుచుండెను. ఛలపూరితమును, బాప భూయిష్ఠమును నగు ప్రపంచమునందు బ్రతికి యుండుటకంటె నాత్మహత్య నొనర్చుటయే శ్రేయస్కరమని తలంచి లేచెను. ప్రాణత్యాగోద్యమమున కుద్యుక్తయై ముందునకు రెండడుగుల నిడియెను. అంతట నిజజనకుని యాశయములు, నాతని కాంక్షలు తలఁపునకుఁ బొడసూపెను. తోడనే వెనుకకు మరలి యథాస్థానమున కరుదెంచి చతికిలఁ బడెను. తన తండ్రి తనకు విద్యాబుద్ధులు గఱపించి, యింగ్లీషునంగూర్చు శిక్ష నలవఱచి తన్ను నాదర్శ ప్రాయముగఁ జేకొని, స్త్రీ సమాజ సుధారక మవశ్య కర్తవ్యమని నిశ్చయించెను. జనకుని మనోభీష్టమును, సఫలమొనరించి జన్మసాఫల్య మొనరింపఁ దలంచెను. జనకుని యాత్మకదియే శాంతిని జేకూర్చునని యెంచెను. ఈ విధముగఁ గాత్యాయని కర్తవ్యాశబద్ధయై, దుఃఖ సంతాపిత హృదయమునకు సాంత్వన మొనరించి శాంతి నొడఁగూర్చి నిద్రాదేవిని సేవింప నెంచి పడకఁజేరి మేనువ్రాల్చెను.

కాత్యాయని పడకఁజేరి మేనువ్రాల్చి నిద్రాదేవి నారాధంప నెంచి కన్నులు మొగిడ్చెను. కాని, ప్రక్కగదిలోని మాటల సవ్వడి చెవులఁబడి నిద్రాదేవిని నా మెదరిఁ జేరనీయని దయ్యెను. ఆసవ్వడిని, నామాటల సందర్భమును బట్టి, యామె తన విషయమును గూర్చి తన పినతల్లి తన పినతండ్రితో మాటలాడు చున్నటుల గ్రహించి, వారి ప్రసంగమును జెవియొగ్గి శ్రద్ధగ వినఁ జొచ్చెను.

పినతల్లి ఉమాదేవి: సరే! మీరు కళంక కాలిమమును ముఖమున నిడుకొన సంసిద్ధులగుచున్నారు. అపకీర్తిభాజనులగుచున్నారు. అంతియేకదా? మీనిశ్చయము.

మహే: అదేమిటి? అట్లనుచున్నావు. ఇందుఁ గళంక మేటిది? అపకీర్తి యేటిది?

ఉమా: మీరు వీక్షణ శ్రవణ గ్రహణ శక్తులు గలవారలై యున్నను, నంధ బధిరజడత్వములను గ్రహింపనెంచినచో, మిమ్మెవరైన నేమనఁగలరు? ఏమి చేయఁ గలరు? మీ కీర్తిని మీ వర్తనమును గూర్చిన లోకప్రసంగమును వినవిన నాచెవులు చిల్లులు పడిపోయినయవి. గుండె పగిలిపోయినయది. ఇట్టి దుర్నీతిపరుఁడు, కృతఘ్నుఁడు, విశ్వాసఘాతుకుఁడు, దురాశాపీడితుఁడు అగుభర్త తోడి కాపురముకంటె సత్సతికి బలవన్మృతి మేలు. దానఁ బాప మలవడనేరదు. దుర్గతి కలుగఁ జాలదు. ఏవంకఁజూచిన నావంక, నెవరనినవారు "వానికేమి చేటు కాలమువచ్చినది? వాని

యాశ యడుగంట, అన్నకూతుయొక్క ఆస్తిని నపహరించి కూర్చున్నవాఁడు. కొట్టినేతిలో బడినట్టు సంతసిలుచున్నవాఁడు. వాని భగవంతుఁడు తిన్నగఁ జూచునా? యని తూలనాడు వారలేగదా? నే నిట్టి మాటలను వినఁజాలకున్నాను. కాత్యాయని సొత్తును, కాత్యాయనిపేర నొనర్చుఁడు. అన్నగారి యాజ్ఞను బరిపాలింపుఁడు. వారైనను మీకేమియు లోపమును జేయలేదు. ఏఁబది లక్షల నిచ్చినారు. అంతతో సంతుష్టిఁజెందుఁడు. లేదేని నే నీమాటలను వినఁజాలను. యమునామతల్లికిఁ బ్రాణముల నర్పించెదను.

మహే: (వికటముగనవ్వి) ఉమా! ఏమియనుచున్నావు. ఈ మాటలు నీనోటనే వినుచున్నాను. మఱి యెవ్వరినోటను నింతదనుక వినలేదు. నాతో నెవఁడైన నే నురాత్ముఁడైన నెల యనఁడు?

ఉమా: మీ ముఖము ముందఱ మీతో మీరిట్లు చేసితిరని యేరును జెప్ప సాహసింపరు. కాని, మీ దుశ్చరితమునుగూర్చి ప్రజలాడుకొను మాటలను మీరు నిశ్చయముగ నెన్నఁడును వినియుండనేలేదా? నేఁడు సాయంకాలము మన సేవకుఁడు రావలాలు అంగడికరిగివచ్చి "అమ్మాజీ! అంగడిలో నెల్లరు చిన్నబాబుగారిని తూలనాడుచున్నవారు. నే నామాటలను వినలేకపోయితిని. ఏమనఁ గలను? ఏమి చేయగలను? వినలేక నోరుమూసికొని యింటిదారిఁబట్టితిని. ఆమాటలు విన్నది మొదలు నాకెక్కుడగ దుఃఖము వచ్చుచున్నది. తల్లీ! మీపాదములతోడుగ నేను నిజము చెప్పుచున్నాను." అని నాతోఁ జెప్పినమాటలను మీరువినియే యున్నారు గదా? ఇంతకంటె నెవ్వరైన నేమనఁగలరు?

మహే: ఇదంతయుఁ గాత్యాయని కారణముగ జరుగుచున్నయది. పండిత రేవతీనారాయణుఁడును, మున్షీ కాళికాప్రసాదుఁడును జేరి కాత్యాయనిఁ బురికొల్పుచుఁ దనమేనమామచేత నామీద వ్యాజ్యము పెట్టించిన యెడఁ దాము ఋజువు పలికెదమని చెప్పుచున్నట్టు వినుచున్నాను.

ఉమా: ద్రోహ మెప్పుడును నూరకపోదు. అన్యాయ మెప్పుడును నణఁగి యుండదు. అధర్మ మెపుడును జయము నొసంగదు. అత్యాశ యెపుడును శ్రేయములను జేకూర్పదు. కాఁబట్టి నామాటను మన్నించి వ్యవహారమును ముదురనీయకుండఁ గాత్యాయని సొత్తును గాత్యాయనికొసంగి కళంకమును బాపుకొనుఁడు. అన్నగారి యాదరణమున, నాశ్రయమునఁ బెరిఁగి పెద్దయై భాగ్యభోగ్యములు వడసి యన్నగారి కూఁతునెడ విశ్వాసఘాతుకమును జూపనెంచిన మీవంటి యవినీతిపరు

లకు నరకమందుఁగూడ నిలుచుటకుఁ దావు దొరకనేరదు. అన్నగారు మీకేమయినఁ గొంచెము నొసంగిరా ! ఒకటి కాదు ? రెండు కాదు ! ఏఁబదిలక్ష లొసంగిరి. అవి చాలును. వానిని జేతనైన తెలివితేట లుపయోగించి సద్వ్యవహారమున నిడుదురేని మీరే కాదు, మీపిల్ల పిల్లల తరములన్నియు సుఖజీవనమున నెలపఁగలరు.

మహే : నీవు నాకు జ్ఞానోపదేశము నొసంగు నంతటిదాన వైతివా ! ఇంకఁ జాలును. నోరు మూసికొనుము. ధనసంగ్రహమునందు సంతుష్టి యేరికిని జెందఁ దగదు. ఉన్నదానితోఁ దనివి నొందరాదు. ఈ రెండును ననుచితములు. కుబేరుఁ డైనను ధనసంగ్రహమునందుఁ దత్పరచిత్తుఁడై మెలంగవలయునని పెద్దలు చెప్పుదురు. అందువలననే వ్యవహారవిషయములలో నాకు వాండ్రమాటలు వినవలదని, యాఁడువాండ్రకు లోఁబడవలదని యందురు. వ్యవహారవిషయములలోని సాధకబాధకములు నీకేమి తెలియును ? నావిశ్వాసఘాతుకమును జూపుటకుగా నన్నగారు మరణశాసనమును వ్రాసియుండలేదు. నేనును బేరుపొందిన పెద్దపెద్ద న్యాయవాదులతో నాలోచించియే యున్నాను. మరణశాసనము లేనినాఁ డెవరును, నేమియుఁ జేయనేరరని చెప్పియున్నారు. రేవతీనారాయణుఁడు కాళికాప్రసాదుఁడు మొదలగువారు వ్యాజ్యము నుపస్థితము గావించినయెడ, వారికిని నాకును, వివాదమొండుండి యుండుటచే, నాకు నష్టమును గలిగించుటకునై యిట్టు లబద్ధపుసాక్ష్యమొసంగుచున్నవారని న్యాయస్థానమున న్యాయాధిపతిఁ యెదుటఁ జెప్పెదను. ఆ మాట లవిశ్వాసములైన వెండిచెప్పు నుపయోగించెదను. అద్దాని ప్రహరణమునకు లొంగనివా రీ మూఁడులోకములలో నేరునులేరు. జడ్జీ దొరసానికి "క్రిస్మస్ ప్రజంటు" అని చేయి తడిచేసి వ్యాజ్యము తప్పక మనపక్షముననే తీర్పగునటుల యేర్పాటు చేయింపగలను ?

ఉమా : ఓహో ! ఇదియా మీయుద్దేశము ? మీ స్వభావ మెంత పరివర్తనమొందినది ? మీదురాశ మిమ్మేదరికా చేర్చినది ? అన్నగారు బ్రతికియున్నకాలములో, నన్నగారి కొఱకుఁ, గాత్యాయనికొఱకుఁ బ్రాణములనైన నర్పించుటకు వెనుదీయనని గొంతెత్తి పలికియున్నవారు కాఁబోలు ! అన్నగారు గతించినంతనె, వారు మరణశయ్యయందుండి చెప్పిన మాటలను లిఖితపూర్వకము కాలేదని, పోనాడి, వారి సొత్తునంతను నపహరించుటకు నడుముకట్టి యున్నవారలు, అవును. ఇందు మీదోషమేటిది ? దోషము ధనమునకుఁ జెందినయది. ధనము పాపిష్ఠిది. ధనలోభ మెంతలెంతలు ఘోరకృత్యములనైనఁ జేయించును. తండ్రికొడుకులకు, నన్నదమ్ములకు, బలవద్వైరమును, గొంతుకోఁతలను జేకూర్చును. ధనము మానవునిచే

నెంతటి పాపకర్మములైనను, నెంతటి విశ్వాసఘాతమైనను, జేయించునది యని నేడు మీవలనఁ దెలియఁగలిగితిని. సరే! ఇన్ని మాటలేల? ఒక మాటఁ జెప్పుచున్నాను. వినుఁడు. అధర్మమూలకమును, నన్యాయార్జితమును నగు నీధనమును నే ననుభవింపనొల్లను. ముట్టనొల్లను. ఈ వ్యవహారంబును సరళముగఁ బరిష్కృతము గావింపనొల్లనినాఁడు. నాయాశ వదలుకొనుఁడు. నన్ను నాపుట్టినింటికి కనుపుఁడు. నేనిందుండఁ జాలను.

మహే : నీవనవసరమగు వ్యథఁ జెందుచున్నావు. ప్రాణముల మీఁదికిఁ దెచ్చుకొనుచున్నావు. అది మంచిది కాదు. చూడు. నేనెంత నేర్పుతో, ఎంత చాతుర్యముతో, ఎవరికిని వ్రేలెత్తి చూపుట కవకాశమును గలుగనీకయుండ నీవ్యవహారమును సాధించెదనో! ఈవ్యవహారమున కంతకును బ్రధాన కారకురాలు కాత్యాయని. దాని నింటినుండి వెడలనడిపితినేని, నాసిగపువ్వు వాడనేరదు. నాపాలఁ బొంగినట్లే. నారొట్టె నేతిలోఁ బడినట్టే యగును. కాత్యాయనికి సత్వరముగఁ బెండ్లి చేసి, దానిని దాని యత్తవారింటి కనిపి యీ వ్యవహారమును నీరు గారునటులు చేసెదను. ఆ పెండ్లియందుఁ గూడ నొక యుక్తిఁ బన్నితిని. ఒక నిరుపేదఁ దెచ్చి దాని కంటఁ గట్టెదను. ధనాఢ్యుని కిచ్చి పెండ్లిచేసితినేని, యాతని సాయమునఁ, గాత్యాయని తనవంతు వచ్చిన యాస్తికొఱకు నాతో వ్యాజ్యమాడుట కవకాశ మొనగూడ నగును. అందువలన నట్టి మువకాశ మలవడనీయక, నిర్ధనుఁడు, పితృహీనుఁడు నగువానిఁ దెచ్చి, యిచ్చి పెండ్లిచేసి వానియింటి కనుపుటకుఁ, గృతనిశ్చయుఁడ నైతిని. కాత్యాయని యత్తింటి కరిగినంతనె వ్యాజ్యమనుమాట సమసిపోవును. మనము నిర్విచారముగ, సుఖజీవనము నెఱపుకొనఁగలుగుదుము, అన్నగారు కాత్యాయనిని, బి. ఏ. ప్యాసు చేయించి దానికి దాని యిచ్చ చొప్పునఁ బెండ్లి చేయవలయునని చెప్పియున్నారు. కాని, వారి మాటలను బాటించితినేని, నేను సర్వనాశనము నొందుదును. అపుడది నన్నుఁ జూడదు. నామాట వినదు. ఇపుడన్ననో నేయడ్డును, నేయాటంకమునులేదు. నే నెటులఁ దలఁచినట్లు చేయఁగలను.

ఉమా : ఇంతటిలో నిజముగఁ గాత్యాయనికిఁ బెండ్లి చేయుటకే కృతనిశ్చయులై యుంటిరా?

మహే : నీకింకను నమ్మకము కలుగలేదా? ఈ జ్యేష్ఠ శుద్ధ తదియనాఁడు కన్యాదానము. పంచమినాఁడు అంపకము.

ఉమా : మీ రనర్థమును జేయుచున్నారు. మీరిట్టు లన్యాయమును, నధర్మమును, ద్రోహమును జేయువార లగుదురని నేనెన్నఁడును గలలోనైనఁ దలంచి

యెఱుఁగను. కాని జ్ఞాపకముంచుకొనుఁడు. ఈ నమ్మకమును నాశనమొనర్పకుఁడు. విశ్వాసఘాతకమునకుఁ దగిన ఫల మనుభవింప నతిశీఘ్రముగనే వేచి యుండవలసిన వార మగుదుము. అది యటులుండనిండు. మీరు తెచ్చు వరుఁడు చదువుచున్న వాఁడా? లేక యుద్యోగమును జేయుచున్నవాఁడా? వాని కులశీలములు, వాని పూర్వాపరములు నేమయినఁ దెలిసికొంటిరా? అదియును లేదా? రూపవతి, శీలవతి, గుణవతి, విద్యావతి, యగు కన్యకను, కులహీనునకు నిరక్షరకుక్షికి, మూర్ఖునకుఁ గాకి ముక్కునకు దొండపండు కట్టిపెట్టి చేతులార గోతిలోఁ ద్రోయనెంచి యుంటిరా?

మహే: లేదు. లేదు. నన్నొక్కసారి అంత నీచునిగఁ దలంపకుము. వరుఁడు పేదవాఁడు. కాని, చదువుచున్నాఁడు. చాందనారాయణుఁ డను పేరున వ్యవహరితుఁ డగుచున్నవాఁడు. అతనికిఁ దండ్రిలేఁడు. తల్లియు నొక యాఁడుతోఁ బుట్టువును నున్నారు. అతఁడు ఎమ్. ఏ. పరీక్షయం దుత్తీర్ణుఁడై యున్నాఁడు. ఉద్యోగమును జేయుచున్నవాఁడు. ప్రకృతము సెక్రిటేరియటులో డెబ్బది యైదు రూప్యములు వేతనమును బడయు చున్నవాఁడు. నాలుగైదు ప్రాణులకుఁ గూడు గుడ్డలకు లోపములేదు. పురోవృద్ధిఁజూపు లక్షణములఁ గలిగి యున్నవాఁడు.

మహేశ్వరనాథుని మాటలను విని తత్పుత్త్రి యుమాదేవి శిరము మోదు కొనుచు

“మహారాజకన్యకఁ బోలె నతిగారాబమునఁ బెరిగి, యుచ్చశిక్షఁబడసి, రూప గుణశీలముల నొప్పు గులుకుచున్న కాత్యాయని యొక సామాన్య పురుషుని బంధన మునకుఁ బాలై యొక మూలఁబడి యొక సాధారణపు యువతివలెఁ గాలక్షేపముల జేయుచుఁ దనజన్మము దన విద్యను, దన యోగ్యతను బ్రపంచమునకుఁ బరిచయముఁ జేయనేఱనిది యగుచుండెనా? దైవమా! ఎంత ఘోరము! ఎంత పాపము! ఎంత అన్యాయము” అని యేడవఁ జొచ్చెను.

కాత్యాయని యింతవరకుఁ బ్రక్కగదిలో నిలిచియుండి పినతండ్రి పినతల్లుల ప్రసంగమును నాలించుచుఁ గన్నుల నీరు గార్చుచుండెను. పినతండ్రి స్వార్థపరత్వము నకుఁ గుందుచుండెను. పినతల్లి పలికిన కడపటిపలుకు లామె హృదయమును గలవర పఱచెను. ఆమె మౌనముద్రికను భంగమొనరించెను. అంత నామె దుఃఖావేశ పరవశయై తనగదినుండి వెడలి పినతల్లియుఁ బినతండ్రియు మాటలాడుకొనుచున్న గదిలోనికిఁ బ్రవేశించి, పినతల్లితో “పిన్నీ! నిశ్చయముగ, యథార్థముగ నీవే

నాతల్లివి. నాతల్లిని నేనెఱుఁగను. నాతల్లి చనిపోయిన దాది నీవే నన్నుఁ బెనిచి పెద్దఁజేసితివి. నీ ఋణమును నేనేవిధముగను నెన్నటికిని దీర్చుకొనఁ జాలను (మహేశ్వరుని నుద్దేశించి) బాబూజీని మొదటినుండియుఁ బితృభావముననే చూచుచున్నదానను. ఇపుడు కూడ నట్టిభావమునే పూని యున్నాను.'' అని పలికి మరలఁ బినతల్లి దిక్కు మొగంబై, 'తల్లీ! నేటి వీరి మాటలు నా హృదయమును విదీర్ణముఁ గావించినయవి. నేను వినమ్రనై చెప్పుచున్నాను. నన్నుఁ గూర్చిన విచారమును విడిచిపెట్టుఁడు. నేను కర్తవ్యమును బ్రధానముగఁ దలంచి యున్న దానను. ధనము నాశించి యున్నదానఁ గాదు. అదృష్టమును నమ్ముకొని యున్న దానను. ఏరియందైనను, స్త్రీయందుఁ గాని పురుషుని యందుఁగాని, యోగ్యతయే యుండెనేని, వారిని సముద్రములోఁ గూలఁద్రోచినను, అరణ్యములో వదలిపెట్టినను, వారు తమ యోగ్యతను, దమ యుత్తమ గుణములను, లోకపరిచితములుగఁ జేయఁ గలరు. అందులకు సందియము లేదు. కాఁబట్టి నన్నుఁగూర్చి యించుకయుఁ జింతిల కుఁడు. నాయనగారి యుపదేశ ప్రభావము, నాయెడల సఫలతఁగాంచఁ గలుగునది యగునెడ, నవశ్యముగ, విధ్యుక్తముగ, నాకర్తవ్యపరిపాలనము నిర్విఘ్నముగ సాగఁ గలుగునది యగును. ధనమునుగూర్చి చింతిలకుఁడు. ఇంతవఱకును ధనాఢ్యులను గౌరవనీయులుగ భావించియుంటిని. కాని తద్భావమిపుడు సంవర్తితమయ్యెను. ధనము సంప్రాప్తమైనపుడు సజ్జనులును దుర్జను లగుదురు. అని నాకిపు డెఱుక యయ్యెను. అంతు మనుష్యుల దోషమెయ్యదియును లేదు. దోషమంతయు ధనమును జెందియున్నది. అందువలన ధనముతోఁ బాటు దోషముకూడ మనుజులఁ బొందు చున్నయది. కాబట్టి ధనమున్నచోట దోషమును, దోషమున్నచోటఁ గష్టమును, నుపస్థితములై యున్నవని తలంపుఁడు. అంతియకాని నిరుపేద జేఁపట్టినఁ గష్టభాగిని నగుదునని విచారింపకుఁడు. నిరుపేద ధనహీనుఁడు దోషరహితుఁడు, ధనదోషము లేనివారిని కష్టములు వరింప నొల్లవు. వారిని సుఖములే వరియించునని నా యిష్టము. నా నిశ్చయము. నా విశ్వాసము. అంతియకాక, కష్టములకు వెఱచుట కాతర లక్షణము. సాహసులు ప్రథమమునఁ గష్టభోగులైనను బర్యాయమున సుఖప్రాప్తు లగుదురు. పితృవాక్య పరిపాలనాతత్పరుఁడగు శ్రీరామచంద్రుండు వనవాసియై పదునాలుగు వత్సరము లమితకష్టముల ననుభవించి యనంతరము రాక్షస సంహార మొనరించి మహారాజభోగ మనుభవించి యుండెను. సీతామహాదేవి, వాల్మీక్యాశ్ర మమున సకల కష్టముల ననుభవించిన పిమ్మట నేకదా మరలఁ బతిపరివారములఁజేరి సుఖించుటకు సమయము ప్రాప్తమయ్యెను. కర్మవీరులు, కర్తవ్యపరాయణులు

పాండుపుత్త్రులు మహా కష్టములను బొందిన పిమ్మటఁగదా కౌరవుల జయించి రాజ్య ప్రాప్తిఁ బడయఁగలిగిన వారలైరి. దమయంతి కష్టముల ననుభవించియేకదా మరల నలునిఁ బడసినయది. సావిత్రిఁ దలంపుఁడు. సుకన్యఁ బరికింపుఁడు వారందఱును గష్టములను ముందుగ ననుభవించిన పిమ్మటనే సుఖములఁ బడసియుండిరి. పిన్నీ! అవి పౌరాణికవార్తలు. అటుండనిండు. ప్రకృతమునఁ గూడఁ జూడుఁడు. కష్టసహిష్ణులై కార్యక్షేత్రమునఁ బరిశ్రమ మొనర్చినవారలే యశోధనములఁ బడయఁ గల వారలగుచున్నారు. కష్టములకు వెఱచి కర్తవ్యపరాయణులు గానివారలు కూటికిని గుడ్డకును గుందుపడువారలగుచున్నవారు. అందువలనఁ గష్టభాక్కునగుదు ననువిచారమును హృదయమునుండి పాఱఁద్రోలుఁడు. ఇఁక మిగిలినది. ప్రాప్తుఁడగుపతి యోగ్యుఁడా? అను విషయముకదా? దాననాకంత విచారణీయముగఁ దోఁచుటలేదు. అంతియకాక పతి యెంతటి వ్యభిచారియైనను, నెంతటి క్రోధియైనను, నెంతటి యవివేకియయినను, నెంతటి దుర్వ్యసనియైనను, నెంతటి క్రూరుఁడైనను, సతియోగ్యతను, సాహసమును గలిగి యుండునది యగునేని, యామె తన పతిని, దన సద్వర్తన సాహాయ్యమున సదాచారునిగ, శాంతునిగ, వివేకివంతునిగ, సుశీలునిగ, దయార్ద్రునిగఁ జేయగలుగు నది యని నా నమ్మకము. అదియునుగాక, నా జీవనలక్ష్యమే వేఱు. మానవ జన్మమును ధరించిన ప్రతి స్త్రీకిని, బ్రతి పురుషునకును, సామాజిక సేవయును, బరోపకృతియు, నవశ్యకర్తవ్యములు. ధనార్జనమును ఉదరపోషణమును, భోగపరాయణత్వమును, ముఖ్యము లయినవి కావు. అటులైనచోఁ బశుపక్షులు తమకడుపులు నింపుకొనుచుండలేదా? కేవలము, కుక్షింభరిత్వము నాశించు వారలు పశుపక్షి సమాను లనవచ్చును. వారి మానవజన్మధారణము నిరర్థక మనవచ్చును. నాయన గారు నాయం దెన్నియో కోరికలు పెట్టుకొని యుండిరి. కాని వారి యాశలను బూర్ణములు గావించుటకు నాయందు యోగ్యత కనుపట్టదు. అయోగ్యతయే చూపట్టుచున్నయది. కాఁబట్టి వినమ్రనై ప్రార్థించుచున్నాను. మీరుభయులు, అనఁగా మీరును, బాబూజీయును, నెం దుచితమని తలంతురో యందే నన్ను బనుపుఁడు. అందే నాకు శ్రేయము గలుగఁ గలదు. నాకీశ్వరుఁడు, నా యుద్దేశములను నాయనగారి యాశయములను, సఫలతఁగావించుటకుఁ దగు బుద్ధిని సాహసమును, బలమును, నొసంగి నన్ను సమర్థురాలినిగఁ జేయు నట్టు లాశీర్వదింపుఁడు" అని పలికి పినతల్లి పాదములపై ప్రాలెను.

కాత్యాయని మాటలు వినినంతనే మహేశ్వరనాథుఁడు వెలవెలపోయెను. చకితచిత్తుఁ డయ్యెను. స్వేదజలసిక్తతనుఁ డయ్యెను. రుద్ధకంఠుఁ డయ్యెను. ఏమను

టకును నోరు మెదల్పనేరఁ డయ్యెను. ఉమాదేవి పదములపై వ్రాలియున్న కాత్యాయనిని లేవనెత్తి యక్కునఁ జేర్చుకొని, "తల్లీ! ధన్యురాలవు. స్త్రీరత్నమవు. నీతల్లి గర్భము రత్నగర్భము, నినుఁ బోలు యువతులు దేశమున నుత్పన్నులగునెడ సత్వరముగ దేశోద్ధరణమున కేమి కొదువయుండును. (మహేశ్వరనాథునిఁ జూపుచు) తల్లీ! వీరిని బినతండ్రియని తలంపకుము. సర్వస్వాపహర్తయని తలంపుము. వీరిబుద్ధి భ్రమించినది.

జై సహా భవితవ్యతా, జై సమికే సహాయ్
అప్ న అపై తాహిపై, తాహి తహా జై జాయ్.

అని తులసీదాసుగారు యథార్థమునే చెప్పియున్నారు. పురాకృతకర్మము ముక్కుపట్టి యీడ్చుచున్నది. ఏమికానున్నదో. వీరి మూలమున నేనెన్ని పాట్లు పడవలసి యున్నదో, యెన్నికష్టముల ననుభవింపవలసి యున్నదో. తల్లీ! నీవేయింట నడుగిడుదువో ఆయిల్లు ధన్యమైనదగును. పూజ్యమైన దగును. అష్టైశ్వర్యపూరితమైన దగును. తల్లీ! (పైట చెరగు సారించుచు) "నీదీర్ఘసుమంగళీత్వమును, మనోరథసిద్ధిని, సమకూర్చుకొని, యిదె శ్రీకృష్ణపరమాత్మునిఁ గొంగుబట్టుకొని ప్రార్థించుచున్నాను" అని పలికెను.

ప్రాగ్దిశయందరుణకాంతులు చూపట్టఁ జొచ్చెను శ్రేష్ఠుఁడును, సజ్జనుఁడును, బ్రభావశాలియు నగు వక్త సభాస్థానమున కరుదెంచుచుండుటఁ గనినంతనే పాషండులు, నీచప్రకృతులు నగు మనుజులు వెలవెలఁ బోయి మరుగు చొచ్చునట్లు నట్లు సూర్యాగమనముఁ గని నక్షత్రములు కాంతిహీనములై మరుగువడఁ జొచ్చెను. కోడి కూయఁజొచ్చెను. గంగాస్నానమున కరుగుచున్నవార లుచ్చరించు "హర హర మహాదేవశంభో" "గంగేమంగళతరంగే" అను శబ్దములు సర్వతోముఖముగఁ గర్ణకుహరములఁ జొరఁబడఁ జొచ్చెను. అపుడు కాత్యాయని నిద్ర కరుగుట యనుచితమని తలంచి, కాల్యకృత్యముల నిర్వర్తించుకొన నుద్యుక్తయై చనియెను. ఉమాదేవియు నామె వెంటనంటి యరిగెను. మహేశ్వరనాథుఁడు తల్పమునందు దొర్లుచుండెను.

మహేశ్వరనాథుఁడు, నాడు మొదలు కాత్యాయని కంటఁబడినపుడెల్ల వెఱపును సిగ్గును గలుగుచుండిన కతమున నవనతవదనుఁ డగుచుండెను. తదతిరిక్తమగు పరివర్తనము నాతనియందుఁ గనబఱుచుటకుఁ గాత్యాయని మాటలు శక్తివంతములు కాఁజాలవయ్యెను. అతఁడు కాత్యాయనీ విదళిన మత్యావశ్యకమని

శ్రేయస్కరమని యెంచి యున్నవాఁడు కావున సత్వరముగ వివాహము సేయు యత్నమున నుండెను.

## ఏడవ ప్రకరణము

పండితహరదత్తశర్మ జ్యోతిష్కుఁడు. గ్రామపౌరోహిత్యమున నధికారము గలవాఁడు. అతఁడు గణితభాగమునందు, ముహూర్తభాగమునందు, జాతకభాగమునందు, శ్రౌతస్మార్త క్రియలయందుఁ దన్ను మించిన వారు కారుగదా తనకు సమానులును గూడ లేరను నహంభావమును సహితము కలిగియుండువాఁడు. జమీందారులును ధనాఢ్యులును గాకపోయినను, సామాన్యులును, మధ్యమశ్రేణిలోని వారును, బలువురు హరదత్తశర్మచేతనే తమ సంతానములకు జన్మపత్రములను వ్రాయించుకొనుచుందురు. నోములు, వ్రతములు, వివాహోపనయనాదులు మొదలగు శుభకార్యము లెల్లను, నాతని బ్రహ్మత్వముననే నెఱవేర్చుకొనుచుందురు. హరదత్తుఁడు వ్రాఁతకోఁతలు చదువు సంధ్యలు నేర్చినవాఁడు కాఁడు. కాని, దూర్తుఁడు. ధౌర్త్యమున నాతని మించినవారెరును లేరు. అతనిని నగరములోని పండితులెల్లరును ధూర్తాగ్రేసరుండని వాకొనుచుందురు. అతడు పౌరోహిత్యముతోఁబాటు వైద్యమునుగూడఁ జేయుచుండును. ఇన్ఫ్లుయెంజా వ్యాప్తమయి యున్న దినములలో నాతని వైద్యమున కెక్కువ వ్యాప్తి కల్గినది. అతఁడు నాడీజ్ఞాన శూన్యుఁడయ్యును, వైద్యరాజని పేరొందినవాఁడు. ప్రతిదినమును బ్రాతస్సాయంకాలములయం దాతని నివాసస్థానమునందు రోగులు గుంపులు గుంపులుగఁ బ్రోగగుచుందురు. తన యౌషధములు ప్రభావపూరితములని సంజీవినులని శుష్కవిజ్ఞాపనపత్రముల నచ్చొత్తించి ప్రచురణ మొనర్చుటయందు సిద్ధహస్తుఁడు. అన్యనగరములకుఁ గూడఁ దనయౌషధపు ప్యాకెట్టులను వందలకొలఁది పనుచుచుండును. అసత్యపు విజ్ఞానపత్రికలను బ్రకటించినందులకును, నిరర్థకపుటౌషధములను విక్రయించినందులకును దోషియై పలుమారులు జుల్మానాలు చెల్లించి యుండెను. కాని, వైద్యవృత్తి మాత్రము వీడియుండలేదు. ఏల వీడును? తన్మూలమునఁ బ్రతిమాసము వందలకొలఁది రూప్యములు మూటఁగట్టుచున్నవాఁడు. ఉచితానుచితములను బాపములను పుణ్యములను బరికించువాఁడు కాఁడు. స్వార్థపరుఁడు. ధనార్జనమునే ప్రాధాన్యమునుగఁ జేకొని యున్నవాఁడు.

హరదత్తుఁడు పైకిఁ జూచుటకు దివ్యపురుషుఁడుగనే చూపట్టును. అందువలన లోకు లాతనికిఁ జేతుల జోడించుచుందురు. వంగివంగి ప్రణతులర్పించుచుందురు.

కాని, యాతని వ్యక్తిగత జీవితపరిచితు లాతనియెడ ఘృణితులగుచుందురు. అయిన నేమి? ప్రణతులిడువారి సంఖ్య యత్యధికము. ఘృణితులగువారి సంఖ్య యత్యల్పము. దాన నాతని యమోఘప్రభావమున కిసుమంతయు లోపముల వడియుండలేదు. హారదత్తుని వర్తనముకూడ సప్రమాపమును దాల్చినయది కాదు. ఎందఱో గృహస్థులు, వారి యిండ్లనుండి వారిసతులపై వారి కూతుండ్రపై వారికోడండ్రపై కుదృష్టుల నిడుట కారణముగఁ దగు సన్మానమొసంగి బహిర్గతునిఁ గావించి యుండిరి. సత్య దూరములగు జన్మపత్రికల వ్రాయుటయనునది యాతని కెడమచేతి పని. ఎచ్చటనైన ధువు జాత్కవము వరుని జాతకమున కనుకూలతఁ జూపట్టదేని, వధువుకడనుండి పారితోషికము గ్రహించి తజ్జాతకమును వరుని జాతకమున కనుకూలమగురీతిని నాయాగ్రహముల నాయాస్థానములయందు నిలువరించి లిఖించి యిచ్చును. దానఁ దద్వివాహము సుసంపన్నమైనదగును. ఈ విధముగనే హారదత్తుఁడు ప్రసిద్ధనారాయణుని జాతకమును రామచరణుని కన్యకతిరిక్తముగ నేకన్య జాతకమును ననుకూలము కాకుండు నటుల లిఖించి యిచ్చెను. అక్కారణమునఁ బ్రసిద్ధుని జనకుఁడు లాలావింధ్యవాసినీ ప్రసాదుఁడు ప్రసిద్ధుని వివాహము యక్షరశూన్యయు, నసభ్యయు, నవివేకియు, నగు రామచరణుని కన్యఁగూర్చి సేయుటయందే దృఢనిశ్చయుఁడై యుండెను. ఈ విధమగు జన్మపత్రలేఖనమువలన హారదత్తుఁడు వేలకొలఁది సంపదగల వాఁడయ్యెను.

"గంతకుఁ దగిన బొంత" యనినట్లు లెట్టివారికట్టివారే ప్రాప్తులగుదురు. హారదత్తునకు స్వర్ణలత యను సతి యాతని కనుకూలవతి సంప్రాప్తమయ్యెను. స్వర్ణలతయు హారదత్తునివంటి స్వభావమును, హారదత్తుని గుణములవంటి గుణములను గలిగి సర్వవిధముల నాతని కర్ధాంగి యని యనిపించుకొనుటకుఁ దగియున్నది. ఆతఁడేరినైన వలలో వైచుకొనిన దినమున నింటికరుదెంచుటయే తడవుగఁ దద్వివరణమును, దన సతి స్వర్ణలతకు దంభములు పలుకుచు నాత్మస్తుతి యొనర్చుకొనుచు, వినిపించుట కభ్యస్తుఁడై యున్నవాఁడు. అందువలన నేఁడాతని యభ్యస్తదృశ్యముఁ బ్రదర్శించుట కవసరము తటస్థించినయది. ఆతఁడు నేఁడును నియమానుసరణముగ నగరమునందంతటను దిరిగి యింటికరుదెంచి పరిహానించుచు వినుచున్నావా? నేఁడు నక్కనడుము త్రొక్కి యూరిలోనికి వెళ్లితిని. లక్ష్మీపుత్తుని వలలో వేసికొన్నాను.

స్వర్ణలత: ఆఁ వినుచున్నాను. నేను మీ రూరిలోనికి బయలుదేరి వెళ్లునపుడు సర్వదా కలకత్తా కాళికాదేవికి మ్రొక్కుచునే యుందును. ఎవరికన్నులో

మాయించి వారిచేత మాయింటికెప్పుడును రూపాయలమూటc జేర్పింపుమని ఇది నా ప్రముఖ్యప్రభావముగాని మఱొకటి కాదు.

హర: అందుకు సందేహమేమి?

స్వర్ణ: నేc డెవరు వలలోc జిక్కినో ముందు చెప్పుcడు.

హర: (పరిహసించుచు) ఇంకను నీ కెఱుcగనే యెఱుcగవా? అ రామ చరణ మహాజనుcడు.

స్వర్ణ: ఎట్లు చిక్కినాcడు?

హర: వాని కూcతు జాతకము నొక గొప్పవాని కొడుకు జాతకమునకు ననుకూలపఱచి వ్రాసి యిచ్చినాను.

స్వర్ణ: సరి. బాగుగనున్నదికాని, ఎన్ని రూపాయలిచ్చినాcడు. పదులా? వందలా?

హర: (పకపక నగుచు) పూర్తిగా నయిదువందలు.

స్వర్ణ: సరిసరి. సంతోషము. అయినచో, నా మాప్యమలు పెట్టి నాకుc జంద్రహారము చేయించిపెట్టుదురా?

హర: అలాగే. చేయింతును. ఈ వేళనే బంగారమును గొనితెత్తును. ఈ విషయము విన్నావా? ఇది యొక క్రొత్త విషయము.

స్వర్ణ: ఆశ్చర్యముతో అదేమిటి?

హర: నేcడా క్రొత్తరోడ్డులో ఆర్యసమాజము వారిదొక సభజరగు చుcడి దిన. ఆ సభలో బొగ్గువంటి నల్లనివాc డొకcడులేచి బ్రాహ్మణులందఱుc జేరి దేశమును మొదటc బాడుచేసినారు. ఇపుడు నాశనము చేయుచున్నారు. పూర్వకాలములలో ఋషులు మునులు నుండువారు. వారు చదువుకొన్నవారు. పిల్లలకుc జదువులు చెప్పుచుండువారు. తాము యజ్ఞములు చేయుచు, నొకరిచేతc జేయించు చుంచెడివారు. అట్టివి యిప్పటి బ్రాహ్మణులలో లేవు. ఇప్పటి బ్రాహ్మణులు యజమానులను, మీకు సరియగు కాలము కాదు. మీకు గ్రహములు వంకరగి నున్నవి. అందుకుc బరిహారముగ, జపములు, శాంతులు, దానములు అనియు, మీ పెద్దలు తరించుటకనియు, నేవేవో చెప్పి ధనము దోcచుకొందురు. కుదురని పెండ్లిండ్లు దొంగజాతకములు వ్రాసి, కుదిరించి చేయింతురు. పిలువనక్కఱలేదు. పెట్టనక్కఱలేదు. దేనికన్న దానికే యెక్కడికనిన నక్కడికే వచ్చి తిని పోదురు. ఎవరి

దగ్గఱనడిన వారి దగ్గఱనే చేయి చాతురు. లేదన్న వదలరు. పొమ్మనినఁబోరు. పోనిమ్మని యిచ్చిన సంతోషింపరు. ఎంత యిచ్చినను సంతుష్టిఁ బొందరు. మెడఁ బట్టి గెంటిన చూరుపట్టి వ్రేలాడుదురు. పరువులేదు. ప్రతిష్ఠలేదు. గౌరవములేదు, మర్యాదలేదు. ఇయ్యకున్నఁ గుదుములగూనలు దింపుదురు. శాపములు పెట్టుదురు.'' ఇవి యిప్పటి బ్రాహ్మణులు చేయుపనులు.

స్వర్ణ : లేకపోయిన బ్రాహ్మణుల నేమి చేయుమందురు. వాని తలద్రైనను, వాని తండ్రితలద్రైనను బగులఁగొట్టి తినుమనునా యేమి ? వాఁడు నా కండ్లఁబడిన ముఖము మీఁద నుమ్మియుందును. పండ్లూడఁగొట్టి యుందును.

హర : అయ్యో ! అంతేకాదు. ఇంకను వినుము వాని మాటలు. ఇఁక మీఁదట బ్రాహ్మణుల మాటలు వినవలదు. వారి మాయలలోఁ బడవలదు. వారు చేయమనిన దానాలు చేయవలదు. వారిమ్మన్న దక్షిణ లియ్యవలదు. ఎద్దులు కష్టపడి పండించుట. గుఱ్ఱాలు తినుట యనునట్లున్నది. ఇదెక్కడి న్యాయము ? మనము కష్టపడి సంపాదించి పెట్టుట. వారు కూర్చుండి తినుట. అది యేమిపని ? మంచిపని కాదు. దానములు దక్షిణలు నియ్యవలయుననినఁ గుంటివారికి, గ్రుడ్డి వారికి, నొసఁగుఁడు. వారు సంతోషింతురు. అంతేకాని బ్రాహ్మణుల కెప్పుడును నియ్యవలదు. వారినిగూడ మనవలెఁ గష్టపడి సంపాదించుకొని తినుఁ డనుఁడు.

స్వర్ణ : వాని తలకాయ. మనకుఁ మన యజమానులు కన్నులు మూసికొని చేతి కెముక లేకయుండునటు లిచ్చుచున్నారు. మనము కడుపులోని చల్ల కదల కుండునట్లు హాయిగ మహారాజులవలెఁ దినుచున్నాము. వాని కర్మము. వాని నాలాగే యేడువనీయుఁడు. మనకేమి ?

హర : వానియేడుపు వాఁడేడుచునే యున్నాఁడు. మని పని మనము చేయుచునే యున్నాము. అది అలాగే యుండును. నన్నుఁ దెల్లవాఱుజామున నైదు గంటలకుఁ దప్పక లేపవలయు. మరచిపోకుము. రేపు ప్రొద్దున వింధ్యవాసినీ ప్రసాదుని కొడుకుకుఁ బెండ్లి చేయింపవలయు.

స్వర్ణలత మంచిదని తన పనిమీఁద వెడలెను. హరదత్తుఁ డెటకో వెళ్లెను.

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము

చాందనారాయణుఁడు సుశీలయు గుణవతియు విద్యావతియు నగు కాత్యాయనిఁ బత్నిగఁ బడసి హర్షహృదయుఁ డయ్యెను. మహానందభరితుఁ డయ్యెను. విద్యావతులగు ఈకాలపు స్త్రీలు కల్లిములు లేని గుఱ్ఱములవలెఁ జెలరేగుచుఁ బతుల

యెడ లక్ష్యమిడకుండ నున్నవారని విని యున్నవాఁడు. అట్టి భావమును, అట్టి విశ్వాసమును బూనియున్నవాఁడు. కాని, కాత్యాయని వర్తనమును దిలకించినంతనె యాభావమును నావిశ్వాసమును దూరగతము లయ్యెను.

చాందనారాయణుని కుటుంబమున, నతఁడును నతని జననియు. యవివాహిత యగు సోదరియుఁ దప్పఁ దతదరుక్తు లెవ్వరునులేరు. ఇపుడు కాత్యాయనితో నలుగురైరి. కాత్యాయని యత్త బహు కర్కశ. కోఁడలిని గోడంట్రికము పెట్టుట యందును, బలుకష్టములపాలుచేయుట యందును, నించుకయు వెనుదీయఁ జాలదు. అందువలనఁ గాత్యాయని కోడంట్రు శీలసంపన్నులైనను నెంతటి గుణవతులైనను, వారినిఁ గోడంట్రుమిడుటయుఁ గష్టభాగినులఁ జేయుటయు, నత్తలకు నవశ్యకర్తమని సహజధర్మమని తలంచుచు నామె కర్తవ్యమును నామె ధర్మమును బరిపాలించు చున్నదనిసంతసిలుచు మహోత్సాహముతో నత్తగారుపెట్టు కష్టములను సహించుచు నామెను బూజ్యభావమునఁ బరిగణించుచుండెను. కాత్యాయని తండ్రి జీవితకాల ములో నింటర్ మీడియేటు రెండవ సంవత్సరపుఁ దరగతి చదువు చుండెను. కాని తండ్రి స్వర్గస్థుఁడైనంతనే పినతండ్రి కారణముగఁ జదువు చాలించెను. చాలించు కొన వలసి వచ్చెను. అనంతరము పరిణీతయై పతిగృహమున కరుదెంచినయది. పతి గృహమున కరుదెంచిన యనతికాలములోనే పతిప్రేమకుఁ బాత్రురాలయ్యెను. పతిప్రేమఁ బడసిన పిమ్మటఁ దనతండ్రి యభిలాషను బతిసమ్ముఖమున విన్నవించినది. భూతకాలపు స్త్రీలవలెఁగాక వర్తమానకాలపు స్త్రీలలో నధికభాగము చదువుట కును, వ్రాయుటకును నేర్చినవారలు. స్త్రీల కుచ్చశిక్షఁ గఱపించుటయందు లోకు లత్యంతము ఘృణిపహృదయు లగునటుల నునికియు, నాచారమును గలిగియున్నారు. దాన సమాజము దుర్గతిక మగుచున్నయది. అందువలన నేనున్నతశిక్షఁ బడసి సమా జములోని శిక్షితులగు స్త్రీలు శిక్షిత స్త్రీలరీతిని వర్తిలుచుఁ బురుష సమాజమందుఁ బ్రస్తుతము ప్రచారమందున్న శిక్షాప్రణాళికను సంస్కరించి బాలికల నుచితరీతిని శిక్షితలఁగావించినచో వారియందు విదేశీయ సభ్యతయు, నునికియు, నాచారవ్యవహా రములును, నామమాత్రమునకైనఁ బొడసూపనేరవను విశ్వాస ముదయింపఁ జేయువ లయునని నా తండ్రిగారి యాశయము. అందువలన నేను బి. ఏ. పట్టపరీక్షయం దుత్తీర్ణురాలనైన పిమ్మట, స్త్రీ సమాజమునకుఁ జేయగలిగినంత సేవఁ జేయవలయు నను కోరికఁ గలిగియున్న దాన నని తన మనోవృత్తమును బతికెఱింగించెను.

చాందనారాయణుఁడును నున్నతవిద్య నభ్యసించినవాఁడు. ఎమ్. ఏ. పరీక్ష యందుత్తీర్ణుఁడైనవాఁడు. ఉద్యోగమును జేయుచున్నవాఁడు. నలుగురలోఁ దల

త్రిప్పుచున్నవాఁడు. ధనార్జమును సుఖజీవితమును నాతని లక్ష్యములు కావు. దేశ సమాజసుధాకరములే యాతని జీవితోద్దేశములు. హితులయాదృతిని, సాయమున "దేశసుధాకర నాటకమండలి" యను సంఘ మొండు సంఘటితము కావించి యున్నాఁడు. ఈ సంఘమందుఁ జేరిన సభ్యులు సుశిక్షితులును, దేశసమాజ సుధారకోత్సాహము నందొకరి కొకరు వెనుదీయని వారలగు పెక్కుండ్రు నవయువకులు. ప్రస్తుతము సమాజమునందుఁ బ్రబలియున్న కురీతుల సజీవచిత్రముల యథారూపమున లిఖించి ప్రదర్శన రూపమున లోకమునకుఁ జూపుచుందురు. ఈ నాటకమండలి నగరమందే కాక ప్రాంత ప్రదేశములయందుఁ గూడ నెక్కుడు ప్రభావమునుగని యున్నయది. సమాజ సుధాకరమునందు 'సమాజ సుధారక నాటక సమితి' చూపుచుండిన మహత్తును బోలిన మహత్తును 'సమాజసుధారక సమితి' యొక్క ప్రధానమంత్రియు, వ్యాఖ్యానాచార్యులునగు 'సుధారానంద సరస్వతీ స్వాముల వారు' గొంతుపగులునటు లెన్నియొసంగినను జూపెట్టఁజాలరైరి. సారాంశమేమనఁ జాందనారాయణుని హృదయము మొదటినుండియు సమాజ సుధారకమునందు లగ్నమైనయది. అతఁడు కాత్యాయని మనః కాంతు నాలించి ప్రసన్నుఁ డయ్యెను. ఆమెని దగ్గఱఁదీసి బుజ్జగించుచు 'హృదయేశ్వరీ! నీవు హృదయేశ్వరివి. స్త్రీరత్నమవు. నిన్నర్ధాంగిగఁ బడయుట వలన నేను ధన్యుఁడ నైతిని. నా జన్మము సార్థకమైనది. ఉన్నత విచారశీల యువతిని సహధర్మిణిగఁ జేసికొనిన నాభాగ్యమే భాగ్యము. నిన్ను సఫల మనోరథఁ గావింపుమని సర్వశక్తి సమన్వితుని, జగదాధారునిఁ, గామితార్థప్రదుని శ్రీ పరమేశ్వరుని నిరంతరము ప్రార్థించెదను. అని సాదరముగఁ బలికెను.

చాందనారాయణుఁడు కాత్యాయనిని నేషనల్ కాలేజేలో ఇంటర్ మీడియేటు రెండవ తరగతియందుఁ బ్రవేశపెట్టెను. కాత్యాయని ప్రకృతి స్వతసిద్ధముగ స్వాభావికముగ సాత్త్వికప్రకృతి. సామాన్యమును సాత్త్వికమును నగు జీవితమునందభిరుచి గలది. తండ్రి జీవిత కాలములోఁ గూడ భారతీయరీతి ననుసరించి స్వదేశ వస్త్రములనే ధరించుచుండినది. మదరాసు నూలుచీరలయం దామె కెక్కుడాసక్తి. ఇంటిలోని వారెంత నిర్బంధించినను భాగలుపూరు పట్టుచీరలుగాని బనారసు జరీబుటేదారిచీరలుగాని ధరింపదు. మాంచెస్టరు, చీనా, జపాను మొదలగు విదేశ వస్త్రము లామెకు ఘృణితములు. కంటకితములు. వానిని జేతితోనైనఁ దాకదు. వివాహానంతరమునఁ గూడ స్వదేశవస్త్రములనే యుపయోగమునం దునిచెను. ఖద్దరు

ప్రచార మారంభమైనది మొదలు ఖద్దరు దుస్తులనే ధరించుట కారంభించినది కాని తదతిరిక్తమగు వస్త్రములఁ గట్టుటలేదు.

కళాశాల కరిగినపుడును గాత్యాయని ఖద్దరువస్త్రములనే ధరించి వెళ్లుచుండును. సహపాఠినులు ఫేషనబుల్ యువతులు. నవీనాలంకారపరిశోభితలు. క్షణక్షణము వేషముల మార్చుటయందు నిపుణలు. వారు కాత్యాయని ఖద్దరువస్త్రధారణమును, నామె సాత్త్వికవర్తనమును, నామె సరళభావమును జూచి పరిహసింప మొదలిడిరి. వారిలో నొక చంచలయువతి కాత్యాయనికి గాంధిమహాత్ముని కన్యయని పేరిడెను. సరళసాధుత్వములు కారణములుగాఁ గాత్యాయని కళాశాలలోఁ బ్రవేశించిన పిమ్మటఁ గొలఁది దినములు సహపాఠినుల పరిహాసములతో నాక్రమితయయ్యెను. కాత్యాయని వర్తనమును, నామె యోగ్యతను, నామె బుద్ధికౌశలమును గళాశాలలోని యధ్యాపికలెల్లరకును బరిచితములగుడు వారెల్ల రామెను నన్య విద్యార్థినులకంటె గౌరవముతోను, నెక్కుడాదృతితోడను, బరికింపఁజొచ్చినందున విద్యార్థినులెల్లరును దత్పూజ్యభావమును గమనించి వారును బూజ్యభావమునఁ జూడఁ జొచ్చిరి. మొదటఁ బరిహసించినవారలు పశ్చాత్తప్తలు కాఁజొచ్చిరి.

కాత్యాయని కళాశాలలోని విద్యార్థినులలో నగ్రగణ్యయయ్యెను. గౌరవచరిత్రయై యుండెను. విద్యార్థినులే గాక యధ్యాపికలును వామె మాటను మన్నింపసాగిరి. అంత నామె విద్యార్థినుల కుపదేశ మొసంగ మొదలిడెను. కళాశాలలో బ్రవేశించిన క్రొత్తలో నామెను సహపాఠినులు గేలిచేయఁ జొచ్చుటచే నాసమయమునఁ దన మాటను, దన యుపదేశమును నెగతాళికిఁ బాత్రములగుననియు, దాన నయ్యవి యుపయుక్తములు కార్యకారులుఁ గాఁజాలవనియును, గ్రహించి యపుడామె యూరకుండెను. కాని యపు డెగతాళి యొనర్చిన వారల కెల్లరకును మాన్యయైనందున సమయానుకూలముగ వారల కుపదేశ మొసంగ నారంభించెను. ఒకనాఁడు విశ్రాంతి సమయములో విద్యార్థినులనెల్ల నొక్కచోఁ జేర్చి వారల కీవిధముగ నుపదేశ మొసంగఁ జొచ్చెను.

"సోదరీమణులారా! మన తల్లిదండ్రులు మనలను జదివించుట కావశ్యకమేది యని తలంచి యేయుద్దేశముతో నున్నారో యను, విషయమును బహుశః మీ రెఱింగి యుండరని నా యూహ. అందువలన వారి యాశయము లేటివో నా యెఱిఁగినంత వఱకు జెప్పెదను. దత్తచిత్తులై యాలింపుఁడు. ఆలించి యందలి యధార్థమును గ్రహింపుఁడు. మన దేశమునందలి స్త్రీ సమాజము యొక్క దశ

మిక్కిలి శోచనీయమైనదై యున్నయది. అందు స్త్రీలు అశిక్షితలును, నక్షరశూన్యలును నగుట కారణముగ నింటిలో నేవిధముగ వ్యవహరింపవలయునో యెవరి నేరీతి నాదరింపవలయునో, పతితోడ నెట్లు మెలంగవలయునో గార్హస్థ్యసుఖము నెట్లుల వఱచుకొన వలయునో యయ్యవి యెఱుంగనేరకున్నవారు. ఇవి సామాన్యవిషయములు. ఈ సామాన్య విషయములనైనను మనదేశపు స్త్రీలు ఎఱుంగని కతమున దుర్గతికు లగుచున్నవారు. అందువలన వారి సంతానము వారికన్నను నెక్కుడు దుర్గతికిఁబాలు గావలసి వచ్చుచున్నది. వారి సంతాన సంతానము మఱింత యెక్కుడు దుస్థితిఁ గననగుచున్నయది. ఈ విధముగ సమాజము నానాఁటికి క్షీణదశను శోచనీయావస్థను జెందుచున్నయది. తత్ఫలముగనే దేశస్థితియు దినదినము హీనస్థితికిఁ బాలగుచున్నయది. పూర్వము భారతదేశము దేశములకు శిరోభూషణమై రాజిల్లినయది. అట్టి దిపుడు పరదేశమునకు బానిసయైనది. ఎంత శోచనీయము. ఎంతదుఃఖదము. అందువలన దేశోద్ధానమునకై నాయకసంతాన మవసరమై యున్నయది. అట్టి సంతానము బడయునది స్త్రీ సమాజము గాన తత్సమాజమును దేశమందలి పురుష సమాజము సుధారకము గావించుటకుఁ గృతనిశ్చయ మయ్యెను. అందులకు స్త్రీ శిక్ష ప్రథమ సాధనమై యొప్పుచున్నయది. దాన నీ సమాజ సుధారకోద్దేశమును సమ్ముఖమున నిడుకొని మన తల్లిదండ్రులు మనము శిక్షితలమై యశిక్షితమాతలను, సోదరీమణులను శిక్షితలఁ గావించి కర్తవ్యపాలనా విధానమును సుబోధకము గావింపఁ గలవారమగుదు మను నాశయమున మనల విద్యగఱపించుచు శిక్షితలఁ గావించుచున్నవారు.”

“సోదరీమణులారా! మన తల్లిదండ్రులు మనలను శిక్షితలఁ గావించుచున్నారు. కాని మనము కర్తవ్యమును గ్రహింపఁజాలకున్నారము. మనకు మన దేశస్థితిని మన సమాజదశను గ్రహింపనేరకున్నారము. మనకు మన దేశస్థితిని మన సమాజ దశను గ్రహింపనేరకుండుట కనువగు రీతిని విద్యఁ గఱపుచున్నారు. తదనుగుణ శిక్షనొసంగు చున్నారు. మనమును విదేశీయపు రంగులచే రంజితలమయి విద్యఁ గఱచుచు శిక్షఁ బడయుచు, నా శిక్షలను, నాయమూల్యసాధనములను ఘృణితములుగఁ జేయుచున్నారము. నేనిట్లనుచున్నానని కోపగింపకుఁడు. క్షమింపుఁడు. సోదరీమణులారా! మీర లుచ్చశిక్షను బడసినకొలఁదిని విద్యాభిమానినులరై, వేషచర్యలు. వేషనులఁదగిలి, ప్రక్కఁబుట్టిన తోఁబుట్టువులతోడనైన మనసిచ్చి మాటలాడకయున్నారు. వారిని గన్నెత్తి చూడనైనఁ జూడక యున్నారు. వారితోఁ గలిసిమెలసి తిరుగకుండ యున్నారు. వారి ప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొనుట

యగౌరవమని యవమాన జనకమని తలంచుచున్నారు. అంతియకాదు. స్వాభిమాన పరవశలై వివాహానంతర మత్తింటికేగి యత్తింటనెట్లు మెలఁగవలయునో యను విషయమును దలంపనేరకున్నవారు. ఇట్టి దురభిమానపరలగు మీరత్తింటి వారలతో నుచిత వ్యవహారములను సలుపుట కిచ్ఛఁగొనఁ గలుగుదురని నేను దలంపనేరను?

“సోదరీమణులారా! ఈ విధముగ మీరు మీ విద్యవలన మీ శిక్షవలన సమాజోద్ధారమునకు బదులుగ సమాజ పతనమునకుఁ గారకు లగుచున్నవార లనుట కిసుమంతయు సందియము లేదు. మీరీ విద్యాశిక్షల గ్రహించి చేపట్టిన యీ యునికియు, నీ వర్తనమును, జూచువారలు కన్యల తలిదండ్రులిట్టి విద్యయందు నిట్టి శిక్షయందు విముఖులగుచున్నవారలు. తమ కన్యలను విద్యాశిక్షితల నొనరింపఁ బూనుకొన్నవారలు చెవులు నులుపుకొనుచున్నవారలు. కాఁబట్టి స్త్రీసమాజము శిక్షావిహీనమగుటకుఁ గారకులు శిక్షిత స్త్రీలనియుఁ దద్దోషము శిక్షితల శిరములపైఁ బడుచున్న దనియు గ్రహింపుఁడు. గ్రహియించి కర్తవ్యముఁ దలంపుఁడు. విదేశ స్త్రీల ననుకరింపకుఁడు. వారి సభ్యత వేఱు. మీసభ్యత వేఱు. వారి యునికి వేఱు. మీయునికి వేఱు. వారి దేశము వేఱు. మీదేశము వేఱు. వారికిని మీకును హస్తిమశకాంతర మున్నయది. వారి హితములు మీ కహితములు. వారి సదాచారములు మీకు దురాచారములు. కాఁబట్టి మీరలు మీ దేశ జలవాయువుల ననుకరించి మీ దేశ శీతోష్ణముల ననుసరించి మీ దేశ పరిస్థితిఁ బరికించి స్నానపానములు రీతి నీతులు, వ్యవహారవర్తనములు సలుపుట కుద్యుక్తులరగుఁడు. దేశనౌకను దరిఁజేర్చు శ్రేయమును జేకొనుఁడు.”

కాత్యాయని యొసంగిన యీమహత్త్వపూరితోపదేశము కాలేజిలోని విద్యార్థినుల యధ్యాపికల నెల్లరహృదయములను విచలితములఁ గావించెను. ఒకనాఁడు ప్రధానాధ్యాపిక కాత్యాయనిని గళాశాలలోపాధ్యాయినులను, విద్యార్థినులను జేరఁబిలిచి యెల్లరసమ్ముఖమున వ్యాఖ్యానమొసంగుమని కోరెను. తదనుసరణముగ నానాఁడు కాత్యాయని పై యుద్దేశమును గూర్చి మరల మార్మికశబ్దయుతముగ మహత్త్వపూరితముగను నొక దీర్ఘోపన్యాస మొసంగెను. కాత్యాయని యుపదేశము కేవలము విద్యార్థినులలోనే కాదు. అధ్యాపికలమండలిలోను సఫలతఁ గనఁ గలిగిన దయ్యెను. ఆదినము మొదలు కళాశాలావాతావరణమునం దద్భుతపరివర్తనము చూపట్టఁ జొచ్చెను. అధ్యాపికలు ప్రతిదినమును గాత్యాయనిచేఁ గన్యకల కుపదేశ మొసంగఁ జేయుచుఁ దాము స్వయముగ నుపదేశము నొసంగఁ జొచ్చిరి.

కళాశాలలో నవీనజీవన ముదయమయ్యెను. అధ్యాపికలును, విద్యార్థినులును నెల్లరును సాత్వికవర్తనులైరి. సాధ్వసధారిణులైరి. విదేశభావమును, విదేశసభ్యతయు, నామమాత్రావశిష్టము లయ్యెను. కళాశాలలోని చిన్నపిల్ల మొదలు ప్రధానాధ్యాపిక వఱకును నెల్లరును గాత్యాయనిని గౌరవింపఁజొచ్చిరి.

* * * * * *

కాత్యాయని పతి చాందనారాయణుఁడు కాత్యాయనిని కళాశాలలోఁ బ్రవేశపెట్టెనుగదా? ఆమె విద్యాభ్యాసనమున కనువగు సౌకర్యముల నొదఁగూర్చెను. కాని, యామె యత్తగారు వికటకర్కశ. కాత్యాయనియం దదివఱకె యత్తగారికి గుణమును నిరర్థకము గావింపక ద్వేషమూని యున్నయది. ఆద్వేషమిపుడు కొడుకునందుఁగూడఁ బ్రసరించె. అందువలన నామె కొడుకునందలి మమతను వాత్సల్యమును గూఁతురగు నిందిరవంకకు మరలించెను. కూఁతునే కొడుకుకంటె నెక్కుడుగఁ బ్రేమింపఁజొచ్చెను.

కాత్యాయని వేఁకువజామున నాలుగు గంటలకు లేచి యాఱుగంటలవఱకుఁ జదువును. అనంతరమా ప్రాఁచిపనులను, స్నానమును, దేవపూజనమును, ముగించి వంటచేయును. తొమ్మిది గంటలకుఁ బతికిని నత్తకును, మఱఁదలికిని భోజనములఁ బూర్తిగ నొనరింపఁజేసి, తాను భుజించి కళాశాల కరుగును. కళాశాలనుండి మరలివచ్చి రాత్రి భోజనమును సిద్ధముచేయు. ఎనిమిది గంటలకు భోజనములను ముగించి యా వెంటనే వంటయింటిని వంటపాత్రలను గడిగి శుభ్రముఁజేయును. పిమ్మటఁ బదునొకండు గంటలవఱకును జదువుకొని యనంతరము శయనించును. అత్తమఱఁదండ్రిద్దఱలో నేరును దగ్గరకురారు సరిగదా యా వంకనైనఁ జూడరు. ఈ విధముగాఁ గాత్యాయని రేయుంబవళ్లు గాఢపరిశ్రమ మొనర్చుచున్నను నామె యత్త యామెపై నిష్ఠురోక్తులాడుచుఁ గ్రోధముఁ బ్రకటించుచుండును. అత్తగారి క్రోధము నుపశమిల్లఁ జేయుటకునై కాత్యాయని గృహకృత్యముల నన్నింటిని స్వయముగఁ జేయఁజొచ్చెను. కాని, చదువు కారణముగ నామెక్రోధ ముపశమిల్లుటకు మారుగ ద్విగుణీకృతమయ్యెను. కోఁడలు కంటఁబడినపుడెల్ల మండిపడుచుండఁజొచ్చెను. కాత్యాయని కళాశాలకు వెడలునపుడు ఆమెపై నామెయత్త నిప్పులు గ్రక్కును. చాందనారాయణునిపై నగ్నివర్షము కురిపించును. కుమారుని సంబోధించి "పెండ్లాము ఆర్జించిపెట్టినఁ దినఁదలఁచితివా యేమి? లోకమర్యాదను బోనాడి నలుగురయెదట పెండ్లామును జదువుకొనుటకుఁ బంపించుచున్నావు. తాత తండ్రుల నాఁడే యింట నాఁడువారు పరఛాయయైనను, బరపురుషులకంట

నెన్నడును బడకయుండిరో, యిపు డా యింటి యాఁడువారు రాజమార్గములఁ దిరుగులాడుచు, గళాశాలలలోని కరుగుచు నందుఁ బురుషులలోఁజేరి చదువుటయా! ఏమి కాలపై పరీత్యము? ఆ పని నేను బ్రదికియుండఁగా జరుగఁగూడదు. నన్ను ముందుగ గంగలోఁ గూలద్రోయుము. ఆపైని పెండ్లామును నలుగురయెదుటఁబెట్టి చదివింపుము. ఆడింపుము. నీ యిష్టము. నేఁ జూడరాను.

చాంద: (వినమ్రముఁడై) అమ్మా! కళాశాలలోఁ బురుషులేకను లేరు. చదువు చెప్పువారలందఱును నాఁడువాండ్రు. చదువుకొనువారు ఆఁడువాండ్రు అచ్చటికరిగి చదువుకొనుట యేమితప్పు! కళాశాలకు రాకపోకలు కాలినడకను జరిపినయెడ లోకలజ్జకు వెఱువవలెను. కాని, బండి గుమ్మము దగ్గఱకు వచ్చి తీసికొని వెళ్లి తిరిగి గుమ్మము దగ్గఱకుఁ దీసికొనివచ్చి దిగఁబెట్టుచున్నపుడు లోకలజ్జకు లోపమేది? కాఁబట్టి వెఱువనక్కఱలేదు. మన బంధువులలోఁజూడు. బాబూ శంభునాధుని యిర్వురు కూఁతుండ్రు వయసువచ్చినవారు కళాశాలకు వెళ్లి చదువుచున్నవారు. బాబూ పరమేశ్వర స్వరూపుఁడు తన భార్యను కళాశాలకుఁ బంపుచున్నాఁడు. కాఁబట్టి యింక బంధువులకును వెఱువనక్కఱలేదు. ఇందుఁ దప్పేమి యున్నది?

తల్లి: తప్పేలేదు. మనయింట, మనవంశములో నెన్నఁడును జరుగనిపనిని మన మెన్నఁడును జేయరాని పనిని జేయుటయేతప్పు. మన బంధువులసాటి మనకేల? వారు చదివించుకొనినఁ జదివించుకొనుదురుగాక! తమ కూఁతులను నడువీధిలో నిలవఁబెట్టుకొందురుగాక! మనయింట నెన్నఁడు జరుగని పనికి నే నెపుడు నంగీకరింపను.

చాంద: అమ్మా! అనవసరమగు పట్టును బట్టకుము. కొంచె మాలోచించి చూడుము. నీకుఁ జదువుటకును వ్రాయుటకును రాదు అందువలన నందుల లాభమేమో తెలియదు. భగవంతుఁడు స్త్రీపురుషుల నిరువురను నొక్కరీతిగనే సృజించి యున్నాఁడు. ఇరువురకును నొక్కరీతిగనే బుద్ధి యొసంగియున్నాఁడు. ఆ బుద్ధి చదువువలన వృద్ధియగును. అయ్యది గ్రహించి భగవంతుఁ డిచ్చిన బుద్ధిని పురుషులు చదువువలన వృద్ధి యొనర్చుకొని యా బుద్ధిబలము నాధారముగఁగొని యెంతెంతలో పనులు చేయుచు నున్నారు. వారివలెనే స్త్రీలును భగవంతుఁడు తమ కొసంగిన బుద్ధిని చదువువలన వృద్ధి యొనర్చుకొని యా బుద్ధిబలమును సాయముగఁగొని గొప్ప గొప్ప పనులఁ జేయఁగలుగుదురు. అందువలన దేశమునకు శీఘ్రముగ స్వరాజ్యము

చేకూఱఁగలదు. దాన క్షేమము లభింపఁగలదు. స్వరాజ్య మెపుడు వచ్చునని నీ వడుగుచున్నావా? ఎపుడు వచ్చునో చెప్పుచున్నాను వినుము. ఎపుడు స్త్రీలు చదువుటకును వ్రాయుటకును నేర్చి తెలివితేటలు గలవారలగుదురో అపుడు స్వరాజ్యము తప్పక వచ్చును. అది నిశ్చయము.

తల్లి: పో. అవతలకుఁ బో. బుద్ధిహీనుఁడా! నాకడుపునఁ బుట్టి నాకే బుద్ధిని జెప్పఁజొచ్చితివి. ఇఁకేమి చెప్పుదును? నీభార్య నీకేవో నూఱి పోసినది. దానివలలోఁ బడితివి. దానిమాట నీకు గురుమంత్రమైనది. అది యేమి యనుమనిన నది యనుచున్నావు. అది యెటు లాడించిన నటు లాడుచున్నావు. ఆఁడుబుద్ధి యసురబుద్ధి. ఆఁడుదాని మాట వినువాఁ డధముఁడు. వాఁడెన్నటికిని ముందునకు రాఁడు.

చాంద: అమ్మా! నీపట్టే నీది. నేఁ జెప్పునది వినిపించుకొనవు. బోధ పఱచుకొనవు. అర్థములేనిమాట లేవో యాడుచున్నావు. అనవసరముగఁ గలఁత నొందుచున్నావు. నేనేమీ తప్పుపని చేయలేదు. నలుగురు చేయుచున్నదియు హర్షించుచున్నదియు నగు పనినే చేయుచున్నాను. నీవు పెద్దదాన వైతివి ఇఁక నీవేమి చేయవలెను? నీకేమి కావలెను? కనినందుకుఁ జచ్చుకొన్నందుకుఁ గొడుకు చేతను, కోఁడలిచేతను సంరక్షణము చేయించుకొనుచుఁ గలిగినయంతఁ గడుపు నిండఁ దినుచు, నొకరికిఁ బెట్టుచు రామా కృష్ణాయనుచు హాయిగ నుండుము. అంత కంటె నిఁక నీకేమి కావలయును? ప్రపంచవ్యాపారముతో నీకేమి నిమిత్తము?

చాందనారాయణుని తల్లి యాతఁడు చెప్పిన మాటలను విని. "అవునవును. ఇపుడు నానిమిత్త మేమున్నది? అడ్డాలలో నున్నపు డమ్మమాట. అమ్మనిమిత్తము గాని, గడ్డాలు వచ్చినపుడు అమ్మమాట యేల? అమ్మ నిమిత్తమేల? అపుడు పెండ్లాము మాట. పెండ్లాము నిమిత్తము. నాయనా! ఇఁక నీయిష్టము వచ్చినట్టు చేయుము. నేనేమియు నననే. నోరు మూసికొని యొకమూలఁ గూర్చుందును. పెట్టినఁ దిందును. పెట్టకుండినఁ బస్తుండును. అయ్యో! భగవంతుఁడా! నాబ్రదుకీనాఁటి కింతకుఁ దెచ్చితివి" అని గొణుఁగుకొనుచుఁ గొడుకు కడనుండి లేచి వెడలి పోయెను.

కాత్యాయని తనయత్తగారిని ప్రసన్నురాలినిగఁ జేసికొనుటకు శక్తివంచన లేకుండఁ బరిశ్రమముఁ జేయుచుండెను. చాందనారాయణుఁడు సెక్రటేరియట్టులో నుద్యోగము చేయుచున్నాడు. నూటయేఁబది రూప్యములు నెలజీతమును బడయు

చున్నాఁడు. గృహకృత్యములు నిర్వహించుట కొకరిద్దఱు సేవకుల నియమించు కొన సమర్థుఁడై యున్నాఁడు. అతఁడు తనసతి యెద్దువలెఁ గష్టపడి యింటిపనుల నన్నింటిని స్వయముగఁ జేయుచుండుటఁ బరికింపఁ జాలకున్నవాఁడు. ఆమె పరిశ్ర మముఁ జూచి సహింపనేరక యెన్నియోసారులు దాసి నొకర్తు నియమింతునని యామెతో నొక్కి చెప్పియుండెను. కాని యందుల కామె యంగీకారము చూప దయ్యెను. కులస్త్రీ తనపతిని దత్పరివారమును నిరంతరప్రసన్ను లగునటుల సర్వ విధములఁ బరిశ్రమ మొనర్పవలయును. ఎవరితో నేరీతిని వ్యవహరింపవలయునో వారితో నారీతిని వ్యవహరింపవలయును. దానికంటె వ్యతిరేకముగ నుండరాదు. జ్ఞానులను జ్ఞానవిషయక సంభాషణమువలనను, క్రోధులను నమ్రతచేతను, ప్రియవచన ములచేతను, మూర్ఖులను స్తుతిమూలకముగ సంతోషము గలిగించుచు నపుడపుడు సమయానుకూలముగ సదుపదేశ మొసంగుచుఁ బ్రసన్నులఁ జేసికొనవలయును. అత్త గారి కేమియుఁ దెలియదు. చెప్పిన వినరు. బోధపడఁజుకొనరు. వారికడ నజ్ఞాన మధికమాత్రయై యున్నయది. దాన నెంతకష్టపడియైనను, నెంతశ్రమపడియైనను, పని చేసి చూపుచు సమయము దొరికినపుడు మంచిని బోధించుచు వారిని బ్రసన్నులఁ జేసి కొనవలయును. అయ్యది నాకుచితము. నాకుఁగర్తవ్యము. ఈవిధముగ నింటిపను లన్నియు నొక్కర్తను జేయుచుండుటను జూడఁజూడవారి కెన్నటికైన నాయెడ జాలి కలుగకుండునా? వారెన్నఁడైనఁ బ్రసన్నులుకాక యుందురా? వారిహృద యము ఱాయియు, ఇనుమును గాదుగదా? ఱాయి యయినను నిను మయినను నిరంతర పరిశ్రమమువలన నరుగునని పెద్దలు చెప్పుదురు. వారి నెన్నటికైనఁ బ్రస న్నులఁ జేసికొనవలయునని నాకోరిక. నాకోరిక నీడేరునంత దనుక నిటులనే కష్ట పడఁ దలంచితి. కాఁబట్టి నామాట మన్నింపుఁడు. ఇపుడింకను దాసికను నియమింపకుఁడు. మీమాట కెదురాడితినని కోపింపకుఁడు క్షమింపుఁడు. అని సమాధాన మొసంగుచు నాతని మనమును మరల్చుచుండును.

చాందనారాయణుఁడు కాత్యాయని యొసఁగు నకాపట్యసమాధానమును ఖండింపనేరక వివశుఁడై యామెపరిశ్రమమునకు సహిష్ణుతఁ జూపవలయువాఁడగు చుండెను. కాత్యాయని ననంద యిందిర పదునొకండు వత్సరములుఁగల కన్య. అక్కన్య మునుముందు తల్లియొనర్చు బోధనలకులోనై కాత్యాయనికిఁ బ్రతికూలయై నిరంతరము నిందారోపణముఁ జేయుచువచ్చెను. కాని, కాలక్రమమునఁ గాత్యా యని సద్వ్యవహారము, సహనశీలము, సానురాగము మొదలగు సద్గుణము లిందిర హృత్ఫలకము నందంకితములు కాఁజొచ్చెను. అందువలన నిందిర తనమనమును

గాత్యాయని కల్పించుచు నామె కనుసన్నల మెలగఁజొచ్చెను. గృహకృత్యముల యందు హస్తమిడఁ జొచ్చెను. కాని, కాత్యాయని యందుల కియ్యకొనక యామెను మరలింపుచుండెను. కొలఁదికాలములోనే వదినెయు, మఱఁదలును నొక్కటియై యొక్కచో నొక్కసారి పండుకొనుచు, నొక్కమారే లేచుచుఁ జెరియొక పనిని జేయుచు నొక్కసారిగనే భుజించుచు నొకరినొక రెడఁబాయక మెలఁగుచుండిరి. ఇందిర కాత్యాయని కాపురమునకు వచ్చునప్పటి కక్షరజ్ఞానము మాత్రము కలిగినదై యుండెను. ఆ జ్ఞానము కాత్యాయని పరిశ్రమవలన నభివృద్ధిఁ గాంచెను. దాననిందిర హిందీ యింగ్లీషు భాషలయం దభిరుచిఁగని యత్యుత్సాహముతో విద్యాభ్యాస మొనరింపఁ దొరకొనెను.

కాత్యాయని యిందిరను తన సద్గుణవ్యవహారముల వలన వశ మొనర్చుకొనెను. అనంతర మత్తగారిని ప్రేమ పాశమున బంధించుట కున్ముఖియయ్యెను. ఆమె యిది వఱకే కాపురమునకు వచ్చినంతనే గృహకృత్యపరిశ్రమమును దానే చేకొని తన యత్తగారికి విశ్రాంతి నొసంగియుండెను. అందువలన నామె యత్తదినమంతయు నిర్వ్యాపారముగఁ గడపుచుండెను. కాత్యాయని ప్రథమమున నత్తగారికి నిత్యమును ప్రాతఃకాలమున గంగానది కరిగి స్నానమొనర్చు చుండుట కుత్సాహమును గలిగించెను. గంగాస్నాతయై యింటికరుదెంచినంతనే యామె పాదముల నుష్ణోదకములఁ గడిగి తడియొత్తును. దేవపూజ కుపకరణముల నమర్చును. పూజానంతరము భక్తిశ్రద్ధలతో నాదరసత్కారములతో భోజనము చేయించును. సంధ్యాకాలము దేవమందిరముల కనిపి దేవదర్శనము, భగవద్భజనముఁ జేయించును. రాత్రి భోజనాది కృత్యములు ముగిసినపిమ్మట నిద్రకరుగునపుడు కాళ్లుపిసుకుచు ధార్మిక కథలను వినిపించును. పురాణములలోని పుణ్యసతుల జీవితచరితములను పరిచితములు గావించును. స్తోత్రములను బఠింపఁజేయును. అపుడపుడు కౌసల్యాసుమిత్రలు తమ కోడండ్ర నేరీతిపుత్రీ భావమున నేలికొనిరో యామర్మమును హృదయాంకితము గావించుచుండును. ఈవిధముగ గాత్యాయని నిత్యమును నత్తకుఁబరిచర్యలు సేయుచుఁ బుణ్యకథలను వినిపించుచు ధర్మముల నెఱిఁగించుచు నామె హృదయాకర్షణమునకు యత్న మొనరింప సాగెను.

బుద్ధిమంతులు వ్యవహారకుశలులు, మృదుమధుర భాషులు, నేర్పరులు, నెంతటి కఠోరులనైనను, నెంతటి మూర్ఖులనైనను, వశమొనర్చుకొనఁ గలుగుదురు. కుశలులు తమ కౌశలమునుసాయముగఁగొని దుష్కరములు దుస్సాధ్యములు నగు కార్యములను సహజముగ సుకరములుగ సుసాధ్యములుగ సాధింపఁ గలుగుదురు. నిరంతర

ప్రయత్నము ఫలభరితమగును. రాయిడి జాతి నడిగించును. ప్రతిదినమును నెదము లేక మృదువాణి సద్వ్యవహారము సద్భావము, సద్వర్తనము నూని వర్తిలు వారి యెడల నెంతటి కఠోరులు నెంతటి దుష్టులు నెంతవఱకుఁ దమప్రాగత్భ్యస్తములగుదుర్గుణములను దుర్భావములను సుస్థిరములుగ నునిచికొని యుండఁ గలుగుదురు ? కాత్యాయని తన కౌశలమును సాయముగఁ గొని యత్తగారిపై విజయ ప్రాప్తిఁగనినయది.

కాత్యాయని యత్త కాత్యాయనిచేయు పరిచర్యలఁ గొనుచుఁ గథల వినుచు బోధించు ధర్మముల సావధానముగా వినుచుఁ గొలఁది కాలములోనే మార్పుచెందిన యది. తన తప్పులను గోడలి సద్గుణములను గ్రహించినయది. కోడలి యెడఁ దా నొనర్చిన దుర్వ్యవహారమును దలంచుకొని పశ్చాత్తాపము నొందుచుఁదన్ను దాను దూషించుకొనఁ జొచ్చినయది. కోడలి సౌజన్యమునకు ముదమొందఁ జొచ్చిన యది. ఆమె వర్తనమును, ఆమె వ్యవహారమును దలంచుకొనుచు "దుర్గాబాయి కోడలివంటి కోడలే దొరికినయెడల నా రోగము మొదలుముట్టఁ గుదిరియుండును. పాపము ! దుర్గాబాయి. ఒక పండుగలేదు. ఒక పర్వములేదు. ఒక నోములేదు. ఒక వ్రతములేదు. తుదకుఁ ద్రివేణీస్నానములేదు. దేవదర్శనమైనను లేదు. జాము రాత్రియుండఁగా లేచి రెండుజాములరాత్రి యగువఱకు దుక్కిటెద్దులాగునఁ బని చేయును. అట్లు చేయుచుండినను, కోడలిచేతఁ బడరానిపాట్లు పడుచున్నయది. ఎప్పటికైన దినము తీఱునా భగవంతుఁడా యని యేడుచుచున్నది. నా పుణ్యము మంచిది. నా యదృష్టము గొప్పది. నాకు మంచి కోడలు దొరకినది. కొడుకు మంచివాఁడయిననేమి ప్రయోజనము ? కోడలు మంచిది కానపుడును, కోడలు మంచిదైనపుడు, కొడుకు చెడ్డవాఁడైనను, వాని చెడ్డ కనుపించదు. బాధింపదు. నాకుఁ గోడలు మంచిది. నాకు సేవచేయును. నా కూఁతునకుఁ బ్రాణమైనవిచ్చును. నిజముగా నట్టి కోడలిని గండ్లకెప్పలలోఁ బెట్టుకొనవలయునుగాని, కోడంత్రికము పెట్టవచ్చునా ? నేను జాల తప్పుచేసితిని. చాలఁ గోడంత్రికము పెట్టితిని. నేఁ బెట్టిన కోడంత్రికమును, గాత్యాయని మంచిది కావున సంహించి నన్నింత పూజించుచున్నదిగాని దుర్గాబాయి కోడలివంటి కోడలే యయిన నన్నింటిలో నుండనిచ్చునా ? మెడఁబట్టి గెంటునుగాని" యనుకొనఁజొచ్చెను.

చాందనారాయణుఁడు తన సతి సద్వర్తనము వలనఁ గొలఁదికాలములోనే తన తల్లితోఁ బుట్టువులు మార్పుచెందినవారగుటఁ బరికించి పరమానందభరితుఁడయ్యెను. దేవీ సదృశయగు కాత్యాయని నర్ధాంగిగఁ బడసిన తన భాగ్యమహాభాగ్యమని సంతసిలఁజొచ్చెను.

నిత్య కలహములు లేని కారణమునఁ జాందనారాయణుని గృహము మహా నంద నిలయమయ్యెను. అందు సుఖ ప్రసన్నతలు సుస్థాపితము లయ్యెను.

## తొమ్మిదవ ప్రకరణము

నేఁడు బాబూ ఆనందస్వరూపుఁడు తన వివాహ విషయమును గూర్చి తన తండ్రితో విస్పష్టముగఁ బ్రసంగింపఁదలంచి యుండెను. అందువలన నాతఁడు సాయంకాలము నాలుగు గంటలు కానున్నను నిత్యాచరణములగు బహిర్గమనమును వాయుసేవనమును స్థగితములు గావించెను. ఎంత త్వరపడినను నెన్నిపర్యాయములు చూచినను గడియారపుముల్లు నాలుగు అంకెపై కరుగకుండెను. ఊరక చూచు వారికిఁ గాలము గడవదుగదా ? ఎట్టకేలకు గడియారము నాలుగవ యంకెపైకి వచ్చెను. సింహ ద్వారముకడ నాలుగు గంటలు టంగు టంగుమని మ్రోగెను. నాలుగు గంటల చప్పుడు చెవిని బడుటయే తడవుగ సతీప్రసాదుఁడు తన పడక గదిలోనుండి ! 'ఓరీ! బుద్ధూ ! గంగాజలము తీసికొనిరమ్ము' అనిపలికె. సేవకుఁడు గంగాజలము గొనితెచ్చి ద్వారముకడ నంతకుముందే వేఁచియుండెను. శబ్దము చెవినిఁ బడుటయే తడవుగ గంగాజలమును గైకొని వాఁడు లోపలికిఁ బోయెను. పిమ్మట నైదునైదు నిమిషములకు నొక పళ్లెరముతో నుపహారమునకై ఫలములను మఱొక పళ్లెరముతో మిటాయీలను దెచ్చి సతీప్రసాదు పండుకొను మంచముకడ నమర్పఁ బడియున్న మేజాబల్లమీద సేవకుఁ డునిచెను. కొంత తడవున కిరువురు సేవకులును బైటికి వెళ్లిరి. సేవకులు గదినుండి బహిర్గతులైన యంతనే యానంద స్వరూపుఁడు గదిలోని కరుగుటకుఁ గనిపెట్టుకొని యుండెను. తండ్రితోఁ గలిసి ముచ్చటింపఁ దలఁచి యుండెను. కాని గదిలోని కరిగి యాతని యెదుట నుండుటకు సాహసింపఁ జాలక యుండెను. అతి ప్రయత్నముతో గదిలోని కరుగఁబూనెనుగాని కాళ్లు వెనుకకు లాగఁజొచ్చెను. ఒకపుడు తన పెండ్లివిషయమయి తండ్రిగారియెదుట మాటలాడుట యెట్టులను విచారమాతని మనమున నుదయించుచుండెను. మఱొక పుడు వారి యిష్టము చొప్పుననే జరుగనిమ్మని తోఁచుచుండెను. మఱియును, వారైనను నాశ్రేయమాసించియేకదా చేయుదురు. అట్టులే యగుఁగాక! వారి సమ్ముఖ మున సిగ్గును, లజ్జను, భయభక్తులను వదలి స్వవివాహముఁ గూర్చి ముచ్చటించుట ధూర్తలక్షణమని యనుకొనును. కాని యొకించుక తడవునకు వేఱొక విచార తరంగ మాతని హృత్సముద్రమున నుప్పొంగి యీ సమయమున సిగ్గని భయమని వెనుకాడి జీవనోద్దేశముల నన్నింటిని నీటఁ గలప నెంచుట వివేక కృత్యము కాదని

బోధించుచుఁ గ్రిందఁబడి ప్రవహింపఁ జొచ్చెను. ఈ విధముగఁ గొంత తడవు డోలాందోళితమనస్కుఁడై తుదకు సాహసముఁగొని మనమును జిక్కఁ బట్టుకొని గదిలోనికిఁ బ్రవేశించి తండ్రికి నమస్కరించి నిలిచెను. సతీప్రసాదును కాళ్లుచేతులు కడుగుకొని ఉపాహారము తీసికొని సుఖోపవిష్టుఁడై యుండెను. అతఁడు తనకడ కరుదెంచి నమస్కరించి నిలిచిన కొడుకును జూచి,

ఆనందా! నేఁడు బహుశః నీకుఁ గళాశాలలోనే యాలస్యమయి యుండు ననియెను. అందుల కానందుఁడు,

చిత్తము. పరీక్షలు దగ్గఱకు వచ్చుచున్నవి. దానివలన నేఁటినుండి ప్రొఫెసర్లు స్పెషలు క్లాసుల నునుచుటకు నిశ్చయించిరి. దానివలన నిలిపిరి. నేఁడు మూఁడున్నర గంటలకు క్లాసు విడిచిపెట్టినారు. అని సంకోచ పూర్వకముగఁ బ్రత్యుత్తరము నొసంగెను.

అంతగది స్తబ్ధతఁజెందెను. ఒక్కింత తడవునకు సతీప్రసాదు చిఱు నగవు నగుచు "ఆనందా! నీవేమో కొన్ని సంగతులు నాతో మాటలాడఁ దలఁచి యున్నాఁడవని మీయమ్మ నిన్న నాతోఁ జెప్పినది. అందుకొఱకే వచ్చితివాయేమి?" అని యానందుని నడిగెను. ఆనందుఁడు సంకుచితచిత్తుఁడై తండ్రి మాటకేమియు బదు లొసంగుటలేదు. ఆనందుని సంశయమును గనిపెట్టి సతీప్రసాదు నాయనా! ఏల సంశయింతువు తెలుపుము. తెలుపుము సందియమును వీడుము. చెప్పఁదలఁచినదేమో నిస్సంశయముగఁ దెలుపుము. ఆనందా' నిన్న మీయమ్మ నీవివాహముఁ గూర్చి నాతో ముచ్చటించిన యది. అందువలననే నేనే నిన్నుఁ బలుకనెంచి యున్నాను. అని పలికెను.

తండ్రిపలికిన సాంత్వనపూర్వకములగు పలుకులాలించి ఆనందునకు సాహసమును దృఢముచేసి కొనెను. అంత నాతఁడు వినమ్రుఁడై సంకుచితస్వరముతో "చిత్తము ఈ విషయమునుగూర్చియే తమతో మనవిచేసికొన నుంటిని. తాము పండిత కాళీప్రసాదుని పుత్త్రికను నాకుఁబెండ్లి చేయనుద్దేశముతో నున్నవారలని నాకుఁ దెలిసినది. ఇప్పటి కన్య లధికసంఖ్యాకులు చదువు వ్రాతలులేక మూర్ఖులుగా నున్నారు. అత్తలతోనాడు బిడ్డలతో నిరంతరము కలహించుచుందురు. అందువలన నింటిలోని వారెల్లరు దుఃఖితులగుచుందురు. అయ్యాదితమకు విశదమైన విషయముగదా! నేను ప్రత్యేకము మనవిచేసికొన నవసరము లేదు. అట్టి కన్యలతోడి పెండ్లిండవలనగలుగు పరిణామము దుఃఖాస్పదము గాని సుఖాస్పదము గానేఱదని నావిశ్వాసము. కాఁబట్టి చదువునేర్చిన కన్యయైనచో దనకర్తవ్యమును గ్రహించును. కేవల మింటిపనులయందే

కాక సాంసారిక సామాజిక వ్యవహారములందుఁగూడ దక్షతగలది యగును. తత్కారణముగ నాజీవనముకూడ సుఖమయమైనదై యుండును.

పండిత : (గంభీరవదనుఁడై) చాలుజాలు. ఇందునీవు పొరపాటు పడుచున్నావు. ఇపుడు చదువునేర్చిన స్త్రీలు ప్రచండు లగుచున్నారు. నీటుగోటులు పూనుచున్నారు. గృహకృత్యముల యందు ఘృణితలగుచున్నారు. పెద్దలను గౌరవింపరు. వృద్ధులమన్నింపరు. పతులను లక్ష్యముచేయరు. నాయనా! నీవింకను జిన్నవాఁడవు. కండ్లుబాగుగాఁ దెఱచియుండలేదు. లోకమేమి చూచితివి? కాలేజి కరుగుచున్నావు. చదువుచున్నావు. నీకలవడినది, పుస్తక జ్ఞానముగాని అనుభవజ్ఞానముకాదు. అనుభవజ్ఞానము లేనివాఁడవగుటచే నట్లు పలుకుచున్నావు. నేనెక్కువ యనుభవముగల వాఁడను. పెద్దవాఁడను. చదువునేర్చిన స్త్రీలను వేలకొలఁదిగ జూచితిని. వారివర్తనములఁ బరికించితి. నేను స్త్రీవిద్యకు విరోధినిగాను. స్త్రీలకు విద్యగఱపు విధానమునకు విరోధిని. అవ్విధానము విషపూరితము దోష భూయిష్ఠము. తద్విధానము ననుసరించి విద్యగఱచుచుండువారల మస్తిష్కములు విషపూరితములు, దోషయుతములు నగుచున్నవి. అందువలన స్త్రీశిక్ష విషతుల్యముగ, దూష్యముగఁ బరిగణింపఁ బడుచున్నయది. కాఁబట్టి కుముదవిహారికన్యతో నీకు వివాహము నొనర్చుటకు నామనస్సొప్పకున్నయది. నీ వివాహమునకే కాదు. వర్తమాన శిక్షావిధానము పరివర్తనము చెందునంతదనుక ఆంగ్లవిద్యాభ్యాసినులు పట్టభద్రలగు యువతులు న్యాయోచిత వర్తనమును గలవారలగు నంతదనుక నేరికిని, కెట్టి శత్రువునకును విద్యనేర్చిన యువతితోడి వివాహమునకిష్టపడను. అట్టివివాహము హితమగునది యగునని నేను తలంపను.

ఆనంద : అతివినయముతో క్షమింపుఁడు. నాన్నగారూ! తమ మాటలకు బదులు పలుకవలసిన వాఁడనగుచున్న వాఁడను. తమరు నామిత్రునిఁ జాందనారాయణుని నెఱింగియే యుందురు. అతని సతి బి. ఎ. చదువుచున్నయది. పెండ్లికి ముందే ఎఫ్. ఏ ప్యాసైనది. బి, ఏ. లోఁ జేరినది. కాని, తండ్రి చనిపోవుట వలనఁ బినతండ్రి చదువు మానిపించి పెండ్లిచేసెను. పెండ్లియయినంతనే యత్తింటి కరుదెంచి కళాశాలలోఁ బ్రవేశించెను. ఆమె సంగతి నేమని చెప్పుదును? ఆమె ఋజువర్తనము, బుద్ధికౌశలము, సౌజన్యము, సరళహృదయము, నిరంతరపరిశ్రమము నెంతని చెప్పుదును? ఇంటఁజిన్నపనులును, బెద్దపనులును సమస్తము తన చేతులతోడనే చేసికొనును. వంటయిల్లు వంట పాత్రలనైనను శుభ్రపఱచుటకు దాసిననుచుకొనలేదు. చాందనారాయణుఁడు దాసి నునిచెదనని యెంతచెప్పినను, నిష్టపడక యాతనిని గారణములఁ జూపి నివారించుచుండును. ఇంటిపనుల యందేకాక చదువు

నందుఁగూడఁ గడుశ్రమయు, శ్రద్ధయుఁ బూనియున్నది. కళాశాలా విద్యార్థిను లలో దలవానికమై యున్నది. చాందనారాయణుని సతివర్తనమును జూచు చున్నాను. కాఁబట్టి నాన్నగారూ! చదువునేర్చిన యువతిని వివాహ మాడకుం డుటకు నాబుద్ధియొడఁబడకయున్నది.

ఆనందుఁడు చూపిన యుదాహరణము కడుంగడు ప్రశంసనీయమైనది. వాస్త వముగఁ జాందనారాయణుని పత్ని యతియోగ్యురాలు. ఆమెఁబోలు వారలు వేయింటి కొక్కరుందురేమో! ఆమెయందే దోషమును జూపుటకును సతీప్రసా దుఁడు సమర్థుఁడు కాఁజాలకుండెను. కాని తల గోకుకొనుచు, ఆనందా! చాందుని భార్యమాటవేఱు. ఆమె సత్యయుగమునాఁటి సాధ్వీరత్నము. అట్టి యువతిఁబోలిన యువతి రెండు మూఁడు వందల సంవత్సరముల క్రిందటనుండి యుండునేమోగాని, యిపుడెచటను గానరాదు. ఆమె తండ్రి ఋషీశ్వరుఁడు యథాశాస్త్రముగ ఋషీ శ్వరుఁడే. కాఁబట్టి యామె యట్టి గుణవతియయ్యెను. కుముదవిహారి సదాచారు లలో సద్గుణులలో లెక్కింపఁబడు చుండుటలేదు. అందువలన నాతని పుత్రికయు నతని లక్షణములనే యలవఱచుకొని యుండునని నా విశ్వాసము. నీకుఁ గుముద విహారి పుత్రికనే పెండ్లాడవలయునని యిష్టమున్నయెడల నటులే చేయఁబడును. దాని కింతగఁ దర్కవితర్కములు తిర్గన భర్జనములు వాద వివాదములేల! కాని నే నొక్కమాట చెప్పుచున్నాను. దానిని జ్ఞాపకము నుంచుకొనుము. కుముద విహారి కూఁతుఁ బరిణయమగుట కుత్సుకుఁడవై యున్నావుగదా? నీయుత్సాహమును గుతూ హలమునుఁ బూర్ణముగ నొనరించుటకు నిశ్చితుఁడనైతిని కాని యిఁదలి పరిణా మము సుఖదమును శుభప్రదమును కాఁజాలదు." అని పలికెను.

సతీప్రసాదొక్కింత తడవు ప్రత్యుత్తరమునకుఁ బ్రతీక్షించుచు నానఁదుని ముఖమువంకఁ జూడ్కిని బ్రసరింపఁజేసెను. కాని, యానందుఁడు ప్రత్యుత్తర మొసఁగ లేదు. అంత నాతఁడు "సరే నాయనా! ఆనందా! నీయిష్టము చొప్పున నీవివాహము కుముదుని శైలనుగూర్చియే చేయబడును. అందుకు సందియ ములేదు. నేనిట్లుచెప్పితినని వెళ్ళి మీయమ్మతోఁ దెలుపు" మని పలుకుచు గదినుండి వెడలి కచేరీ చావడి వంక కరిగెను.

పండిత సతీప్రసాదు "నీవివాహము కుముదునిశైలను గూర్చియే చేయు దును" అని చెప్పినమాటను విననంతనే యానందుఁడు ప్రసన్నవదనుఁడై పులకిత గాత్రుఁడై తండ్రిగదినివీడి తనగదిలోని కరుదెంచెను. "నాన్నగారు మనవివా

హము న క్లిష్టపడిరి. వివాహముహూర్తము డిసెంబరు 24 వ తేది నిశ్చితమైనది ”
అని శైలకుఁ దంత్రివార్త ననిపెను.

## పదియవ ప్రకరణము

వృద్ధజమీందారుని నిరోధము కారణముగఁ బండిత కుముదవిహారి శైలను మందలించెను. అనుచితవర్తనమువలనఁ బ్రాప్తములగు ననర్థముల నామెకుబోధించి చెప్పెను. తత్పరిణామము శైలకు హర్షదేవునితోడి ప్రసంగమున కవరుద్ధమైన దయ్యెను. శైల కళాశాలకరుగుచుండునపుడు హర్షదేవుఁడు తనసైకిలును శైలబండి ననుకరించి కళాశాలవఱకును నడుపుచుండును. ఆమె కళాశాలలో నుండునంత దనుకఁ గళాశాల చుట్టును బరిక్రమించుచుండును. ఆమెకళాశాలనుండి యింటికి మరలునపుడు మరల నామె బండి ననుసరించి తనసైకిలు నొకపుడు బండికి ముందు గను మఱొకపుడు బండికివెనుకఁగను నడపుచు నింకొకపుడు సమముగను నడపుచు నింటివఱకు నరుగుచుండును. ప్రేమీప్రేమికు లిరువురును నాలుగు కండ్లును దార సిల్లునపుడు స్మితవదనులగు చుందురు. కనుసన్నలఁ దమ మనోభావముల నన్యోన్య మెఱిఁగించు కొనుచుందురు.

సంజ్ఞామాత్రముననఁ జంచలయువతియు, మోహమదోన్మత్తుఁడగు నవయువ కుఁడును బరితృప్తు లెన్నఁడును గాఁజాలరు. ఇరువురహృదయములు ప్రేమరససంభ రితము లగుచుండును. వేదనాగ్నిజ్వాలాసంతప్తము లగుచుండును. ఇయ్యది సహజము. అట్లువారిహృదయములు ప్రేమాగ్నిజ్వాలా ప్రజ్వలితములు. అట్టి ప్రేమాగ్ని ప్రాయికముగ నీయిరువదియవ శతాబ్దియందలి విద్యార్థిసమాజమునఁగల యువతీ యువకుల హృదయములలో నుత్పన్నమగుచుండును.

ఆంగ్లశిక్షయొక్క వర్తమాన ప్రణాళిక సమాజమందొక విధమయిన విషపూరితప్రభావమును వహించి యున్నయది. ఆంగ్లేయ పాఠశాలలలోని విద్యా ర్థుల యునికియును, వర్తనమును, వ్యవహారమును బరిశీలించి చూచినవారలు, ఆంగ్లే యపాఠశాలలో విద్యార్థులు చరిత్రభ్రష్టులగు చుండుటకుఁ బ్రధానకారణ మీశిక్షా ప్రణాళికయే యని ఘంటాపథముగ వాకొనుటకు బాధ్యులుగావలసిన వారలగు దురు. ఆంగ్లపాఠశాలా విద్యార్థులచరిత్ర మధఃపతనమగు చుండెనని విచారశీలు రెల్లరును దలంచుచున్నారు. అతిశాంతుఁడు, అతిగంభీరుఁడు, అతివినమ్రుఁడు, అతివిశుద్ధ చరిత్రుఁడొకఁడు, ఆంగ్లపాఠశాలలో జొచ్చిన కొలది దినములలో నేచంచ లుఁడుగను, జరిత్రభ్రష్టుఁడుగను పరివర్తనుఁడయ్యెను. ఇయ్యది యనుభవైక

వేద్యమే. సాధారణముగ ననభిజ్ఞులగు బాలికాబాలకులు పాఠశాలలో గుసంగులై చరిత్రభంగమున కనువులగు దురభ్యాసములకు లోనయి యనతికాలములోనే దుశ్చరిత్రమున దుర్వర్తనమున నగ్రగణ్యులగు చున్నవారలు. ఇట్టివారలు పాఠశాలానుబంధములగు ఛాత్రాలయ (Boarding Houses) నివాసులలో గణనాతీతులు.

శైలాహర్షదేవు లీయిరువదవశతబ్దియందలి విద్యార్థిసామాజికులు. ప్రకృతపు శిక్షా ప్రణాళిక ననుకరించి యుచ్చశిక్షఁ బడయుచున్నవారలు. కాఁబట్టి వారు తచ్ఛిక్షాజనిత ప్రభావమున కెట్లు దూరులు కాఁగలరు! వారి హృదయములయందంకురితమైన పరస్పరప్రేమ వాస్తవికమైనప్రేమ కాదు. విడంబనాత్మకమైన యది. పరస్పర సంయోగము, ముఖావలోకనము, ప్రేమాలాపములు మొదలయినవానిఁ గూర్చి వారికిఁగల యుత్కంఠ తృష్ణాపూరితము. ఆప్రేమిప్రేమిక లిరువురును నిరుద్ధులై యిచ్ఛాప్రాప్తికి విదూరు లగుట కారణముగ నుదితమైన పరితాపమున సంతప్తు లగుచున్నవారలు. వృద్ధజమీదారుని యనుసరణము శైలాహర్ష దేవులకిరువురకు గంటకితముగ నగుచుండెను. దుస్సహమగుచుండెను. కాని, ఏమిచేయగలరు? వివశులగుచుండిరి. విషణ్ణులగుచుండిరి. హతాశు లగుచుండిరి. శైలవృద్ధ జమీదారునెదుట హర్షదేవునితో మాటలాడుటకుఁ గాదుగదా, యాతనివంకఁ గన్నెత్తి చూచుటకైన సాహసమూన నేరకుండెను. అందువలన నిరువురును మనోరథసిద్ధు లగుట కుపాయాంతరముల నారయఁ జొచ్చిరి. శైల యొకదినమున గళాశాల నుండి యింటి కరుదెంచి:

ప్రియహర్షదేవా! నీమోహనరూపమును నీస్మితవదనమును, నెంతటి మహిమావంతమలో నేఁజెప్పజాలను. నాహృదయ మపహరించిన యవి. నన్ను మంత్రముగ్ధఁజేసినయవి. నన్నింద్రజాలమునఁ ద్రోచినయవి. వివశనైతిని. నీహృదయాలింగనమును బడయనేరని యెడఁ బ్రాణధారణము దుష్కరముగఁ బ్రతీత మగుచున్నది. నామన మెంత చెప్పినను ధైర్యమూన కున్నయది. హృదయము బహిర్గత మగుచున్నయది. ఒక్కొక్కనిమిష మొక్కొక్క వత్సరముగఁ గడుపుచున్నదానను. అన్నపానములు శయనాసనములు, పఠనలేఖనములు, విషతుల్యములగు చున్నయవి. ఏమిచేయుటకును ఏరితోమాటలాడుటకును మనస్సొప్పకున్నయది. మతిభ్రమణమును జెందియున్నాను. వెఱ్ఱినైయున్నాను, నీవునన్ను మఱచియుందువు నన్ను దలఁచియుండవు. నావంక ధ్యానమైన నిడియుండవు. నేను నిన్ను మరువలేను. ఈ వృద్ధుఁడు నాకు మసిపూసినాఁడు. నాకు హంతకుఁడైనాఁడు. నిన్నుఁ జూచుటకు నీతోమాటలాడుటకును బ్రతిబంధకుఁడైనాడు. కానిమ్ము వానినుండి ముక్తివడ

యుటకు నేనొక యుపాయముగ్రహించితిని. తద్విషయమును వ్రాయుచున్నాను. సంతప్త హృదయమునకుఁ జల్లదనముఁ జేకూర్చుట కింత కంటె? వేఱుపాయము తోఁచుట లేదు.

నాపరీక్షా సమయము దగ్గఱఁ బడుచున్నయది. అందువలన నెలదినములు కళాశాలా ఛాత్రాలయములోనుండి సహపాఠినులతోఁ గలిసి చదువుట యుపయుక్తముగఁ దోఁచుచున్నదని నాతండ్రితోఁ జెప్పితిని. నాచెప్పినది సార్థకమైనది. నా తండ్రి నాకు ఛాత్రాలయములో నివసించుట కనుమతియొసంగెను. నేను నేఁటికి నాల్గవదినమున ఛాత్రాలయములో నివసించుట కరుగుటకు సిద్ధముగ నున్నదానను. కాఁబట్టి నీవు ఛాత్రాలయము నందలి సేవకులను లోనొనర్చుకొని నన్నుఁ గలియుట కుపాయమాలోచింపుము.

ఇఁక వ్రాయనేమున్నది. ఏమివ్రాయుదును? నీసంయోగమువలన జనితమగు నానంద సాగరమునఁ గ్రుంకు లిడనెంచి యున్నదానను. విషాదాంబుధిఁ బడి యున్నదానను. దరిఁజేర్చెదవో లేక ముంచెదవో చూచెదను. త్వరపడకుము. ఆలసింపకుము. విలంబన క్షణమైన నోర్వఁజాలను. క్షణమొక్కొక్కటి యొక్కొక్క ప్రాణము నపహరించుచున్న యది. అందువలన నాలుగు దినములు ముందుగ నెఱింగించితిని. ఇఁకఁ గార్యసాధనము నీయాధీనము.

నీ

శైల

అని యొక జాబువ్రాసి యద్దానిని దాసిచేత నిడి హర్షదేవున కొసంగి రమ్మని చెప్పెను.

హర్షదేవుఁడు దాసి యొసంగిన జాబునుచేకొని పఠించెను. ప్రసన్నహృదయుఁడయ్యెను. దాసికి రెండు రూప్యములు పురస్కారముగ నొసంగెను. తత్క్షణము కమీజు వేస్టు కోటుల జేబులఁ దడవి నోటుబుక్కునుదీసి యందొక కాగితమును జింపి యద్దానిపై ఫౌన్టెన్ కలముతో శైలకీవిధముగ లేఖవ్రాసి యనిచెను.

ప్రియా! శైలా!

ఒకవంక దాసిత్వరపెట్టుచున్నయది. వేఱొకవంక నానంద తరంగములు వెల్లివిరియు చుండుటవలన మనఃస్థైర్యమలవడకున్నయది. అందువలన నేమి వ్రాయుటకు నశక్తుడనై యున్నాఁడను. ఏమివ్రాయజాలకపోయినను, నావంటి యల్పుని యెడ నింతటి మహారాగమును బూని యున్నందులకు ధన్యవాదముల నొసంగుటకు నా జిహ్వాయసమర్థయగు చుండెనని మాత్రము వ్రాయుచున్నాను.

ప్రియా ! "నీవు నన్ను మఱచియుందువు. నన్నుఁ దలఁచియుండవు. నా వంక ధ్యానమైన నిడియుండవు" అని వ్రాసితివి. అందులకు సమాధానముగ నా పడుపాట్లు నాపొందుదుఃఖము వ్రాయఁబూనినచో బదికాగితములకుఁ దక్కువ గాకుండ నలఁపు చేయవలసి వచ్చును. అందుకుఁ దగిన సమయ మలవడ దయ్యెను. ఈశ్వర కటాక్షమున్నయెడ శీఘ్రముగనే నీపాదముల కడ నుపస్థితుఁడనై నాపడిన పాటు నాపొందిన దుఃఖమును సవిస్తరముగ వినుచుచున్నాఁడను.

నీ

హర్ష

హర్షదేవుఁడు శైలపత్రమునకుఁ బ్రత్యుత్తరమును గడుఁ బ్రసన్నముతోఁ నొసంగె. ఆమె సందర్శము నత్యుత్సుకుఁడై ప్రతీక్షించు చుండెను. సాయంతన మైదుగంటలు కానుండెను. శైలను ఛాత్రాలయమున డించిన బగ్గీ ఛాత్రాలయమును వీడి చనియెను. అయ్యది హర్షదేవున కవగత మయ్యెను. అంత ఛాత్రాలయ సేవకుల వశవర్తులజేసికొను విషయ ముపస్థితమగుడు నుదాసీనుఁడు కాఁజొచ్చెను. సేవకులతో మాటలాడు విధ మెట్టిది ? వారలను వశవర్తులను గావించుకొనుటకు మార్గ మేది ? అని యూహింపఁ దొడఁగెను. ఆయూహ నొకదరికిఁ జేర్పకయే సైకిలును జేకొని యొకమార్గమును బట్టి దీర్ఘాలోచనాపరవశుఁడై మెల్లమెల్లగ నడువఁ జొచ్చెను. అట్లుకొంతదూర మరుగునంత నాతని యాలోచనమునకు విఘ్నము కలుగఁగ సైకిలును జేకొనియే నిష్కారణముగ నడచుచున్నాఁడనని యనుకొనుచు సైకిలుపై నారూఢుఁడై చనుచు యథాలోచనమున మరల మునుకలిడఁ జొచ్చెను. అట్లుఁ జనుచుఁ గళాశాల ద్వారముకడ కరుగుదెంచెను. అందుఁగావలియున్న యొక వృద్ధుఁడును మెల్లకింటి వాఁడునగు చౌకీదారాతనిఁజూచి "అహో ! పిట్టవలలోఁ దగుల నగు" నని తనలోఁ దానను కొనుచు ముదమొందఁజొచ్చెను.

హర్షదేవుఁడు శైలాసందర్శనమును బడయుటకుఁ దగు నుపాయమును మార్గమధ్యమున నెంతగ నాలోచించినను దోఁపనందున దననివాసమున కరుదెంచి శౌచాదికృత్యములఁ దీర్చుకొని మరల సైకిలుపై నారూఢుఁడై మహిళాఛాత్రాలయమువంక కరిగి యచ్చటి విశేషముల గ్రహింపవలయు నని యనుకొనుచు నా మార్గమునఁ జనఁ జొచ్చెను.

మహిళా ఛాత్రాలయము కళాశాల యావరణములోనే కళాశాలకు వెనుక భాగమున నొక్కింత దూరమున నెలకొనియున్నది. అద్దానికి బ్రవేశద్వారము వేఱొండులేదు. కళాశాలా ద్వారమునుండియే లోనఁ బ్రవేశింపవలయు. అందు

సేవకులు తప్ప విద్యార్థులు గాని, తదితరులు పురుషులేరును గాని. ఛాత్రాలయాధినేత (Superintendent) యనుమతి లేక ప్రవేశించుటకు వలను పడదు.

హర్షదేవునకుఁ బ్రతిదినమునందును దననివాసము నందుండి కళాశాల కరుగుటయం దర్ధఘంటాసమయము పట్టుచుండెను. కాని నేఁ డిరువది నిముసములే పట్టెను. కళాశాలాద్వారముకడ కరుదెంచి నిలిచెను. అఁ దొక రిద్దరు సేవకు లాతని కంటఁ బడిరి. కాని, వారితో నేమి మాట్లాడవలయునో నిశ్చయ మొనరింపనేరక కొంత తడవిటునటు పరిక్రమింపఁజొచ్చెను. అనంతరము కర్తవ్యవిమూఢుఁడై సైకిలుపై నారూఢుఁడై మందగతిఁ గనుచు "ఇఁక చేయవలయునది యెద్ది! చేయరానిది యెద్ది? శైలసందర్శనము నలవఱచుకొనుటకు సాధనమెద్ది? యని తలంపఁ జొచ్చెను. సేవకులపరిచితిఁ బడయునాశతో గళాశాల కరుదెంచెను. కాని, వారి పరిచయమును బడయు విధ మెద్దియుఁ దోపని వాఁడైనందున నాతని యాశ నిరాశారూపమునఁ బరిణత మయ్యెను. అట్లు చనుచుఁ దన విచలిత హృదయమునకు స్థైర్యమొనఁగూర్పనెంచి కంపెనీ బాగ్ లోనికిఁ బ్రవేశించెను.

నాఁడు స్థిరవాసరము. ప్రతిస్థిరవాసరమును సాయంసమయమునఁ గంపెనీ బాగులో బ్యాండువాద్యము వాయింపఁ బడుచుండును. తన్నియమానుసారముగ నేఁడును బ్యాండు వాయింపఁబడుచుండెను. హర్షదేవుఁడు సంగీత మన్నను బ్యాండువాద్యమన్నను చెవికోసికొనును. అందెక్కువయభిరుచిఁ గలవాఁడు. ఎందుఁబాటకచేరీగాని జంత్రవాద్యములుగాని ప్రవర్తిల్లునని వినిన నందేగుచుండును. ఆతఁడు రాగజ్ఞానము గలవాఁడు. గాత్రపుఁబాటయందును, వీణ. ఫిడేలు, హార్మోనియము మొదలగు వాద్యములయందును విశేషప్రజ్ఞ గలవాఁడు కాకపోయినను, నలుగుర కానంద మొసఁగఁగల సమర్థుఁడనుటకు సంశయము లేదు. ఆతఁడు నాఁడు బ్యాండువాద్యము నాలింప నాయారామమునకు వెళ్లెనే కాని, యాతనిమనస్సున కావాద్యము నింపుఁబెంపలేదు. కావుననందుండి తొలఁగి కోటు జేబునుండి యొకసిగరెట్టును దీసికొని దాని నగ్గిపుల్ల వెలిగించి ముట్టించెను. ఆసిగరెట్టును నోటనుంచుకొని యిటునటు పచారు చేయుచుఁ జిత్తశాంతిపడయుటకుఁ బ్రయత్నింపఁ జొచ్చెను. కాని, యెంతతిరిగినను నెంతప్రయత్నించినను జిత్తశాంతి యలవడ దయ్యెను. తుదకు విసుఁగు జనించెను. అందువలన నందుండ నొల్లక తనయావాసమున కరిగెను.

హర్షదేవుఁడు తన నిలయమున కరుదెంచి భోజనాది కృత్యములఁ దీర్చుకొని యందలి పుష్పవాటికలోని యొకతిన్నెపై మేనువ్రాల్చి దీపపువెలుతురున నొక

సమాచార పత్రికను బరికించుచుండెను. ఎనిమిది గంటలు కావచ్చెను. ఆసమయమున రవిశంకరుఁ డను నొక మిత్రుఁ డరుదెంచి తత్తఱ మొందుచు "హర్షా! నాటకమును జూడవచ్చెదవా? కిర్లోస్కరు కంపెనీతాలూకు సుప్రసిద్ధ నాటకము 'భగవాన్ తిలక్' యొక్క ప్రథమదర్శనము. నేఁడు." అని పలికెను. అందులకు హర్షదేవుఁడు మందస్వరమున "ఏమి చెప్పుదును. రవీ! తప్పక వచ్చువాఁడనే. కాని, కొంచెము తలనొప్పిగా నున్నది. రాత్రినిద్ర లేక పోయిన నొకవేళ మఱింత యెక్కువయై జబ్బుక్రిందఁ బెట్టునేమోయని భయము. పరీక్షా దినములు కూడ సమీపించుచున్నవి. కాఁబట్టి రా వెనుదీయుచున్నాను." అని ప్రత్యుత్తర మొసంగెను. రవిశంకరుఁడు నాటకసందర్శనమునకుఁ ద్వరపడుచుండువాఁడు కావున హర్షదేవుని నెక్కువనిర్బంధింపకయు నితరసంభాషణ మొనర్పకయుఁ దనత్రోవఁ దాను వెడలిపోయెను.

రవిశంకరుఁడు హర్షదేవునకుఁ బరమమిత్రుఁడు. సచ్చరిత్రుఁడు గంభీరహృదయుఁడు. వయసునందు హర్షదేవునికంటె నొకటిరెండుసంవత్సరము లెక్కువయయిన వాఁడు. హర్షదేవునితోఁబాటు ఎమ్.ఏ. చదువుచున్నవాఁడు. హర్షదేవుఁడును అన్ని సుగుణములును గలిగియుండినవాఁడేగాని, చరిత్రలోప మొండు గలిగియుండుట వలన రవిశంకరున కీడు కాఁజాలక యున్నవాఁడు. హర్షదేవునకు రవిశంకరునకు దాఁపఱిక మెద్దియును లేదు. ఆతఁడాతని కన్నివిషయములను నెఱిఁగించుచుండును. కాని, చరిత్రలోపము కలవాఁడు అగుటవలనఁ దదవగుణముఁ గూర్చిన విషయమును మాత్ర మాతనికడ గుప్తముగ నునుచుచుండును. రవిశంకరుఁ డాతని యవగుణమును గ్రహించునేని నిష్ఠురుఁ డగునని యాతనికి భయము. సంకోచము. అందువలన హార్దిక కష్టము నెంత యనుభవించుచున్నను హర్షదేవుఁడు శైలంఁగూర్చి తానొందుచున్న పరితాప విషయమును రవిశంకరునకు రహస్యముగ నునిచెను.

రవిశంకరుఁడు వెడలిన పిమ్మట హర్షదేవునకు సమాచార పత్రికావలోకన మసహ్య మయ్యెను. తిన్నెమీఁదనుండి లేచి యిటునటు పరిక్రమించుచు "అవు! ఏమిచెప్పుదును. ఎంతటివారినైన వికలేంద్రియులఁగఁ జేయక విడువక యుండునట్టి మోహినీశక్తి స్త్రీలయం దొప్పుచుండునని యెన్నఁడును దలంచి యెఱుఁగను. అమ్మ, నాయన, అత్త, వదినె మొదలగువారు, పెండ్లినిగూర్చి, బోధించి చెప్పినపుడు, వారి బోధనలఁ బెడచెవుల నిడుచు, వకాలతు ప్యాసయినఁగాని పెండ్లాడనని శపథములు పలికితిని. అట్లు పలికినందుల కప్పుడేరును నేమియు ననలేదు. కాని, వదినెగారు మాత్రము కనుబొమ్మలు మాత్రము ముడివెట్టుచు, "శపథముల

శేమి? ఎన్ని యైనను బలుకవచ్చును. అందులకు ఆటంక మెద్దియులేదు. యెవతె యైన మృగలోచని, మనోహారిణి కన్నులపడినపుడు ఈ పలికిన శపథములు నిలుపుకొననేఱవు. అపుడా మదవతిదిక్కు లగ్నహృదయుఁడవై యామె వలలోఁజిక్కి యథార్థమగు జీవనానందమునకుఁ దిలాంజలి నొసంగవలయు వాఁడవగుదువు" అని ధిక్కరించి నొక్కి నొక్కి వక్కాణించెను. ఆమె పలికినట్టుగానే యిపుడు అట్టి వలలోఁ జిక్కితిని. ఏమిచేయుదును. బాల్యజీవితమును బరమ పవిత్రమును శుద్ధముగను నెఱపియుంటిని. గాంధిమహాత్ముని లేఖలు పఠించినపుడు భార్యాపుత్త్రుల పాలన పోషణములు సలుపుటకుఁ జాలునంత ధనోపార్జనమునకు వలయు సామర్థ్యమలవడునంత దనుకఁ బెండ్లిచేసుకొనరాదని ప్రతినను బూనియుంటిని. కాని, పాఠశాలలోఁ జేరినంతనే పరివర్తనుఁడనైతిని. మాఱుపడితిని. అందలి బాలుర రహస్యవర్తనములు, పరస్పరవ్యవహారములు నా హృదయము నాకర్షించినయవి. నన్నులోఁ గొనినయవి. నాకు దుర్గుణముల నలవఱచినయవి. అట్లయ్యును. బాఠశాలలో నున్నంతవఱకు భయభక్తులు, సిగ్గులజ్జలు నన్ను వీడుటలేదు. అందువలన నపుడంత చెడుటలేదు. అంత విషమపరిస్థితులకు లోనగుటయును లేదు. కళాశాలలోఁ జేరినయంతనే యున్న రవంత వివేక మూడిపోయినది. భోపతులాలువంటి యువకులు చరిత్రభ్రష్టులు పాఠశాలా జీవితములోనే పొడసూపఁగలరను విశ్వాసము నాకుదృఢమయ్యెను. భ్రష్టులుతాము భ్రష్టులమైతిమనియూరకొనియుండరు. పరులనుగూడభ్రష్టులఁజేయఁదొడంగుదురు. ఎంతటి సద్వర్తనులనైన దుర్వర్తనులఁగావింతురు. భోపతులాలు నన్నెంతకౌశలముతో లోఁగొనియెను. ప్రకృతపు విద్యార్థులు పాఠశాలలోఁ జదువుకొని శిక్షాసంబంధములగు పరీక్షల నుత్తీర్ణులగుటకుఁ బూర్వముననే "చరిత్రహీనులైతి" రను ప్రశంసాపత్రము (Certificates) లను బడయఁగలవార లగుచున్నవార లని నా నమ్మకము. సరే! అయినదేమో యయినది. దాని నిఁకఁ దలచుఁకొని యేడిచిన నేమి లాభము! చేతులు కాలిన పిమ్మట నాకులు పట్టుకొనిన నేమిప్రయోజనము! జరుగవలసినది యేదో జరిగినది. దుర్వర్తనుఁడనైతిని. దుర్గుణముల కాలవాలమైతిని. దుర్వ్యసనములకు లోనైతిని. ఇఁక విచారింపవలయునది యీ యభ్యస్తములైన దుర్గుణ దుర్వ్యసనములవలన లభ్యమగు నానందమును ననుభవించిన యనంతరము దానిని విడుచుటయా? లేక తదనుగుణముగ సలుపు దుష్కర్మమున కలవడెడి శిక్ష ననుభవించిన పిమ్మట విడుచుటయా యను విషయము. కాబట్టి యందుల కిఁక నేఁ జేయవలయు నేకమాత్రపుఁబని శైలలోఁ గొనుటయే. అద్దానిని బ్రాణ మిచ్చియైనను సాధించెదను" అను నిశ్చయమున కరుదెంచెను.

హర్ష దేవుఁడు కర్తవ్య నిశ్చితుఁడయ్యెను. కాని, తత్సాధనమున కనువగు నుపాయ మాతనికిఁ దోఁచకుండెను. ఏమిచేయఁ గలఁడు ? హృదయమునకు శాంతి యలవడకుండెను. బుద్ధికి స్థైర్యము కలుగకుండెను. తుదకు నిస్పృహుఁడై నిద్రించుటకుఁ బడకగదిలోని కేగెను. అతఁడు పడకగదిలోని కేగుచుండుటఁగని యాతని జనని సేవకునొకనిఁ బిలిచి "చూడు. హర్షుఁడు పండుకొనుట కరుగుచున్నాఁడు. పాలుతీసికొని వెళ్లి యిచ్చిరమ్ము" అని చెప్పెను. సేవకుఁడు పాలుతీసికొని వెళ్లి హర్ష దేవుని చేతి కందీయఁబోవ, నాతఁడు. "వద్దు తీసికొని వెళ్లు. నేఁడు శరీరము బాగుగలేదు పాలుత్రాగను." అని పలుకుచు సేవకునిఁ బనిచెను. సేవకుఁడు పాలపాత్రఁ గొని వెడలిపోయెను.

హర్ష దేవుఁడు పగలంతయు నెండలోఁ దిరిగితిరిగి యలసిసొలసి యుండె. కాని, శైలను గూర్చిన విచారమాతని హృదయమును దహించుచుండెను. దాని నిద్రాదేవి యాతని దరిఁజేరదయ్యెను. అందువలన నిద్రనాశించి తన కట్టెమట మేజాబల్లపై నిలిచియున్న సారాయము సీసతీసి యందలి ద్రవమును రెండు మోతాదులు సేవించి గదిని వీడి మేడమీఁది కరిగి యందొక మంచముపైఁ బరుండి నిద్రాదేవి నారాధింపఁ దొడఁగెను. కాని, నిరంతరము తోడునీడవలె చేరి మెలఁగెడి బంధుమిత్రులుఁగూడ విపత్తునందు, విషాదమునందు దరిఁజేరుటకు వెఱచి దూరగతు లగుచుందురు. అట్టిచో నిద్రాదేవి యెట్లు దరిఁజేరఁగలుగును. హర్ష దేవుఁడు నిద్ర నాశించి సారాయమును సేవించెను. కాని, సారాయము సేవించుటవలన నిద్దుర కలుగుటకు మాఱుగఁ జింతాతిశయము కలిగెను. దాన శారీరక మానసిక పీడ లెక్కువ యయ్యెను. దుస్సహము లయ్యెను. అంత నాతఁడు "ఇపుడు శైల కొఱకుఁ బ్రాణప్రియ యగు శైల కొఱకు భోపతులాలు శరణమును జేకొనవలసి వచ్చెనా ? ఏమి ? ఒకప్పుడు వానిని వాని నీచకృత్యములు కారణముగఁ దూలనాడి యుంటిని. అది మొదలు వానికి దూరముగనే యుండి యున్నాఁడను. ఇపుడు మరల వాని చెంత కరిగి వానిని మంచిమాటలాడవలయునా ? అవును. అవసరము. అవసరము వచ్చినపుడు గాడిద కాళ్లు పట్టుకొనవలయును. అందువలన నవశ్యము వాని శరణమును జేకొనవలయును. వానితో మంచిమాటలాడవలయును. అతఁ డిట్టి ప్రమేయములలో సిద్ధహస్తుఁడని పేరు పొందినవాఁడు. నందరాణి యిల్లు పెట్టెవంటి యిల్లు. అట్టి యింటిలోఁ జొరఁబడి యామె స్నేహముఁ బడయుడమనునది భోపతు లాలునకు సాధ్యమయినదిగాని, తదితరులకు సాధ్యమగునదియా ? అతఁడు మోహిని యింటికరిగి, యింటివారి కేవిధమగు ననుమానమును గలుగనీయక వారితోఁ గలిసి

మెలసి, తిరిగి మోహినిని వశమొనర్చుకొని తుద కామెను నిలువెడలించెను. ఇట్టివి యెన్నియోపనులు చేసెను. ఇట్టి యద్భుత కార్యములు భోపతులాలునకు సాధ్యములయ్యెను గాని తదితరులకు సాధ్యములు కాఁజాలవు " అని యనుకొనఁజొచ్చెను.

అంతఁ గొంత తడవునకు హర్ష దేవుని దగ్ధహృదయమున కించుక సాంత్వన మలవడియెను. సంతసము చేకూరెను. ఒకానొకడు స్వప్నావస్థయందు నావికారోహియై సముద్రయాన మొనర్చుచుండెను. నావ నడుసముద్రములోఁబడి నడుచుచుండెను. నలువైపులను సముద్ర జలమున కతిరిక్త మగునదేదియును గానరాకుండె. ఎటుచూచినను నేదియుఁ గనఁబడుటలేదు. ఆకసమున నెగిరెడిపక్షియైన దృగ్గోచర మగుటలేదు. ఆ సమయమున సముద్ర మధ్యమునఁ బ్రచండ ఝంఝా మారుతము వీవ మొదలిడియెను. ఝంఝామారుతముయొక్క యాఘాతమునకు నావనిలువపోపజాలక కొట్టుకొనిపోయి యందొక కొండకుఁ దగిలి బ్రద్దలయ్యెను. అంత నావ జలపూరితమయి మునుఁగ నారంభించెను. ఒక వంక నావ సముద్రములో మునిఁగి పోవుచుండెను. వేఱొకవంక ఝంఝామారుతము భీషణరూపధారిణియై ప్రచండ తాండవ మొనర్చుచుండెను. నావికులు హతచేతస్కులైరి. అంత నామనుజుఁడు నావలోని యన్యోన్య యాత్రికులతోఁ బాటుగ నీ భయంకర దృశ్యమును జూచి హాహాకారమొనర్చుచు జీవితాశ వీడి యంతిమ ఘటికకొఱ కెదురుచూచు చుండెను. అట్టి సమయమున నాతని స్వప్నమునకు భంగము కలిగెను. తెలివివచ్చి కనులు విచ్చి నలువలంకులు పరికించి చూచునంత తానొక మంచముపైని పండుకొని యుండుటను గాంచఁగలిగెను. ఆ సమయమున నా స్వప్నదర్శియగు మనుజుఁడు, తానట్టిభయానక దుర్ఘటనమునుండి ప్రాణత్రాణమును బడసి బయటఁ బడినందులకెంత హర్షితుడగునో హర్ష దేవుఁడును గర్తవ్యనిశ్చితుఁడై చింతా సాగరమునుండి బయలు వెడలినందులకంత హర్షితచిత్తుఁడయ్యెను. భోపతులాలు శరణ్యమును జేకొనినయెడ స్వార్థసిద్ధి చేకూఱునను విశ్వాసమాతని హృదయసీమయందు సంచరింపఁ జొచ్చెను.

స్వార్థసిద్ధి చేకూఱునను విశ్వాస మంకురించినంతనే హర్ష దేవుఁడు విచారవిదూరుఁడయ్యెను. అంత నిద్రాదేవి యాతని నొడిజేర్చుకొని లాలించుచు జోకొట్టఁ జొచ్చెను. దాన నాతఁడు మృత్యుదేవతతోఁ బందె మిడినట్టులు ఘోరనిద్రావశుఁడై గుఱ్ఱుపెట్ట నారంభించెను.

## పదునొకండవ ప్రకరణము

జ్యేష్ఠమాసము. కృష్ణపక్షము. పంచమితిథి. రాత్రి పదునొకండు గంటల సమయము. నిశానాథుఁడింకను నాకసమున కరుదెంచుటలేదు. ఆ సమయమున నొక

నరపిశాచుని బలాత్కారమునకు లోను గానున్న యబలా శిరోమణి యార్తనాదము సుధాకిరుని కర్ణకుహరములఁ జొరబడి హృదయవిదీర్ణ మొనర్చినందున, నాతఁడు తపయఁజాలక తత్ క్షణమునకు వినువీధికరుదెంచి సుధామయజ్యోత్స్నను నలుదిక్కులకుఁ బాఱననిచ్చెను. ఉద్యానవనము లందలి ఘననికుంజ పుంజములలోనికిఁ గూడ వెన్నెల వెలుతురు చొరుచుండుటఁ గాంచి యబలా బలాత్కారి యగు నా నరాధముఁడు భీతధైర్యుఁడై పెలపెలఁ బోవఁ జొచ్చెను. అతఁడింతవఱకును ననునయవినయములఁ జూపుచు నా యబలను దనవలలోఁ జిక్కించుకొనఁదలఁచి యుండెను. కాని, వెన్నెల వెలుఁగును జూచి, పశుబలము నుపయోగపఱచి యభీష్టసిద్ధిని బడయ నుద్యుక్తుఁడగుచుఁ "జూడు. రెండు గంటల నుండి మంచిమాట లాడుచున్నాను. లాలనముఁ జేయుచున్నాను. బ్రతిమాలుచున్నాను. కాని, నీ కఠినహృదయము, నీ రాతిగుండె, కొంచెమయినను గరుఁగకున్నది. నీ వెంత నిష్ఠురురాలవు. ఎంత కఠినురాలవు. నీయందుముగ్ధుఁడై నీకొఱకుఁబ్రాణములనైన నొసంగుటకు సంసిద్ధుఁడై యున్న వానిని, గన్నులారఁ గనుచు వానిపై నించుకయుఁ గనికరమును జూపకున్న దానవు. వానియభిలాషనైనఁ దీర్చుట కియ్యకొన కున్న దానవు. నాతో నా యింటికి రమ్ము. లక్షాధికమగు నా యైశ్వర్యమున కధీశ్వరివికమ్ము. సుఖభోగముల ననుభవింపుము. దాసదాసీజను లొనర్చుసేవలఁ జేకొనుము. నీనిరుపమసౌందర్యమును, నీ నిండుజవ్వనమును సార్థకముఁ గావింపుము. అడవిఁ గాచిన వెన్నెలను, సముద్రములోఁ గురిసిన వర్షమును బోలె నిరర్థకములఁ గావింపకుము. ఇప్పుడైనను మించిన దేదియును లేదు. నా మాటను మన్నింపుము. నన్ను బలాత్కారమును జూపుటకుఁ బ్రేరేపకుము.

యువతి: ఛీ మూర్ఖా! పొమ్ము. నా యెదుటనుండి తొలఁగిపొమ్ము. విశ్వాసఘాతుకా! నరపిశాచీ! ప్లేషను దగ్గఱ ఠాకూరు జగపాలసింహుని యిల్లుచేర్చెదనని బాసచేసి వెంటనిడుకొని వచ్చినవాఁడవు నీవు కావా? నీ చేసిన బాసలనే యొనర్చి నా సతీత్వమును నష్టమును భ్రష్టమును గావింప నెంచుచున్నాఁడవు? చూచుటకుఁ బైకి సాక్షాత్తుపరోపకారమును భూతదయయును నీయందుమూర్తీభవించి యున్నటులఁ గనఁబడు చున్నాఁడవు. హృదయములో నిట్టి పాపచింతనమును బూనియున్నాఁడవు. ఆహా! నీ కపటవర్తనమును గూర్చి యిసుమంతయు మనమునఁ దోఁచియుండినచో, నీ ముఖమును నెన్నఁడును జూచుదాననుగాను. నీ వెంటఁ జనుదెంచుదాననుగాను. ఇంత దుఃఖమును నెట్లు వహించి యున్నదాననో, యీ శరీరమున కలవడు నారవంత కష్టమును, గూడ నటులనే సహించి యుందును. కాషాయాంబరములను ధరించు పాఖండులగు సాధువులు, సన్న్యాసులు, తదంబరముల

చాటున నెంతెంతలు ధూర్తకృత్యములు, విశ్వాసఘాతకములు మోసములు సలుపుచుఁ దదంబరములఁ గలుషితములుగ నెట్లు చేయుచున్నవారలో, యటులనే నీవంటి నీచులు ఖద్దరు వస్త్రములను గలుషితములుగ దూషితములుగఁ జేయుచున్న వారలని నేనిపుడు నిన్నుఁ జూచి తలంచుచున్నాను.

యువతీమణి పలికిన యీ తిరస్కారపూరితములగు వాక్కులను యువకుఁ డలక్ష్యము సేయుచు, వికటహాసముఁ బ్రకటించుచు "జ్ఞానవతీ! నేనేమి చేయుదును? నీ చపలవీక్షణములు, నీ తీక్ష్ణదృగ్బాణములు నా హృదయమును విదీర్ణము గావించినవి. నీ యరుణకపోలములు నీ యమృత సమబింబాధరమును, నాపై వజ్రపాత మొనరించిన యవి. ఇఁక నిన్ను వీడి యొక నిముసమయినను నిలువఁ జాలను. ఒక యడుగైనను నిలువఁ జాలను. నీ సుమసమ కోమలాంగమును నా హృదయమునఁ జేర్చుకొని నా జన్మమును సాఫల్యముఁ గావించుకొన నుత్సుకుఁడనగుచున్నాఁడను. పరమేశ్వరుఁడు నీకు సాటిలేని సౌందర్యమును నొసంగియు వైధవ్యముఁ జేకూర్చి కడునన్యాయ్యమును నధర్మమును జేసియున్నాఁడు. నీ ప్రాయ మిరువదివత్సరములకు మించియున్నటులఁ గానరాదు. ఇంకను నూఱుసంవత్సరములు బ్రదుకవలసి యున్నదానవు. కాబట్టి నామాటవినుము. నన్నుఁ బోద్రోయకుము. రమ్ము. నన్నుఁ గౌఁగిటజేర్చి నా హృదయ సంతాపమును జల్లార్పుము. ప్రియా! ప్రాణేశ్వరీ! నా మనము దగ్ధమగుచున్నది. ఇఁక నెక్కుడుగ చంపకుము. మనమును దహించుచున్న మదనాగ్నిని జల్లార్పుము.

ఇటులఁబలుకుచు యువకుఁడు కామాంధుఁడై జ్ఞానవతి వంక కరుగఁజొచ్చెను. జ్ఞానవతి యింతవఱకు ధైర్యసాహసములఁ జిక్కఁబట్టి యుండెను. కాని, యువకుఁ డున్మాదునిఁబోలె మీఁదికరుదెంచుచుండుటఁ గనినంతనె యామెకుఁ గాలుసేతులు వడఁకఁ జొచ్చెను. భూమి గిరగిర దిరుగుచున్నట్లయ్యెను. అంత ధైర్యసాహసము లామె కడనుండి దూరగతము లయ్యెను. మదోన్మత్తుఁడును, వ్యభిచారియు నగు యువకుఁ డాక్రమణోన్ముఖుఁ డగుటఁ జూచి జ్ఞానవతి నేలఁ గూలఁబడి యొక భయంకరమగు నార్తనాద మొనర్చి మూర్ఛితయయ్యెను.

యువకుఁడు మూర్ఛితయై యొడలెఱుంగక నేలఁబడియున్న జ్ఞానవతిఁ జూచి ప్రసన్న హృదయుఁ డయ్యెను. ఒడలెఱింగియుండినఁ దనమేనఁ జేయియెన్నఁడు నిడనీయదు. ఇఁక నిర్బాధకముగ మనసు తనియునటుల దీని సౌందర్యసుధను గన్నులారఁ గ్రోలనగునని యనుకొనుచుఁ దనతృష్ణఁ బాపుకొన జ్ఞానవతిని డగ్గఱిలఁ జొచ్చెను. కాని, అదియేమి? ఆసాధ్వీమతల్లి సతీత్వతేజము కారణముగ నా పాపా

త్ముని యడుగులు ముందునకుఁ బడనేరకుండెను. కాలుసేతులు కంపిల్లఁ జొచ్చెను. హృదయము విచిత్రగతి ననుకరించెను. శరీరము స్వేదజలపూరితమయ్యెను. చిత్తము విభ్రాంతమయ్యెను. కాని, యేమయినను బూవిలుతుఁ డీ లక్షణములన్నింటినిఁ బాఱఁద్రోలి యా యువకునకు ధైర్యముఁ బురికొల్పెను. అంత నా యువకుఁడు, ఆ పాపచింతనుఁడు, నా వ్యభిచారి తన పాపపుఁ జేతులనిడి యా సతీమతల్లి శరీరము నపవిత్రముఁ గావించుటకునై యామెం బయిపాటునఁ జేయ నుద్యుక్తుఁడయ్యెను. అంతనా సమయమున "జాగ్రత జాగ్రత. నిలువుము. ఆగుఆగు" మనుశబ్దములు మేఘగర్జనముల వలె నాతని కర్ణకుహరములఁ జొఱఁబడెను. యువకుఁడు మొదటనే పాపచింతనుఁ డగుటవలన భయవిహ్వలుఁడును, శంకితచిత్తుఁడునై యుండెను. ఈశబ్దములు కర్ణగతములైనంతనే హతచేతస్కుఁడయ్యెను. శబ్ద మరుదెంచిన వంకకుఁ జూడ్కులుసారించెను. తానున్న నికుంజమునకుఁ బరుగు బరుగున నరుదెంచుచున్న యువకుల నిర్వురఁ గనియెను. ఆ యువకుఁడా వ్యభిచారి, యా దుర్నీతిపరుఁడు, ఇట్టి దుర్నీతిపరుఁడు, ఇట్టి దుష్కృత్యము లొనర్చుటయందు సిద్ధహస్తుఁడు గాన, నా యువకుల నిరువురఁ జూచినంతనె వారి బాఱిఁ బడకుండ నికుంజమును వీడి వేఱొక మార్గమునఁ బరుగిడఁ జొచ్చెను. కాని భాగ్య మాతనికిఁ దోడగుటలేదు. అతఁడు పరుగిడు మార్గమున నానికుంజమువంక కరుదెంచుచున్న వేఱువురు యువకులాతని కడ్డమై బాఱిపోకుండ నిరోధించి పట్టుకొనిరి.

ఆ పాపాత్ముఁ డగు యువకుఁడు నికుంజములోనుండి వెలువడి పరుగిడఁ జొచ్చుటను మొదట నరుదెంచిన యిరువురు యువకులును జూచి యుండిరి. అందొకఁడు ఆ పాపాత్మునిఁ బట్టుకొనిన యిరువుర యువకులవంక కరిగెను. వేఱొకఁడు నికుంజములోనికిఁ జొచ్చిన యువకుఁడు గాఢమూర్ఛితయై నేలఁబడియున్న యువతీరత్నముఁ గాంచి బయటికరుదెంచి "ఆ దురాత్మునిఁ బాఱిపోనీయకుఁడు. పట్టుకొని బయటికిఁ గొనిరండు." అని పలికి మరల నికుంజముఁ జొచ్చి చైతన్యవిహీనయై పడియున్న యువతికిఁ జైతన్యముఁ జేకూర్ప యత్నించుచుండెను. ఆ ముువ్వురును నా పాపాత్మునిఁ గాలుసేతులు బంధించి నికుంజములోనికిఁ గొనితెచ్చి యొకవంక నునిచిరి. నలువురు నచేతనావస్థయందుఁ బడియున్న యువతికిఁ జేతనముఁ గూర్చు యత్నమునందుండిరి. ఒకఁడు దీపముఁ గొనితెచ్చెను. వేఱొకఁడు శీతలోదకముఁ దెచ్చి యామె ముఖమునఁ జిలకరింపఁ జొచ్చెను. మఱొకఁడు వీవనఁ గొనిదెచ్చి వీవఁదొడంగెను. మఱొకఁడు పానీయముఁ దెచ్చి యించించుక నోటఁ బోయఁ జొచ్చెను. నలువురు నీవిధముగఁ గొంత తడవు పచారములు సలుప నాయువతికి

స్మృతి కలిగినయది. ఆమె కన్నులు విచ్చి పరికించి చూచునంత నొకవంక తన కుపచారులై యొప్పియున్న యువకులు నలువురును, నింకొకరివంకఁ గాలుసేతులు బంధింపఁబడి పడియున్న తనకుఁ బూర్వపరిచితుఁడగు, తన సతీత్వహరణమున కుద్యుక్తుఁడును నగు కుత్సితుఁడును దృక్పథమునఁ బడిరి. ఆ నలువురును దన సతీత్వమునకు నష్టమాపాదింప నెంచియున్న యా దుర్నీతిపరుని సహచరులేమో యను భయ మామె మనమున నుదయింప నామె మరలఁ గన్నులు మొగిడ్చెను. నలువురు యువకులును నామె భయకారణమును గ్రహించిరి. అందొకఁ డామెతో. "సోదరీ! భయపడకుము. నీకు భగవంతుఁడు రక్షకుఁ డయ్యెనని యెంచుము. సర్వవిధముల సురక్షణస్థితియందున్నానని తలంపుము. నీ కష్టములు గట్టెక్కెనని నిశ్చయింపుము. ఇఁక నీ దుర్నయుఁడు నీవంక దృష్టియైన నిడనేరఁడు. నీకు నలువురము సోదరుల మున్నాము. నీ రక్షణమునకు సంసిద్ధులమై యున్నారము. నీ వేమియుఁ జింతిలకుము. ఏమియు భయపడవలదు లెమ్ము. ధైర్యమును జేకొనుము. చిత్తమును శాంతిలఁ జేయుము. నీ యాజ్ఞ యేదియో యెఱిఁగింపుము. మేము దానిని శిరమున నిడుకొని పాలింతుము" అని పలికెను.

ఆ యువకుని మాటల నాలకించి జ్ఞానవతి కన్నులు తెఱచెను. నలువుర నొకసారి పరికించెను. లేచి కూర్చుండెను. తలవంచుకొని నేలఁజూచుచు "అన్నలారా! మీరు నన్నీ నరాధముని, విశ్వాసఘాతకుని చేతులలోనుండి విడిపించి రక్షించితిరి. మీకు వెయ్యివేల నమస్కారములు. బ్రదికియున్నంతకాలము మీ మేలును మరువఁ జాలను. మీకుఁ గృతజ్ఞతనై యుందును. మీరు ధర్మమును నా సతీత్వమును భ్రష్టములు కాకుండఁ గాపాడితిరి. మీ కీశ్వరుఁడు శుభపరంపరల నొసంగుఁగాక! మీరు నాకు సోదరతుల్యులే కాదు. దైవసమానులు. పూజనీయులు. నాకేమి యాజ్ఞ నిడుదురో దానిని బాలించుటకు సిద్ధముగ నున్నదానను. మీకన్న నా మేలునుకోరువారీ ప్రపంచమున నాకితరులేరును లేరు. నాకీ ప్రపంచమున నంతయు నంధకారబంధురమైయున్నయది. నేఁటికి మూఁడు వత్సరములుగ ననేక కష్టములను నొకదానికంటె నొకటి యెక్కుడగుదాని ననుభవించుచునే యున్నాను. నేఁటివలెనే నా ధర్మమును నా సతీత్వమును నెన్నియో యాక్రమణలకు లోనైనయవి. ఎందఱో దుష్టులు నన్నుఁ గళంకితఁ జేయ నుద్యుక్తులైరి. కాని, యనాథులకు నాథుఁడును, నసహాయులకు సాయము చేయువాఁడును, నశరణ్యులకు శరణ్యుఁడును, నగు నా యధీశ్వరుఁడు నార్తత్రాణపరాయణుఁడు నిరంతరము నా వెన్నంటి తిరుగాడుచు నాకు రక్షణ మొసంగుచునే యున్నవాఁడు. ఈ మూఁడు సంవత్సరములలో

నెన్నియో సాధులు కుత్సితులును, వేషధారులును నగు పరోపకారులు పలువురు ప్రాప్తులైరి. అహా! అందఱును నాయెడ విశ్వాసఘాతకులైరి. మీరు నేఁడు నన్నీ ఘోరవిపత్తునుండి తప్పించిన విధముఁ జూడఁజూడ, మీ వలన నా కెవ్విధమయిన నరిష్టము గలుగ నేరదని నాకు విశ్వాసము కలుగుచున్నయది. ఇఁక నేను మీ చేతులలో నా జీవనసూత్రమును నిడుచున్నాను. మీ కెట్లుతోఁచిన నట్లు చేయుఁడు. పాలముంచినను సరే, నీళ్లముంచినను సరే. మీదే భారము" అని పలికెను. ఆమాటలు విని యందొకఁడు "దేవి! మమ్ము సోదరులుగఁ దలంపుము. మావలనఁగాని మాయెదుట మఱియొకరివలనఁగాని, నీ కేవిధమయిన యరిష్టమును గలుగ నేరదని బాసచేసి చెప్పుచున్నారము. మమ్ము విశ్వసింపుము. సోదరీ! మూఁడు సంవత్సరములుగఁ బలుకష్టముల ననుభవించు చున్నదానవని యిపుడు పలికి యుంటివి. నీ మాటలవలన నీ జీవితము విచిత్ర ఘట్టములతో నిండియున్నట్లు తెలియుచున్నది. నేఁడీ నరపశువుచేతిలో నెట్లు చిక్కితివి? వినఁగోరుచున్నారము. మాయెడ విశ్వాసము కలిగినేని నీ కుచితమని తోఁచెనేని నీ దుఃఖపూరితమగు జీవనచరితమును నొకింత మాకు వినిపింపుము" అని వేఁడెను.

ఆ మాటలు విని జ్ఞానవతి శిరము వంచుకొని దీర్ఘనిశ్వాసముఁ బుచ్చుచు "నా బ్రతుకు పుట్టినది మొదలు నేఁటివఱకు దుఃఖములతోనే యొప్పుచున్నది. ఎట్టి దుష్ట నక్షత్రమునఁ బుట్టితినో చెప్పఁజాలను. నేను పుట్టువుతోనే కాదు కాదు— తల్లిగర్భము జొరునపుడే యొకదానికంటె నొకటియెక్కుడగు కష్టములను వెంటఁ గొని తెచ్చుకొన్న దానను. నా దుఃఖద చరితమును విని మిమ్ము శోకాకుల చిత్తులఁ జేయుటకు నా మనము అంగీకరింపదయ్యెను. కాని, మీయాజ్ఞాపాలనము నా కవశ్య కర్తవ్యమగుటచే వినుచున్న దానను. వినుఁ" డని పలుకుచుఁ గనులనీరు నింపుకొనుచు నిట్లు చెప్పఁదొడంగెను :

"నే నాగ్రా నగరములోని యొక క్షత్రియ కులమునందు జన్మించితిని. నన్ను జ్ఞానవతియని లోకులు పిలుతురు. నాతండ్రి పేరు ఠాకూర్ రఘునాథసింహుఁడు. తల్లికడుపులోనుండి బయటఁబడునపుడే కష్టములను వెంటనిడుకొని వచ్చితినని యిపుడే కదా చెప్పియుంటిని. నా పుట్టుకనే నాతల్లితో స్వర్గవాసమున కరిగినది. ఇంటిలో నా ముసలియవ్వ (తండ్రితల్లి) తక్క మఱెవరును స్త్రీలు లేరు. ఆమెయే నన్ను బెంచినయది. నాకొక జ్యేష్ఠసోదరుఁడుగలడు. అతఁడు నాకంటె నేడుసంవత్సరములు పెద్దవాఁడు. అతఁడే నా పుట్టువుతోనే తల్లి మృతినొందినదియు, అపుడు రెండు దినములు నన్నుఁ జూచినవారలే లేరనియు నాతోఁ జెప్పెను.

మా యవ్వ "ఇదిపుట్టి తల్లిని మ్రింగివేసినది. ఇట్టిది బ్రతుకుటకంటె చచ్చుటయే మేలని" యనుచుండెడిదఁట. కాని నేనిన్ని దుఃఖములను నన్ని కష్టములను ననుభవింపవలయునని నా నుదుట వ్రాసియుండ నాకుఁ జావెటులు కలుగును? మూఁడవ దినమునుండియు మా యవ్వ యేమి అనుకొనినదో కాని నన్ను సంరక్షింపఁ దొడఁగినయది. కాలక్రమమున మిక్కుటముగఁ బ్రేమింపఁజొచ్చినయది. నాకు అయిదు సంవత్సరముల యీడు వచ్చినయది ఆపుడు నాతండ్రి యెవరెంత చెప్పినను, నెంత బోధించినను, నెంత వలదనినను సరకుగొనక రెండవపెండ్లి చేసికొనెను. నా కేడవయేఁడు వచ్చినది మొదలు జ్ఞానమించుక కలుగఁజొచ్చినయది. మంచిచెడ్డలు లాభనష్టములు, కష్టసుఖములు బోధపడఁజొచ్చెను. సవతితల్లి తన సవతిబిడ్డలకెట్టి కష్టముల నిడఁజొచ్చునో యందులకుఁ దగు జ్వలంతోదాహరణమును నా సవతితల్లి ప్రపంచమునకుఁ జూపెట్టినది. నా తండ్రికి బెండ్లియైన యొక సంవత్సరములోనే నా దౌర్భాగ్యమువలన నా యవ్వ నన్ను వీడి పరలోకమునకు నరిగెను. నా సవతితల్లికి ముల్లోకముల కాధిపత్య మలవడెను. ఆమె నాపైని దన నిరంకుశాధికారమును జూపఁజొచ్చెను. నన్ను బెట్టరాని కష్టములఁ బెట్టఁజొచ్చెను. అంతటితోఁ దనియక నా తండ్రితో నాపై లేనిపోని నేరములు కల్పించి చెప్పుచుండెడిది. నాతండ్రి నా సవతితల్లి చేతిలో నొక కొయ్యబొమ్మవలె నాడుచుండెను. ఆమె వాక్కు వేదవాక్కని యాతని విశ్వాసము. ఆమె చెప్పినమాటలు విని వెనుక ముందులు చూడక నన్నుఁ బ్రతినిత్యము చావమోఁది చెవులు మూయుచుండెడు వాఁడు. నా సవతితల్లి నన్ను బెట్టవలసిన కష్టముల నన్నిటిని బెట్టుచుండినను నామె మనసునకుఁ జల్లఁదన మలవడకుండెను. ఒకనాఁడామె తండ్రితో "ఇఁక నీ ముద్దుల కూఁతుతో నేను వేఁగలేను. అది పెట్టు బాధలను భరింపలేను. ఇంటిలో నన్నో, దానినో యిద్దఱిలో నెవరినో యొకరిని యుంచుకొనుము. రెండవవారి నిల్లు వెడల నడుపుము. నన్నే యుంచుకొనఁ దలఁచితివేని దాని ముఖానకింత పసపురాచి యొక కొత్తగుడ్డఁ గట్టఁబెట్టి యేయయ్యనో తెచ్చి వాని చేతిలోఁ బెట్టి వాని వెంట సాగనంపుము. లేదేని నా ముఖమునకింత మసిపూసికొని నేనే నా యంతటనెందేని పోదును. అంతియకాని యిఁక దాని బాధపడఁ జాలనని చెప్పెను.

ఆ మాటలు విని నా తండ్రి హసితవదనుఁడై "నీకింత తొందర యెందుకు? ఇంత కోపమెందుకు? నీ యిష్టమెటులనో అటులే జరుగఁగలదు." అని ప్రత్యుత్తర మొసంగెను. నా సవతితల్లి మాటలు నాకంత దుఃఖదములు కాలేదు. కాని

యీ మాటలన నా తండ్రి హృదయమున కెంతగాయము కలిగినదో యను దుఃఖము మిక్కుటముగా నయ్యెను. కాని యేమి చేయగలను? నా వశములో నేమియున్నది? ఒక మూలఁబడి యొకగంటసేపేడ్చి దుఃఖమును గొంత చులకన చేసుకొంటిని. నా సవతితల్లి ప్రతినిత్యమును నాపై నేరములు చెప్పిచెప్పి పోరుఁ బెట్టిబెట్టి తుదకు నన్ను శీఘ్రముగఁ బెండ్లిచేసి యావల కనుపుటకు బాధ్యునిఁ గావించినది. నాపెండ్లి నా పదియవ యేటనే సుసంపన్నమైనది. శుల్కమెక్కువ యీయని కారణమున నొక నిర్ధనుఁడు, విద్యావిహీనుడు నాకుఁబతియయ్యెను. వివాహమయిన మఱునాఁడు నాకు నత్తగారింటి కంపకము జరిగినది. పిమ్మటఁ బుట్టింటి దర్శనము నాకుఁ గలుగలేదు. అట్టి భాగ్యము నా నుదుట వ్రాయఁబడియుండలేదు.

"అత్తింటి బలగములోఁ జినమామ, పిన్నత్త, ఆవంక వారగు బావలు మఱఁదులు మొదలగువారు పలువురున్నారు. కాని, నా పతివంక వారు అత్తగారి కంటె వేఱెవ్వరులేరు? నా అత్తయు నా పినమామయు బలవద్విరోధులై యున్నవారు. అభాగ్యవశమున నాకుఁ గర్కశయగు నత్తగారు సంప్రాప్తమైరి. రాత్రింబవళ్లు నన్ను సాధించుటయు నన్ను బాధించుటయు, నాతో జగడమాడుటయు నామెకు నిత్యకృత్యములు. విహితధర్మములు. నా పతి నా యత్తగారిని బోలి యుండలేదు. సాధుపుంగవుఁడు, దయార్ద్ర హృదయుఁడు నా యత్త నన్నెన్ని కష్టములు పెట్టుచున్నను, ఆ కష్టముల నన్నింటిని నాపతియను నయాదరణములు చూపి మరపించుచుండెను. కాని, నన్ను వెంటనిడుకొని నా యత్త నెన్నఁడును బల్లెత్తుమాట ననలేదు. నే నందులకే సంతసించితిని. ఇట్లయిదేఁడ్లు జరిగినది. అనంతరము నా యత్త విషూచిజాడ్యమువలన మృతినొందినది. అంత నా దుఃఖములు కొంత దూర మయ్యెను. హృదయము చల్లఁబడెను. కాని సుఖమన్నది నా భాగ్యములో లేనేలేదు. అత్తగారు చనిపోయిన రెండేండ్లకు భగవంతుఁడు నా భర్తను గొనిపోయెను. అపుడు విపత్పర్వతము విఱిగి నామీదఁ బడెను. నా పతి యౌర్ధ్వదైహిక క్రియలు ముగియుటలేదు. నా పతి గతించిన పదియవ దినమున నా తండ్రి మరణించెనని వార్తవచ్చెను. ఆ సమయమున నాకుఁ బ్రపంచ మంధకార బంధుర మయ్యెను. నన్నేరును అడిగినవారులేరు. ఆర్చినవారులేరు. తీర్చినవారులేరు. నా పినమామ నాయింటివారితో నిదివఱకే వైరమూని యుండెను. అందువలన నాపై నింత విపత్తువచ్చిపడినను, వారేరును నన్నుఁగాదుగదా నా యింటివంకనైనఁ దొంగి చూచినవారు లేరు. అయినను అవసరము నాదగుటవలన నేనే వారి యింటికేగి వారి సాయమును యాచించితిని. కాని వారేరును నా వంకఁ జూడలేదు. నా కష్ట

మునకు సానుభూతిఁ బ్రకటింపలేదు. నా పినమామగారు ఎంత కఠోర హృదయుఁడు. అతఁడు నా భర్తపేరెత్తి, వాఁడు బ్రతికియున్నపుడే వానితోడి సంబంధము తెగఁదెంపులు చేసికొంటిని. ఇఁక వాఁడు చచ్చిన తరువాత వాని పెండ్లాముతో నేమిసంబంధ మని పలికెను. అంత హతబుద్ధినై యింటి కరుగు దెంచితిని. మరునాఁడు వేఁకువజామున యమున వంక కరుగఁజొచ్చితిని. మార్గమధ్య మున నా మతి భ్రమించినయది. వెఱ్ఱియెత్తినదానివలెఁ, బిశాచ మావేశించినదాని వలె నిందందుఁ దిరుగుచుంటిని. ఆ సమయమున నొక గుఱ్ఱపుబగ్గీ నా కెదురు వచ్చుచు నన్నుదగ్గఱిలి నంతనె నిలిచినయది. నేను బగ్గీలోనికిఁ జూచితిని. అందొక యువతి కూర్చుండి యుండెను. ఆమె నన్నుఁ దన చెంతకు రమ్మని పిలిచినయది. కాని నే నామె మాటను వినిపించుకొనక యామె వంకఁ జూడక నా త్రోవన నేను బోఁజొచ్చితిని. కాని. నన్నామె పోనీక బలవంతముగ నశ్వశకటముపైఁ గూర్చుండఁ బెట్టుకొని, నాయెడఁ బ్రేమయు, సానుభూతియుఁ జూపుచు నన్నుఁ దన గృహమునకుఁ గొని చనినయది. నన్నాదరించి తన యింట నునిచికొనినయది. ఆమె ముఖమున నామెపతి యొక గొప్ప జమీందారుఁ డనియుఁ బలుకుబడి గలవాఁ డనియు సమాజ సేవకుఁ డనియు వింటిమి. ఆ యువతి యనాథ యగు నన్నుఁ దన నిజ సోదరినిగ నాదరింపఁ జొచ్చెను. నేనేదయినఁ బనిచేయ నుద్యుక్త నయినప్డోఁ దన మీఁద నొట్టుపెట్టుకొని నన్నా పనినుండి మరలించు చుండును. ఆమెకు సంస్కృతమునఁ జక్కని జ్ఞానము కలదు. శిక్షాగ్రంథములు. ధర్మగ్రంథములు పెక్కులు చదివినయది. రేయింబవళ్లు గీతాపాఠము చేయుచుండును. నాకును సంస్కృతమునఁ బ్రవేశము కలిగించెను. నా పతి నాకు మాతృభాషను జదువు టకును వ్రాయుటకును నేర్పుటయేగాక తులసీరామాయణమును సూరిపదావళి మొదలగు గ్రంథముల యందలి గూఢార్థములను గూడ గ్రహింపఁగల జ్ఞానమలవఱచి యుండెను. దాన సంస్కృత జ్ఞానము త్వరలో నాకు లభించెను. నాకుఁ బాఠముఁ జెప్పుటతోఁ బాటుగ నా యువతి సతీధర్మములు, పాతివ్రత్య మాహాత్మ్యములు, తద్ధర్మములు, విధవా స్త్రీల కర్తవ్యములు, మొదలగునవి యుపదేశించు చుండెను. ఆమె యుపదేశప్రభావమున నాకు ధార్మికచింతనము ప్రబలమయ్యెను. పాతివ్రత్య ధర్మము, తన్మహత్వము, విధవా స్త్రీల కర్తవ్యములు హృదయంగమము లయ్యెను. ఆ యువతి యాశ్రయము నా దుఃఖమును మరపించినయది. విరాగమును మనశ్శాంతినిఁ గలిగించినయది. కాని కష్టానుభవమునకును దుఃఖభోగమునకును భగవంతుఁడు నన్నుఁ బుట్టించి యున్నవాఁడు గనుక నేనా యువతి యాశ్రయమున నిర్విచారముగ

నుండుటఁగని చూపోపక వేఱొక నూతన విపత్తుఁ దెచ్చి విధి నాపై నిడియెను. ఆ సతీమతల్లి యాదరణములోనే కొంతకాలముంటిని. అంత నామె మఱఁది పతి కనిష్ఠ సోదరుని హృదయమునఁ బాపచింతనము పొడసూపసాగెను. ఆతఁడు నాపై వక్రదృష్టిని బఱుపఁదొడంగెను. ఆతని వర్తన మాతల్లి కెఱింగించితి. ఆమె యాతనికి బుద్ధిగఱపుచు మందలించి నన్ను నిశ్చింతగనుండుమని హెచ్చరించెను. కాని, నే నాతని కంటఁబడకుండఁ గడుజాగరూకతతో మెలంగుచుంటిని. ఏమైన నేమి? నా దురదృష్టము నన్ను వెంటాడుచుండెను. నే నొకనాఁ డొక్కర్తనై యొకచోటఁ దదేకధ్యానమున గీతాపాఠ మొనర్చుచుండు సమయమునఁ బిల్లివలెఁ జప్పుడు కాకుండ నాతఁ డరుదెంచి నా చేతిని బట్టుకొనెను. అంత నే నులికిపడిలేచి చేయి విదిలించుకొని కేకలిడుచు నందుండి పరుగిడి యామె చెంతఁ జేరఁబోయితి. నేను కేక లిడఁదొడంగినంతనే యా దుర్వర్తనుఁడు—ఆదుశ్చరితుఁ డందుండి పలాయన మొనర్చె.

ఆనాఁ డాయువతి యా సమయమున నింటిలో నుండలేదు. నగరములోని యొక బంధువుల యింటి శుభకార్యమునందు సహాయోగి యగుట కరిగియుండె. సాయంతన మింటి కరుదెంచెను. ఆ దుశ్చరితుని వర్తనమును సేవకులవలన నాలించి తత్తరమున నా కడ కరుదెంచి జరిగిన వృత్తము నాద్యంతము నెఱింగింపుమని నన్ను నిరోధించెను. ఆమె తీవ్రత చూడ నాదుశ్చరితుని యింటినుండి వెడల ననుపుటకు వెనుదీయనిదిగ నాకుఁ బొడకట్టినయది. ఆతని వర్తన మెఱిఁగించితినేని అట్లు జరుగుటకు సందియములేదు. దాన గృహమునఁ గలఁతలకుఁ గారకురాలనగుదునని తలంచి యామె యాగ్రహ ముపశమించునట్లు తగు సమాధానముఁజెప్పి పనిచితిని. కాని, నా హృదయము దడదడఁ గొట్టుకొనుచునే యుండెను. ఆ దురాత్ముఁ డెప్పుడో యే సమయముననో నన్ను భంగపఱచునని నా యంతరాత్మ బోధించుచున్నది. దాన నిఁక నా సతీత్వము సురక్షితము గానేరదని, దాన సంకటముల పాలగుదునని భయ మెక్కువ కాఁజొచ్చెను. అందువలన నా యుదంతమును సాంతముగ నొకనాఁ డొక కాగితముపై వ్రాసి యా కాగితము నామె పండుకొను పఱుపు తలగడ క్రింద నునిచి, పిమ్మట వా భాగ్యముపై భార మునిచి యా నిశీథమున నేరికిని నెఱుకపడక యుండ నా గృహమునుండి బయటి కరుదెంచితిని.

కాశీపురమున విధవాశ్రమ మొందున్నదని యందు సహాయులగు విధవా స్త్రీల కాశ్రయ మొసంగి వారలకుఁ బలు విధములగు పనులు నేర్పుదురనియు, నందువలన నందలి స్త్రీలు మాన మర్యాదలను గాపాడుకొనుచు స్వతంత్ర జీవనము నెఱపు

కొనుచు సుఖంబున నున్నవారనియు మొదలుగాఁగల యీ విధవాశ్రమ వృత్తాంత మొకప్పుడు మాటల సందర్భమున నాకాశ్రయ మొసంగిన యీ సతీరత్నము నాతోఁ జెప్పినయది. అపుడు నాకడ డెబ్బది రూప్యములున్నయవి. అప్పటి నా యసహాయ పరిస్థితి యందుఁ గాశీ పురమున విధవాశ్రమ మాశ్రయముగఁ జేకొనుట శ్రేయమని తలంచి కాశీపురిఁ జేరుట కుద్యుక్తనైతిని. రైలుస్టేషనున కరుగ నెంచితిని. కాని స్టేషను ఏ వంకనున్నదో యే మార్గమున నరుగవలయునో యెంత దూర మరుగవలయునో యేమియుఁ దెలియదు. ఏరినైన నడిగి తెలిసికొందుమన్నను నా యర్ధమున నేరు కనఁబడుదురు? ఏమియుఁ దోఁచక యిటునటు చూడఁ జొచ్చితిని. అంత దైవ సంయోగమున నా మార్గమున నొక బండి యరుదెంచెను. బండిని సమీపించినంత బండిలో నేరును లేకపోవుటఁగని స్టేషనునకు నన్నుఁ గొనిపోయెదవా? న్యాయమగు బాడుగుఁ దెలుపుము. ఇచ్చెదను. అని బండివానితోఁ బలికితిని. బండివాఁడు చాల మంచివాఁడు. అమ్మా! మీరొక్కరేనా? మీతో నేరును లేరా? ఈ యర్ధరాత్రమున నొంటరిగఁ జనుట మంచిది కాదు. అయినను భయము లేదు. రండు. బండిలోఁ గూర్చుండుఁడు. మిమ్ము స్టేషనునకుఁ జేర్తును. అమ్మా! ఇచ్చటినుండి షేషనునకు బాడుగు రెండు అణాలు. నే నెక్కువ యడుగ లేదు. మీ యిష్టము. మిమ్ము స్టేషనునకుఁ గొనిపోయి టిక్కట్టుఁ గొని తెచ్చి మిమ్ము రైలులోఁ గూర్చుండఁ బెట్టెదను. అని పలికెను. బండివాఁడు అడిగిన అద్దె స్వల్పముగఁ దోఁచినందున మఱి యేమియు బేరమాడక వల్లెయని బండిలో నెక్కి కూర్చుంటిని. బండివాఁడు బండిని స్టేషనునకు నడుపఁజొచ్చెను. దూరమును బట్టి చూడ బండివాఁడు అద్దె తక్కువగనే యడిగినాఁడని తోఁచినది. స్టేషనునకుఁ జేరినపిమ్మట బండివాఁడు నాకు టిక్కట్టును గొని తెచ్చి యిచ్చి నన్ను వెంటఁ బెట్టుకొని పోయి కాశీకి వెళ్లు రైలులోఁ గూర్చుండఁ బెట్టినాఁడు. పిమ్మటఁ గొంత తడవునకు రైలు స్టేషను నుండి బయలుదేరి నడువఁజొచ్చినది. యథా సమయమునకుఁ గాశీ స్టేషనున కరుదెంచి యందు నిలిచినది. నేను రైలుదిగి స్టేషనువదలి బయటి కరుదెంచి విధవాశ్రమ మెందున్నదని యెంత దూరములో నున్నదని యందలివారల నడిగితిని. అందేరును నా మాట వినిపించుకొనువారు లేరు. నా మాటకుఁ బ్రత్యుత్తర మొసంగు వారలును లేరు. అందు సందడి యెక్కుడుగ నుండెను. ఆ సందడి కొంత యడిగిన పిమ్మట క్షేత్ర పురోహితులు (పండాలు) వారివారి గుమాస్తాల వెంట నిడుకొని అయిదారుగురు నా చెంత కరుదెంచిరి. వారు మంచి దుస్తులను ధరించియున్నారు. కాశీ విశ్వేశ్వరుని ప్రత్యక్షావతారములవలెఁ జూపట్టుచున్న

నారు. వారిలో నొకఁడు నా యెదుటికి వచ్చి "మాయీజీ! ఎక్కడికి వెళ్లెదరు? ఎవరింట బసచేయుదురు? విశ్వనాథుని దర్శనము చేయఁదలఁచినయెడ నాతో రండు. ఏమియు నిబ్బందిలేక దర్శనము చేయింతును." అని పలికెను. అంత రెండవ వాఁడు "అన్నదాతా! మీ పూర్వుల లిఖితములు, వ్రాసియిచ్చిన పురోహిత పత్రికలు నాకడ నున్నవి. నేను మీ కుల పురోహితుఁడను. నన్ను విడిచి మఱియొకరి దగ్గఱకు వెళ్లఁగూడదు. అట్లరిగినయెడల మీ పూర్వులఁనవమానించినఁ గాదనిన, దానవగుదువు. దానఁబాపను కలుగును. కాశీపురిలోఁ బుణ్యమార్జింప వచ్చితివి గాని పాపమార్జించుటకుఁ గాదుగదా? కాఁబట్టి నావెంట రమ్ము." అనిపల్కెను. మూఁడవవాఁడు రెండవవానిని వెనుకకుఁ ద్రోయుచు, నా పేరును, నా తండ్రి పేరును, నా తాత పేరును, నడుగఁ జొచ్చెను. నేను నా పేరు చెప్పుటయే తడవుగ నాలవపండా తన చేతనున్న దస్తరము విప్పుచు నా ముఖమువంకఁ జూచుచు, "మాయీ! మీ పూర్వుల చేతివ్రాఁతలు నాకడ నున్నవి. మీవారి నందఱను నే నెఱుఁగుదును. నీ వృద్ధ ప్రపితామహుఁడు మానసింహుఁడు అతని కుమారుఁడు భూపతిసింహుఁడు. నీ ప్రపితామహుఁడు భూపతిసింహుని కొడుకు మాధోసింహుఁడు. నీ పితామహుఁడు, తాత మాధోసింగుకొడుకు నీ తండ్రి రఘువీరసింగు. మాయీ! చూడు నీ తాతతండ్రులు నా కాళ్లు కడిగి పూజించినారు. కాఁబట్టి మా యింటికి రమ్ము. నీకుఁ దోఁచినది కానియో, డబ్బో, యిచ్చిన నియ్యవచ్చును. లేకున్న మానవచ్చును. నీ యిష్టము. నీ కియ్యవలసినదని నిర్బంధమేదియును లేదు. మే మిమ్మని యేమియు బాధింపము." అని చెప్పఁజొచ్చెను.

ఈ విధముగ శవమును గ్రద్దలు, రాబందులు చుట్టుకొన్నట్లు నన్నుఁ బండాలు చుట్టుకొని యిటునటు కదలనీయక నిలువరించిరి. నేను "తండ్రులారా! అన్నలారా! దుఃఖ సముద్రములోఁబడి కొట్టుకొని కొట్టుకొని యిటకు వచ్చితిని. ఇల్లిల్లు తిరిగి బిచ్చమెత్తికొన వలసినదాననైతి. విశ్వనాథుని దర్శనము చేయుటకు రాలేదు. నేను విధవను. దిక్కులేని దానను. కాశీలో విధవాశ్రమ మొండున్నదని విని యందుఁ జేరవచ్చితిని. నన్ను బాధింపకుఁడు. నే నెక్కడకును నెవరి వెంటను రాను" అనిపలికితిని. నా యీ మాటలువిని పండాలలో నిద్దఱుతక్కఁ దక్కినవారందఱును మొగములు చిట్లించుకొని వెడలిపోయిరి. నాకు దుఃఖభోగమే నుదుటనువ్రాయఁబడి యున్నందున నందుల కనువగు సాధన సామగ్రులు, సాయము, సంపదయు, వల వడుచుండును. నన్ను వీడక నా యెదుట నిలిచియున్న పాషండులగు నా యిరువురు పండాలు, కొంత తడవు తమలోఁ దామేమోమాటలాడుకొని యందుండి వెడలి

పోయిరి. నేను విధవాశ్రమమున కరుగనెంచి బండికొఱకు వెదకుచుండ నాయిరు వురలో నొకఁడు బండిని వెంటనిడుకొని మరల నా చెంత కరుదెంచి ' నీ మాటలు వినుటవలన నా గుండె పగిలిపోయినది. నీ యెడ నాకు దయ, జాలి, కలుగుచున్నది. చేతనైనంత సాయము చేయుటకు నామనము తత్తరమొందు చున్నయది. చింతిలకుము. మా యింటికిదగ్గఱనే విధవాశ్రమమున్నది. ఆశ్రమము మేనేజరు నాయందు భక్తిశ్రద్ధలు గలవాఁడు. రమ్ము. నా వెంటరమ్ము. నిన్ను ఆశ్రమాధికారికప్పగింతును. నిన్నతఁడు మిక్కుటమగు గౌరవముతోఁ జూచువాఁడగును. ' అని పలుక నే నరిగిన దండుకొఱకే కదా! దానికనుకూలసాధన మలవడుటవలన నించుక ధైర్యమును బడసితిని. నా కష్టదినములు కడతేఱినవని సంతసిల్లితిని. అతనికి ధన్య వాదము లొసంగుచు నాతఁడు తెచ్చిన బండిలోఁ గూర్చుండి యాతనివెంట నరిగితిని. ఆతఁడు తన యింటికిఁ గొనిపోయి, ' యిపుడు చాల ప్రొద్దుపోయినది. స్నానము చేసి భోజనము సలుపుము. ఇంచుక విశ్రమింపుము. సాయంకాల మాతని కడకుఁ బిలుచుకొని పోయెదను. ఇపుఁడు వెళ్లినను ప్రయోజనములేదు. అతఁ డక్కడ నుండఁడు. ' అని చెప్పెను. అతని యింట కరిగిచూడఁగా సింహద్వారమున నొకవంక భంగునూఱఁ బడుచున్నది. నూఱు నట్టివాని చుట్టును బదుగురు గుండాలు, ముష్కరులు కూర్చుండి యున్నవారు. మఱియొక వంక చిలుము గొట్టమును నొకరి చేతిలోని దానినొకరు చేకొని గంజాయి పొగఁబీల్చుచుండువారు మఱి పదుగురు గనఁబడిరి. ఆ దృశ్యమును జూచినంతనే నాకు మొగమునందు జంకు జనించినది. కాశీ పండాలు భంగుత్రాగుదురనియు, భంగుముద్దను శ్రీ కాశీవిశ్వేశ్వరునకు నైవేద్యము చేయుదురనియు, భైరవునకు గంజాయిపొగ తగలనిచ్చోఁ దలనొప్పి యెత్తుననియు మాయూరిలో ముసలి యవ్వలు చెప్పుచుండుటను వినియున్నదాన నగుటచే భంగుగంజాయి సేవనములు పండాలకు సహజకర్మములని తలంచితిని. వారి వర్తనమునకును వారియునికికి సందియమునుగాని భయమునుగాని పొందక రెండు మూఁడుగంటలేకదా యిందుఁ గడపవలయునని యనుకొని బండిలోనుండి దిగితిని. అంతనాతఁడు నన్నుఁదనయింటిలోనికిఁ గొనిపోయెను. నేనును నామానప్రాణములు ఈశ్వరాధీనము లొనర్చి యింటిలోని కరిగితిని. ఇంటిలో వృద్ధదాసి యొక్కర్తె తప్ప మఱెవరును లేరు. ఇల్లు చూడనయ్యది సత్పురుషులు నివసించు నిలయముగఁ దోఁపలేదు.

ఇంతవఱకుఁ జెప్పి జ్ఞానవతి యొక దీర్ఘనిశ్వాసముం బుచ్చి యా నలుపుర యువతులఁ జూచి " రాత్రి రెండవ యామము ముగియుచున్నది. నావలన మీకు శ్రమ

కలుగుచున్నయది. నా దుఃఖకథను సంక్షేపముగ వినిచి ముగించెదను.” అని పలుకుచు ననంతరవృత్తమును మరల నిట్లు వినిపింప నారంభించెను. “ఆ పండా యింటిలో మూఁడుదినములు మాత్రముంటిని. కాని యా మూఁడుదినములు మూఁడు యుగములువలెఁ గడచినయవి. ఆ మూఁడు దినములలో నాయింట నా కండ్లయెదుట జరుగనిదియు నా క్షేత్రపురోహిత మహాశయుఁ డాచరింపనిదియు నగు నీచకర్మ మెద్దియును గొదువడి యుండలేదు. మద్యమాంసాదులు యథేచ్ఛముగ వినియోగ మున నొప్పుచుండెను. పురోహిత మహాశయుఁడు దినమంతయు సారాయిమత్తువలన నొడ లెఱుంగక పడియుండును. సాయంతన మగునంత వేశ్య యొకతె యాతని సేవకరుదెంచును. పాతిక ముప్పదిమంది లాఠీహస్తమునందు ధరించినవారలు మస్కరులు, గుండాలు, యమకింకరులను తృణీకరించువారు, పురోహితమహాశయుని గుమస్తాలమని చెప్పుకొనుచుండు వా రరుదెంచి యాతనిఁ బరివేష్టింతురు. క్షేత్ర పురోహితులు తమ గుమాస్తాలకు మాసిక వేతనముల నీయరు. ఆ గుమాస్తాలు తెచ్చు యాత్రికుల లొసంగు ద్రవ్యములో సగ పాలొసంగుచుందురు. ఒకప్పుడు ముప్పా తిక పాలు కూడ నొసంగుచుందురు. ఈ గుమాస్తా నామధారులు దుర్బలుఁడును నిఱుపేదయు నగు వేఱొక పురోహితుని యింటికరుగు యాత్రికులను యజమాను లను జతురుపాయములలో నేది యవసరమగు నద్దానిఁ బ్రయోగించి వారలను తమ పోషకుని యింటికిఁ దెచ్చుచుందురు. వారి పురోహితుని వారి దరిఁజేరనీయక తరుమఁ గొట్టుచుందురు. ఒకవేళ నా పురోహితుఁడు, తన యింట కరుదేర నెంచిన యజ మానులఁ దరిఁజేర నుద్యుక్తుఁ డగునేని లాఠీపూజఁ గావింతురు. కపాలమోక్షముఁ గలిగింతురు. ఏవిధముగనైనను యజమానులను దమ యజమానులకడకుఁ గొనితెచ్చు టయే యీ గుమాస్తా నామధారులొనర్చుపని. వారు చదువు సంధ్యలు గలవారు కారు. వ్రాఁత కోఁతలెఱింగిన వారును గారు. చదువు సంధ్యలును వ్రాఁతకోఁతల యవసరము వారికిలేదు. వారికిఁ గావలయునవి కపటము, మోసము, మస్కరము. చదువుకొనినవారు సాత్త్విక ప్రకృతులును, పాపభీతులును నగు వారలను క్షేత్ర పురోహితులు గుమాస్తాలుగఁ జేకొనరు. వారలకుఁ దమ గుమస్తా యేజాతివాఁడై ననుసరే, యెంత దుశ్చరితుఁడైనను సరే, యెంత దుర్వర్తనుఁడైనను సరే, యజమా నులను గొనితెచ్చుటకు సమర్థుఁడగువాఁడు కావలెను. మానావమానముల వంక ధ్యాన మిడకుండు వాఁడు కావలెను. చంపుటకును జచ్చుటకును సిద్ధమగువాఁడు కావలెను. ధనవంతులు దానశూరులును నగు యజమానులు యాత్రకొఱకు నరుదెంచు వారి కొఱకు వారి కడనుండి ద్రవ్యముఁ జేకొనుటకు క్షేత్రపురోహితు లొండొరులు

తలలు పగులఁగొట్టుకొందురు. రక్తప్రవాహము లొనర్చుకొందురు. అంతటితోఁ దనివినొందక కోర్టులెక్కుదురు. పోలీసులకు, న్యాయవాదులకు, న్యాయాధికారులకు స్వర్ణరజితముద్రికలతోఁ బూజలనొనర్తురు. న్యాయాలయములు నేఁతిబీర కాయను, పెరుగుతోటకూరను, బంగారు పిచ్చుకను బోలియున్న వనుటకు సందియము లేదు. అందు న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు విచారింపఁబడవు. పరిగణింపఁబడవు. వాది ప్రతివాదులలో ఫిర్యాది ముద్దాయిలలో నెక్కుడుపూజలు సలుపువారు. ఎక్కుడు మంత్రపుష్పములను సమర్పించువారు విచారింపఁ బడుదురు. పరిగణింపఁబడుదురు. వారు దోషులైనను నిర్దోషులగుదురు. విజయులగుదురు.

పండామహాశయుఁడు నన్నింటిలోనికిఁ గొనిపోయి యాముసలిఁ బిలిచి యామెతోఁ జెవిలో రహస్యముగ నేమిచెప్పెనో నెఱుఁగను. కాని, వారిరువురు నొక్కింత తడవున కారహస్యాలాపమును ముగించి నేవినునట్లుగ నాపండా 'బాయిజీకీ స్నానభోజనములలోనేమియు సదుపాయలోపముకలుగకుండఁ బరికింపుఁ' డని పలుకుచు నందుండి వెడలిపోయెను. ముసలి ప్రొద్దువ్రాలినది. గంగ దూరముగ నున్నది. కాఁబట్టి కుళాయిలోనిదీ గంగాజలమే కనుక గంగాజలములోఁ జేయుమని చెప్పుచుఁ గొళాయి గదిలోనికిఁ గొనిపోయెను. ఆమె చెప్పినది యుక్తియుక్తముగఁ దోఁచినది. కావున నందు స్నానము చేసితిని. స్నానము ముగించునంతలో నాకు భోజనము సిద్ధపఱచి యమర్చిపెట్టినయది. నేనుభోజనము చేయుచుండు సమయముననే కాదు. తక్కిన కాలమందుఁ గూడ నాచెంతఁ గూర్చుండి పురోహితుని యైశ్వర్యమును గూర్చి యాతని గుణసంపదఁ గూర్చి యాకాశవీధులంటు నటుల స్తోత్రపాఠమొనర్ప జొచ్చినది. తరువాతఁ బగలు పండాదర్శన మానాఁడు లభింపలేదు. దీపములు పెట్టిన తరువాత నాతఁడు లోపలి కరుదెంచెను. అతఁడు నా కండ్లకు కగపడినంతనే 'విధవాశ్రమమున కనుపు నేర్పాటు త్వరలోఁ గావించుట మంచి' దని పలికితిని. నా పలుకాలించి యాతఁడు 'ఆశ్రమ మేనేజరు నింటికివెళ్లి యిదిగో వచ్చుచున్నాను. అతఁడింటలేఁడు. ఎచ్చటికో వెళ్లినాఁడు. ఎప్పటికి మరలివచ్చునో తెలియదని యక్కడివారు తెల్పినారు. మరలి వచ్చితిని. రేపు తగిన యేర్పాటు చేసెదను. ఏల యింత త్వరపడుదువు? నా యిల్లు నీ యిల్లు. నేను నీ వాఁడను. ఇందున్నవారు నీ వారు. అని పలుకుచు నందుండి వెడలిపోయెను.

పురోహితునిమాటలు వినినంతనే నాకుఁ దలఁ దిరుగఁజొచ్చెను. గుండెలలో బండ పడినట్లయ్యెను. ఇదేదో ఇంద్రజాలమని తోఁచినది. ఇందేదో మోసమున్నదని

పొడఁగట్టినది. పగలు ముదుసలి వినిచినమాటలవలనఁ గొంత వఱకు దుఃఖ విస్మృతి యలవడినది కాని, పండా పలికిన యవ్యక్తపు టాశాభంగపుఁ బల్కులు వినుటవలన విస్మృత దుఃఖము మరల స్మృతిలోని కరుకాంచినయది. పురోహితుని కడ నునికియు, ఆచారము, విచారము, ఆహారము, విహారము, గుణము మొదలగు వానియందు సత్పురుషోచితమగునది యొక్కటియైనఁ జూపట్టినయెడ వానియింట నిలుచుటకే విచారమును కలిగియుండకపోవును. కాని, యవి యన్నియును వైపరీత్యమును జూపుచుండుటవలన భయశోకములు మఱింత నెక్కుడుగాఁ దొడఁగెను. ఎన్ని కష్టములను లోనగుచున్నను నే శీలమును సురక్షితముగఁ గళంకరహితముగ నునుచు కొనుచున్నదాననో యా శీలమును నిప్పుడు ఈ పాపాత్ముఁడు కళంకితముఁ గావింపనెంచి యాక్రమించినచో నేమిచేయఁగలదాన నను విచారము నా మనమును ముంపఁజొచ్చెను. ఈ విచార సాగరమునఁ బడి కొట్టుకొనుచు దరిఁజేరు నుపాయముఁ బొడఁగానక కొంతవఱ కేడ్చితిని. మరల ధైర్యముఁగొని యుపాయాంతర మరయఁ జొచ్చితిని. నా పరివర్తనమును నామనోవిచారమును నా ముదుసలి గ్రహించెను. నా చెంతకరుదెంచి యా పండాను బట్రాజువలె బహుతరముగఁ బొగడ్త యొనరించుచు "మనప్రభువు ముత్యమువలె మంచివాఁడు. పూర్ణ చంద్రునకు మచ్చగలిగినట్టు ఇద్దరు ముగ్గురు సంగడికాండ్ర సాంగత్యము వలన భంగు త్రాగుడొకటి యాతనికిఁ బ్రాప్తమయినది. ఆనందపురుషుఁ డగుటవలన నప్పుడప్పుడు సానులరావించి వారిచేత నాడించుచుఁ బాడించుచు వారిపాటలను గనివిని యానందమును బొందుచుండును. అంతియ కాని, తక్కిన విషయములలో మన ప్రభు దేవుఁడేనమ్మా! అతని పేరును కీడురారు. అంతియే కాదు. కూతురా! నీవు నాకుఁ గడుపునఁ గన్నబిడ్డవంటిదానవు. నేను నీకుఁ దల్లి వంటిదానను. నేనుండనే యున్నాను. నేనుండ నీకేమిభయము? నిన్ను రేయుంబవళ్లు నా కండ్లరెప్పలలోఁ బెట్టుకొని కాపాడెదను. నా కడుపులోఁ బెట్టు కొని సంరక్షించెదను. నీకింత విచారమేల! భయమేల?" అని బోధించి ధైర్యముఁ గొలుపఁ జొచ్చెను. ఈ విధముగ నా ముదుసలి కల్లబొల్లి మాటలఁ జెప్పుచుఁ గపటప్రేమఁ జూపుచుఁ జప్పిడిమాటలు చెప్పుచు నా విచారమును దూరమొనర్చుచుండెను. తన ధూర్తత్వమును బ్రకటించుచు నన్ను వలలోవైచుకొనెను. ఒకటిరెండు దినములుండుట కేమియభ్యంతరము? ఇంతలోఁ బ్రమాదమెద్దియులేదు. కలుగనేరదు. భయపడవలసిన కార్యమెద్దియుఁ గానరాదు. అని మనమున నిబ్బర ముదయింపఁజేసెను.

అంతఁ గొంత తడవునకు నా పురోహితుఁడు నా కొఱకు, పూరీ, మిఠాయి, పాలు, మీఁగడ మొదలగు స్వాదుపదార్థములు ఒక సేవకుఁడు గొని వెంటరాఁగా

తాను లోనికి నరుదెంచి, బాయీజీ! ఇదిగో చూడుము. నీకిష్టమగుదానిని గడుపునిండఁ దినుము ఏమియు సందేహింపకుము. ఏమియు మొగమోటము నొందకుము. రేపు ఆశ్రమము మేనేజరు దగ్గఱకుఁ గొనిపోయెదను. అని చెప్పెను. అతఁడు తెప్పించినా ముందఱ నిడిన పూరి మిటాయి మొదలగువానినిజూచి "పండాజీ! ఇవన్నియునేల? వీనిని నిరర్థకముగఁ గొని తెచ్చితివి. నే నివి తిను దానను గాను. పప్పు రొట్టె మాత్రమే నాకుఁ జాలును. అంతకు మించిన ఒద్దియును దినను. నేను విధవనుగదా? విధవ లిట్టి పదార్థములను దినరాదు. వీనిని గొని పొండు" అని పలికితిని. నా పలుకులు వినిపించుకొనక యేపండా యందుండి వెడలి వసారాలోని కరిగెను. అందఁతకు ముందునుండియు నా ముదుసలి పండా కొఱకు లేఁచియుండెను. పండా ముదుసలు లిద్దరు నొక రహస్యస్థానమున కరిగి యించుకతడవు గుసగుస లాడుకొనిరి. అనంతరము పండా వెడలిపోయెను. ముదుసలి లోని కరుదెంచెను."

జ్ఞానవతి యా యువకులను బరికించి "యీ కథను వినుచుచు మీకు విసుఁగుఁ బుట్టించు చున్నదాననని యెఱుంగుదును. వర్తమానమున మన ధర్మగురువులు, పీఠాధిపతులు మఠమహంతులు దేవాలయపుధర్మకర్తలు, క్షేత్రపురోహితులు మొదలగు దేవాంశసంభూతు లెంత పతితులుగను, నెంత భ్రష్టచరితులుగను, నొప్పుచున్నవారలో చూడుఁడు. భక్తులను బీడించి చేకొనిన ద్రవ్యమును బాపకర్మములయందు వినియోగ పఱచుచున్నారు. ఆదర్శవర్తనులై లోకులకు సన్మార్గముఁ జూపుటకు మారుగ దుర్వర్తనులై లోకులకు దుర్గతుల నొడఁ గూర్చుచు లోకమున కమితద్రోహ మొనర్చుచున్నవారు. ఇట్టివారివలన దేశమునకును, సమాజమునకును నెంత దుర్దశ సంప్రాప్తమగుచెండెనో చూడుఁడు. ఇఁక నా తరువాతి కథను నాలింపుఁడు. పండా వెడలిపోయిన పిమ్మట ముదుసలి లోని కరుదెంచెను. కొంత తడవు తనలోఁ దానేమో గొణుఁగుకొనెను. అనంతరము నా చెంత కరుదెంచి "సుందరీ! లేచి తిండితినుము. మంచిమంచి వస్తువులు తినుట, మంచిమంచి బట్టలు కట్టుట, మంచిమంచి భోగములు అనుభవించుట, ఇవే నీ రూపమునకు నీ యీడునకుఁ గావలసినవి. ఇవి నీ కయాచితములుగ సంప్రాప్తము లగుచున్నవి. నీ సౌందర్యమును, నీ నిండు జవ్వనమును సార్థకములుగఁ జేసికొనుము. మన ప్రభువు నీపై యెక్కువ మక్కువ పడుచున్నాఁడు. నిన్నుఁ గనురెప్పలలోఁ బెట్టుకొనును. నీ కనుసన్నల మెలంగును. నీ కోరినది తెచ్చియిచ్చును. నిన్నుఁ దనప్రాణములకంటె నెక్కుడుగఁ జూచుకొనును. ఇఁక విధవాశ్రమము అని పలవింపకుము. దానిమాటఁ దలపెట్టకుము. మన ప్రభువుకడ నుండుము. మన ప్రభువుఁ జేపట్టి బ్రతికున్నంతవఱకు సుఖప

డుము. నీ సేవఁజేయ నలుగురు సేవకులు, నలుగురు చాకళ్లు చేతులుకట్టుకొని సిద్ధముగ నున్నారు. మహారాణివలె నుండుము. నిన్నందఱును రాణిని జేయుటకుఁ దొందఱపడుచున్నవారు.” అని పలుకుచు నా మేనఁజేయి నిడఁబోయెను.

ఆ కాలసర్పము పలికినపలుకులు నా చెవులఁ జొరబడినంతనే నామీఁది ప్రాణములు మీఁదనే యెగిరిపోయెను. నా యొడలు కంపమొందఁ జొచ్చెను. ముచ్చెమటలు కారఁజొచ్చెను. ఆ సమయమున నాకుఁ బొడమిన కోపమెంతయని చెప్పుదును. ఆ నల్లత్రాఁచును, ఆ వృద్ధపిశాచమును జంపి నేను జచ్చుట కుద్యుక్తనైతిని. కాని, త్వరపడిన కార్యము చెడుననితలంచి శాంతమూనితిని. ఆ సమయమున నించుకయైనఁ గోపమును జూపితినేని, నేనుండినది గుండాలయునికిపట్టు. దుర్ణయములకు నిలయము. దాన నా మానప్రాణములు దక్కవేఱవని తలంచితిని. అందువలన ముసలిదాని మాటలకు హితాహితములఁ జూపక మాఱుపలుకక యొకటిరెండు పూరీలను నోట వేసికొని వెళ్లి ప్రక్కమీఁద వ్రాలితిని. ముదుసలి తనమాటలు కుత్తరమును, నా మనోవృత్తమును గ్రహింపవలయునను నాశయముతో నా ప్రక్కఁ జేరి, లాలన చేయుచు, లోభముఁజూపుచు, హితముగఁ గఱపుచుఁ, బలువిధములఁ బ్రశ్నించి యడిగినది. కాని నేనులఁకుపలుకులు లేక బెల్లముకొట్టిన ఱాయివలెఁ బడియుంటిని, తుదకామె నా యుత్తరమును బడయనేరక నిరాశయై పండా యున్న యెడ కరిగినది. పిమ్మట నొక్కింతతడవునకు పండా నేనున్నయెడకరుదెంచి “బాయీజీ! నేనీ దినమునవెళ్లి తెలిసికొన్నాను. విధవాశ్రమమెత్తి వేయబడినదని మేనేజరు చెప్పినాఁడట. అందలివారల నందరను బంపినారు. ఇప్పుడేరిని జేర్చుకొనరు. మేనేజరు గ్రామాంతరము వెళ్లినాఁడు. విధవాశ్రమము విషయము నీకేల? అది యెత్తివేసిన నేమాయె? నీకేమి లోపము? నిన్ను నా ప్రాణములకంటె నెక్కుడుగఁ దలంచుచున్నాను. ఏల వ్యర్థముగా నిక్కడకుఁ బోదలంతువు? ఈ నాయింటిని నీ నాయాస్తిని నీ కొసంగుచున్నాను. చేకొనుము. నన్నుఁజేపట్టుము. నేను నీకు జీతమీయనక్కఱలేని సేవకుఁడనై యుందును. ప్రాణములనైన నర్పించుటకు సిద్ధముగ నున్నాఁడను. నామాట వినుము. నన్ను దయఁజూడుము. నన్ను సుఖపెట్టుము. నీవు సుఖపడుము” అని పలికెను.

ముసలిదాని మాటలు వినినంతనే ధైర్యముఁ జేకొంటిని. మనస్సునకు స్థైర్యమొడఁగూర్చితిని. పండాబారిఁ బడకయుండుట కుపాయమును గ్రహించితిని. ఆతని మాటల కొడఁబడు దానివలె నటించుచు సతీత్వమును గళంకితముగాక యుండినట్లు జాగరూకతతో మెలంగుచు నేవిధముగనైన నా యింటినుండి బయటఁబడుటకు గృత

నిశ్చయనైతిని. పండా వచించిన హితవచనముల నాలించి, యిసుమంతయు వైకల్యమునుగాని, క్రోధమునుగాని ప్రకటింపక యాతనితో ' మీరు ధర్మగురువులు. తీర్థపురోహితులు. యాత్రికులను సద్గతికులఁగ జేయువారలు. ధర్మచ్యుతులకు సదుపదేశముల నొసంగుచు వారలను ధర్మరతులుగఁ జేయుచు ధర్మరక్షణ మొనర్చుటయే మీ కర్తవ్యము. విధవలను దుర్వ్యాసనలనుండి విదళించి వారలకు భగవద్భక్తిఁ బురికొల్పి, భగవదధీనలగఁ జేయుటయ మీవిధి. అట్టిచో మీరలీవిధముగ మీ పాలఁ బడిన యొక యసహాయశరణ్యయనాథ యువతిని, సచ్చరిత్రను, సదాచారిణిని, నరకకూపమునఁ గూలద్రోయనెంచుట యేటి ధర్మము! ఎక్కడి న్యాయ్యము?' అని సవినయముగఁ బలికితిని.

నా మాటలు విని పండా వెడనగవునగుచు " ఇప్పటి కాలములో ధర్మకర్మములడుగంటినవి. ఎక్కడను నేరియందును జూపట్టవు. ఇది కలియుగము. హితమయిన పదార్థమెద్దియయినను, నభక్ష్యాభక్ష్యవిచారణమును జేగొనక భక్షణము చేయుటయు, ఇష్టమయిన వస్త్రమును ధరించుటయు, ఇంద్రియతృప్తి నలవఱచుకొనుటయు, నగునవి కలి ధర్మములు. కాయమును గష్టపెట్టుటయు, నింద్రియ ప్రవృత్తుల నణంచుటయు ననునవి యధర్మములు. తదాచరణములు పాపకర్మములు. తత్ఫలితములు నరకయాతనలు. శరీరమును సుఖపెట్టుటయు, నింద్రియములకుఁ దృప్తినలవఱచుటయు, సద్ధర్మములు. తల్లభ్యములు స్వర్గభోగములు. మానవజన్మ మెత్తి నందులకు యౌవనము ప్రాప్తమయినందులకుఁ దదనుగుణముగ, నిష్టోపభోగముల ననుభవించుటయేగదా సార్థకము. కాఁబట్టి నామాట వినుము. నన్నుఁజేపట్టుము." అని యున్మత్తచిత్తుఁడై యింకను నేమేమియో వదఱుచుండెను. కాని, యాతని ప్రల్లదములు సాంతములు కాకుండఁగనే యా సమయమున "పండాజీ మహారాజా! యజమానులు వచ్చియున్నారు. ద్వారముకడ వేచియున్నారు. మీ కొఱకెదురుచూచుచున్నారు. త్వరగ దయచేయుఁడు" అనువాక్కు లాతని చెవులఁ బడినయవి. అంత నాతఁడింటిలోనుండి బైటికరిగెను. మరల నాతఁడు నా కడకు రాలేదు. నేనారాత్రియందిలు వదలి పోవుటకు నిశ్చయము చేసికొంటిని. పండా యటనుండి వెడలిపోయినను నామనస్సునందలి యాందోళనము తగ్గలేదు. నా కంటికి నిదురరాదు. ఇంటిలోని వారందఱు నిద్రించిన పిమ్మట వారెఱుంగకయే నెమ్మదిగ బయటపడవలయు నను నాశ నాకుఁ బ్రబలమయ్యెను. అందువలన నందుండి లేచి యావల కరుదెంచితి. వీధి ద్వారమునకుఁ బ్రక్కగ నించుక దూరమున నున్నయొక గదిలోనుండి పాటయు మద్దెల వాద్యమును విననయ్యెను. నిశ్శబ్దమును బ్రతీక్షించుచుండు నాకీపాటయు నీ వాద్యమును

జెవులఁబడినంతనే కుప్పఁగూలఁ బడినట్టు కూలఁబడితిని. కొంతదడవునకు ధైర్యముఁ దెచ్చుకొని యా పాటగది దరికరిగి లోనికిఁ దొంగిచూచితి. లోన పండా మహాశయుఁడును అతని గుండా గుమాస్తాలును సభదీర్చి కూర్చుండి యుండిరి. వారియెదుట సానిమేళము జరుగుచుండెను. వారందఱును సానులను నిర్నిమేషులై వీక్షించుచుండిరి. వారి పాటను దన్మయులై యాలించుచుండిరి. ఈ తీర్థపురోహితుని యా యనుచితవ్యాపారముఁ జూచినంతనే నామనంబున తీర్థపురోహితుఁడని పరిగణించిగదా యీతనిని హైందవసమాజము ఆదర గౌరవములతో భక్తిప్రపత్తులతోఁ జూచుచుండును. ఈతని పాదములను గడుగు చుండెను. ఈతనిఁ జూచుచుండెను. కోరిన దాన దక్షిణల నొసంగి తనియించు చుండెను. ఈతఁ డన్నినో తీర్థపురోహిత వృత్తివలన సంప్రాప్తమగు ధనమును వేశ్యా గమనమునందును, మద్యసేవనమునందును, ద్యూతమందును, నధికారుల పాదములకుఁ గట్నములకును వినియోగ పరచుచుండెను. ఇట్టి దురాచార దుర్వర్తనుఁడగు తీర్థ గురునకు దానమొసంగు దాతల కలవడునది దుర్గతియా లేక సద్గతియా యను సందియము నా మనమును బీడింపఁ జొచ్చెను. కాని యా సందియమింతట నివార ణము కానేరదని తోచినందున నద్దానిఁ బోద్రోచితిని.

కొంత తడవునకు వేశ్యల యాటపాటలు ఆ సభికుల హృదయ చోరకము లయ్యెను. సమ్మోహనాస్త్రములయ్యెను. అందఱును వేశ్యాధ్యాన నిమగ్నులై తదేక దృష్టులై యొడలుమఱచి తన్మయులై యుండిరి. నే నదే తగిన యదనని తలంచి సడిచప్పుడు కాకయే తలుపును దగ్గఱఁజేర్చి దారిఁబట్టి కొంత దూరమరిగితిని. అంత భయము జనించినది. ముందున కడుగిడుటకు ధైర్యము కలుగ దయ్యెను. అర్థ రాత్రి సమయము. ఎటుచూచినను భయానకమగు ఘోరాంధకారముతప్ప వేఱొండు కానరా దయ్యెను. చీమచిటుక్కు-మనిన నొడలు కంపిలఁ జొచ్చెను. గుండెలు కొట్టుకొనఁజొచ్చెను. ఆ సమయమున నా కమిత దుఃఖమువచ్చినది. నన్నుఁ బుట్టిం చిన భగవంతునిమీఁద నమిత క్రోధము వచ్చినది. అంత హా! భగవంతుఁడా! నన్ను బ్రతికియున్నంత కాలము కష్టముల పాలుచేయుటకే తలంచియున్న వాఁడవా? నన్నం దులకే పుట్టించినాఁడవా? నే పుట్టినంతనే నా తల్లిని గొనిపోయితివి. పెండ్లి అయినం తనే భర్తనెత్తుకొని పోయితివి. ప్రాణములు పోఁగొట్టుకొనఁనెంచి గంగలోఁ బడుట కరుగుచుండ నట్లు కాకుండ విఘ్నమాపాదించితివి. ఇంతచేసియు నీ ప్రపంచములో నిలుచుటకు మూఁడడుగుల స్థలమును దినుటకుఁ బట్టెడన్నమును, నలవడకుండఁ జేయుచున్న వాఁడవు. నాకేదిదిక్కు-? నేనెందు బోదును? ఎందుఁ జొత్తును? అని

పరిపరి విధముల నేడ్చితిని. కాని, భగవంతుఁడు నిర్దయుఁడు. కఠినచిత్తుఁడు నా యేడ్పును వినఁడయ్యెను. ఆశ్వాసించువారును నా సమయమున నెవరును లేరు. నా యేడ్పు తనంతకుఁ దానే చల్లారినది.

విపన్నులకు ధైర్యసాహసములు గదా సహాయము చేయునవి. వాని తోడ్పాటును గ్రహించి రైలుస్టేషనున కరుగు మార్గమును ద్రొక్కితిని. పండా యిల్లువదలునపుడే నా మేనమామ జగపాలసింగు అలహాబాదులో వాసము చేయు చున్నాఁడు. అతని పంచఁజేరిన నా దుఃఖజీవనములో నొక్కింత భాగమును గడ తేర్చుకొనవచ్చునని తలంచి యుండవని, ఆ యర్ధరాత్రమునఁ బలుకష్టములకుఁ బాలై తుదకెట్లో స్టేషనుచేరితిని. అలహాబాదున కరుగు రైలుబండి ప్లాటుఫారమున నిలిచి యున్నదని తెలిసికొంటిని. వెంటనే టిక్కెట్టునుగొని రైలుబండిలోఁ గూర్చుంటిని. కొంత తడవునకు రైలుబండి కదలినది. యథాసమయమునకు అలహాబాదు స్టేషనున కరుదెంచెను. అంత నేను బండినుండిదిగి స్టేషనుదాఁటి బయటి కరుదెంచితిని. అంత నాయెదుట నా మేనమామ యిలుచేరు విషయమును గూర్చిన కఠినప్రశ్న ముపస్థితమయ్యెను. అద్దానిని సమర్థించుట కుపాయ మెద్దియును దోఁపదయ్యెను. నా చిన్నతనములో రెండుమూఁడు పర్యాయములు మేనమామ యింటికరిగియుంటిని గాని, యపుడాతని యింటికరుగు మార్గమును గుర్తింపఁజాలకయుంటిని. అతఁడు నివసించు వీధినిసయితము తెలియఁజాలక యుంటిని. ఈ పెద్దపట్టణములో జగపాల సింగు పేరా ప్రతిష్టా? ఎవరెఱుఁగఁ గలరు? అతఁ డెందున్నదియు నెవరు చెప్పఁ గలరు? ఎవరినడిగినను నెవరును మే మెఱుగము మే మెఱుఁగమని చెప్పువారేగాని యొక్కరైనను మే మెరుగుదు మనువారు కానరారైరి. అంతస్టేషనువీధి యొక్కింత దూర మరిగి యందునిలిచి 'యేమి చేయుదును? ఎందుఁబోదును?" అని తలపోయు చుంటిని. ఆ సమయమున నీ పాపాత్ముఁడు నాచెంత కరుదెంచి నా యుదంతమును గూర్చి ప్రశ్నించెను. నాకురు జగపాలసింగు నా మేనమామయనియు, నాతని యింటి కరుదెంచి యున్నదాననియు బ్రత్యుత్తర మిచ్చితి. నా మాట వినినంతనే "జగ పాలసింగా? నే నెఱుఁగుదును. అతఁడు నేను నొక్కవీధిలోనే యున్నారము. అతని యిల్లు మాయింటి దగ్గఱనే యున్నది. నా వెంటరమ్మ, నిన్ను సుఖముగా నిలుచేర్చెదను." అని పలికెను. చూచుటకు యోగ్యుఁడుగఁ గనఁబడుచున్నాఁడు. ఖద్దరుబట్టలు కట్టియున్నాఁడు. మంచి సాయము లభించినదని తలంచి యాతని వెంటఁ జనుటకు సిద్ధపడితిని. అపుడీతఁడు నన్ను సోదరీ యని పిలుచుచు దేనె లొలుకు మాటలాడుచు సచ్చరితుఁడని దయార్ద్ర హృదయుఁడని యనుకొను నంత

విశ్వాసమును గలిగించుచు మెలంగినవాఁడు. కావునఁ దేనెపూసిన కత్తియనియు విషపూరితమగు పయోముఖకుంభమనియుఁ దలంపఁ జాలకపోయితిని. హృదయమున నింతటి దుర్వ్యాచారమును బూనినవాఁడని యెఱుంగలేకపోయితిని. ఈతనిని నేనును సోదరాయని పిలువఁజొచ్చితి. అంత ససంభ్రమమున గుఱ్ఱపుబండి నొకదానిని వెంట నిడుకొనివచ్చి యందుఁ గూర్చుండు మనియె. సిద్ధముగ నున్నదాన నగుటచే వెంటనే బండిదగ్గఱ కరిగి యందుఁ గాలిడితిని. ఏలకో కాయ మంతటఁ గంపింపఁ జొచ్చినది మనసు దిగులుపొందఁ దొడఁగెను. బండిలో నునిచిన కాలు తీసి దిగువఁ బెట్టితి బండిలోఁ గూర్చుండరాదని యనుకొంటిని. నా పరిస్థితిని గాంచి యీ దుశ్చరిత్రుఁడు "సోదరీ! ఏల సంశయించుచు వెనుకంజ వేయుచున్నదానవు. ఏల భయపడుచున్నదానవు. సందియముగాని భయమునుగాని పొందవలదు. నీవు నాకు ధర్మసోదరివి. నన్ను సోదరునిగఁ దలంపుము. నా వలన నీ కెవ్విధమయిన యనిష్టమును గలుగనేరదు. చింతిలకుము. నీ మేనమామ యింటికి నిన్ను సుఖముగఁ జేర్చెదను." అని మరలఁ బలుకసాగెను. ఈ మాటలన్నియు విన్న పిమ్మటనైనను నా సందియము నా మనసునందలి దిగులు నన్ను వీడినవి కావు. అంతఃకరణము యొక్క శక్తి యనుపమానమైనదిగదా? అంతఃకరణమునకు యుక్తాయుక్తములు ప్రత్యక్షములు. అయినను నపుడేమి చేయఁగలను? ఏమి చేయుదును? వివశను. తుదకు బండిలోఁ గూర్చుంటిని.

అపుడు రాత్రి యెనిమిది తొమ్మిది గంటలు కావచ్చినది. గుఱ్ఱపుబండి కొంత దూరము నగరములో జనసమ్మర్దమగు మార్గమున నడిచి యటుపిమ్మట నగరమును వీడి జనశూన్యమగు మార్గమును బట్టెను. అది చూచి యిదియేమి? ఈ మార్గమున బెట్టుచున్నావు. మా మామ యిల్లు పట్టణములోఁ గదా యున్నది. ఆ త్రోవనువిడిచి యీ త్రోవను నెక్కడికిఁ దీసికొని పోవుచున్నావని యడిగితిని. "ఆ త్రోవ కట్టి వేయఁబడినది. దానిని బాగుచేయుచున్నారు. బండ్లామార్గమున నడువనిచ్చుటలేదు. పట్టణములోని కరుగుటకుఁ జుట్టుతిరిగి వెళ్లవలయును. కాఁబట్టి యీ త్రోవను బట్టవలసి వచ్చినది" అని సమాధానము చెప్పెను. ఈ సమాధానము విశ్వాసము గొల్పుటలేదు. కాని ఖండింపలేకపోయినాను. ఆ విధముగ నాబండి కొంతవఱకే మనుజసంచారములేని మార్గమున ననుసరించి యీ నిర్జనస్థానమున కరుదెంచి నిలిచినది. బండివాఁడు నొగలనుండి దిగివచ్చి బండితలుపును తెరచి నన్ను దిగుమనియెను. నేను బండినుండి దిగితిని. అపుడు నాకుఁ గలిగిన భయమెంతని చెప్పుదును? మిన్నువిఱిగి మీఁదఁబడినట్టు లయ్యెను. "సోదరా! ఇందు దింపుచున్నావు. ఇది మహారణ్యము ఇండ్లిల్లులేదు. వాకిలిలేదు. ఎటుచూచినను ఘోరారణ్యము కానవచ్చుచున్నది. మనుష్య

సంచారము గలిగిన దానివలెఁ గానరాదు. ఇందు ద్రోహమెద్దియును లేదుగదా” యని యీ నరాధముని నడిగితిని. ఈతఁడు నా మాటలు వినుపించుకొనక బండివానికి బండి బాడుగనొసంగి వానిఁ బాఱఁద్రోలెను. నేను బండివానిని జేట నిలునిలుమని మొఱపెట్టితిని; కాని యీ నీచుఁడు వాని కిదివఱకే పాఠముఁ గఱపియుండెను గాఁబోలు. నేనెంత మొఱపెట్టినను సరకుసేయక వెనుదిరుగక గుఱ్ఱములను బర్వెత్తించెను. గుఱ్ఱపుబండి వెడలిపోయిన పిమ్మట నీకుత్సితుఁడు తన కుత్సిత విచారమును బ్రకటించెను. అనునయ వినయములను జూపెను. భయముఁగొలిపెను. కాని నేను లోనగుట లేదు. తుదకెంతకును నేవిధముగను లోఁబడకుండుటఁ జూచి క్రోధోన్మత్తుఁడై బలాత్కారముఁజూప నుంకించెను. అంత నా హృదయము వికలమయ్యెను. స్మృతి తప్పెను. నేల కొరగితిని. స్మృతి కలిగి చూచునంతలో మీరు నలుగురును గనులఁబడితిరి.”

జ్ఞానవతియొక్క దుఃఖచరితమును నాలించి యానలుగురు యువకులును శోకాకుల చిత్తులైరి. ఆ యవినీతిపరుని క్రోధారుణిత నేత్రులైరి. అందొకఁడు తన క్రోధమును నణఁచుకొనఁజాలక యవనత వదనుఁడై చెంత నిలిచియున్న యా యపరాధిని బోరగిలఁబడి నేల ముద్దిడుకొను నటుల వెన్నువిరుగునటుల నొక గ్రుద్దు గ్రుద్దెను. అదిచూచి వారిలో మఱి యొకఁడు ఆ గ్రుద్దినవానిని వెనుకకుఁద్రోచి “ఇది నీకుఁ దగదు. ఇట్లు కొట్టుట యుచితమైన పనిగాదు. ఈ యువకుఁడు కులీనుఁడుగను, సభ్యుడుగను, గౌరవనీయుఁడుగను, గనఁడుచున్నవాఁడు. కాఁబట్టి నాలుగుచీవాట్లు పెట్టి బుద్ధిగఱపి విడిచిపుచ్చుటయె చాలును. అదియె యీతనికిఁ దగినశిక్ష. గౌరవముగల వారి కంతకంటె వేఱుశిక్షయెద్ది? వారి కింతకంటె నవమానకరమగు శిక్ష వేఱొకటిలేదు. ఈ శిక్షవలన నీతఁడిక ముందిట్టి దుర్వర్తనము నెన్నఁడును బూనఁజాలఁడని తలంచెదనని పలుకుచు నాతనిని మందలించెను.

జ్ఞానవతీ మానరక్షణమున కరుదెంచిన యా నలుగురు యువకులును, ఆనందస్వరూపుఁడు, ప్రసిద్ధనారాయణుఁడు, చాంద నారాయణుఁడు, వినయకుమారుఁడును ఈ నలుగురును నారాత్రి యా యుద్యానమున వేఱొక నికుంజములో నుపవిష్టులై యానందప్రసిద్ధుల వివాహవిషయక వాదోపవాదముల నొప్పుచుండు తఱి యాయింతి యార్తనాదము వీరి చెవులఁబడెను. అంత నలుగురును మానవతీ మానసంరక్షణోత్సుకులై పరుగు పరుగున నరుదెంచి యందుఁ గృతకృత్యతఁ బడయఁగలిగినవారైరి.

జ్ఞానవతియొక్క యాత్మకథనము నాలించి, యా నలువురునందు సవతితల్లి సవతి బిడ్డల యెడల వహించు ద్వేషభావమును, అత్తకోఁడలునందుఁ జూపు నిష్ఠు

లతయు, వైధవ్యమును జెందిన యువతు లనుభవించు కష్టములును, వారి శీలాపహరణమునకు కగు యాక్రమణములును, దదాక్రమణములనుండి వెలువడుటకు వారు పడు పాట్లును, క్షేత్రపురోహితుల దురాచార దుర్వర్తనములును నవినీతివర్తనులగు కులీనయువకుల వాసనాతృప్తి నభిలషించి యబలలను గుచక్రములను లోను గావించు విధమును యథార్థరూపమునఁ జిత్రితములై యున్నవని తమలోఁ దామనుకొనిరి.

జ్ఞానవతిని రైలుస్టేషనుకడనుండి మాయోపాయమునఁ గొనితెచ్చి యందు బలాత్కరింప నెంచిన యువకుఁడు పాటలీపుత్రవాసుఁడును శైలకుమారి కను రక్తుఁడగు హర్షదేవుని సహచరుఁడును నగు భోపతులాలు. వీని చరితము హర్షదేవుఁడు బహుతరముగఁ బ్రశంసించి యుండెను. అతఁడు కార్యాంతరమున నలహాబాదున కరుదెంచియున్నాఁడు.

భోపతులాలున కింతవఱకుఁ బ్రాణములు కుదుటఁ బడుటలేదు. పోలీసుఠాణాలోని కప్పగింతు రని యాతని విశ్వాసము. దాన గౌరవభంగమును, కష్టానుభవమును, దుఃఖ భోగమును నవశ్యప్రాప్తములని పరితపించుచుండెను. కాని యానందుఁడు పలికిన "నాలుగు చీవాట్లుపెట్టి బుద్ధిగఱపి విడిచిపుచ్చుటయే చాలును" అనుపలుకులు వినినంతనే యాతని పరితాపము దూరగతమయ్యెను. తన వర్తనము గర్హితమైనదిగ గ్రహించెను. కుమార్గమున నిఁకముందెన్నఁడును నడుగిడరాదని నిశ్చయించెను. ఆనందునియెడ భక్తిప్రపత్తులుపొడమిన వాఁడయ్యెను. దాన స్థిరమనస్కుఁడయ్యెను. అంత నాతఁడానంద పరవశుఁడై యానందుని పదవనజముల వ్రాలి తన పాపము పాపకర్మమును క్షమింపుఁడని యాతనిఁ బలు విధములఁ బ్రార్థించెను. ఇఁక ముందెన్నఁడును నిట్టి దుష్కార్యమును నాచరించు వాఁడను గానని పలు విధములఁ బాసచేసి పలికెను.

ఆనందుఁడు భోపతుని యీ పరితాపమును బరివర్తనమును గని యానందభరితుఁడయ్యెను. పాదములపై వ్రాలియున్న భోపతుని లేవనెత్తి "నేను క్షమించుటకు నీవు నాకేమియు నపరాధము సలిపియుండలేదు. జ్ఞానవతిని జూపుచు "నీ వీదేవి కపరాధమొనర్చితివి. ఈమె కపరాధివైతివి. కాఁబట్టి నీ యపరాధమునకు క్షమాప్రదాన మొసంగుట కీదేవియే యధికారిణి కాని మఱియొకరు గారు. క్షమాప్రదాన మాశించువాఁడ వగుదువేని యీ దేవిని బ్రార్థింపు"మని యాతనితో ననెను. ఆనందుని మాటలు చెవులఁ బడుటయే తడవుగ భోపతుని హృదయమున నుదయమైన గ్లాని దుర్భరమును దుస్సహమును నైనందున ఖిన్నవదనుఁడును నశ్రుపూరితనయనుఁడును నయ్యెను, ఆతఁడు మఱుమాట పలుకక జ్ఞానవతి పదపద్మముల

కడ వ్రాలి "తల్లీ! నీ యీ పవిత్ర పదపద్మములకు నాయపవిత్ర శరీర సంస్పర్శన మును గలిగించుటకు నామనము భయమొందుచున్నది. నీవు సామాన్య యువతివి కావు. ప్రత్యక్ష పరదేవివి. నీ యొసంగు దండనమునకుఁ బ్రతీక్షించుచున్నాను. కరుణించి యుచిత దండనమును, క్షమాప్రదానమును నొసంగుదువయేని నేను యథార్థ ప్రాయశ్చిత్తమును పాపశాంతియును బొందినవాఁడ నగుదు" నని యామెను బ్రార్థించెను.

జ్ఞానవతి హృదయము సహజముగ సరళము. దయార్ద్రము. అందువలన భూపతిని పశ్చాత్తప్త సూచకములగు వాక్యముల నాలించినంతనె కరుణాంతరం గయై "సోదరా! నీవు యథార్థముగ భగవత్సాక్షికముగ నీ హృదయమును దుర్వాసనలఁ బోఁద్రోలి, దుశ్చింతల విడనాడి, నిష్కల్మషమగు దానిగఁ గావించుకొని, నిర్మలాంతఃకరణముతో నీ యొనర్చిన పాపకర్మముల క్షమింపుమని, మరల నట్టి కృత్యములయందెన్నఁడును మనము పోకుండునటుల వరమిమ్మని పరమేశ్వరునిఁ బ్రార్థించువాఁడ వగుదువో అపుడు పరమేశ్వరుఁ డవశ్యము నీకు క్షమాదాన మొసఁగును. అపుడు నీ హృదయమునకు స్థిరమైన శాంతమును నీకు నిజమయిన యానందమును జేకూఱఁగలవు. దాన నీకు శ్రేయమొనఁగూడును." అని బదులు చెప్పెను. అప్పటి దృశ్యమత్యంతము హృదయగ్రాహకమయినదయ్యెను. చూపరుల హృదయములను స్వర్గీయ భావ సామ్రాజ్యచ్ఛాదితులుగఁ గావించెను. కొన్ని నిముసములకు ముందుఁ బాపభూయిష్టముగ నున్న నికుంజ మధ్యమిపుడు పుణ్యో పేతమై విరాజిలఁ జొచ్చినయది. ఈ విచిత్రపరివర్తనమున కెల్లరును ముగ్ధహృదయు లైరి. భూపతులాలు వారలనందఱను క్షమింపుఁడని వేఁడుకొనెను. సద్హృదయుఁ డగు నానందుఁడు "నిజముగ నీ కర్తృకమునకుఁ బశ్చాత్తప్తుఁడ వగుచు నిఁకముం దెన్నఁడును నిట్టి కుమార్గమున నడుగడక యుండు వాఁడ నగుదునని నీవు పలికిన ప్రతిజ్ఞావచనము నిర్మలాంతఃకరణముతోడనే పలికినది యగునేని నీవు నిర్భయముగ నిర్విచారముగ నరుగనగును. నీ యపరాధము క్షంతవ్యము. కాని మరల నెన్నఁడైన నిట్టి రాక్షస కృత్యమునకుఁ గడంగువాఁడ వగుదువేని నిశ్చయముగ నిపత్పాతమునకు లోనగువాఁడ వగుటయే కాదు ప్రాణములఁగూడఁ గోలుపోవు వాఁడవగుదువు. అని మనమున నిడుకొనుము" అని హిత మొసంగెను. భూపతు లాలానందుని హితముఁ జేకొని అశ్రునయనుఁడై రుద్ధకంఠుఁడై ప్రణతు లర్పించి తనదారిని వెడలిపోయెను.

భూపతు చనిన యనంతర మానందుఁడు తన ముప్వుర సుహృదుల మంతన మును జేకొని జ్ఞానవతితో "సోదరీ! నీకష్టములు గట్టెక్కినవని తలంపుము. నీదుఃఖ

దినము లంకమొందెనని నమ్ముము. నీకు మేము నలువురమును సోదరులమని విశ్వసింపుము. ఇఁకముందు నీకేవిధమయిన కష్టమును లోపమును గలుగనేరదని తలంపుము. నీ ధర్మమునకును సతీత్వమునకును బాధక మసంభవమని నిశ్చయింపుము. (చాందనారాయణుని వ్రేలిడి చూపుచు) ఈతఁడు నా ప్రియమిత్రుఁడు చాందనారాయణుఁడు. ఈతని యర్ధాంగి కాత్యాయనీదేవి. వీరు దంపతులిరువురును ప్రత్యక్ష లక్ష్మీనారాయణులు. పార్వతీపరమేశ్వరులు. వీరి గుణగణములను నేను విశదముగ వినిపింపఁజాలను. కాలక్రమమున నీయంతట నీవే యెఱుఁగఁగలవు. నీవు వీరియండ నుండుము. దాననీకు శ్రేయమొనఁగూడును. నాయింట నివసించుచు నా యింటిని పావనముగ దానినిగఁ జేయనగును గాని, వీరి యండ నుండుట వలన లభ్యము కాఁదగిన ఆనందమయమును ఆదర్శప్రాయమును నగు జీవనము నాయింట లభ్యము కాఁజాలదు. వీరు నిన్నుఁ బ్రాణపదముగఁ గాపాడుదురు. వీరివలన నీకు సుశిక్షయుల బడఁగలదు. నిన్ను సోదర తుల్యముగ మాతృసమానముగ నాదరింతురు. వీరికంటె నతిశక్తులగు నాప్తులు, బంధువులు నీకీ ప్రపంచములో మఱొకరు లభింపనేరరని నా నిశ్చయము.” అని పలికెను.

ఆనందుఁడు పలికిన మాటల నాలించి, జ్ఞానవతి వినమ్రవదనయై కన్నుల నీరు గార్చుచు డగ్గుత్తికతో “భగవత్కృపవలన మిమ్ముఁ గంటిని. మీ శరణ్యముఁ బడసితిని. మీ సంరక్షణమున నుండఁగోరితిని. నా మేనమామ సంరక్షణమున నుండదల చెంచితిని కాని, నా మేనయత్త స్వభావము మంచిది కాదు. ఒరులను జూచి యోర్వలేదు. స్వలాభపరాయణ. అయినను అంతకంటె వేఱు శరణ్యము కానరానందున నామె పెట్టు కష్టముల ననుభవించుచు, నామె యాడుమాటలను, సహించుచు నామె పజ్జఁజేరి తల దాచుకొననెంచి వచ్చితిని. ఇంతట నా భాగ్యము పండినది. నా సుకృతము ఫలించినది. నా కష్టములు గట్టెక్కినవి. మీ శరణ్యము లభ్యమైనది. నేనా కాత్యాయనీ మహాదేవి చరణ సన్నిధిని నిలుచుటకు నీడను బడయఁగల దాన నగుదునేని నా జీవనము ధన్య జీవనమగును. నేను మానవజన్మమెత్తినందులకు సార్థక్యమును గనిన దాన నగుదును. నా మామ యింట నా బ్రదుకు దుర్భరమైనదగును. కాఁబట్టి (చాందుని నుద్దేశించి) సోదరా! మీ రక్షణమునందు నా బ్రదుకు నిరుపద్రవమైనదగునని నాయంతఃకరణము బోధించు చున్నయది. కాఁబట్టి మీయండ నుండనెంచితిని” అని పలికెను. ఆ మాటలువిని చాందనారాయణుఁడు పరమానంద భరితుఁడై “పరమ సంతోషము. నా గృహము పావనమగును. సోదరీ! మా యింటిని మీ యింటినిగఁ దలంపుము. నీ యిచ్చవచ్చినట్లుండవచ్చును. మీ

కభ్యంతర మెద్దియును లేదు. మీకేకష్టమును గలుగనేరదు." అని పలికెను. చాందుని పలుకుల నెల్లరును సమర్థనము గావించిరి. జ్ఞానపతిని వెంట నిడుకొని చాందనారాయణుఁడు తన గృహమున కరిగెను. తక్కిన ముప్పురును తమతమ నిలయముల కరిగిరి.

## పంద్రెండవ ప్రకరణము

ఏప్రిలు పదుమూఁడవ తేదిన జలియనువాలా బాగునందు హత్యాకాండము ప్రవర్తిల్లినయది. నేఁడు ఏప్రిలునెల పదుమూఁడవతేది. అందువలనఁ దచ్చిహ్నముగ నగరమునందలి కాంగ్రెసు కమిటీ (జాతీయవాదపక్షము) వారు "ఈదినమున నగర వాసులు ప్రాతఃకాలము గంగాస్నానమును, నీశ్వరారాధనమును, సలుపవలయును. ఉపవాసములు చేయవలయును. సాయంతనమున సార్వజనికసభ గావించి యందు బాగ్ దుర్ఘటన సందర్భమున దేహత్యాగ మొనర్చిన దేశభక్తుల నామములను స్మరించి వారి యెడఁ దమకుఁగల భక్తి ప్రపత్తులఁ బ్రకటితములు చేయవలయు" నని ఘోషణము గావించి యుండిరి. తద్ఘోషణము ననుసరించి నగరవాసులు చిన్నలు పెద్దలు స్త్రీలు పురుషులు ఎల్లరు కాంగ్రెసుకమిటీ కార్యాలయమునొద్దఁ జేరుచుండిరి. కళాశాలా విద్యార్థులును, ఉన్నత పాఠశాలా విద్యార్థులును గుంపులు గుంపులుగ నరుదెంచి తదుత్సవమున సహభాగులగుచుండిరి. నగరమం దెటఁజూచినను విచిత్ర దృశ్యము గాననగుచుండెను. ఎల్లరును జలియన్‌వాలాబాగ్ సంఘటన స్మరణ సూచకమగు నుత్సవకార్య క్రమమునఁ బాలు గొనుచుండిరి. కాని, యిరువురుయువకులాంగ్లవిద్యాభ్యాసకులు తదుత్సవములోఁ బాల్గొనక సైకిళ్లమీఁదఁ గూర్చుండి నగరబహిః ప్రాంతమునకరిగి యందొక పూఁదోఁటలోఁజొచ్చి సైకిళ్లను దిగి వానినొక చెట్టున కానించి యొకచో నుపవిష్టులైరి. అందొకఁడు హర్షదేవుఁడు. మఱొక్కఁడు భోపతులాలు. భోపతులాలు తన కోటుజేబునుండి చేరుమాలు దీసి యద్దానితో ముఖముఁ దుడుచుకొనుచు హర్షదేవునితో "అనాఁటి సంఘటన సందర్భమునఁ దద్విషయమును విశదముగఁ జెప్పియే యున్నాను. ఇఁకముందిట్టి నీచకర్మములయందడుగిడనని ప్రతినఁబూని యున్నాను. కాఁబట్టి నన్నీ నీచకృత్యములలోఁ బ్రవృత్తుని గావింపకుము" అనియెను. కొంతవడికొక దీర్ఘ నిశ్వాసమును బుచ్చుచు "ఈ కార్యమవమాన దాయకమును విపన్మూలకమును నగునది యని నే నెఱుఁగుదును. కాని యేమి చేయుదును? వివశుఁడనైతిని. నా హృదయము నాలోలేదు. నామతి భ్రమితమయ్యెను. నేఁ బిచ్చవాఁడనైతిని. నా కాహారనిద్రలు రుచింపని

వయ్యెను. అహోరాత్రము లీచింతాగ్నినిఁబడి వేగుచున్నాను. ఇంతవఱకీ యుదంత మేరికిని నెఱిఁగింపలేదు. నీ మీఁదనే సంపూర్ణముగ నాశ యిడుకొని యున్నాఁడను. నీ వ్రాఁపుఁజూచుకొని నిర్విచారముగ నున్నాను. నీవు కాదనినచో నింక బెక్కు లనర్థములు ప్రాపించుననుటకు సందియములేదు. ఇందు నాకొక్కనికే ప్రాణసంకటము కలుగనున్నయెడ నంత చింతిలువాఁడనుగాను. కాని మిత్రమా! అటు ఆమెయుఁ జరితపించుచున్నయది. తన ప్రాణమును బంధము పెట్టియున్నయది. చూడు మామె యేడు దినములలో దర్శన మొసఁగవేని యెనిమిదవ దివసమున సూర్యోదయము కాకమున్న శైలప్రాణములఁ గోల్పోయిన దనువార్త నాలకింపగలవు. అని యెల్లు విస్పష్టముగ వ్రాసి యున్నదో? నాకేమియు నుపాయము తోఁచకున్నది. నాన నిన్ను వేఁడుచున్నవాఁడను. నీకు శ్రమకలుగఁజేయుట కింకొక కారణము కూడఁగలదు. నీవిట్టిపనులలో నాఱితేఱినవాఁడవు, సిద్ధహస్తుఁడవు. నీకీ పగువా రేరను లేరని యెఱింగి యున్నాఁడను. అంతియ కాదు. బోర్డింగుహౌస్ (వసతిగృహపు) అసిస్టెంటు మేనేజరు పూర్ణముగ నీకు లోనై యుండు వాఁడని, నీవుకోరిన యువతిని నీవున్న యెడ కనుపు ననియును, వినియున్నాఁడను” అని పలికెను.

ఈ మాటలువిని భోపతులాలు “అఁ. అవును. కాకపోయిన వెనుకనెపుడో యేమిటి? ఇపుడుకూడ నేను దలఁచితినేని శైలయేమి యొకలెక్కయా? ఏ మహారాజు కూఁతురునైనను సరే నాయింటికి రప్పించుకొఁనగలను? కాని యున్న సంగతి యిది. ఇట్టి పనులయందు విముఖుఁడనైతిని. ఈ మార్గమున నడుగిడనని ప్రతిన పట్టితిని. నా బుద్ధియిపుడు రెండుప్రక్కలఁ ద్రొక్కులాడుచున్నయది. ఒకవంక నాఁటి రాత్రి నేఁజేసిన ప్రతిజ్ఞ నన్నీ యనుచితకర్మములనుండి క్రోసుల కొలఁది దూరము వెనుక కీడ్చుకొని పోవుచున్నయది. వేఱొక వంకఁ బ్రాణమిత్రుని యీప్సితమును జేకూర్పకుండిన రెండు హత్యలు చుట్టుకొన నున్నవను విచారము ముందునకు లాగుచున్నయది. ఇందుఁ జేయవలయునది యెద్ది? చేయరానిదెద్ది? ఏమియుఁ దోఁపకుండెను. మంచిది. కానిమ్ము. దీనికొక యుపాయమున్నది. దాన నెల్ల కార్యములు చక్కఁబడును. కాలేజీద్వారముకడ వృద్ధుఁడును, మెల్లకంటి వాఁడునునగు నొక జమాదారుఁడున్నాఁడు. వానిని వశపఱచుకొనినచో నీ కార్యము సానుకూలము గాఁగలదు.” అని యాశఁగొల్పెను.

భోపతులాలు పలికిన యాశాజనకము లగు పలుకుల నాలించి హర్షదేవుఁడు హర్షచిత్తుఁ డయ్యెను. భోపతుని చేతిని దన రెండుచేతులతోఁ బట్టుకొని లేచి

"నిన్ను మిత్రునిగ భావించుటలేదు. సోదరునిగ నెంచుచున్నాను. సోదరా! ఇపుడు కలిగిన యానందమును బోలిన యానంద మిది వఱకెన్నఁడును, నాకుఁ గలిగి యుండ లేదు. నిశ్చయముగఁ జెప్పుచున్నాఁడను. నాకోర్కె నీ దీర్తువను నాస నాకింతవఱకుఁ గలుగలేదు. ఇపుడు నన్ను సఫల మనోరథునిగఁ జేయుటకుఁ గంకణముఁ గట్టుకొంటివి. నీమేలుమఱువఁ జాలను. నీయొనర్చు నుపకృతి భారమును నేను బ్రదికియున్నంత కాలము శిరమున నిడుకొనుచున్నాను.

భోపతులాలా నాఁటి రాత్రి యానందస్వరూపుఁడు మున్నఁగు వారి యెదుటఁ జేసినబాసను నేఁడు హర్షదేవుఁడించుక యనునయ వినయములఁ బ్రకటించుచు స్తోత్రపాఠములఁ జేసినంతనే మీఱినవాఁడయ్యెను నీచప్రకృతులు బాసలకును గట్టుఁబాటులకుఁను బ్రమాణములకును నెన్నఁడును గట్టుఁబడి యుండనేఱరు. వారు క్షణక్షణమును దమ మతములను దమ మాటలను మరల్చుకొందురు. వారికడ నిలుకడయును బట్టుదలయును బూజ్యములు. భోపతులాలు భగ్నప్రతిజ్ఞుఁ డగుటకు నాతని నీచప్రకృతియే ముఖ్యకారణము. కాదనవచ్చును. మఱియొక కారణముకూడఁ గలదు. చదువుకొన్నవారలు, నలువురలోఁ దల చూపుచుఁ దిరుగఁ దలచుకొన్నవారలు, సభ్యులును భోపతుని సేవగింతురు. తమ దరి కాదనిఁ జేరనీయరు. సజ్జనులాతనిఁ జూచ వెఱతురు. దానఁ గులీనుఁడును ధనసంపన్నుఁడును, ఎం. ఏ. చదువుచున్న వాఁడును నగు యువకుఁ డొకఁడు తన స్తోత్రముఁ జేయుచున్నపుడు, తనకు సహచరుఁడు కానున్నప్పుడు తనకుఁగల్గినయానంద ముప్పొంగి మేఱమీఱి ప్రవహింపఁ జొచ్చెను. ఆ ప్రవాహవేగమునకు నిలుపోప నేరక భగ్నప్రతిజ్ఞుఁడయ్యెను. నీచప్రకృతుల కమితానంద మలవడినపుడు ప్రతిజ్ఞా భంగు లగుట యొక విపరీతమా? అతఁడు హర్షదేవునితో "మనస్ఫూర్తిగఁ జెప్పుచున్నాను. ప్రాణమిచ్చియైనను నీకు సాయమొనరింతును. నీ మనోరథమును జేకూర్చెదను. నిశ్చింతుఁడవుగమ్ము. ఇఁకమీఁద పోదము కాలము వ్యర్థపుచ్చరాదు." అని పలికెను.

భోపతునిమాటల నాలకించి హర్షదేవుఁడు ప్రహృష్టహృదయుఁడై కృతజ్ఞతా సూచకముగ నమ్ర భావమును బ్రకటించుచు నాతనితో "కళాశాలవంక కరుగుట మంచిదని నా తలంపు." అని అనియెను. ఆ మాటకు భోపతులాలు "ఆహా! అలాగే యరుగ నగును. అదియును యోజింపఁ దగినదియే. ఆ జమాదారునితో మాటాడనగును. పద. ఆ మార్గముననే చనుదమని ప్రత్యుత్తర మొసంగెను.

అంత హర్షదేవభోపతు లిరువురును దమతమ త్రొక్కుడు బండ్లనెక్కి చనిరి. కళాశాల సమీపించిరి. భోపతులాలు తన చిరపరిచితుఁడగు నా మెల్లకంటి వృద్ధ

జమాదారుని చెంతకుఁ బిలిచెను. జమాదారుఁడును భోపతునిఁగని పరుగుపరుగున నాతని చెంతఁజేరి వంగివంగి దండము లిడుచు "సర్కార్! ఎన్నాళ్లకు సెలవుగా నేఁడు వచ్చితిరి? మహారాజా! నన్ను మఱచిపోలేదుగదా" అని ప్రశ్నించెను. భోపతువాని ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరముగ నైదురూప్యముల నోటును శైలపేర జాబును వానిచేతఁ నిడుచు జెవిలో నేదియో రహస్యముగఁ జెప్పెను. ఆవృద్ధుఁడును బరమానందభరితుఁడై యాతనకొక నమస్కారమును సమర్పించెను. అంత భోపతులాలు హర్షదేవుఁడు వెుమతము మార్గములఁ నరిగిరి.

* * *

కాలేజీ బోర్డింగు హౌసు (వసతిగృహము) లో శైలకుమారియు మాధవియు నొక గదిలో నివసించుచుండిరి. వృద్ధజమాదారు ప్రమాదవశమున శైలకుమారి కీయవలసిన హర్షదేవులేఖ మాధవికొసంగెను. కవరుపైన శైల చిఱునామా వ్రాయఁబడియున్నను, నిదివఱకు మాధవి వృద్ధజమాదారు తెచ్చి శైల కొసంగుచుండిన లేఖలను బెక్కింటిని జూచియుండినదగుటచే నీ లేఖనుగూడఁ జదువుట కుత్కంఠయై మొదలు గుర్తించేఱుపుమనటులు కడుంగడు నేర్పుతోఁ గవరునువిప్పి యా కమ్మను బఠించెను. ఇదివఱకు శైల కనుపెంచు రహస్యపుఁ గమ్మలను గవరులను దెఱచి పఠించుచు మరల నెప్పటిరీతిగఁ గవరులలోనిడి శైల గుర్తించేరక యుండునటులుగ నతికించుచుండెడిది. కాని, నేఁటి జాబునందలి విషయము గ్రాహ్యమయినంతనే యామె తద్విషయముఁ గూర్చి శైలతోఁ బ్రసంగించుటకై కృతనిశ్చయయై శైలను బ్రతీక్షించుచు లేఖను గవరులో నునుచుచుండెను. అంతట శైలయరుదెంచి గదిలోఁ బ్రవేశించి చిఱునగవు నవ్వుచు "మాధవీ! జమాదారు నాకొక జాబిచ్చెనఁట? అదేది? అందేమి వ్రాయబఁడియున్నదో చూచెదను. ఇటు తెమ్ము" అని యడిగెను. ఆ మాటను వినుటయే తడవుగ మాధవి తెఱచిన కవరును శైల ముందటికి విసరివైచెను. తెఱచిన కవరును, మాధవి ముఖమునందుఁ జూపట్టు తిరస్కారభావమునుగని శైల వైకల్యమొందెను. తన రహస్యవర్తనము మాధవి కవగతమయ్యెనని చింతిలఁజొచ్చెను. కాని యుత్తరమును జదువవలయునను నుత్సుకము మగుడ నద్దానిని, పఠింపఁజొచ్చెను. పత్రపఠనము సమాప్తమయినంతనే మాధవి. "శైలా! నీ యీ యనుచితవర్తనమును గని యత్యంతము చింతిల్లుచున్నాను. నీ యుత్తరముల నిదివఱకుఁ బెక్కులు చూచియుంటిని గాని, యథార్థమును గ్రహింపఁ జాలనైతిని. అందువలనఁ దద్విషయమును గూర్చి నీతో ముచ్చటింపనైతిని. నేఁటి యుత్తరము నీ రహస్యవర్తనమును బహిరంగ మొనర్చెను. అందువలననే గ్రహించిన విషయము

సాధారణముగఁగొని నీయీ వర్తనము కళంకపూరితమైనదని, త్వరలో నిందుండి యొక నమస్కారమిడి తొలఁగుమని చెప్పుచున్నాను. ఇంత కతిరిక్తమేమియుం జెప్పఁజాలను.'' అని నిష్ఠురముగ ననియెను.

ఆ మాటలు విని శైలతనువర్తనము మాధవి కవగతమయ్యెనని తలంచి బహిరంగమయిన విషయమును దాపనెంచుట యసంగతమును నవివేకమును నగునని యెంచి, తాను హర్షదేవుని ప్రేమజాలములోఁ జిక్కుకొనిన యుదంతముః నాద్యంతమును మాధవి కెఱింగించెను.

అయ్యాదివిని మాధవి వ్యధితహృదయయై "శైలా! ఈ వర్తన మెట్టిదియో యించుకయైనఁ దలపోసి చూచితివా? ఇయ్యది నీకొక్కతెకే కాదు. శిక్షా సంస్థలకన్నింటికిని, శిక్షిత స్త్రీ సమాజమున కంతటికిని శాశ్వత కళంకమును నాపాదించినయది. ఇట్టి పెద్దపెద్ద సంస్థలును, ఇట్టి యుచ్చశిక్షాప్రాప్తలగు యువతులును, దేశమునకు సమాజమునకును నెంత యెంత లనర్థముల నలవఱచుచుండెనో. యని లోకులు చెప్పుకొందురు. స్త్రీశిక్షయెడల ఘృణితులగుదురు. దాన స్త్రీ సమాజము మూర్ఖతాపిశాచము బాఱినుండి తొలఁగనేరక యుండుట సునిశ్చితమగును'' అనియెను.

అమాట విని శైల "నేనొక్కతెనే యిట్టి పరిస్థితులలోఁ దగులుకొని యున్నదానవని భ్రమపడుచున్నదానవు కాఁబోలు! నా కారణముననే విద్యాశాలలు విద్యావతుల ప్రపంచము దోషభూయిష్ఠము లగుననియు స్త్రీ సమాజమధఃపతనమగు నినియుఁ బలుకుచున్నదానవు. అది కేవలము భ్రాంతికము. నిందావాచకము. ఇందిట్టి వ్యవహారములు ప్రతినిత్యము నెన్ని జరుగుచున్నవో చూచుచుండుటలేదా? ఇందున్న వారిలో నిష్కళంకప్రవర్తనముగల శీలవతి, సాధ్వీమణి యేరో పేర్కొనుము. చూడవలయును. ఇంతమాత్రమున నేమియగును? ఇందేమి దోషమున్నది? ఏరైన హితుఁడుగాని, బంధుజనుఁడుగాని, తదన్యుఁడుగాని. యనురక్తుఁడై చూపనెంచిన యట్టివాని సంసర్గము నింద్యమనఁ జెల్లునా? ఒకవంకఁ దెరచాటు (పరదా) నూడఁబెఱుక నభిలషించుచు, వేఱొకవంక మిత్రుఁడు చూడ నభిలషించి యరుదెంచినవానితోడి సంసర్గము వ్యభిచారమని తలంచుట యుక్త సంగతమో బుద్ధివైపరీత్యమో, నాకు బోధపడుటలేదు. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, మొదలగు విదేశములలో స్త్రీల వృత్తము నీకుఁ దెలియనిదా? వారివలెనే స్త్రీగాని పురుషుఁడు గాని, వారు కోరినపురుషునిఁగాని స్త్రీనిగాని చేరి వారితో వార్తాలాపములు సలుపుచు టెన్నిసు మొదలగు నాటలనాడుచు, విహారమరుగుచుఁ దల్లభ్యమగు నానందమును ననుభవింపక యుండుటకు మనమేమి పాపము చేసికొనియున్నారము?

ఇయ్యది ప్రకృతము (ఫేషన్) విలాసమయియున్నది. చదువు వ్రాఁతలు కలిగియున్న నేమి ? మూర్ఖ ప్రకృతులిట్టి ఫేషనును (విలాసమును) కాలకూటమని తలంతురు. నీ యనుమానము కడుశోచనీయము. కడుదుఃఖదము.

ఆ మాటలు విని మాధవి "వాని యనుకరణము నాశించు కారణముననే హిందూదేశము వినాశనమునకుఁ బాలగుచున్నది. యూరోపునందలి సభ్యతయెట్టిది? అచ్చటి జీవితమెట్టిది? అచ్చటి యాహార విహారములెట్టివి? అచటి యాచార వ్యవహారములెట్టివి? వాతావరణమెట్టిది? యను విషయములను విచారింపక యున్నారము. వాని మంచిచెడ్డలను తెలియకయే మేఁకలవలె నొకరివెనుక నొకరము వంతునఁ దుదకందఱము తత్ప్రవాహముల మీఁదఁ బడుచున్నారము. మన యాదర్శము, మన సభ్యత, మన యాచార వ్యవహారములు, మన యాహారవిహారములు, వేఱు విధములు. వారివి వేఱువిధములు. మన యాదర్శమును, మన సభ్యతయు నత్యుచ్ఛ్రాయములు. కానిచో యూనానిమొదలగు దేశ సభ్యతలవలె మన దేశ సభ్యతయును ప్రపంచమందస్తిత్వమొందియుండకపోవచ్చును. మన దేశాదర్శముచ్చతరమగుట చేతనే యెన్ని ఘోరాక్రమణములకు, నెన్ని యత్యాచారములకు లోనైనదైనను, మన యున్నతాదర్శమును సభ్యతయును నేఁటికిని దీపములవలెఁ బ్రకాశించుచున్నయవి. యూరోపయసభ్యతనిరంతరము పరివర్తనమొందుచు వచ్చుచున్నయది, ఎన్ని సారులున్నతస్థితికిఁబోయినది ? ఎన్ని సారులు క్రిందఁ బడినది. ఇప్పటి యీ యున్నతావస్థయందును, నిష్కళంకమైనయది కాదయ్యెను. అట్టిచో నిప్పటికిని మన భారతీయ సభ్యత నిష్కళంకమై, నిశ్చలమై, నిరుపమానమై జగత్ప్రసిద్ధినిఁగొని విరాజిలుచున్నయది. ప్రపంచమంతమొందకుండ నద్దానికంత మలవడనేఱదు. ఈ మాట నిశ్చయము. కాని యీ సమయమున ననుకూలముగ నేఁడు మన సభ్యతయందును, మన యునికియందును, జూపట్టుచున్న యసంగతము ముద్రాంకితములై స్థైర్యము కనఁగలుగునవి యగునేని, మన యస్తిత్వము విలుప్తమగుటకేమియును గష్టము కలుగనేరదు. ప్రపంచమున నెన్నఁడో ప్రళయము సంభవించునని పలికిన వ్యాసమహర్షి యసత్యవాది యగుటయుఁ బ్రపంచమంతమగుటయుఁ ద్వరలోనే సంప్రాప్తములగుననుటకే సందియమునులేదు. మన మాంగ్ల విద్యాశిక్షఁబడయుచుండుట ప్రపంచములోని యన్యోన్యదేశములలోనివారే యే తీరునఁ బ్రపంచములో వ్యవహరింపఁబడుచున్నవారలో యా తీరున మనమును వ్యవహరింపఁబడుటకును, వారివలె జ్ఞానశక్తి నలవఱచుకొనుటకునుగాని వారిలోని చెడులను గ్రహించుటకును వారి ననుకరించుటకును, వారికి దాసులమగుటకును నెంతమాత్రము కాదు. ఇందలి వారెల్లరును

నీయంటురోగమునకు గుఱియైనవారలేయని పలికితివిగాని, యీ భీషణరోగమును రూపుమాపుటకు ఘోరయత్నములు సలుపఁబడుచున్నవని తెలియఁజాలవైతివి. అట్టి రోగుల పరిణామము వారికగు చికిత్సావిధానమును నెంతటి భయంకరములో యెంత యవమాన కరములో యని గణింపనేరవైతివి. కొందఱు కుమార్గవర్తనులగుచున్న వారలనియే తలంపుము. అట్లని వారివలెనే మనమును కుమార్గవర్తనులమై గోతిలోఁ గూలఁబడుటకు సంసిద్ధులముగా నెంచుట యనుచితము. అయ్యది బుద్ధివిలక్షణము.'' అని పలికెను.

ఆ మాటలువిని శైల కుపితయై "నీదేశసభ్యతను దలఁచుకొని నీకే గ్రుక్కిళ్లు మ్రింగుకొను చుండుము. నీవే నీనోటితోఁ బొగడుకొనుచుండుము. కాని, విదేశీయులీ దేశమును దృణహీనముగఁ జూచుచున్నారు. ఈ దేశీయులఁ గాళ్లఁ దన్నుచున్నారు. ఈ దేశమునకును, నీ దేశీయులకును నీ విధముగఁ గలుగుచున్న పరిభవము దుర్భరమగుచున్నదని మది నెన్నక క్రిందఁబడినను, మీఁది వారమేయని యీ మన దేశమును, నీ యాదర్శమును, నీ సభ్యతను నుచ్చతమములని పొంగుచుఁ బొగడుచున్నావు. కాని, యయ్యది పరిహాస పాత్రమని తెలియనేరక యున్నావు. నేఁడు ప్రపంచమంతెల్లయెడల విదేశ సభ్యత్వము షడ్జమ స్వరమున సంగీతముఁ బాడుచున్నయది. అయ్యది నీ విచారణమున నిందనీయ మగుచున్నయది. నీకుఁ గర్ణకఠోరమగుచున్నయది. నీకు మనస్తాపమును గలిగించు చున్నయది. కాని, యీ దేశీయులెంత వఱకుఁ బరదేశీయుల యనుకరణమును జేకొనక యుందురో, అంతవఱకు నీ దేశమునకు ముక్తి కలుగనేరదని నేను నిశ్చయముగఁ జెప్పుచున్నాను. ఈ దేశీయులు తమ దేశోద్ధరణమునకును, దమ జీవితమును, సుఖముగ నానందకరముగ నెఱపుకొనుటకును, బరదేశీయ సభ్యతానుకరణ మవశ్యకర్తవ్యమని మువ్మాటికిని నొక్కిచెప్పుచున్నాను'' అనెను.

ఆ మాటలువిని మాధవి, యీ సమయమున శైల యౌవనమదమున నున్మత్తయై, తృష్ణాతురయై, యుచితానుచిత పరిజ్ఞానశూన్యయై యున్నదని గ్రహించి, యిఁక నామె యెంత చెప్పినను, నెంత బోధించినను, నెంత వలదని కొట్టుకొనినను కార్యకారి కాఁజాలదని నిశ్చయించి, "శైలా! ఇప్పు నీవేమియుఁ దెలియఁజాలవు. ఏమి చెప్పినను బోధపఱచుకొనఁజాలవు. కాని, నీ యీ వర్తనము నీకొక్కతెకే కాదు స్త్రీ శిక్షణసంస్థల కన్నింటికిని శాశ్వత కళంకము కలిగించును. లోకుల హృదయములయందు స్త్రీ శిక్షయెడల నసహ్యమును జనింపఁజేయును. శిక్షితలగు స్త్రీలు తిరస్కృతలగుదురు.'' అని దృఢముగాఁ బలికెను.

కాలేజీ బోర్డింగుహౌసు సూపరింటెండెంటు (కళాశాలా భోజన గృహ నిరీక్షకాధికారి) విద్యార్థినులపై నెంతటి తీక్ష్ణ దృష్టినిడి యెంత పరికించుచున్నను బలువురు యువతులు కనులు గప్పి కువర్తనలై తమ మనోభీష్టముల నొడఁగూర్చుకొనుచునే యున్నవారు. ఈ విషయమయి యాతఁడెఱిఁగి యుండియుఁ గారణాంతరములవలన నెఱుంగనట్లు వర్తించుచుండెను. శైల యానిరీక్షకాధికారి కడకు "ఇంటికరిగి సాయంకాలము మరలివత్తును. అనుమతి నొసంగుఁడు" అని ప్రార్థించుచు నొక జాబును వ్రాసిపంపెను. అతఁడు శైల పెద్దయింటిబిడ్డ యనియు, నగరములోనే యిల్లనియు, సాయంత్రము మరలివచ్చుననియు, ననుమతి యొసఁగుట కభ్యంతరమేమి లేదనియుఁ దలంచి వెంటనే యనుమతి నొసంగెను.

హర్షదేవుఁడు జార్జిటవును నందలి విక్టోరియా యుపవనము (పార్కు)లో సాయంకాలమైదు గంటలకరుదెమ్మని శైల కొక జాబువ్రాసి పంపియుండెను. తదనుసరణముగ హర్షవుదేని కడకు నరుగుటకు శైల యింటి కరుగు నెపమున వసతిగృహమును వీడుట కనుమతిని గొని, బాడుగుబండి నొకదానిని దెప్పించి యందుఁ గూర్చుండి విక్టోరియా పార్కున కరిగెను. అపుడు సాయంకాల మయిదుగంటలు కానుండెను. హర్షదేవుఁడు విహారారామమున కరుదెంచెను, కాని, శైల జాడ యేమాత్రమును నెందును గానరాదయ్యెను. అంత నాతఁడు వికలహృదయుఁడై సైకిలుమీఁదఁ గూర్చుండి పార్కులోనికిఁ బ్రవేశించు మార్గములను నొకదాని తర్వాత నొకదానినిగఁ బరిశీలించుచుఁ దిరుగఁజొచ్చెను. ఒక మార్గము వెంటఁ గొంతదూరముపోయి పరీక్షించి వేఱొక మార్గమున కరుగుచు, వెనుకకు, దిరిగి చూచును. ఇట్లుచేయుచుండఁ గొంత తడవున కొక మార్గము ననుసరించి పార్కులోనికిఁ జనుచుండు నొక గుఱ్ఱపుబగ్గీ యాతనికంటఁ బడెను. దానిని జూచిన వెంటనే యాతని మనోవైకల్యము ద్విగుణితము కాఁజొచ్చెను. కొంత తడవునకు బగ్గీ వెనుక భాగమునఁ గూర్చుండి వచ్చుచున్న కాలేజి జమాదారు హర్షదేవునింగాంచి వెంటనే బండినుండి దిగి యెదురుగాఁబోయి సవినయముగా నమస్కరించి, యాతని మనంబును గుదురుపఱచెను. బండి హర్షదేవుని సమీపమునకు వచ్చి నిలిచెను. శైల బండిలోనుండి దిగి లజ్జచే నించుక తలవంచి కంపించుచుండు తన హస్తముతో హర్షదేవుని హస్తమును గ్రహించి హస్తచాలనము (Shake hand) గావించెను. కళాశాలా జమాదారుఁడు బండిని గొనిచని పార్కునం దొకచో నిలిపి తానందు శైల రాక కెదురు చూచుచుండెను.

శైలా హర్షదేవు లొకరిహస్తము నొకరు గ్రహించి పట్టుకొని, యూచుకొనుచు, ముచ్చటలాడుకొనుచు నా విహారా రామమునఁ జనిచని యొక రేకాంత

ప్రదేశమును జేరిరి. అయ్యది నిర్జన స్థానమని తలంచి వారందరిగిరి కాని, యందొక వృద్ధుఁడు వారికి దృగ్గోచరుఁడయ్యెను. ఆ వృద్ధుఁడును శైలయుఁ బరస్పరము ముఖముల నవలోకించిరి. శైలా వృద్ధపురుషుల నయనములు నాలుగును గలిసికొనినవి. అంత శైల భ్రాంత చిత్తయై హర్షదేవుని హస్తమును వదలి నోటఁ బేలిడుకొని కఱచుకొనుచు నందుండి తొలఁగి వేఱొకవంక కరిగి నిలిచెను. శైలవర్తన మీ విధముగ మార్పునొందుటకుఁ గారణమెద్దియో హర్షదేవుఁడు గ్రహింపలేదు. అతఁడు "మై డియర్ శైలా! ఇదియేమి? మొకమెఱుఁగని యొక ముదుకనిఁజూచి యింత భయంపడుచున్న దానవు? ఈతఁడెవఁడో? ఎందలివాఁడో తెలియదయ్యెను. ఒకవేళఁ దెలిసినవాఁడే కంటఁబడునని యనుకొందము. అయినను నిందేమి తప్పు గలదు. ఇయ్యది యిప్పటి ఫేషను (సభ్యత) అందు ముఖ్యముగ మనవంటి యాంగ్ల భాషాభ్యాసకులగు వారికీ మర్యాద యవశ్యావలంబనీయము." అని వికటహాస మొనర్చుచుఁ బలికెను.

శైల వృద్ధునిఁ జూచినంతనే వెఱఁగొందుచు నొక ప్రక్క మార్గమునుబట్టి చనఁజొచ్చెను. హర్షదేవుఁడు కూడ నా మార్గము ననుసరించి నామె వెనువెంట నరుగుచు "ప్రియా! నిర్హేతుకముగ నేల భీతిలుచున్న దానవు? భీతిలుట కిందేమి యున్నది?" యని పలికెను. శైలయు "నీ వీతనిని నెవఁడో మొకమెఱుఁగని యొక ముదుసలినిగాఁ దలంచుచున్న వాఁడవు. నీవనుకొనునట్టులు మొకము నెఱుకలేని ముసలివాఁడాతఁడు. మా బంధువర్గములోనివాఁడు సుమా! మా వీధిలోనే మా యింటికి సమీపముననే కాపురమున్న వాఁడు. పలుకుబడిగల న్యాయవాదులలో నొకఁడు. పేరు కమలాప్రసాదుఁడు. ఈతఁడు కనఁబడుటవలన నిపుడు కలిగిన భయమింతటితో ముగియునని తలంపకుము. మన కిఁక మరల నన్యోన్యము లోకనము కలుగదను భయముకూడ నాకఁబొడ సూపుచున్నయది. ఇది నీవన్నటుల నేఁటి ఫేషన్. అది నిశ్చయమే. కాని, యిష్టము వచ్చినటులుగ నెవరితోననిన వారితో నీ విధముగ బహిరంగముగ మెలఁగుట కిది సమయము కాదు. అట్టి సమయమింకను రాలేదు. సమాజ బంధువర్గములతోడి సంబంధ బంధములు వీడినపుడే యిట్లుచేయ నగును. ఎంతవఱకు జాతిబంధన మొప్పుచుండునో, ఎంతవఱకు జాతిబహిష్కార భయముపోయకయుండునో, అంతవఱకీ ఫేషనునకుఁ బ్రచారము చేకూరుట కడుం గడు నసంభవము. ఈ కారణముననే పప్పా (శైలజనకుఁడు పండిత కుముదవిహారి) సామాజిక జాతిబంధనములయెడఁ బ్రబల విరోధ మూనియుండినను, విధిలేక వానిని పాటించుచున్నాఁడు. అందువలన నీ సంఘటనమునుగూర్చి భయంపడవలసియున్నది"

అని పలికెను. ఆయ్యది విని హర్షదేవుఁడు "సరే! ఈ వృద్ధుఁడు వెళ్లి నీపప్పాకుఁ దెలిపినయెడల నీ పప్పా నిన్ను భోజనవసతి గృహములోనుండి యింటికే కొనిపోవు ననుట కిసుమంతయును సందియము కనఁబడదు. నీవు కళాశాలా వసతి గృహమును విడుదాన వగుదువేని నీ సందర్శనము నాకుఁ గలుగనేరదు. దాన నా ప్రాణములు వ్యర్థముగఁ జేకొను దానవగుదువుగదా!" యని మాఱుపలికెను. అందులకు శైల "ఇందులో" "వినిచినయెడల" అను సంశయమున కవకాశమే లేదు. వినిచెననియే తలంపవలయు. ఈ వృద్ధుఁడొక్క పప్పాకే కాదు. వీధి యంతటను, ఊరనంతటను జాటి చెప్పును. ఈతని స్వభావమును నే నెఱుఁగుదును. నన్ను బడిలోఁ బ్రవేశపెట్టునపుడు మాతోఁ బ్రతిఘటించెను. పప్పా యింగ్లండునుండి వచ్చినపుడు మమ్ము జాతినుండి బహిష్కరించుటకును, బంధువర్గములోఁ జేరనీయక యుండునట్లు చేయుటకును. దన యావచ్ఛక్తిని వినియోగపఱచెను. ఏమియు లేనప్పుడే యే దోషమును గనఁబడనపుడే యెంతేని గడబిడఁజేయు స్వభావముగలవాఁడిప్పు డల్లరి పెట్టక యూరక యుండఁగలఁడా? అది యసంభవము. ఈ సమయమున భూమ్యాకాశము లొక్కటియగునట్లు చేయును. ఇదియే మన యిర్వురకును గడపటి పరారియము కనుచూపు అని తలంతును. ఈ విసర్గము, ఈ విధమగు వియోగము నాకపరిమిత దుఃఖమును గలిగించుచుండెను. కాని, ఏమిచేయఁగలను? వివశురాలను. సమాజబంధమును ద్రెంచుకొని బయటఁబడి యిష్టమువచ్చినట్లు చేయవలయునని తలంచుచున్నానుగాని; యొక్కమాటుగ నిటుచేసిన లోకులు కాకులవలెఁ గావుకావుమని యఱచుచు నన్ను నల్లరిపెట్టుదురు. నన్ను వ్రేలుపెట్టి చూపుచు నిందింతురు. నన్నెందును నిలువనీయరు. దానికి భయపడి వెనుదీయుచున్నాను. నేఁడు సామాజిక నిర్బంధమను వేదిపై నా ప్రేమను బలియిడి భావిసంతానమునకు, జాతి బంధనమును, సామాజిక శృంఖలలను ద్రెంచుకొని బయలుపడి యూరోపీయ దేశములోని వారివలె నెవరి కిష్టమైనట్లు వారు చేయవలయుననియు. నట్లుచేయుటవలన శ్రేయమును, దేశోద్ధరణమును సుసాధ్యములగు ననియు బోధించి చెప్పెదను. ఆంగ్లదేశీయానుకరణము దేశ దాస్యవిమోచనమునకు సాధనమని ప్రచారముఁ గావించెదను. ఇది నా నిశ్చయము. ఇది నా మనస్సంకల్పము. ఏ ప్రేమి, యే ప్రేమికల దానిని మనఃపూర్వకముగ నిర్మలాంతః కరణముతోఁ బ్రేమించునో వారి వివాహమునకు జాతీయత విఘ్నకారియా? సామాజిక నిబంధనములు నిర్బంధములా? ఇదేటి న్యాయము? ఇదేటి ధర్మము? అని కన్నుల నీరు గార్చుచుఁ బలికెను. ఇట్లు మాటలాడి యాడి శైల యావేశపరవశమయ్యెను. ఆమె యొక్క విపుల వ్యాఖ్యాన

(Speech) మీయనుండెను. కాని, హర్షదేవుఁడు, ఇఁక నెక్కుడుగ వినుట కుద్యుక్తుఁడై యుండలేదు. అతని హృదయము శిథిలితమయ్యెను. అతఁడు "శైలా! ప్రేమ యనునది సహజముగ దైవికప్రేరణమున జనించునది. అయ్యది నిశ్చలమును, నిర్మలమునునై వఱలునది. అట్టి ప్రేమకుఁ ద్యాగము లక్షణము. అట్టి ప్రేమకు నేభయమును, నే యడ్డంకియును, విఘాతమును గలిగింపనేరవు. అట్టి ప్రేమ సూత్రమున బంధితులగువారు సర్వస్వమును, తుదకుఁ బ్రాణమును గూడఁ దృణప్రాయముగాఁ జేసి పరిత్యజించుటకు సంసిద్ధులగుదురు. అట్టి ప్రేమబంధనమును విపత్సంఘర్షణము దృఢతమమగు దానినిగఁ జేయునుగాని, ఖండితమగుదానినిగఁ జేయఁజాలదు. అట్టి సమయమున నీ హృదయమున జనించిన ప్రేమాంకురమును నిర్విచారముగ నపకీర్తి భయమను ఖడ్గపాతమునకు లోనొనర్చి రూపుమాపుటకు సంసిద్ధమగుచున్న దానవు. ఇదియా నీ చదువునకును, నీ సభ్యతకును లక్షణము. ఆంగ్ల శిక్షఁబడసినందులకును, నాంగ్లపద్ధతుల నాచరణమున నిడుటయా లేక వీడుటయా చేయఁదగినది? ఒక్కింత తలపోసి చూడుము. శైలా! నన్ను మునుమున్న నీ వలలోఁ జిక్కునట్లు చేసితివి. తరువాత నీ ప్రేమ పాశమున దృఢబద్ధము గావించితివి. ఇపుడు కాలుసేతులు గలియఁగట్టి యగాధ సముద్రములోఁ గూలఁద్రోయ నున్నదానవు. ఇది నీకుఁదగునా? నీ సభ్యత కుచితమా? ఇందువలన నా జీవనమే కాదు మన యిరువురజీవనములును, నిరర్థకములగును. నష్టప్రాయములగును అని తలంపుము" అని విషాదమును వెడలఁ గ్రక్కుచుఁ బలికెను.

హర్షదేవునకు సాంత్వనమును గొలుపుటకుఁ దగు సమాధాన మిచ్చుటకు శైల మది తలంచి పలుకనెంచెను. కాని, కమలాప్రసాదుఁడు వేఱొక ప్రక్కనుండి యరుదెంచుచు వారికంటఁబడెను. అతనిఁజూచి శైల తత్తఱపడుచు "చూడుఁడు. చూడుఁడు. అతఁడు మనలను వదలలేదు. మనవంకకే యరుదెంచుచున్నవాఁడు. ఇఁక నేఁ దడయరాదు. అదృష్టము తోడగునెడ మరల నొకసారి సంయోగము కలుగఁ గలదు. లేనిచో నేమి కానున్ననో?" అని పలికెను. అంతట వృద్ధుఁడు కమలాప్రసాదుఁడు డగ్గఱుటఁజూచి శైల వికలహృదయ యగుచుఁ బదములు తొట్రిలుచుండ బగ్గివంక కరుగఁజొచ్చెను. కమలాప్రసాదుఁడు, శైలాహర్షదేవుల నిరువురను, బాఱఁజూచుచు వారి లక్షణములను గనిపెట్టుచు వారి ప్రక్కనుండియే పోయెను. శైలయు బగ్గిలోఁ గూరుచుండి బోర్డింగు హౌసునకుఁ జనెను. హర్షదేవుఁడు తన త్రొక్కుడు బండిని శైల శకటమువెంట నడుప నెంచెనుగాని, యా సమయమున నాతని కళాశాలా ధ్యాపకుఁడొకఁడాతని కట్టెదుట నుపస్థితుఁడగుట నా ప్రయ

త్నము మాని, యాతనితోఁ బ్రసంగింపఁ బ్రారంభించెను. ఆ సమయమున హర్షదేవునకు జనించిన నిరాశయు, విషాదమును, చింత యని యేమి చెప్పఁగలము! ప్రేమజాలమునందుఁ దగుల్కొనిన ప్రేమయే చెప్పవలెను. ఇట్టి సమయమున మతియేరైన హర్షదేవుని కడ్డుపడినవార లగుదురేని వారి నత్యంతము తిరస్కృతులను గావించి యుండును. కాని యడ్డు నిల్చినవాఁ డుపాధ్యాయుఁడు. శిక్షకుఁడు పాపము? ఏమి చేయఁగలఁడు? చేతులు నలుపుకొనుచు నచట నిలిచిపోయెను.

శైల తలఁచినదేమో యయినది. కమలాప్రసాదుఁడు తాను విహారోద్యానమునఁ బరికించిన శైలవర్తన విషయమును, దన కల్పనా కౌశలమును గనఁబఱచుచు నున్నవి కొంతయు, లేనిది కొంతయును, జేర్చి బంధువర్గములోను, వీధిలోను. నగరములోను, నెల్లయెడలఁ జాటఁజొచ్చెను. ఆతఁడు కంటబడిన ప్రతివ్యక్తితో నెల్లఁ జెప్పెను. ఇదివఱకే బంధువర్గములోనివారును, వీధిలోనివారును బలువురు కుముదవిహారి యెడల నీర్ష్యాళువులై యుండిరి. ఇఁక వారి సంగతిని వేఱుగఁ జెప్పవలయునా? కమలాప్రసాదుఁడు రచించిన ప్రబంధమునకు టీకాటిప్పణములను విరచింపఁ దొడఁగిరి. అందు స్త్రీల వాక్కుల విషయమై చెప్పనక్కఱయేలేదు. ఒకరికింకొక రెదురగుదురేని వారిలోవారు "చూడు. నేను మొదటనుండియుఁ జెప్పుచునే యున్నాను. ఎపుడో యొకనాఁడీ చిన్నది (శైల) సిగకుఁ బూలు చుట్టుకొని వీధికెక్కనని. తుద కదియే జరిగినది. కాళ్లకు, అంగుళెన్నర యెత్తు మడమలు గల జూడుజోడు, కంట్లకు సులోచనములు, దానిని జూచిన నా కొడలు రగులుకొని పోవుచుండెడిది. ఆఁడు జాతిని నింతనెత్తి కెక్కించుకొనుట యెన్నఁడును మంచిది కాదు. ఆఁడుదానిని నణఁచిపెట్టవలెనని చెప్పినవారు వెఱ్ఱివారై చెప్పిరా యేమి? అనుభవించి వాడి వడఁబోసి చెప్పిరి. కుముదవిహారి తన నీటుగోటులనే చూచుకొనుచున్నాఁడు కాని, కూఁతురు వ్యభిచారమును దెలియకున్నాఁడు. వాని నన వలసినపనిలేదు. వాని ధన మదము వాని నట్లు చేయించుచున్నది. కనులను గననీయదు. చెవులను విననీయదు. డబ్బు కలదని యింతటి త్రుళ్లిపాటు అయినదిలే. ముఖము నల్లఁబడినది. ఇఁక నేమి చేయును? అణఁగి యుండక" అని చెప్పుకొనఁజొచ్చిరి.

* * * * *

శైలవర్తనము నగరులో నెల్లయెడలఁ గోడియై కూయఁజొచ్చెను. ఆబాలవృద్ధుల కెల్లరకును విశదమయ్యెను. ఎచ్చటవిన్నను, నెవరినోట వినినను, శైలవర్తనమును గూర్చిన ప్రసంగమే విననగుచుండెను. కాని, పండిత కుముద విహారికి మాత్రము తెలియదయ్యెను. ఆతఁడు దీపము క్రిందిఁ క్రీనీడవలె నుండెను. ఆతఁడు

తెలియుట యెట్లు! ఆతనికిఁ దెలియఁజేయుట కేరికిని సాహసముదయింప కుండెను. ఈ విషయమునుగూర్చి వీధిలో నలువురు గుమిగూడి చెప్పుకొనుచుండిన మాటలను విని వచ్చినదాసి యొకతె శైల తల్లియగు నరుంధతికి శైలవర్తనము నిందిత మగుచుండెనని పలుకుచుఁ దాను వినిన మాటలను నాద్యంతముఁ బూసగ్రుచ్చినటులు విని చెను. అరుంధతి మొదటినుండియు శైలవర్తనమునకును, నునికికిని, బ్రతిరోధమును బ్రకటించుచునే యుండెను. శైలను కళాశాలా వసతి గృహమునకుఁ బనుచునపుడును, కుముద విహారితో నెక్కువ ప్రతిఘటించెను. ఆమె యీ యపకీర్తి ముచ్చట చెవులఁ బడినంతనే గుండెలు బాదుకొనఁజొచ్చెను. తల మోదుకొన జొచ్చెను. తనపతి యింటి కరుదెంచి నంతనే యాతని కీవృత్త మెఱిఁగించి. యీ యపకీర్తిని వలనిడుకొని బ్రదుక నొల్లనని చెప్పి, యాత్మహత్యఁ గావించుకొనుటకుఁ గృత నిశ్చయ యయ్యెను. అరుంధతి యా దినమునఁ దనభర్తకు నియమాను సరణముగఁ గచ్చేరీనుండి యింటికిఁ జనుదెంచుసరికిఁ బానీయాము (టీ)నైన నమర్చుటకు యత్నమును సలిపి యుండలేదు. ఆమె తన శయన గృహములోని కేఁగి ప్రక్క మీఁదఁ బడి యేడువఁ దొడంగెను.

పండిత కుముదవిహారి న్యాయస్థానపు టావరణములోని తన గదిలోఁ గక్షి దారులతో నాఁటి వ్యాజ్యముల విషయము ముచ్చటించుచుండెను. ఆ సమయమునఁ దపాలాబంట్రోతు జాబులఁ గొని తెచ్చి యిచ్చెను. ఆతఁడా జాబుల నన్నింటినిఁ దన గుమాస్తా చేతి కొసంగెను. తన చేతియందొక జాబును మాత్రముంచుకొని దానిని బఠింపఁజొచ్చెను. ఆ జాబును బఠించునపుడు ఆతని ముఖమునందు శోక సంతాపములు తాండవము లాడుచుండెను. జాబును సాంతముగఁ జదివిన యనంతర మొక దీర్ఘ నిశ్వాసముఁ బుచ్చెను. మనస్తాపము నడంచుటకు యత్నమొనర్చెనుగాని, యయ్యది యాతని యభిమతమునకుఁ బ్రతికూలముఁ జూపుచు నశ్రురూపమున నేత్రములనుండి బయలుపడెను. మరలఁ బత్రము పఠింపఁదొడంగెను. అందిట్లు వ్రాయఁబడి యుండెను.

“తమోహృదయా! అంధకారవాసీ! నీ యింటిగుట్టు నీకేమైనఁ దెలియునా? జనులు రాత్రులందు నిద్రితులగుదురు. నిద్రితు లగుచున్నను, సావధానులై యుందురు. నీవు పగలును నిద్రావస్థలోనే యుందువు. ఒకవేళ జాగ్రదవస్థలోనుండి యున్నను, గనులు మూఁతఁబడియే యుండును. చెవులు బధిరత్వమాని యుండును. ఎన్నఁడును దెఱువఁబడియుండవు. వీధులలో, అంగళ్లలోఁ గచేరీలలో, నగరములో, నే వంకఁ గాంచినను, నే వంక కరిగినను, నీ శైల వర్తనమును గూర్చిన నిందాప్రసం

గములు, నీ మౌఢ్యముఁ గూర్చిన నిష్ఠుర భాషణములను, విననగుచున్నవి. కాని, నీ వీ లోకములోని వాఁడవు కావా! నీ శైల వర్తనము నీకుఁ దెలియక యుండెనా! లేక తెలిసియే సహించి యూరక యున్నవాఁడవా? ఇప్పుడైనను గ్రహించి యుచిత ప్రబోధనము చేయింపక యుందువా? ఉపేక్ష చేయుదువేని తద్దోష మేరికిఁ జెందు ననుకొందువో? నీకుఁ బ్రబోధమును గలిగించుట కర్తవ్యము కావునఁ గర్తవ్యము పాలితమైనది. ఇఁక నుచిత మెద్దియో గ్రహించి యట్లు వర్తింపుము" పత్ర పఠనము సమాప్తమయ్యెను. కాని యాతని హృదయము చింతాతరంగములలో నోలలాడు చున్నట్లు లాతని ముఖము చెప్పుచుండెను. పత్రమును జేబునందిడుకొని యచ్చోటు వాసి యెందేని జనియెను. సాయంకాలము కోర్టునుండి యింటికి మరల వచ్చునపుడు కళాశాలా భోజన వసతి గృహమునకరిగి శైలను తన మోటారులోఁ గూర్చుండఁ బెట్టుకొని యింటికిఁ దోడ్కొని వచ్చెను.

కుముదవిహారి యింటి కరుదెంచుటయే తడవుగ అరుంధతి తలకట్టుకొని కోప గృహములో శయనించి యుండెనని వినియెను. అంత నాతఁడామెకు శైలవర్తన మామె చెవులఁబడినదని నిశ్చయించెను. అందువలన నాతఁడు శైలను గచేరీ చావడిలో నిలిపి తానరుంధతినిఁ బ్రసన్నఁజేయ నంతఃపురములోనికరిగెను. అరుంధతి శోకసాగరమునఁ గ్రుంకు లిడుచుండెను. బోరగిలఁబడి యేడ్చుచుండెను. తలక్రింది తలగడ కన్నీళ్లతోఁ దడిసి ముద్దయయ్యెను. ఆమె క్రోధాతిరేకమున నోడలెఱుఁగక మధ్యమధ్య ఫూత్కారముఁ జేయుచుండెను. చడిచప్పుడులు లేకుండ గదిలోనికి మెల్లఁగ నరుదెంచి కట్టెదుట నిలిచియున్న కుముదవిహారిని కనువిచ్చిచూచెను. అంత నామె క్రోధమున నగ్నరూపముఁ దాల్చెను. ఆమె తోఁకత్రొక్కిన పామువలెఁ ద్రుళ్లిపడి ప్రక్కమీఁదనుండి లేచి కూర్చుండి కోపోద్రేకియై "నా కడకు రావలదు నా యెదుట నిలువవలదు. నా ముఖముఁ జూపవలదు. ఇఁక నా ముఖమేరికిని జూపఁ దలఁచుకొనలేను. ఇఁక బ్రదుకనొల్ల. నా చెవులఁ బడఁగానే ప్రాణమును బోఁ గొట్టుకొన నెంచితినిగాని, యీ యాత్మహత్యాపాతకమును మీ శిరమున నిడుటకై మీ రాకకెదురుచూచుచు వేఁచియున్నాను. ఆకులట చెడుటకుఁ గారకులు మీరలు. అది పుట్టినది ఆఁడుపుట్టువు. ఆఁడుదానికీ విధముగ స్వేచ్ఛనొసంగుట యనుచితము. అదు పాజ్ఞలలో నునుపని యాఁడుదానికి దుర్బుద్ధియేగాని, సుబుద్ధి యెన్నఁడును గలుగనేరదు. దాన నపకీర్తి కలుగును. నలుగురలోఁ దలయెత్తుకొని తిరుగుట దుర్ఘటమగును. అని నేనెంత చెప్పితిని. ఎంత తల పగులఁగొట్టుకొంటిని అపుడు నా మాట వింటిరా? నేను నోరు కదిలించినపుడెల్ల నా నోరు మూయించితిరి. మీరు చేసిన

దానికిపుడు కలిగిన ఫలమును మీరే యనుభవింపుఁడు. నేననుభవింపలేను. ఇంత కంటె నేనేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. ఇఁక నింకుండి దయచేసి మీ పనిని మీరు చూచుకొనుఁడు. నాపనిని నేను జేసికొనుటకు విఘ్నమును గలుగనీయకుఁడు" అని పలికెను.

కుముదవిహారి యొక యపరాధివలెఁ దలవంచుకొని, యడుగులు తొట్రుపడుచుండ నెమ్మదిగ నరుంధతిని దగ్గఱి యామె పజ్జనాసీనుఁడై "ప్రియా! ఇందు నా మతి భ్రమసినది. నా బుద్ధి తారుమారయినది. ఇంత భయంకరమును, నింత విషపూరితమును, నింతటి యపకీర్తి దాయకమును నగుఫలము సంభవమగునని నేను గ్రహింపలేక పోయితిని. ఇంత దుష్పరిణామమునకు మూలమగునని నేను గ్రహింపలేక పోయితిని. నిజము చెప్పుచున్నాను. హిందూస్థానములోని స్త్రీలు చదువులేని కారణముగ నేమియుఁ దెలియనేరకున్న వారలని తల్లి దండ్రులు తమ మగపిల్లలకు విద్యాభివృద్ధికిఁ జేయు యత్నములో శతాంశమయినను ఆడుపిల్లల చదువునుగూర్చి చేయకుండ నుండుటయే గాక, వారలను మూఢులుగ నునుచుచు నన్యాయమును నత్యాచారమును సలుపుచున్నవారలనియు, నందువలన దేశపరిస్థితులను గ్రహించు జ్ఞానము నిసుమంతయు లేకుండ నున్నవారనియు, స్త్రీల యవివేకము, నజ్ఞానము కారణముగ దేశమింత పతితావస్థకు నధోగతికిఁ బాలైనదనియుఁ దలంచితి. పాశ్చాత్య దేశపు స్త్రీలవలె మనదేశపు స్త్రీలుకూడ విద్యావతులై స్త్రీ సమాజోన్నతిఁగూర్చి పాటుపడఁగలవారగునెడ వారలపై పురుషులింత యన్యాయమును, నత్యాచారమును జూపనేరరని యెంచితిని. దేశదాస్యవిముక్తికిఁ గారకులు స్త్రీలనియు, అట్టి స్త్రీలు విద్యావతులును, వివేకవతులును, నగునెడ దేశముక్తి సహజముగ సశీఘ్రముగ లభించునని తలంచితిని. అందువలననే మగపిల్లవాండ్రకువలె, నాఁడు పిల్లలకును విద్యావశ్యకతను నిశ్చయించితిని. ఆంగ్ల వనితల యాదర్శములఁ బ్రత్యక్షముగఁ జూచినవాఁడ నగుటచేఁ దత్ఫలితమను గ్రహించినవాఁడనగుటచే శైల నింతవఱకుఁ జదివించితిని. ఇంత శిక్షకుఁ బాత్రురాలినిఁ గావించితిని. ఇంత స్వేచ్ఛా స్వాతంత్ర్యములయందు నిలిపితిని. కాని, యిప్పటి యీ సంఘటనముఁ ఆదేశ సభ్యతకును, మనదేశ సభ్యతకును గల యంతరము, హస్తిమశకాంతరమును బోలియున్నదని తెలుపుచున్నయది. ఆదేశమందు సర్వజన సమ్మతమును, సర్వజనావలంబనమును, నత్యంత గౌరవ ప్రదమును, నగు నాచార మీ దేశమందు వ్యభిచారముగ నెన్నఁబడునని బోధించుచున్నయది. నే నొనరించిన తప్పిదమున కిపుడు పరితాప మొందుచున్నాఁడను. మొదటనె యీ విషయమును దెలిసియుందునేని శైల నిటులుంచి యింతవఱకుఁ జదివించి యుం

డెను. స్త్రీలకు విద్యనలవఱచుట యెంత యావశ్యకమై యున్నను, శిక్షా ప్రణాళిక దోషభూయిష్ఠమై యొప్పుచున్నదనియుఁ, దత్కారణమున స్త్రీశిక్ష స్త్రీస్వాతంత్ర్యములు దోషాకరములు ప్రమాద జనితములు నగుచున్నవి. కాఁబట్టి శిక్షాప్రణాళికా పరివర్తన మత్యంతావశ్యకమని తలంచినాను. నీ వన్నటుల నేనే శైల నీస్థితికిఁ బాలుఁ గావించితిని. అది నిజము. ఈ యపరాధము నాదికాని శైలది కాదు. కాఁబట్టి దాని యెడఁ గోపింపకుము, దాని నేమియును ననకుము, నేను జెప్పినమాటలయందలి యాథార్థ్యమును గ్రహియించి శైలయెడఁ గలిగిన యాగ్రహమును బాఱఁద్రోలి, శాంతమును బూని. దానిని క్షమింతువని నమ్ముచున్నాను." అనిపల్కెను.

వాస్తవముగఁ గుముదవిహారి తన యపరాధమును గ్రహించి స్వీకరించి, పశ్చాత్తాపమొందుచుఁ దన సంతాపమును, తన మనోభావమును విస్పష్టముగ వ్యక్తపఱచినందున నాతని మాటలను నరుంధతి శిరోధార్యమొనరింపవలసినదయ్యెను. ఆమె "మీరు మీ కూఁతునందుఁ బూనియున్న వాత్సల్యమతి మాత్రమైనదగుటచే విభ్రమచిత్తులరై కులమునకుఁ గళంకమును గలిగించినవారలైతిరి. ఈ విషయమును మొదటనే గుర్తించియుండినయెడల నేఁడీ దుర్ఘటము ఘటిల్లక యుండెడిదని తలంచుచున్నాను. ఇపుడేమనుకొనిన నేమిప్రయోజనము? గత జలసేతు బంధనము ఒలికిపోయిన పాలకొఱకేడ్చుటవంటిదే. మంచిచెడ్డలు, సుఖదుఃఖములు, కీర్త్యపకీర్తులు. పురాకృతము ననుసరించి సంభవములగుచుండును. అవి యనుభవైకవేద్యములు. అనుభవింపలేమనినఁ దొలఁగిపోవునవి కావు. కాఁబట్టి యనుభవించెదను. ఆఁడుపిల్ల యేనాఁడు కడుపునఁ బుట్టినదో, యానాఁడే యపకీర్తికిఁ దలయొగ్గికొంటిని. కాని, యొకమాటఁ జెప్పుచున్నాను. అయినదేదో యయినది. శైలనిఁక కళాశాలా వసతి గృహములో నుంపక వెంటనే తోడుకొనిరండు. చదువు నిలుపుచేయింపుఁడు. సత్వరముగ నొకయయ్యచేతిలోఁ బెట్టుఁడు. దాన శ్రేయమగు. లేనిచో నింతకంటె నెక్కువయగు ననర్థసముదాయము రాఁగలదు" అని పలికెను.

అరుంధతి పలికిన పలుకులు విని కుముదవిహారి "త్వరలోఁ బెండ్లిచేయ నిశ్చయించితినని చెప్పమరచితిని. చదివినంత వఱకుఁ జాలును. నా పొరపాటువలనఁ జదువున కబ్బవలయు సద్భావము లబ్బలేదు. కాని, చదివిన పుస్తకములలోని దుర్భావములు దుర్గుణములు నలవడినవి. దాని పెండ్లివిషయమయి యీ దినముననే పండితసతీప్రసాదునకు జాబు వ్రాసెదను. అతఁడు పాపముతొందఱ పడుచునేయున్నాఁడు. కాని, నేనేజాలము చేయుచు వచ్చినాను. సరి. దానికేమి. ఇంకొకసంగతి. మన బంధువులు, మన వీధిలోనివారు, మనల నెంత కళంకగించుచున్నారో, యెంత

యీర్ష్యాదృష్టితోఁ జూచుచున్నారో, అది నీ వెఱుఁగుదువుగదా? ఈ సంఘటన
మును పండిత సతీప్రసాదునకును, ఆనందునకును, తెలియఁజేయకయుందు రనుకొను
టకు వలనుపడదు. కాఁబట్టి వీధిలోనివారెల్లరును నాకుఁ బ్రతిపక్షులై, యుపక్రమం
సలుపనెంచి, శైల కళాశాలలోని సహపాఠులలోని యొకనితోఁ గుప్రసంగమును
బూని యున్నదని యొక ప్రవాదమును బ్రకటించుచున్నందున సత్వరముగఁ బెండ్లి
చేయ నిశ్చయించితినని వారిరువురకును జెరియొక జాబును వ్రాయుట మంచిదని
తలంచుచున్నాను. నీవేమందువు?" అని ప్రశ్నించెను.

అందుల కరుంధతి "అనుటకేమున్నది? మీకుఁ దోఁచినటులు చేయుఁడు. ఏదోవిధముగఁ గలిగిన కళంకమును గప్పిపుచ్చక తీఱదుగదా?" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఆ మాటల నాలించి కుముదవిహారి "మంచిది. నేఁడే జాబులువ్రాసెద. వారెప్పుడనిన నప్పుడు పెండ్లికి సిద్ధమయి యుండవలయు. నేను న్యాయస్థానము నుండి వచ్చునపుడు శైలను దోడ్కొనియే వచ్చినాను. నీ యెదుటికి వచ్చుటకు సిగ్గిలుచున్నయది. భయపడుచున్నయది. చింతిలుచున్నయది. కాఁబట్టి దానిని కచేరీ చావడి దగ్గఱనునిచి వచ్చినాను. చూడు నామాటవిను. దానినేమియు ననకుము. నేను వెళ్లి బోధించి మంచిమాటలాడి దానిని లోపలికనిపెదను. కొంచెముసేపయిన తర్వాత నీ చెంతకు రమ్మని యేరిచేతనైనఁ జెప్పి పంపుము." అని పలుకుచు నరుంధతిని శాంతింపఁజేసి యందుండి వెడలెను.

కుముదవిహారి యరుంధతి క్రోధవిషాదములను బాఱఁద్రోలెనుగదా? ఆమెయు శాంతమును వహించెను. తర్వాత నంతఃపురమును వీడి కచేరీచావడిలోనున్న శైల కడకరుదెంచి మీ తల్లి కోపమును వీడి ప్రసన్నయయ్యెనని చెప్పెను. విశ్వాసముఁ గొలిపెను. లోనికనిపెను. కాని, శైలకుఁ దల్లియెదుటకుఁ బోవుటకు ధైర్యము కలుగదయ్యెను. అంత దొంగవలె చప్పుడుచేయక యడుగువిడుచు నక్కి-నక్కి, తలవంచుకొని, యేరును గనకుండునటులు తన గదిలోనికిఁ బోయెను. శైల తన గదిలోని కరుదెంచినదని యరుంధతి గ్రహించెను. కాని, యామె శైలఁజూచుటయు, నామెతో మాటలాడుటయు నసంగతములని భావించి యేమియుఁ దెలియని దాని వలె నటింపఁజొచ్చెను.

## పదుమూఁడవ ప్రకరణము

లాలావింధ్యవాసినీప్రసాదు తన మౌర్ఖ్యమును గ్రహించెను. తన్నుఁ దాను నిందించుకొనఁజొచ్చెను. అతఁడు తన మౌఢ్యమును, తన హఠమును, తన యవివేక కృత్యమును దలఁచుకొని విలపింపని నిముసమొక్కటియును లేదయ్యెను. తాను

జేసినపనికిఁ బశ్చాత్తాప మొందఁజొచ్చెను. తన యంధ విశ్వాసమింత భయంకరమును, నింత విపరీతమును, నింత విషాదపూరితమును, నను పరిణామమును దాల్చునని యెన్నఁడును దలఁచినవాఁడు కాఁడు. ఎఱిఁగియుండినఁ దన కాళ్లను దన చేతులతో ఖండించుకొనునా? అట్లెన్నఁడును ఖండించుకొనఁడు. మిష్టరు ప్రసిద్ధినారాయణుఁడు వకాలతు ప్యాసయ్యెను. వకీలయ్యెను, వకాలతును హెచ్చుగఁ గలిగియుండెను. పేరుగల న్యాయవాదులలో నొకఁడై యుండెను. పండిత సతీ ప్రసాదుతో వ్యవహారమూనినవారెల్లరును బ్రసిద్ధుని కక్షిదారులైరి. వింధ్యవాసినీప్రసాదు పండిత సతీప్రసాదుకడఁ బ్రధానోద్యోగియై యుండి బహుతరముగ ధనార్జనముచేయుచుండెను. ఈ వలన కుమారుఁడును న్యాయవాదిగానుండి తండ్రి యార్జనముకంటె నెక్కువ యార్జనము కలిగియుండెను. అతఁడు సర్వవిధముల సుఖ సమన్వితుఁడై యుండెను. కాని, కోఁడలి వ్యవహారమును జూచినను దలఁచినను నాతని హృదయము వ్రక్కలగుచుండెను. రామదీను మహాజనుని కూఁతుతోఁ బురోహితుని మాయమాటలకులోనై, దురాశాపీడితుఁడై, లోభియై, ప్రసిద్ధునకుఁ బెండ్లిచేసెను. పురోహితుని వాక్కులు వేదవాక్కులని తలంచి, పిల్లనుగూర్చి కాని, పిల్ల రూపగుణములను గూర్చి కాని, పిల్ల శీల స్వభావములనుగాని యిసుమంతయైనఁ బరికించినవాఁడు కాఁడయ్యెను. వానివంక ధ్యానమైన నిడినవాఁడు కాఁడు. ఇపుడా రామదీనుని యవివేకపు గుణముగల యసభ్యపు నాగరికతతోఁ గూడిన కూఁతుతోఁ బ్రసిద్ధుఁడే కాదు, ప్రసిద్ధుని తండ్రియుఁ బ్రసిద్ధుని తల్లియుఁ బ్రసిద్ధుని బంధువులును, సేవకులును, నెల్లరును దుఃఖితులగుచుండిరి. రామదీనుని కూఁతురు ప్రసిద్ధునకుఁ దగిన సతి కాదు. వారి దాంపత్యమనుకూల దాంపత్యమగుట లేదు. రామదీనుని కూఁతురు కడ గౌరవ మర్యాదల పొందునకైనఁ గానరావయ్యెను. ప్రసిద్ధునివంటి సుశీలునకు, విద్యావంతునకుఁ, బ్రయోజకునకు, సుయోగ్యునకు (gentleman) అతనిఁబోలు శీలవతి, గుణవతి, విద్యావతి, కౌశలవతి, యగు యువతి సతి కావలయుఁగాని, విధివైపరీత్యమున నాతనికి వ్యతిరేకవతి సతి యయ్యెను. అట్టి సతిఁ జేపట్టుటకతఁడే బాధ్యుఁడు. అది ప్రమాద వశమున జరిగినది కాదు. బుద్ధిపూర్వకముగఁ జేసికొన్నది. ఆ వివాహము నిజముగ నాతని జననీజనకుల నిర్బంధమువలన సుసంపన్నమైనదనుట కిసుమంతయును సందియము లేదు. కాని, యా సమయమునఁ బ్రసిద్ధుఁడించుక ప్రతికూలముఁ బ్రకటించినఁ, దజ్జననీజనకులు తమ యిష్టమువచ్చినట్లు చేయఁగలిగిన వారలగుదురా? వింధ్యవాసినీ ప్రసాదుని మౌఢ్యము, హఠమును నింతటిముప్పుఁ జేకూర్చుటకుఁ గారణములైన వసనా? అతి సాత్త్వికమొకప్పుడు అతిశయారిష్టమునకుఁ గారణమైనఁదగును. అందువలననే "అతి సర్వత్రవర్జయే" త్తని విజ్ఞులు చెప్పుదురు.

ఆయతి సాత్త్వికమువలన లభ్యమైనఫలమే ప్రసిద్ధుని జీవనము రూపుమాపుటకు నాశన మగుటకుఁ గారణమైన దయ్యెను.

ప్రసిద్ధుని సతి రామదేవి. ఆమెను జూచువారెల్లరుఁ బ్రపంచములో మౌర్ఖ్యమును, నవివేకమును బ్రోగుఁజేసి, ముద్దయొని, యా ముద్దను బ్రహ్మదేవుఁడా యాఁడుదానినిగాఁ బుట్టినాఁడని యనుచుండిరి. ఆమె యింత మూర్ఖమును నింత యవివేకమును గలది యనుటకుఁ బ్రథమకారణము వైశ్యకులజన్మము. రెండవది, తండ్రి కొక్కతెయే కూఁతురు. అదుపు, ఆజ్ఞ, భయము, భక్తిలేక మిగుల గారాబమునఁ బెరిఁగినది. ఆడినదియాటగను, బాడినదిపాటగను సాగుచుఁ బెరిఁగినపిల్లలు మూర్ఖులుగను, నవివేకులుగను బరిణమిల్లుట యొక యబ్బురమా? రామదీనుఁడు చేయునది కిరాణావ్యాపారము. తైలవర్తకము, అతని యంగడిలోఁ బ్రతిదినమును, వేలకొలఁది వ్యాపారము సాగుచుండును. తండ్రి కనుంగుఁ గూఁతురగుటవలన రామదేవి యంగడిలోఁ దండ్రిచెంతనే రాత్రిందివములు కూరుచొనుచుండినది. ఇంటిలో నామె సాధించుటకును, నామెపై వీక్షణమిడుటకును, బదుగురు సేవకులుండియున్నను, జిన్నతనమునుండియు నంగడిలో నిలుచుట కలవాటుపడినది గనుక నందే యాటపాటలు సలుపుచుండెడిది. వైశ్యులును, వైశ్యులసేవకులును, నెంత యసహ్యముగఁ జూపట్టుచుందురో యయ్యది జగమెఱింగిన విషయమే కదా? అందు రామదీను నంగడిలో జరగునది తైలవర్తకము. అందలి ప్రదేశము తైలసిక్తము. అందు రేయుంబవళ్లు నాటపాటలనుండు రామదేవి శరీరమును, వస్త్రములును నసహ్యకరము లగుటకు సందియములేదుకదా? దాన నంగడియందు నాటపాటల కభ్యస్తయైనదిగనుక నశుభ్రతకును నలవాటుపడినది. ఆమె శరీరమందుఁ జందనపుఁబూఁతవలె నెప్పుడును రెండు మూఁడంగుళముల దలముగల మట్టిపోఁత కాననగుచుండుటచే నామె శరీరమునకుఁ గల సహజవర్ణమేదియో యెఱికిని దెలియరాదు. శరీరమందుఁ దైలము, తైలముపై కిరానా సామానుల యందలి దుమారమును నలముకొని యామెకడ నొక విధమగు దుర్గంధమును నుదయింపఁజేయుచుండెను. ఆమె యత్తవారింటికిఁ గాపురము చేయుట కరుదెంచునప్పటికిని నా బాల్యాభ్యస్తమగు నసహ్యరూపధారణమును విడువఁజాలకుండెను. సువాసితములును, సుగంధబంధురములును, నగుతలనూనెలను, అత్తరులను, లవండరులను, సెంట్లను, బెక్కులు తెచ్చి ప్రసిద్ధుఁడామెకొసంగుచుండునుగాని, 'పందిపరిమళమును బరిగణింప'దను వాక్యము సార్థకము చేయుచు, ప్రసిద్ధుఁడొసంగు పరిమళ పదార్థముల నన్నింటిని దాకనైనఁ దాకక పరిహరించుచుండును. రమదేవికి బదిగజముల దూరము నందుండువారయినను నామె శరీరమునందుండి వెడలు దుర్గంధమును సహింపనేరక వమనములు చేసికొనుచుందురు.

రమదేవి మాటయందు మృదుత్వము శూన్యము. పారుష్యమా యతిశయము. ఆమెతో నొక పర్యాయము మాటలాడినవారికి మఱియొక పర్యాయము మాటలాడుటకు మనసొప్పదు. ఆమె నిష్ఠుర వ్యవహారమునకును బరుషభాషణమునకును సహింప నొల్లక రామదీనుని యంగడిలోనికి బేరసారముల కరుదెంచువా రప్పుడప్పుడు కుపితులై మరలిపోవుచుండెడివారు. అత్తింటఁగూడ మాటకఱుకుఁదనము కారణముగ సేవకు లెవరును నామెయెడ లక్ష్యము గౌరవము గలవారు కారైరి. ఆమెనుజూచి సంతసమొందువా రెవరును లేరైరి. గృహకృత్యములయం దామె కించుకయును బరిచయము లేదు. వంటమనిషి రానినాఁడు, శక్తి యెంతలేకపోయినను, నెంతలేక లేక పోయినను, నెంతబాధ నొందుచున్నను, నేమయినను నామె, శతవృద్ధమగు నత్త వంట యిల్లు చొరవలసినదే. ప్రొయ్యియూఁదవలసినదే.

రమదేవికిఁ బ్రసిద్ధ నారాయణుఁడు మంచి మంచి విలువగల మద్రాసు, బనారసు, ఫారసీ చీరలను, మంచిమంచి ఫేషనులతోనుండు జాకెట్లను దెచ్చి యిచ్చుచుండునుగాని, యాతఁడు తెచ్చియిచ్చు చీరలు, జాకెట్లు మొదలగునవన్నియు నామె కింపుఁ గొలుపునవి కాఁజాలక పెట్టెశృంగారమున కుపయుక్తములుగఁ జూడఁబడుచుండెను. ఆమె యెపుడు చూచినను, వెనుకటివలెఁ బైఁట పరికిణీలను, బదిమూరల నక్కీదారుచీరలను ధరించి కనఁబడుచుండును. ఎపుడైనను నత్త నిర్బంధపూర్వకముగఁ జీరను గట్టిపెట్టిన, నామెయొక వంకకరిగి యింత బురదను, వేఱొకమూలకరిగి యింత చమురును, మఱియొకమూలకరిగి కొంత మసిని బట్టించుకొని యొక నిమేషములో నా చీరను ధ్వంసము చేయుచుండును. ఆమె కట్టిన చీరను నెన్నటికిని నే చాఁకలియును శుభ్రపఱుపఁజాలఁడు. రమదేవిని నేహ్యదృశ్యమును బాఱఁద్రోలి పరిశుభ్రముగ నునుపవలయునని పాపమా మెయత్త యెంతయుఁ బాటుపడఁజొచ్చెను. ప్రతిదినమును శరీరమును సుగంధద్రవ్యములతో నలుఁగిడి తైలాభ్యంజనస్నానము చేయించుచుండును. ప్రసిద్ధున కామెయెడ ఘృణితభావముదయింపకుండ నునుచుటకై యామె యశుభ్రతను నసహ్యరూపమును విదళించుటకుఁ బ్రతిదినము నెన్నియో పాట్లు పడఁజొచ్చెను. కాని, యెన్ని పాట్లు పడిన నేమి ప్రయోజనము! నైజగుణ మెన్నటికైన మార్పుచెందునా? "స్వభావో దురవిక్రమ్య" అను పెద్దల సూక్తి యన్వర్థముకదా? కాకి కలహంసయగునా? ఎన్నిమార్లు గంగలో ముంచినను నల్లకుక్క నల్లకుక్కగనేయుండును గాని, తెల్లకుక్కగ మారదుగదా? రమదేవికడ రమదేవి యత్త పరిశ్రమయంతయు వ్యర్థమగుచుండెను. ఆమె యెప్పుడును నేహ్యముగనే కనఁబడుచుండును. ఆమె చుట్టును నీఁగలు ముసరుచుండును. అందువలనఁ బ్రసిద్ధుఁ

డామెతో మాటలాడఁడయ్యె. ఆమె దగ్గఱకరుగఁడయ్యెను. ఆమెను గన్నెత్తి యయినఁ జూడఁడయ్యెను. కాని, యామెపై మొదటనే యొక్కసారిగ నసహయోగమును బూనినవాఁడు కాఁడు. అజ్ఞస్త్రీని మానవిగఁ జేయుటకు శక్తివంచనము లేకయుండ నెన్ని పాట్లు పడవలయునో యన్ని పాట్లుపడెను. ఇప్పటి యువకులు బి. ఏ., ఎం. ఏ., లు ప్యాసయినవారలు సాధారణ పరిస్థితులలో నున్నవారలును, బరిశుభ్రతతో, నొప్పుచు, నీటుగోటులతో, డాబుదర్పములతో నుందురు. వారి కనుకూలవతులగు యువతులనే చేకొన నభిలషించుచుందురు. కాని, చదువులేని యవివేకినులను, మూర్ఖ శిరోమణులను జేపట్టుటకియ్యకొనరు. అందుఁ బ్రసిద్ధుఁడు సాధారణ పరిస్థితులలోనివాఁడు కాఁడు. ఎం. ఏ., ఎల్. ఎల్. బి. ధనాఢ్యుఁడు, వకీలుపని చేయుచున్నవాఁడు. అట్లయ్యును దన మూర్ఖసతియందుఁ బ్రేమానురాగముల నతిశయముగ నూని యుండెను. అతఁడు రమదేవిని మార్గములోనికిఁ దెచ్చుటకు ఆఱుమాసములు నిరంతర పరిశ్రమ మొనర్చెను. అతని న్యాయవాదిత్వము బహువ్యాప్తిగనినయది. కక్షిదారులు చెప్పు మాటలను వినుటకైనఁ జాలునంత సమయ మతనికిఁ జిక్కకయుండెను. అట్లున్నను, అతఁడు స్వయముగ రమదేవికిఁ జదువుచెప్పుచు, మంచిమంచి విషయములను బోధించుచు, నిత్యము రెండుగంటల కాలము వ్యయమొనర్పఁజొచ్చెను. శుభ్రముగ నునుచుటకుఁ బహు యత్నములు సలుపుచుండెను. పైఁట, పరికిణీలను, లంగాలను, నక్కీదారు చీరలను వదలించి మదరాసు, బనారసు, ఫార్సీచీరలను ధరింపఁజేయుట కెన్నియో పాట్లు పడఁజొచ్చెనుగాని, యెంత చేసిన నేమిప్రయోజనము? అమృతముఁబోసినను వేమునకుఁ జేఁదు వీడునా? పాపమాతఁడామెకు జ్ఞానమును గలిగించుటకుఁ జేయఁదగినన్ని యెన్నియో యత్నములు సలిపెను. కాని, మూఢచిత్తులను జ్ఞానవంతులఁ జేయుటకు బ్రహ్మకైనఁ దరముకాదని విజ్ఞులు చెప్పుచుందురుగదా? అట్టిచోఁ బ్రసిద్ధుఁడు విఫలుఁడగునా? కాఁజాలఁడయ్యె. అందువలనఁ దుదకు విసుఁగుఁజెంది నిరాశుఁడై చేయునదినేరక యసహాయోగ నీత్యనుసరణము సఫలతఁ గూర్పఁగలుగునది యగునేమో యనునాసఁగొని యద్దాని గ్రహించెను.

ప్రసిద్ధుఁడసహాయోగముఁ గ్రహించుటఁగని రమదేవి హృదయము విదీర్ణమయ్యెను. ఇంతవఱకుఁ దన్ను శిరమున నిడుకొనుచు వచ్చిన తనపతి యిప్పుడీవిధముగ నొక్కసారిగఁ గ్రిందకుఁ దిగఁద్రోయుటఁగని తత్కారణమేదియో యని యరయఁజొచ్చెను. ఇపుడైనను నామె మౌఢ్యమామెను విడిచినదికాదు. ఆమె వివేకవతియగు యువతియగునెడ నింతవఱకు రానీయకుండఁగనే పతి కనుకూలవతియై

మెలఁగునదియగును, గాని, తనపతి తనయెడ నప్రసన్నుఁడగుటకును, నసహాయోగ మూనుటకును బాధ్యుఁడగునటులుఁ జేసికొననేరదు. ఒకప్పుడు కర్మవశమున నిట్టిది సంభవమగునది యగునేని, తెలివిగలయువతి తన తప్పును గ్రహియించి దిద్దుకొనఁ జొచ్చును. పతి ప్రసన్నతను బడయుటకుఁ బలు యత్నములుఁ సలుపఁజొచ్చును. పతి కనుకూలవతియై మెలఁగఁజొచ్చును. కాని, రమాదేవి యవివేకవతి. మూర్ఖపిశాచ మామెపై సంపూర్ణముగ నావహించి యున్నయది. అందువలనఁ బ్రసిద్ధుని యసహాయోగమునకుఁ గారణ మామె హృదయ ఫలకమున భీషణ రూపమున నంకితమయ్యె. అతఁడు పర స్త్రీ ప్రేమఁ దగిలినవాఁడని యామె తలంచెను. అయ్యది యసహాయోగమునకుఁ గారణమని యామె మనమున దృఢమయ్యెను.

*　　*　　*　　*　　*　　*

ఇపుడు రమాదేవి యవివేకము నిజముగ నవివేకముగ నుండలేదు. దౌష్ట్యముగఁ బరివర్తనమయ్యెను. ఆమె ప్రసిద్ధునియెడ సర్వవిధముల సంశయమును బూనెను. బంధువర్గములో నాతని కవమానము చేయఁజొచ్చెను. ఎదురుపడినవారితో నెల్ల నాతనిఁగూర్చిన సత్యదూరములును, నింద్యములును, నగు విషయములను గల్పించి చెప్పఁజొచ్చెను. ఆమెకుఁ బుట్టినయిల్లు, మెట్టినయిల్లు నొక యూరనే యుండెను. అందువలనఁ దన పతినిగూర్చినట్టియు, అత్తమామలఁ గూర్చినట్టియుఁ, గల్పితము లైన నేరములను, ప్రతి నిమేషమును దల్లిదండ్రుల కెఱిఁగింపఁజొచ్చెను. వారామె మాటల విశ్వసింపమొదలిడిరి. ఊరిలోని సంబంధము ముంజూరు నగ్గివంటిదని పెద్దలు చెప్పుదురు. రమాదేవి చెప్పు మాటలను నమ్మి యామె తల్లిదండ్రులు, ప్రసిద్ధునిఁ, బ్రసిద్ధుని తలిదండ్రులను దూషింపసాగిరి. దాన నారెండు కుటుంబములకు మనోభావములు (అభిప్రాయములు) భిన్నములగుటయేగాక యంతఃకలహములకుఁ బ్రబలకారణములయ్యెను.

రమాదేవితండ్రి రామదీనుఁడు లక్ష్మీప్రసన్నుఁడు కాని, సరస్వతీ ప్రసన్నుఁడు కాఁడు. వివేకవంతుఁడు కాఁడు. దోషమెందున్నదని విచారణ సేయుటకుఁ దగిన జ్ఞానము గలవాఁడు కాఁడు. కాఁబట్టి యాతఁడు కూఁతురుచెప్పు మాటలు యథార్థములని నమ్మి, తన బంధువులతోను, దన సాటివారితోను, దన పరిచయులతోడను, దన యంగడి కరుదెంచిన వారితోడను, వేయేల? ఎదురైన స్త్రీ బాలవృద్ధులతో "చూచితిరా! అన్నలారా! అయ్యలారా! అమ్మలారా! అక్కలారా! మంచి కుటుంబములోనివాఁడని బుద్ధిమంతుఁడని, చదువుకొన్నవాఁడని, ప్రాజ్ఞుఁడని తలంచి పిల్లనిచ్చి పెండ్లి చేసితిని. బంగారుకుండయని తలంచితిఁగాని, విషముతో నిండిన దని

తెలియఁజాలనైతిని. పర స్త్రీగమనుఁడగునని, వేశ్యాలోలుఁడగునని యెఱిఁగి యుండితినేని, కుసుమకోమలియగు కూఁతును గోతిలో నేలపడఁద్రోయుదును? ఎఱుఁగక కన్నకూఁతు గొంతుకను జేతులారఁగోసికొంటిని. నా కొడుకు శీలవర్తనుఁడు కాఁడని పెద్దమనిషి, వింధ్యవాసినీప్రసాదు చెప్పవలదా? అతఁడు చెప్పియుండిన నెంత బాగుగనుండును? చెప్పక నా గొంతుక కోసినాఁడు. నా కూఁతు జీవితమును నాశనముఁ జేసినాఁడు. ఇఁక నా కూఁతురు బ్రతికియున్నంత కాలము నా మీఁదఁ బడి యేడువవలసినదే గదా? మీరైన నాతనికి బుద్ధిచెప్పి నా కూఁతు కాపురమును జక్కపఱపుఁడు. మీకుఁ బుణ్యమువచ్చును.'' అని యేడ్చుచుఁ దన కూఁతు దుఃఖదావస్థను జెప్పుచుండెను. ఇట్లే రమదేవి తల్లియుఁ దన బంధువుల యిండ్లకు వివాహాది శుభకార్యములకరిగినపుడును, పర్వదినములలో గంగాస్నానమునకరిగినపుడును, సత్సవాదుల కరిగినపుడును, దన యెదుటఁబడిన వారలకడఁ బ్రసిద్ధుని, నతనితల్లిని, దండ్రిని గూర్చి దూషించుచుండెను.

ప్రసిద్ధుఁడు నగరములో నొక తగుమనుష్యుఁడుగఁ బరిగణింపఁబడుచున్న వాఁడు. అట్టి వానియెడ రమదేవియు, నామె తలిదండ్రులును, నపవాదము ప్రకటింపఁజొచ్చిరి. వారు ప్రకటించు నపవాదము క్రమక్రమముగ మిత్రమండలిలో, బంధువర్గములో, నగరములో సర్వత్ర వ్యాప్తిఁ గనినయది. ప్రసిద్ధుని పరిస్థితులను, నునికిని, బ్రాయమును గనినవారెల్లరును చ్యుతచంద్రుఁడని తలంపసాగిరి. ప్రసిద్ధునకు న్యాయవాదవృత్తియం దెక్కువ ప్రశస్తి కలదు. విశ్రాంతి యలవడుటయే దుర్లభము. అనవరతము న్యాయవాదవృత్తియందుఁ బరిశ్రమయే యుండును. 'పతనమందిరమున కరుగుటకైన సమయము చిక్కదు. ఎన్నఁడైనఁ గార్యావసరమున నిల్లువీడి బైట కరిగెనేని యాతనిఁ జూచువారెల్లరు వ్రేలుపెట్టి చూపుచు నాతని దుశ్శీలమును వాకొని దూషింపఁ దొరకొనుచుండిరి. హితైషులు, ప్రసిద్ధునకును, నాతని తలిదండ్రులకును రమదేవిని బ్రసన్నము చేసికొనుట కుపాయమును సత్వరముగఁ జేకొనుఁడు, లేనిచో నపకీర్తి భాజను లగుదురని యుపదేశింపఁజొచ్చిరి. మిత్రులు కఱపు హితమును గ్రహించువారివలెఁ బ్రసిద్ధుఁడును, వాతని తలిదండ్రులును వల్లె యని యనుచు మౌనముఁ బూనఁజొచ్చిరే కాని తమ నిర్దోషత్వమును బయలుపఱచుట కెన్నఁడును యత్నము సలిపినవారలు కారు. ప్రసిద్ధునితల్లి యెన్నఁడైనఁ బైటి కరిగినపుడు రమదేవియెడ నెవరైన నుచితవ్యవహారమును బూనియుండుట శ్రేయమని యామెతోఁ జెప్పినయెడఁ గ్రోధావేశయై వారలకు రమదేవి యవివేకవర్తనమును బూసఁగ్రుచ్చినట్లు లాద్యంతముగ వినిపించుచుండును. ప్రసిద్ధుని తల్లి చెప్పిన

మాటలు వినినవారలు "అవును. అక్కా! నీవలె నెవరు చేయఁగలరు? ఎవరు సహింపఁగలరు? ఇప్పటికాలమునఁ గోడం్రడెంత నేర్పరులైనను, నెంత బుద్ధిమంతు రాండ్రైనను, నెంత భయభక్తులుగలవారలైనను, నెంత సహనశీలలైనను, అత్తలు, ఆఁడుబిడ్డలు, వారలను కోడం్రటకముపెట్టి రాచి రాపాడుటయేగాని యున్నావా? తిన్నావా? యని యడుగనైన నడుగరు. నీవు పూర్వకాలపుదానవు గావున, నీయవివేకపుఁ గోడలిని బట్టుకొని యిన్ని తంటాలు పడినావు. చేతనైనంత పనిని జేసినావు. మఱొకరు పడలేరు. మఱొకరు చేయనులేరు. ప్రసిద్ధబాబుకూడ చేయఁ గలిగినంతయుఁ జేసినాఁడు. తుదకు విసుఁగు పొందినాఁడు. ఇంతకంటె నెక్కువ యెవరు చేయఁగలరు? కాని, యీ సంగతి నాకేమి తెలియును? మీరింత తంటాలు పడినారని నేనెఱుఁగ. నాతో నందాదేవి (రమదేవితల్లి) యేమి చెప్పినదో అది విన్నాను. విని దుఃఖపడినాను. చూడు. నందాదేవి మరల నెపుడైన నాకగుపడిన దానికిఁ దగిన రీతిగ సమాధానముచెప్పి బుద్ధి గఱపెదను." అని పలుకుచుందురు. ప్రసిద్ధునితల్లి తనకుఁగలుగు విజయమునకుఁ గడుంగడుఁ బ్రసన్నయై యింటి కరుగు చుండును.

రమదేవి యవివేకము ప్రసిద్ధుని నడవడికిఁ గళంక మాపాదించెను. ఆతని నపకీర్తి భాజనునిగ నొనర్చెను. ప్రసిద్ధుఁడు తాను బ్రయోగించిన యసహాయో గాస్త్రము విజయమునకు మాఱుగ నపజయమును జేకూర్చినదని గ్రహించెను. మరల నొకసారి బుద్ధిగఱపు యత్నమునఁ బ్రవృత్తుఁ డయ్యెను. ఒకనాఁటి యుదయమున నించుక మాటలాడవలసి యున్నదిగానఁ జెంతకు రమ్మని రమదేవికి వర్తమాన మంపెను. ఆమాట నాలించి రమదేవి కడుఁబ్రసన్నయై తన సక్కు దారుపైఁట పరికిణీని ధరించి, గంగిరెద్దువలె నొడలు సింగారించుకొని ప్రసిద్ధునికడ కరిగెను.

రమదేవి వేషమును జూచినంతనే ప్రసిద్ధునకుఁ గనుబొమలు ముడివడియెను. కన్నుల నీరుగ్రమ్మెను. కాని, కార్యాంతరమున రావించినవాఁడు గాన నామెను చిన్నపుచ్చుట యనుచితమని యెంచి తన మనోవైకల్యమును లోనడంచుకొనియెను. అనంతర మా దంపతుల కిరువురకును గొంత తడవు ప్రసంగము ప్రవర్తిల్లెను. కాని వారి ప్రసంగోదంతమేదియో రహస్యముగ జరిగిన దగుట నెఱుకపడకపోయినను, దద్ఫలితము భీషణరూపముఁ దాల్చినదనియు, వారి కన్యోన్యము జనించిన వైషమ్యములు ప్రవృద్ధము లయ్యెననియుఁ దెల్లమయ్యెను. అంత రమదేవి యత్తింటి నుండ నొల్లక తన్నుఁ గొనిపోవలయునని పుట్టినింటివారికిఁ దెలిపెను. ఆమె యిష్టప్రకారమే పుట్టినింటివా రామెను గొనిపోవుటకు వచ్చిరి. కాని, యామె యత్త యా విష

యమునకుఁ బ్రతికూలమును గనఁబఱచెను. అందులకు రమదేవి క్రోధోన్మత్తయై యర్ధరాత్రమున నింటివా రందఱు గాఢ నిద్రాపరవశులైయుండ నేరికిని దెలుపక లేకుండ నిలువీడి పుట్టినింటికి కరిగెను. పుట్టినిల్లు చేరినవెంటనే "బలవంతముగఁ బ్రాణములనైన విడువగలనుగాని యింక నత్తవారింటికి మాత్రమరుగుట కొడఁబడ నేర" నని తల్లిదండ్రులతోఁ బల్కుచు వారి పాదములమీఁదఁబడి గోలుగో లున నేడ్చెను. ఆమె యేడ్పును జూచి తల్లిదండ్రులు భరింపనేరక "తల్లీ! మేము బ్రతికియుండ నీవత్తింటి కరుగవలసిన యవసరములేదు. మా ప్రాణములనైన విడుతుముగాని నిన్ను విడువము. నిన్నింటికనుపము." అని పలుకుచు నామె నోదార్పఁ జొచ్చిరి.

*　　　　*　　　　*　　　　*

రమదేవి యొరు లేపను దెలుపంగకుండునట్లుగ నర్ధరాత్రమున నిలువీడి పుట్టి నింటి కరిగెను. ఆ కార్యమున కామె యత్త యెంతయుఁ గుపితయయ్యెను. పిలిచి తెచ్చుకొనుటకామె యొడఁబడదయ్యెను. పుట్టినింటి కేరీతిగా నరిగినదో యత్తింటికిని నా రీతిగనే రావలయునని యామె యాశయము. అశయమే కాదు. ఆట్లు పిలిచి తోడుకొని వచ్చుట యవమానకరమనియు నామె తలంపు. ప్రసిద్ధుఁడు తల్లి కెఱుక లేకయే తన సతికడకు మరలి రావలయుననియు, తన మామకడకుఁ గూఁతు నంప వలసినదనియు నాలుగైదు పర్యాయములు వార్తనంపెను. కాని, ఆ వార్తలను వాని సతిగాని వాని మామగాని లక్ష్యపెట్టలేదు. ఎన్నఁడును రమదేవి తలిదండ్రు లామె నత్తవారి యింటికరుగుమని హెచ్చరించుటయునులేదు. అంతటఁ బ్రసిద్ధుఁడు నిరాశుఁడై, నిరుత్సాహుఁడును, నిష్ప్రయత్నుఁడునునై యూరకుండెను. అతని మిత్రులును హితైషులును, అతని సతిని న్యాయస్థానము మూలముగ రక్షించుకొనుమని యాతనికి హితము నుపదేశింపఁబూనిరి. కాని, యాతఁడు వారి హితవచనములను బెడచెవి నిడినవాఁడే కాని, లెక్కపెట్టినవాఁడు కాఁడయ్యెను.

రమదేవి పుట్టినింట గౌరవముతో, ముద్దుముచ్చటలతో, నాదరాభిమానములతో, జూడఁబడియెను. క్రమక్రమముగ నామె యెడ నుదాసీనత పొడసూపఁ జొచ్చెను. ఆమె తలితండ్రు లామె వర్తనమునకును, నామె పరుష వాక్కులకును సహిష్ణులగు చుండిరి గాని, యన్నదమ్ములు, వదినెలు, మఱదండ్రు మొదలగువారు క్రమముగ నసహిష్ణుతఁ జూపుచుండిరి. ఒకనాఁడు రమదేవి నిష్కారణముగఁ దన వదినెతో జగడమాడసాగెను. వదినెతోఁగావించిన జగడము నిర్హేతుక మగుటవలనఁ దత్పరిణామము వికటముగ నామె యెదుట నుపస్థితమయ్యెను. అంత నామె వదినె

యామెను "ఇంత జగడాలమాటివి గనుకనే యత్తవారియిల్లు వీడివచ్చితివి. పండు వంటి కాపురమును జెడఁదన్నుకొంటివి. తిన్నసైనదాన వగుదువేని అట్టి పతినివీడి యెట్లు రాఁగలవు! వచ్చినదానవు వచ్చినట్టు పడియుండుము. ఇంత యాగడమా? నా పంచఁజేరి నాతోనే కక్షగట్టిపోరుటయా? నీ కాపురమునకు నీవు నీళ్లుపోసుకొని వచ్చితివి. దాన సిగ్గుపడి యూరక పడియుండుము. పరులకాఁపురమును జెడఁగొట్టుటకు సిద్ధపడకు" మని తిరస్కరించుచు నిష్ఠురముగఁ బలికెను.

వదినె పలికిన పలుకులు రమదేవికిఁ గర్ణశూలము లయ్యెను. హృదయమును జీల్చివేయునవి యయ్యెను. అంత నామె గోలు గోలున నేడ్చుచుఁ దల్లి చెంతకుఁ బోయి వదినె పలికిన పలుకులను దెలిపి, "ఇఁక నీయింట నుండనొల్ల. ఎందైనఁ జని బిచ్చమెత్తికొని బ్రతికెదను. లేదా గంగలోఁబడి ప్రాణములు విడిచెద" నని పల్కుచు నేడ్వ నారంభించెను. అపుడు తల్లి కోఁడలిని దూలనాడుచు, రమదేవికి సాంత్వనముఁ గొలిపెను. కాని, రమదేవి కామె వదినెయందుఁ గల మత్సరమును రూపుమాపదయ్యెను. దాన నామెకుఁ గల మచ్చరము దినదినము నభివృద్ధిని బొంది, గృహకలహమును బుట్టించెను. ఇంటిలో హాహాకారము లుదయింపఁ జేసెను. ఇంటిలోనివారి యెల్లరహృదయములను వికలములను గావించెను. గృహమునఁ గల్లోలము నకుఁ గారణభూతురాలై నట్టియు మత్సరరూపిణియునగు నారమదేవిని నిల్లువెడలించుటకు హెచ్చరిక యుదయించెను. తదుద్యమమున నెల్లవారును బ్రవృత్తులగునట్లు చేసెను. రమదేవి స్వభావము సహజముగ దుష్టమయినది కావున నత్తింటనుండ నొల్లక వచ్చెననియు, నెపుడును సభ్యతలేకయుండుననియు, నామెతండ్రియు, నన్న దమ్ములును, వదినెలును, మఱఁదండ్రును, దక్కుంగల బంధుజనులు తలంచిరి. దోష మంతయు రమదేవియందే యున్నదిగాని, ప్రసిద్ధునియందు గాని, యాతని తల్లియందు గాని, తండ్రియందు గాని యిసుమంతయు లేదని గ్రహించిరి. ఆఁడుబిడ్డ యత్తింట నుండఁదగినదిగానీ, పుట్టినింట నుండదగినది కాదని యెంచిరి. ఆమె నత్తవారింటి కంపఁ బ్రయత్నింపసాగిరి. కాని, యామె తల్లి, తన కూఁతురునందుఁ దిలమాత్ర మేనియు దోషము లేదను విశ్వాసము దృఢముగ నూనియున్న దగుటవలనఁ గూఁతు నత్తింటి కనుపుటకుఁ బ్రబలమగు విరుద్ధభావమును బ్రకటించెను. ప్రసిద్ధుఁడు పరస్త్రీ రతుఁడై తన కూఁతునందుఁ బ్రేమ వీడియున్నవాఁడు గావునఁ దనకూఁతు నాతనికడ కనుపుట పపన్నాలమని యెంచసాగెను. సతీపతుల కన్యోన్యానురాగమును జనింపఁ జేయుటకు మణిమంత్రౌషధసిద్ధులు సాధనములని నిదర్శనపూర్వకములుగఁ దన పతి కెరింగించి, ప్రసిద్ధునకు రమదేవియందుఁ బ్రేమానురాగముల నుదయింపఁ జేయుటకు-

దత్సాధనములఁ జేయవలసినదని యాతనికి బోధించెను. రామదీను మహాజనుఁడు జన్మమున వైశ్యుఁడు. దానికిఁ దోడుగ నిరక్షరకుక్షి. అంధవిశ్వాసి. లోకజ్ఞాన శూన్యుఁడు. దాన నాతఁడు తన భార్యచెప్పినమాటలను యథార్థములని తలఁచి తత్సాధనములఁ జేయుచుండుట కుద్యుక్తుఁ డయ్యెను. ఇట్టి సాధనముల సలుపుటకుఁ దగిన సమర్థుఁడు హరదత్త పండితుఁడేయని భార్యాభర్త లిరువురుఁ గూడఁబలుకు కొని, తత్సాధనముల నాతనిచేఁ జేయించుటకుఁ గృతనిశ్చయులైరి.

రామదీను మహాజనుఁడు హరదత్త పండితుని రావించెను. హరదత్తుఁడు మస్తకమునఁ ద్రిపుండ్రములను, గంఠమున రుద్రాక్షమాలలను, భుజమున దుశ్శాలు లను, హస్తమునఁ బంచాంగపుఁ గట్టను, ధరించి బొజ్జ నాడించుకొనుచు రామదీ నుని యంగడి కరుదెంచెను. రామదీనుఁడు నమస్కారము చేయకపోయినను, "అష్టై శ్వర్యాభివృద్ధి రస్తు – ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు, పుత్రపౌత్రాభివృద్ధి రస్తు." అను మొదలుగాఁగల యాశీర్వాద వాక్యములను వర్షముగఁ గురిపించెను. రామదీనుఁడు హరదత్తునిఁ జూచి, లేచి వినమ్రుఁడై ప్రణతు లర్పించి, వేఱొక గదిలోనికిఁ గొని పోయి, రమదేవి వృత్తాంతమును వినిపించి, యామె పతియామెకు వశవర్తిఁ డగుట కేదైన సాధనములు సలుపుఁ డని ప్రార్థించెను. అంత హరదత్తుఁ డప్రయత్నముగఁ బక్షివలలోఁ బడెనని సంతసిల్లుచు, "అహా! ఇదనెంత? నాయెడమచేతి చిటికెన ప్రేలి పని. ఇందుల కింత విచారమేల? ఒకమండలము మంత్రానుష్ఠానమొనర్చినఁ బ్రసిద్ధుఁడు నీకూఁతును చుట్టుచుట్టుఁ దిరుగువాఁడగును. ఆమె చేతిలోని యాట బొమ్మ యగును. అని శపథపూర్వకముగఁ జెప్పుచున్నాఁడ. కాని, యిందుకు ధనము వ్యయ మెక్కుడగు నని వెనుదీయుచున్నాను. ముందు మంత్రానుష్ఠా నమునకు సంకల్పము చేయించి పిమ్మట డబ్బునకు వ్యయమగు నని వెఱచి వెనుదీసిన యెడల కూఁతు జీవనమునకు విపత్తు కలిగించిన వాఁడవగుదువు. కాఁబట్టి ముందుగ వ్యయము విషయ మాలోచింపుము" అని పలికెను. అతని మాటల నాలించి రామదేనుఁడు "డబ్బు వ్యయమగు నని వెనుదీయువాఁడను గాను. ఎంత వెచ్చింపు మన్నను వెచ్చింతును. పదిగాని పాతిక గాని వ్యయమయిన నగుఁగాక! మనకుఁ గావలసినది పిల్ల బ్రతుకు అది ముఖ్యముగాని ధనము ముఖ్యమా?" అని ప్రత్యుత్తర మిచ్చెను. హరదత్తుఁ డామాటలు విని గ్రుడ్లు పెద్దవిగఁ జేసి, "శ్రేష్ఠి గారూ? ఈసాధనము పదిపాతికతో సాగునది కాదు. అధమాధమము సగముసంచి వదల వలసి యుండును. ఇందొక బ్రాహ్మణుఁ డర్ధ మండలము రేయంబవళ్ళు స్మశా నములో నుండి యనుష్ఠానము సలిపినఁ గదా యక్షుఁడు ప్రసన్నుఁ డైనఁ గాని

నీకూఁతు కాపురము సరిపడదు. దక్షిణను బట్టి శ్రద్ధ శ్రద్ధను బట్టి ఫలము. కాబట్టి యనుష్ఠానము చేయు బ్రాహ్మణునకు ననుష్ఠానమునం దెక్కుడు శ్రద్ధ కలుగుటకు దక్షిణ నెక్కుడుగ నీయవలయును. తక్కువ యొసంగిన యెడల దానికిఁ దగు శ్రద్ధతో ననుష్ఠాన మొనర్చును. ఏయత్నునిఁ బ్రసన్ను మఖలషించి యనుష్ఠానము చేయించుచుంటిమో, యాయత్నుఁడు, విస్ఫుక్తముగఁ దృప్తికరముగఁ బూజితుఁడుగానినాఁడు, ప్రసన్నుఁడు కాఁడు సరియేగదా? కుపితుఁడై నీకూఁతు ప్రాణము మీఁదికే వచ్చిపడును. కాఁబట్టి యనుష్ఠానముచేయు బ్రాహ్మణునకు భూరి దక్షిణ యొసంగుట యత్యంతావశ్యకము.'' అని పల్కెను. రామ దీనున కయిదు వందల రూపాయలు వ్యయమగు నను మాటచెవులలోఁ బడినంతనే గుండెలో రాయిపడెను. కాని, పండితుని మాట కనంగీకారముఁ జూపినఁ గార్యము చెడునని తలంచి, యిప్పటికి వల్లెయని పల్కెదను. సందర్భము జరగిన తర్వాతఁ జూచుకొననగు'' నని యనుకొనుచు, హారదత్తునితో '' కానిండు. అయిదువందలవ నొకలెక్కయా? కార్యము సానుకూలమగు నేని, పదివందలయినను లెక్కలేదు'' అని పలుకుచు హారదత్తున కయిదువందల రూప్యముల నిచ్చుటకు నంగీకరించిన వాఁడయ్యెను.

హారదత్తుఁ డింటి కరుదెంచి, తన సతియగు స్వర్ణలతతో '' అయిదువందల రూపాయిల నొసంగు పక్షి పట్టుపడెను.'' అని పరమ సంతోషమునఁ బల్కెను. స్వర్ణలత యాదినమున భర్తకుఁ బిండివంటలతో విందుచేసెను. తనపతి యేనాఁడు ద్రవ్య సంపాదనమును వినిపించునో యానాఁడాతనికిఁ బిండివంటలతో భోజనమిడుట స్వర్ణలత కాచారము. ఆపండితుఁడు స్విష్టకృత్తుగ భుజించి ''జాణే! చూచితివా? ఒకటి కాదు. రెండు కాదు. ఐదువందల రూపాయలు. ఒక్కమారు నీకళ్ల ముందటికి వచ్చిపడును. ఆ యయిదు వందల మహాజనుఁడు తన పనియయిన తరువాత నిచ్చును. ఆపని గిని మతేమియు లేదు. అది నేను వేసిన పాచికయే. ఇట్టి పాచికలను సారించి యిదివఱ కెందఱినో లోఁబఱచు కొన్నాను. ప్రస్తుతము సగము సొమ్ము చేతిలోఁ బడుట కభ్యంతరములేదు. ముందువ్యయమున కని లాగెద. తరువాత నిరువది దినము లగుట తడవుగ రామదీనుని కూఁతుఁతో ''నీమీఁద దయ్యము వ్రాలినది. ఆదయ్యమును నీపెనిమిటిని నీవశము చేయుటకై పంపెదను. కావున నాదయ్యమును లోఁగఁ దీసికొనుటకును, అది నీకోరికల నిచ్చునట్లు చేసికొనుటకును గొంత కాలము పూజచేయవలెను. ఆపూజకుఁ గొంతవ్యయమగును. ఎంత వ్యయమైనను సందేహింపకుము. పూజ వదల వలదు. డబ్బునకు నీకేమి తక్కువ. మహారాజు కడుపునఁ బుట్టితివి. మహారాజును చేపట్టితివి. అని చెప్పి దాని దగ్గఱ నుండి కూడఁ

గొంత డబ్బు లాగెదను. అటుతరువాత రామదీనునితో నీకూఁతుపైని దయ్యము వ్రాలినది. ఆదయ్యమునకు విధ్యుక్తముగఁ బూజ జరుగనిచోఁ గష్టము. ఇపుడు పూజ జరుగలేదని కోపించినది. అందువలన మనపని సఫల మగుటలేదు. కాబట్టి యిపు డైన వెనుదీయక పూజచేయింపుము. లేకపోయిన నీకూఁతునకు ప్రాణము మీఁదికిఁ దెచ్చిన వాఁడవగుదువు' అని చెప్పెదను. అపుడు మిగిలిన సగము సొమ్మే కాదు ఇంకను నెక్కువ, ఎవరి కోసము? తప్పక యిచ్చును" అని తనభార్యతోఁ బలికెను. ఆపలుకులు విని స్వర్ణలత సరిసరి. మీయాలోచన మిగుల బాగుగ నున్నది. ఇపుడా రూపాయలు పెట్టి కంటెయుఁ గాసుల పేరును తప్పక చేయింతురు కదా ఓగంగమ్మ తల్లీ! దినదినము నొక్కొక్క మూరుని లోఁబఱచుచు నాయొడలు బంగారముతో నింపుచునుందుము తల్లీ! నేను దినదినము గంగాస్నానము చేయు చుందు" నని గంగాదేవికి మ్రొక్కెను.

*   *   *   *   *

పండిత హరదత్తు రామదీనుని కడనుండి అయిదు వందలే కాదు. అంతకు నెక్కువగనే సంగ్రహించెను కాని, యాతఁడు చేసినది యేమియును లేదు. సాధించినది అంతకంటెను లేదు. ఇంతకును జేయుటకును సాధించుటకును నేమియున్నది? అది యంతయు నాతని మాయాకౌశలము ధనసంగ్రహమునకు సాధనము. హరదత్తుని మంత్రానుష్ఠానము వలన రమదేవికి, మేలునకు బదులుఁగఁ గీడును, సుఖమునకు బదులుగ దుఃఖమును, సంప్రాప్తము లయ్యెను. తనమీఁద దయ్యము వాలినదని హరదత్తుఁడు చెప్పిన మాట నిజమని యామె మనమున దృఢవిశ్వాస ముదయము యినందున, నామె మనమునఁ జాంచల్య ముదయించెను. అట్లు దయ మయిన మన శ్చాంచల్యము దిన క్రమమున మతి భ్రమణముగఁ బరివర్తన మయ్యెను. ఆమె మాసిన ట్టియుఁ, జినిఁగినట్టియుఁ బ్రాఁతపేలికలను ధరించి తల విఱియఁబోసికొని, యిలు, వీడి వీధులఁ వెంబడిఁ దిరుగఁజొచ్చెను. ముఖము నెఱిఁగినవారు ఆమెదుస్థితిని గను విచారింప సాగిరి. ఎఱుఁగనివారు పరిహసింప సాగిరి. అతతాయు లామెపై రాళ్లు రువ్వుచు నెగతాళి చేయుచుఁ బలువిధములు బాధించుచుండిరి. కాని. యెన్నఁడైన గదిని బంధించుటకు మరచిన యెడల నామె వీధులవెంబడిఁ బరుగిడక మానదు.

ప్రసిద్ధుఁడు తాను రమదేవి వాార్ధక్యమును మరల్చుటకు మును ముందు యథాశక్తి ప్రయత్నమును సలిపి యున్నను, బర్యాయముగ నొక్కపరి విముఖత్వమూని, పెద్ద యపరాధమును, బెద్దయనర్థమును జేసినాఁడనని పరితాప మొందఁజొచ్చెను. తానీవిధమున నిరాశఁ జెందక యసహాయోగమును గ్రహింపక సాదరముగ నామెని.

మార్గములోనికిఁ దెచ్చుటకు నిరంతర ప్రయత్నము గలవాఁడై యుండి యున్నచో, నామె యిట్టిదురంత సంఘటనమునకుఁ బాలు కాకుండు నేమో యని విలపింపసాగెను. అతఁడొనర్చిన యపరాధమాతనికి హృదయ కంటకమయ్యెను. అతఁడు తన వ్యాపారము నంతను బరిత్యజించి తన సతికి స్వాస్థ్యమును నొసఁగూర్ప నెంచి ప్రఖ్యాతులును, సిద్ధహస్తులును నగు వైద్యులను, కవిరాజులను, డాక్టర్లను, ఒలఁవురఁ రావించి పలువిధములగు చికిత్సలను జేయించెను. కాని, యామెమూర్ఖ చిత్తమున, “ నీమీఁద దయ్యము వ్రాలిన ” దని హరదత్తుఁడు చెప్పినమాట దృఢతమమై యొప్పుచుండిన కతమున నాచికిత్స లెవ్వియును, నామె చిత్తవిభ్రమణమునకుఁ బరివర్తనమును గలిగింప నేరనివయ్యెను. చిత్తవిభ్రమణము కలిగిన కొలఁది దినములలోనే యామె యన్నపానములను బరిత్యజించిన యది. అన్నపానములను బరిత్యజించిన పదునైదు దినములలో నీఘోర సంకటమునుండి విముక్తిఁ జెంది పరలోకగామియయ్యెను.

రమదేవి మృతినొందిన నాఁట నుండియుఁ బ్రసిద్ధుని మనమున వైరాగ్యముదయించెను. సంసార మపారముగఁ దోఁచెను. అతఁడు రమదేవికిఁ జిత్తవిభ్రమణము కలిగినపుడే వకాలతువృత్తిని తదితరవ్యవహారములను విసర్జించి యున్నవాఁడు. ఇపుడాతనికిఁ దల్లిదండ్రులు, హితులు, మొదలగు వారెల్లరు విరక్తులైరి. ఇల్లు వాకిలి, యైశ్వర్యము, సుఖానుభవము, నసహ్యము లయ్యెను. ఆ బాల్యమిత్రుఁడగు నానందస్వరూపుని తోడిసంగతియు, నాతనితోడివార్తాలాపమును, గూడ విషతుల్యములుగఁ బరిణమించెను. ఆనందుఁడు ప్రసిద్ధుని మనోవైకల్యమును ద్రిప్పుట కెన్ని ప్రయత్నములో చేసెను. నాటకములకు, సినీమాలకు, గానసభలకు, వినోద స్థానములకుఁ గొనిపోవసాగెను. వింతవింత దృశ్యములును, జిత్తాకర్షకములునగు ప్రదేశములకుఁ దోడ్కొని పోవుచుండెను. మిత్రబృందమునుజేర్చి జంత్రవాద్యములందును, హాస్యప్రసంగములయందును నాటకములయందును లగ్నచిత్తునిగఁ జేయుచుండెను. కాని, యెన్ని చేసినను, బ్రసిద్ధుని వైరాగ్యము, మనోవైకల్యములు, నుపశయమిల్లుటకు మారుగఁ బ్రజ్వరిల్లు చుండెను. ఒకనాఁటి యుదయమున నాకస్మికముగఁ బ్రసిద్ధుఁ డెరికిని దెలియకయే యెందో వెడలిపోయె నను వార్త నగరమందెల్లయెడలఁ బ్రతిధ్వనించెను.

* * * *

లాలా వింధ్యవాసినీ ప్రసాదుఁడును, నాతని సతియుఁ దన కుమారుఁడగు బ్రసిద్ధుని మనోవైకల్యమునుగని యిదివఱకేయర్ధము మృతులైయున్నవారు. పిమ్మటఁ బ్రసిద్ధుని గృహత్యాగమును, నాయిరువుర హృదయములను విదీర్ణము గావించెను.

ఏకైకపుత్త్రుఁడు. ఎన్నఁడును గనుమరగి యుండనివాఁడు. ప్రాజ్ఞుఁడు. ప్రయోజకుఁడు. పేరుప్రతిష్ఠలఁ గనినవాఁడు. అట్టివాఁడు దుఃఖాకులుఁడై, వికలహృదయుఁడై, విరాగియై యిలువదలి, పలాయనము నొందినపుడు, వృద్ధులగు మాతాపితల కలవడు దుఃఖము నింతింతయని యెవరు చెప్పఁగలరు? వింధ్యవాసినీ ప్రసాదుఁడు తన సంపదలో నర్ధమున్న కంటె నెక్కువ ప్రసిద్ధుని యన్వేషణమున వ్యయము చేసెను. ప్రసిద్ధునిఁ గొని తెచ్చినను, లేక యాతని యునికి నెఱింగించిన వారికి, నైదువేల రూప్యములు పురస్కారమొసఁగఁ బడునని వార్తాపత్త్రికలలోఁ బ్రకటించెను. విజ్ఞాపన పత్త్రములను బంచిపెట్టెను. కాని యెవరును నీపనిని జేయఁజాలరైరి. ప్రసిద్ధుని యన్వేషణమును గూర్చి యానందుఁడు మాత్రము స్వయముగఁ బెక్కులు తీర్థములు క్షేత్రమును, పల్లెలుఁ పట్టణములు, నగరములు, తిరిగి తిరిగి వెదకెను. గాని, ప్రసద్ధుని యుదంతము నెఱుఁగఁజాల డయ్యెను.

ప్రసిద్ధుఁడు పలాయన మొనర్చిన దినముననే యాతని జనని దుఃఖాతిరేకమున వివశయై యన్నపానములను వీడి యాతఁడు దొరకఁగలఁడను నాశప్రబలముగా నుండుటవలనఁ బ్రాణములను జిక్కఁబట్టియుండెను. ప్రసిద్ధుఁడెందును జిక్కలేదని యెందున్నదియుఁ దెలియలేదని చెవులఁ బడినంతనే యామె యవస్థయింత శోచనీయ స్థితికి వచ్చెను. అట్టి సమయమున హఠాత్తుగఁ దనపతికిఁ బండితసతీప్రసాదు భవనములోనే మృతుఁడయ్యెనను వార్త చెవులఁ బడెను. వెంటనే యామె భూమి మీఁదఁ బడి మూర్ఛిత యయ్యెను. ఆమె యామూర్ఛనుండి తెలివి పొంది మరలలేచి మసలకయే పోయెను.

ఆనందుఁడు తన బాల్యమిత్త్రుని తలిదండ్రుల మృతకళేబరములను రెండింటిని తైలమందునిచి వార్తాపత్త్రికలలో "ప్రసిద్ధనారాయణుని తలిదండ్రు లిరువురును నేఁడొక్కసారిగ మృతులైరి. వారి మృతశరీరములు సంస్కారరహితములై పడి యున్నవి. ప్రసిద్ధుఁడెందైననుండిన నీసువార్తనెఱిగిన తత్క్షణ మింటికి మరలి రావలయును." అని ప్రకటించెను. ఈ వార్త ప్రకటితమైన రెండుమూఁడు దినములు ప్రసిద్ధుని రాకకుఁ బ్రతీక్షించియుండెను. కాని, యాతనిజాడ కనఁబడ దయ్యెను. అనంతర మానందుఁడు ప్రసిద్ధుని జననీజనకుల మృతకళేబరములకు విధ్యుక్తముగ దహనసంస్కారమును గావించెను. వారల కూర్ధ్వదైహికక్రియల నిర్వర్తింపఁజేసెను. తదాత్మలకు శాంతి యలవడుటకు దానధర్మములను జేయించెను. బ్రాహ్మణ సమారాధనలను జరిపించెను. తద్బంధుజనుల నందఱను మృష్టాన్న సంతుష్టులఁ గావించెను. వింధ్యవాసినీ ప్రసాదుని సంపత్తునంతను సురక్షితముగ నునుచు బాధ్యతను స్వయముగ నానందస్వరూపుఁడే గ్రహించెను.

ఈ ఘోరవిపత్పాతమును, నీ యనంతదుఃఖసంభరిత సంఘటనమును, ననుకూల వివాహములుచేయు వారలును, చేసికొనువారలును జక్కఁగ గమనింతురుగాక! దేశారిష్టమునకును, సమాజానర్థమునకును, ననుకూల వివాహములును, ననుకూల దాంపత్యములును బ్రధాన కారణములని లోక మెఱుఁగుఁగాక!.

## పదునాలుగవ ప్రకరణము

ఇఁక శైలకుమారిని 'మిస్' అని యనరాదు. మిసెస్ ఆనందస్వరూప్ అనవలెను. పండితసతీ ప్రసాదుఁడు సమాజ సుధారకులఁ బోలె దనకుమారుని వివాహము మహావైభవముతో జరపెను. వేలకొలఁది రూప్యములను, అనాథాలయమునకును, విధవాకష్ట నివారిణీసభకును, దిలకు స్వరాజ్యకోశమునకును, విద్యాలయములకును, దానమొసంగెను. పండితసతీప్రసాదు తన బంధు జనులకు వ్యవహార సంబంధములు గలవారి నానందింపఁ జేయుటకై "మంగళముఖు" మను మేళమును రావించి వివాహోపలక్ష్యముగ నృత్యగానములను బ్రదర్శింపఁ జేసినవాఁడు కాఁడు. ఈవివాహోత్సవ దిదృక్షులు నాగరికులు మహానందభరితులైరి, కాని, వృద్ధాచార సంపన్నుల విచారణమున కీవివాహము మేళము లేకయే జరగిన కారణమున నంత వైభవముతోఁ గూడినదిగఁ గనఁ బడుటలేదు.

మిసెస్ శైలకుమారి యింటిలో నడుగిడుటయే తడవుగ నామె యత్త యామెకు "ఆనందరాణి" యని ముద్దుపేరిడియెను. కాని, యాముద్దుపేరు వ్యవహార ప్రాచుర్యము గనినది కాదయ్యెను. శైల యత్తింటి కరుదెంచిన పిమ్మట నామెకు హర్షదేవుని యందుఁ బొడమిన ప్రేమానురాగములు విస్మృతము లయ్యెను. అట్లగుట బహుశః ఆంగ్లేయశిక్షణము వలన నలవడు సభ్యతాప్రభావమై యుండవచ్చును. ఆంగ్ల శిక్షితలు నవనాగరకులు ప్రేమను సుస్థిరముగనుండు బంధనముగఁ బరిగణింపరు. అస్థిరమగు మనోవినోదముగఁ దలంతురని పలువురి యాశయము.

వివాహమైన వెంటనే శైల యత్తింటి కరుదెంచి యాఱుమాసము లుండెను. ఈయాఱుమాసములును, గడుముద్దుగఁ గడు గారాబముగఁ జూడఁబడెను. అత్తయు, మామయుఁ, బతియు నామెకు సుఖ సంతోషముల నొడఁ గూర్చుటకుఁ బలు విధములగు యత్నములు సలుపఁజొచ్చిరి. కాని, వారి వర్తనము, వారి యత్నములు నామెకు బాహ్యదృశ్యములుగఁ దోఁచి నందున నామె ముఖము వికసితముగ నుండుటలేదు. ఆమె యత్త యామెకుఁ దల దువ్వి జడవైచి వస్త్రాభరణముల నలంకరించుట కెంతయు నుత్సుకయై యెన్నిపర్యాయములో దాసికలను బిలువనంపెను. గాని శైల తన

యత్త యుత్సుకతను నెన్నఁడును బూర్తి కానిచ్చినది కాదు. బి. ఏ. డిగ్రీని బొందిన శైలకు పాశ్చాత్యవనితల పరిపాటి పడిన శైలకు నీసింగారములు, నీయాభరణములు రుచికరములగునా? సహ్యములగునా? ఈసింగారము, ఈయాభరణ ధారణము, నవనాగరిక లక్షణమని సిద్ధాంత మొనరించెను. తనయత్తయుత్సుకత యవివేక జనిత మని నిశ్చయించెను. సింగారములను నాభరణములను నేవగించెను.

సాధారణముగ హిందూగృహములలోనికిఁ గ్రొత్త కోడండ్రు వచ్చినచో వారి బంధువుల యిండ్లలోని వారును, మిత్రుల యిండ్లలోనివారును, బరిచయము గల యిండ్లలోని వారును వచ్చి చూచుటయు, వారి పరిస్థితులకుఁ దగిన రీతిని బురస్కృతుల నొసంగుటయుఁ బ్రచలిత మగు నాచారము. ఆయాచారము ననుకరించి శైలను జూచుటకుఁ బలువురు స్త్రీలరుదెంచుచుండిరి. పండిత సతీప్రసాదు నగరములోఁ బేరుపొందిన సంపన్న గృహస్థుఁడు. అతఁడు, సంపన్నులు, బమీందారులు, ప్రతిష్ఠితులు, వర్తకులు, మొదలగువారలతో, మైత్రియు, వ్యవహార సంబంధమును గలిగియున్నవాఁడు. తత్కారణమున వారి వారి యిండ్లలోని స్త్రీలు శైలను జూచుటకు రాఁదొడంగిరి. రెండుమాసముల వఱకుఁ బ్రతి దినమును నగరనారీమణులు శైలఁ దిలకించు కుతుకమునఁ బండిత సతీప్రసాదు భవనములో సమావేశమగుచుండిరి. శైలవర్తనమును జూచి విముఖులగుచుండిరి. తమ యిండ్లకు మరలు నపుడు, వారిలోవారు, ఆహా! ఏమి మీశైల స్వాతిశయము. దీని నిర్లక్ష్యము. దీనిమిడిసిపాటు. పెద్ద యింటి పడుచును పెద్ద యింటికోఁడలును నయిన దని యాయింతగర్వము! ఇంత కంటె నెక్కువ యైశ్వర్యవంతుల కోండండ్రను, నెక్కువ శ్రీమంతుల కోడండ్రను జూచినారము, కాని, వారిలో నిట్టి గర్వవతి నెందును జూడలేదు.” అని యను కొనక మరలిన వారొక్కరును గనఁబడరు. వారిలో:

ఒకయువతి: అక్కా! ఆమె నీవలె నావలె మూరురాలు కాదు. ఇంగ్లీషు చదువుకొనినది. బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణురాలయినది. దొరసాని. ఆమె మేఁడ మీఁదినుండి క్రిందికి దిగి వచ్చునపుడు చూచినావా? కాళ్లకు జేనెడుఎత్తు జోడు. కండ్లకద్దములు. గౌనుమీఁదఁ బెద్ద కోటు. పిఱ్ఱల దనుక వ్రేలుచుండు విరుగఁబోసికొన్న జెంద్రుకలు. క్రిందికి వచ్చినపుడైనను మనవంక చూడనైనఁ జూచునా? అదరైన లేదు. సిగ్గుఎగ్గులులేవు. నిస్సంశయముగ భర్తగదిలోఁ బ్రవేశించెను గదా?

మఱియొకయువతి: అవునమ్మా! మా తారను మాయన్న యింగ్లీషుచదివించు చున్నాఁడు నేను వెళ్లి మానిపింతును. ఆంగ్లభాషచదివించుట పిల్లను పాడుచేయుటయే గాని, బాగుపఱచుట కాదు. చాలుచాలు. వీరి కోఁడలిని జూడ బుద్ధివచ్చినది. ఇఁక నీ చదువునకొక దండము. బాబూ!

వేఱొక యువతి : అవునవును. ఎన్నఁడును బొఱపాటుగానైనను ఆఁడుపిల్లకు విదేశభాష చదివింపరాదు. ఏమున్నది ? ఈ విధముగ నాఁడు పిల్లలు చెడిపోవుదురు. అపకీర్తి పాలగుదురు. ” అని యనుకొనుచుండిరి.

శైలను జూచివచ్చినవారందఱు నీవిధముగ వ్యాఖ్యానములను రచించుచు మరలుచుండిరి.

పాపము. ఆనందుని తల్లి తన కుమారునకు వివాహము చేయునపుడు “ కోడలు వచ్చును. చదువుకొన్నది. బుద్ధిమంతురాలు. నాయందు భక్తిగలిగి యుండును. నాకన్నియు చదివిచెప్పును. లక్షలకొలఁది విలువఁజేయు నాభరణములు మూలఁబడి యున్నవి. వానికి సార్థకము కలిగించును.” అని గంపెడాశ పెట్టుకొని యుండెను. కాని, కోడలి వర్తనమును, నునికియుఁ జూచినంతనే యామె యాశ నిరాశయయ్యెను. పండిత సత్యప్రసాదుఁడు ఖిన్నుఁడయ్యెను. అత నెంతో ముద్దుతో, నెంతో ప్రేమతో, నెంతో వాత్సల్యముతో, కోడలిని జెంతఁజేరఁ బిలుచునుగాని, కోడ లెన్నఁడును నత్తచెంత కరుగదయ్యెను. శైల ప్రాతః సాయంకాలములయందు బైటికి వాయుసేవనమున కరుగునపుడు తక్కుతక్కుంగల కాలములోఁ దన గదిలో నుండి యావల కడుగిడుట కాదుగదా ? తొంగియైనఁ జూడ దయ్యెను.

ఆనందుఁడు తన మాతాపితరుల భిన్నహృదయముల యొక్కయనుభవము కలిగినవాఁడయ్యెను, దన సతిస్వాతంత్ర్య వర్తనమునకు బాధకము కలిగించుట కిష్టము లేని వాఁడై యుండెను. శైలకుమారి ప్రత్యక్షాంగ్లేయ సభ్యతాస్వరూపము. ఆనందుఁ డాంగ్లేయ సభ్యతానుగామి. ఆకారణమున నాతఁడు శైల ప్రక్క బెదరూని యుం డెను. అతఁడెన్నఁడైన శైలతోఁ దన తల్లి చెంత కరిగి కొంత తడవు ముచ్చటలనాడి యామె మనమును రంజిలఁ జేయుమని సూచనగ బలికిన యెడ నామె మొగమెఱ్ఱఁ జేయుచు “ బుద్ధిహీనులవలె మాటలాడుచున్నారు. ఇదియేమి ? ఎం. ఏ. ఎల్ ఎల్. బి. డిగ్రీలు పడసినందుల కిదియా సార్థకము ? అనాగరకులను, అవివేకులను జేరుమని చెప్పుటయా ? ఆమె చెంతకరిగినఁ గాలమువ్యర్థమగును. ఆమె యవివేకపు మాటలకు నాకు ఒడలు మంట లెత్తును. నేను సహింపఁ జాలను. నేనామెచెంత కరుగనొల్లను. ” అని బదులు పలుకు చుండును. పాప మానందుఁడు నిర్విణ్ణుఁ డగు చుండును. ఆమె మాటలకుఁ బ్రత్యుత్తరము నొసంగుటకు సమర్థుఁ డయ్యెను, బెదరి విని మెదల్పక యామె చెప్పుసమాధానమును శిరోధార్యమొనర్చుచుండెను.

* * * * *

మిసెస్ శైలకుమారి పుట్టినింటికరిగి నెలదినములుండి మరల నత్తవారింటి కరుగుదెంచెను. ఇపుడామె ప్రచండత మరింత యెక్కువ యయ్యెను ఇదివరలో

విహారమున కరుగునపు డానందుని వెంట నిడుకొని వెళ్లుచుండిన శైల యిపుడా ప్రసంగమయిన నెత్తుటలేదు. ఇదివరకు సమయ వివక్షత యుండెడిది. ఇపుడా విషయమే లేదు. ఏసమయమున నేప్రదేశమున నెచ్చట నెవరిని జూడవలయు నని మనమునఁ దలంపు జనించునో ఆసమయమున నాప్రదేశమున వారిఁ జూచుటకు బండి కట్టించుకొని ఒంటరిగ సంశయముగ నరుగఁజొచ్చినయది. నిరంకుశవర్తనయయ్యెను. ఉన్మత్తగజము వలె సంచరింపఁ దొడంగెను.

పండిత సతీప్రసాదుఁడు పూర్వాచారపరాయణుఁడు కాఁడు. నవనాగరకుల లోని వాఁడు. సంఘసంస్కార ప్రియుఁడు. స్త్రీవిద్యాభిమాని. స్త్రీసుధారకాభిలాషి స్త్రీస్వాతంత్ర్యానుమోది. అయినను శైలయొక్క నిరంకుశత సమాతిరిక్తత యగు స్వాతంత్ర్య వర్తనమునకుఁ బ్రతికూలతఁ జూపసాగెను. ఆమె యత్తమామల యెడ భయభక్తులను, బతియందు లక్ష్యమును వదలి వారి మాటల నుల్లంఘించి తన యిచ్ఛకు వచ్చిన యటులు వర్తించుచుండుటఁ జూచి, యోర్వఁజాలని వాఁడగుచుండెను. తుద కాతఁడు శైల యుద్దండవర్తనమునకుఁ గడు విదీర్ణుఁడై యామెకు ననేక పర్యాయములు హితముఁ గఱపెను. ఇట్టి వర్తనము తగదని బోధించి గట్టిగా మందలించెను. కాని, ప్రపంచములోఁ దానొక్కతెయే బుద్ధిమంతురాలనియుఁ దదితరులు బుద్ధిహీను లనియు నామె తలంపు. భగవంతుఁడు తన కొక్కతెకే జ్ఞానమొసంగిన వాఁడని యామె విశ్వాసము. కాఁబట్టి, యామె తన యాత్మగౌరవము ముందు అహంభావము ముందు, విద్యాభిమానము నందు నేరిని గుర్తిప నేరకుండెను. ఆకారణమున మామహితమును జేకొనుటయు బోధను గ్రహించుటయు, మాటను మన్నించుటయుఁ, దనగౌరవమునకు న్యూనత నాపాదించుట యని తలంచి వాని నన్నింటిని బెడచెవుల నిడుచుండెను. అంత సతీప్రసాదు నిరాశుఁడై చేయునది యేమియుఁదోఁచని వాఁడై, శైలతోడి ఘర్షణమునుండి విరమించుట శ్రేయ మని యెంచి యామెను నామె యిచ్ఛాను వర్తనమునకు విడిచిపుచ్చెను. పండిత సతీప్రసాదున కొక్కఁడే పుత్త్రుఁడు. పుత్త్రవధువు కారణముగ నేక పుత్త్రునకు మనస్తాపమున కనిష్టము గలవాఁడై, యణఁగి మణఁగి కాలమును గడుపుకొనఁ జొచ్చెను. ఆతని సతియు నాతని ననుసరించెను.

శైల దినచర్య, వైస్ రాయి ( రాజప్రతినిధి ) దొరసాని దినచర్య కేయంశమునను గొదువపడనేరదు. ఆమెకుఁ దెల్లనాఱు సరికి ముప్వురు బావర్చీలు, నలుగురు బట్లరులు కావలసి యుండును. కుక్కుటాండములు, కవాబులు, పావురొట్టెలు మొదలగున్నవి. ప్రాతఃకాలాహారమునకుఁ బితృగృహముననే యలవాటు పడియున్నది. ఆయ

లవాటును భర్తృగృహము నందును, నిర్విఘ్నముగ సాగించుకొనుచుండెను. ఆనంద స్వరూపు శైలయొక్క యీ యభక్ష్య భక్షణమునకు ఆటంకము, ప్రకటించెను. కాని శైల యాతని మొగము వాల్చుకొను వానిగ నోరెత్త లేని వానిగఁ జేసివిడిచెను. శైల యొక్క యనుచితవర్తనమున కానందుఁ డాపత్తిని బ్రకటించునప్పో నామె యాతఁడు పడసిన యాంగ్లభాషా శిక్షకును, బొందిన డిగ్రీలకును నాక్షేపణముఁ జూపుచు, "నీచదివిన చదువునకు నీపడిసిన డిగ్రీలకును గలిగిన ఫలము గడ్డికోయుట యేనా? చాలుఁ జాలు! ఆంగ్లేయులు తమ స్త్రీల నెట్టి స్వాతంత్ర్యములోనునుచు చున్నవారలో యించుక పరికించిన విశదము కాఁగలదు. వారు చేసినది యుచితమని ధర్మమని సదాచారమని తలంతురు. వారివర్తనమున హస్తము నిడువారులేరు. కాని, ఇఁక మనమన్ననో ధర్మము, అధర్మము, అకులము, ఈకులము, భక్ష్యము, అభక్ష్యము, మొదలగు నసందర్భపు నిబంధనములఁ దగులుకొని యధోగతిపాలమగు చున్నారము. ఐరోపీయులు ఇట్టి తెలివితక్కువ నిబంధనలకు లోఁబడరు. అందువలననే వారు నేఁడున్నత శిఖరమున విరాజమానులై యొప్పుచున్నవారు. మీరలింగ్లీషునం దుచ్చ శిక్షా ప్రాప్తిఁ బడసిన వారయ్యును, తద్భావ ప్రభావముల నిసుమంతయు గ్రహింపనేర కుండుటకుఁ గారణమును గనఁ జాలకున్న దాన నని తిరస్కరించుచుండును. ఆనందుఁ డందుల కందులకు యథోచితమగు సమాధాన మొసంగుటకు సాహసమును జేకొను టకు వెఱపుగలిగి యూరకయుండెను. ఇతఁడు శైలనొక వికృతప్రకృతిగ నెంచి యామెకు భయపడుచుండును. శైలయు నంకుశము లేని యున్మత్త గజముఁ బోలెఁ గళ్లెములేని గుఱ్ఱము వలెఁ దనకుఁ దోఁచిన చోటున కరుగుచుఁ దోఁచిన పనిని జేయుచు స్వేచ్ఛాను వర్తనయై మెలఁగ జొచ్చెను.

శైలకుమారి లోక వికృతములగు డాంబికములు దర్పములు, నీటులు, గోటులు వన్నెలు, చిన్నెలు, విచారములు, విహారములు, కలిగి వర్తిల్లు చున్నదయ్యును, దన కర్తవ్య నిశ్చయమును, దన జీవితోద్దేశమును మరచి యుండలేదు. ఉచ్చశిక్షఁగని బి. ఏ. పట్టమును బడసి జీవికను భోగవిలాసములఁ దగిలి వ్యర్థమొనర్చుట యామె యాశయము గాదు. స్త్రీసమాజ సుధారక మామె యాశయము. తదాశయము తండ్రి శిక్షణము వలన నుదితమైన యది డాక్టరు కుముదవిహారి తనపుత్త్రికయగు శైలకుఁ బలుమారులు " పుత్త్రీ! స్త్రీసమాజ సుధారకమును స్వాతంత్ర్యప్రబోధనమును నాయభీష్టములు. నామనోరథముల నీడేర్చుకొనుటకు నిన్ను సాధనముగఁ జేసికొని యుంటిని. నీకింత యుచ్చశిక్షయలవఱచితిని. కాఁబట్టి నాయభీష్టముల నెఱవేర్చుటకుఁ గంకణబద్ధురాలవు కావలయు" నని నొక్కి చెప్పియుండెను. అందువలన నామె తండ్రి యుపదేశమును హృద్గత మొనర్చి మననము చేయుచుండెను. ఆమెకు వయస్సు

వచ్చిన కొలఁదిని, లోకజ్ఞానమును, స్త్రీజాతియందుఁ బ్రబలము గ జూపట్టుచుండ పరవశతల యందును, విషాదము మిక్కుటముగఁ గాఁజొచ్చినందువలన స్త్రీలను గూడఁ బురుషులకుఁ బోలె స్వాతంత్ర్యాధికారములను బడయు వారలనుగఁ జేయ వలయు నను నభిలాష మామె యందధిక మయ్యెను. స్త్రీసమాజ సుధారకమును, స్త్రీస్వాతంత్ర్య సంపాదనమును, గర్తవ్యములుగ జీవితాదర్శములుగ నెన్నఁజొచ్చెను. ఇపుడు తనయంకుఁ దన కర్తవ్యమును బరిపాలించుటకుఁ దగుసాధన సామర్థ్యములు చూపట్టు చున్నవని నిశ్చయించి నూతన విచార శీలలగు యువతులలోఁ దన ప్రభావము, పేరు, ప్రతిష్ఠలు, గణ్యములుగను మాన్యములుగ నగుచుండుటఁ నిని, సమాజమందు స్త్రీస్వాతంత్ర్యాందోళనమును బుట్టించుట కుపయుక్త సమయ మిది యని నిశ్చయించెను. అందువలనఁ దనభవనమునందే యొక విరాట్సభను సమకూర్ప నెంచి తదను గుణముగఁ బ్రకటన పత్రికలను, గరపత్రముల ప్రచురణములు గావించెను. పరిచితులును, బ్రతిష్ఠితులును నగు వారి యువతుల కాహ్వాన పత్రికల ననిపెను. సభోద్దేశములను, బహిరంగముగ సర్వవ్యాప్తములగు నటుల బహుళప్రచారము గావించెను.

## పదునైదవ ప్రకరణము

నేఁడు మహిళాసభ సమకూడుదినము. శైలకుమారి భవనము పచ్చతోరణములతో విరాజిల్లుచుండెను. నిశ్చిత సమయమునకుఁ బూర్వమే మహిళామణు లరుదెంచి సభాస్థల మలంకరించిరి. శైలకుమారిని నగరనారీమణులు దొరసానియని పేర్కొనఁ జొచ్చిరి. దొరసాని యని యనిపించుకొనుటచేత నామె కుత్సాహ మెక్కుడగుచుండెను. ఆమె మాటల నాలించుటకు యువతులనేమి! తరుణులును, వృద్ధలును నత్యుత్సుకు లగుచుండిరి. సభకరుదెంచు నంగనామణులను సభామర్యాదల నెఱింగిన స్త్రీలు తగినవిధముగ నాదరించుచు నుచితాసనముల నాసీనలఁ గావించుచుండిరి. తాంబూలాదు లొసంగి సత్కరించుచుండిరి. ఆనందస్వరూపుని మిత్రుఁడగు చాందనారాయణుని ధర్మపత్ని, ఆధునిక విద్యావతుల కాదర్శప్రాయ శ్రీమతి కాత్యాయనీదేవి బి. ఏ. సభాగతలగు నంగనామణుల నతిభక్తితో, నత్యాదరముతో నాసీనలఁజేసి కుశలము నారసి జలపాన, తాంబూలాదుల నొసఁగి హర్షచిత్తులఁ జేయుచుండెను. సభాసమయము సాయంకాలము రెండున్నరగంటలకు నిర్ణీతమయ్యెను. కాని, మూఁడున్నరగంటలు కావచ్చినను నిమంత్రితలగువారి జాడ పొడ సూపదయ్యెను. పలువురు, పతి యత్తమామల నిరోధమున రాఁజాలకుండినను, వచ్చినవారు రెండువేలకంటె నధికముగ నుండిరి. శైలకుమారీ భవనము స్త్రీజనముచే

నలంకృతమయ్యెను. సభకు నియమితులగు వారరుదెంచిన పిమ్మట సభాకార్యము నుపక్రమించుట సమంజసమని శైలకుమారి మునుముందుగఁ దలంచియుండినయది కాని, కాలాతిక్రమణ మెక్కువగ నగుచుండినందున సభాకార్యక్రమమును సాగించుట కుపక్రమించెను. సభానేత్రి యెన్నికఁ గూర్చిన ప్రస్తావమును జేయుటకు శైలకుమారి సభావేదిక మీఁదికి నరుదెంచి పలుసారులు ప్రయత్నము చేసెను. కాని, స్త్రీ మండలిలోఁ గోలాహల మతిశయముగ నుండుట వలనఁ బ్రస్తావింప నేరకుండెను. స్త్రీలు సభకరుదెంచుట ప్రారంభమైన దాదిగఁ గోలాహల ముత్పత్తి కాఁజొచ్చెను. స్త్రీల సంఖ్య హెచ్చినకొలఁది కోలాహలమును హెచ్చఁజొచ్చెను. శైలకుమారి రెండుమూఁడు నిముసములు "మాటలాడకుఁడు. నిశ్శబ్దముగ నుండుఁడు" అని చేతులు జోడించి యెలుఁగెత్తి పలుకుచు సభాస్థలమునందు నిశ్శబ్దతను నెలకొల్ప నెంచెను గాని సఫలత నొందఁజాలకుండెను. సభావేదికఁ దిలకించు స్త్రీలు నిశ్శబ్దమును వహింపఁజొచ్చిరి. కాని, తదన్యమనస్కులు నిశబ్దమును బూనకుండిరి. అందొక యువతి పసిబిడ్డ బిట్టుగ రోదనమొనర్చె. తన్మూలమున హాహాకార ముత్పత్తి యగుచుండెను. వేఱొక యువతి బిడ్డ విరేచనము చేసికొన మొదలుపెట్టెను. దానఁ గల్లోల మొకప్రక్కఁ గాఁజొచ్చెను. ఈ విధముగ నొక్కొక్క ప్రక్క యొక్కొక్క విధముగ నల్లరియగుచుండెను. సభా స్థలము సంతచావడికంటెను, గల్లంగడికంటెను, నెక్కుడు గగ్గోలుతో నొప్పుచుండెను. ఒకరిమాట నింకొకరి చెవినిఁ బడఁజాలకుండెను తుదకు శైలకుమారి సభావేదికమీఁదికరిగి చప్పటులు చఱచి చఱచి, మేజాపై నఱచేతితో మోదిమోది, గంటను, మ్రోగించి మ్రోగించి యెట్టకేలకు నందఱదృష్టులను సభావేదికవంక కాకర్షితలగునట్లు చేసి యందఱను నిశ్శబ్దముగ నుండుఁడని వినమ్రవదనయై ప్రార్థించెను. అందఱును నిశ్శబ్దతను వహించిన యనంతరము "శ్రీమతి కాత్యాయనీదేవిగారు సర్వవిధముల సభానేత్రిపద మలంకరించుట కర్హురాలు గనుక మనసభాకార్యక్రమమును నిర్వహించుట కధినేత్రిగ నేర్పఱచుట యుక్తముగఁ దోఁచుచున్నది' అను ప్రస్తావము నుపపాదన మొనర్చెను. తత్ప్రస్తావమును నొక ప్రసిద్ధ మహిళామణి సమర్థనము గావించెను. పూర్వపరిచిత యగు జ్ఞానవతీదేవి యను మోదమును బ్రకటించెను. సభానేత్రి యెన్నిక ప్రస్తావము సమర్థనానుమోదములఁ బడసినంతనె, కాత్యాయనీదేవి. కరతాళధ్వనులు చెలరేగుచుండ సభాధినేత్రి యాసనమును సుశోభితము గావించెను. ఆమె తన వ్యాఖ్యానమున నేటి సభోద్దేశమును వెలిఁబుచ్చుచు, "జననీమతల్లులారా! సోదరీ రత్నములారా! స్త్రీ స్వాతంత్ర్యమునకును, స్త్రీ సమాజ సుధారకమునకును

నవిరత ప్రయత్నమున నొప్పుచున్న మన సోదరీమణి శ్రీమతి శైలకుమారీదేవి స్త్రీ జాత్యుద్ధరణ కార్యసమారంభయై నేఁడు శంఖుస్థాపనము గావించుచున్న యది. అయ్యది స్త్రీ సమాజమున కత్యంతమును హర్షదమును, సౌభాగ్యప్రదమును నగు విషయము. మనము విద్యావిహీనలమును, జ్ఞానశూన్యమును నయి యుండుటయే కారణముగ మన మెట్టి ఘోరకష్టములను ననర్థములను నెదుర్కొనుచున్నవారమో యయ్యది మన మెఱింగినదియు, మన యనుభవములో నున్నదియు నగు విషయమే గనుక వేఱుగఁ జెప్పనవసరము లేదు. మన దేశీయ పురుషసమాజము, మన పరిస్థితులం కనించుకయు ధ్యానము నుంచకుండ నంతటి స్వార్థపరతంత్రయై యొప్పుచున్న యది. అందువలన మనమే స్వయముగ నీ యసహాయ పరిస్థితిని దూరముగఁ దూరమొనర్చుటకు నుపాయమును నారసి చేకొనవలసియున్నది. అయ్యది మన కవశ్యకర్తవ్యము. ఆయుపాయమును గార్యరూపముగఁ బరిణతము గావించి, మన మోఁకాళ్లు పట్టుకొని మనము నిలుచుకొనుటకుఁ దగు సాహసము మనలో నుత్పన్నము కావించుకొన వలయును. పురుషులు మనల నుద్ధరించుట యనుమాట కల్ల. వారిపై నాశ నిడుకొని కనిపెట్టుకొని యుండుటవలనఁ గాలాతిక్రమణమగుటకంటె వేఱొండు, ప్రయోజనమును గననేరము. కావున మనమే తగు ప్రయత్నములను జేసికొనవలసి యున్న యది. పురుషులు మనకు సహాయసంపదల నొసంగుటకు సంసిద్ధులగువారలే యైనను, గాకపోయినను, గష్టములకును, ననర్థములకును బాలు కావలసినవారము మనమే కావున స్వయముగ మన దశా సుధారకమునకుఁ బ్రయత్నము చేయవలసియున్నది. కాఁబట్టి యీ యాశయమును సమ్ముఖమున నిడుకొని నేఁ డీసభ కూర్పఁబడినయది. మీకెల్లరకును శ్రమకలిగించుట యైనది. కాని యీ మహాసభను సమకూర్చిన కారణమున శ్రీమతి శైలకుమారీదేవికి మన మందఱము కృతజ్ఞతఁ జూపుచు, నామె కొన్ని విషయములఁ దెలుపుట కుత్సాహవతిగా నుండుటచే నామె చెప్పునట్టి విషయమును శ్రద్ధగ, శాంతముగ, సావధానముగ నాలకించి యందలి సారమును గ్రహింపవలయునని మిమ్ముల నెల్లరను సభక్తికముగఁ బ్రార్థించుచున్నదానను అని పలికి తన యాసనమున నుపవిష్టయయ్యెను.

అనంతరము శైలకుమారి యుపన్యాసమొసంగ సభావేదిక నలంకరించె. ఆమె వేదికపై నిలిచినంతనే కరతాళధ్వనులు చెలరేగెను. అందులకామె తన యనుమోదమును సూచించుచుఁ బ్రత్యుత్తరముగ ముకుళితకరకమలయై యందఱను నభివాదనచేసెను. కొంతవడికి సభాస్థలమున నిశ్శబ్దము నెలకొనియెను. శైలకుమారి యీ విధముగ నుపన్యాసము నారంభించెను.

"సభానేత్రీ! ప్రియజనులారా! ప్రియసోదరీమణులారా! నేఁడు మన యిండ్లలో మనపై నెంతలేని కష్టములు పడుచున్నవో, మన కెంతలేని దుఃఖములు కలుగుచున్నవో, యిండ్లలోను వెలుపలను, నెల్లరెఱిఁగినదే. సమాజములోను, మన మెంత నీచముగను, నవమానపూరితముగను దృష్టితోఁ జూడఁబడుచున్నారమో, మన మేతీరుగ నవిద్యాకారణముగ ఘోరనిబిడాంధకారమునఁ బడియున్నవారమో, యేతీరుగ నీచదాసీలవలె, బానిసరాండ్రవలె, నీచాతినీచములను, నసహ్యాత్యసహ్యములను, నగు కృత్యములను గావించుచున్నవారమో, అట్లు సలుపుచున్నను, మనపైని క్రూరులును, నిర్దయులును నగు పురుషులు చీపురుకట్టలను చేతిగ్గుడ్డలను నెట్లు ప్రయోగములు గావించుచున్నారో, మనదేహములను నెట్టుగాఁ గాచిన గరిటె కాతల వాతల నెట్లు పాలుగావించుచున్నారలో, స్వల్పాతిస్వల్పమగు నపరాధమున కైనను, మంచిచెడ్డలను వీడి దయాదాక్షిణ్యములను బాసి మనల నెట్లు నిడుపుఁ బెట్టి యిలు వెడలఁగొట్టుచున్నవారలో, యవి యన్నియును, మనకందఱకును స్వానుభవములో నున్నవియే. కావున వానిని నేను ప్రత్యేకముగ వివరింపనక్కఱలేదు. మన దుస్థితికిఁ బాలగుటకు ముఖ్యకారణము పురుషసమాజము. పురుషసమాజము యొక్క స్వార్థపరత్వమే మన యనర్థమునకుఁ బ్రధాన కారణము. (యథార్థము, యథార్థము, అను శబ్దములు) మన యిండ్లలో మనము చెప్పనలవి కానియు, ననుభవింప నలవి కానివియు నగు నెంతలేని యత్యాచారములకు లోనగుచున్నవారము. అహా! ఎంత విపరీతము! ఎంత ఘోరము! ఎంత క్రూరము! వివాహసమయమునందు దద్వేదికయందగ్నిహోత్రుని సాక్షిగాఁ బరమందరి యెదుటను, మనలను గృహలక్ష్ములుగ, గృహదేవతలుగ, గృహస్వామినులుగఁ జేయుదుమని ప్రమాణములు చేసి, వేదోక్తవాక్యములఁ బలికి, మనలఁ జేఁబట్టి యిండ్లకుఁ దోడ్కొని తెచ్చుచున్నారు. పిమ్మట గృహదాసికలకంటె నీచురాండ్రనుగఁ జేయుచున్నారు. ఇది వారి స్వాతంత్ర్య స్వార్థపరవశత్వములను జూపుచుండుటలేదా? వారి సుఖమును, వారు చూచుకొనుచున్నటుల బోధించుటలేదా! సోదరీమణులారా! పురుషులును, స్త్రీలును, బ్రహ్మచే సమానముగ సృష్టింపఁబడినవారలేగదా! అట్టిచో నందొకరికంటె నెక్కువ యొకరేల యుండవలయు? తక్కువ యొకరికేల యుండవలయును! ఒకరి కాధిక్యమేమి? ఒకరికి నీచతమేమి! ఒకరికిఁ బ్రభుత్వమేమి? ఒకరికి దాస్యమేమి' ఒకరికి సుఖమేమి? ఒకరికిఁ గష్టమేమి? ఇది బ్రహ్మనిర్మితమందురా! కాదు; కాదు. పురుష స్వార్థపారవశ్యజనిత దుర్నయము. పురుషులు స్వార్థపరాయణులు. స్వలాభేచ్ఛ గలవారలు. మనవలన సుఖములఁ బడయుచున్నవారు. మనలకు దుఃఖముల నొసంగుచున్నవారు. అట్టిచోఁ బురుషులేల సుఖింపవలయును? మన మేల యూపిరిగొనుటకైనను దెరపి

గావున దినమంతయు, నెద్దులవలె యంత్రములవలెఁ బరిశ్రమము చేయవలయును? పురుషులు ఆర్జనపరులు, భర్తలు. స్త్రీలు అర్జనహీనలు, భార్యలు. అందువలన సుఖింపవగునని యందురా? అది తప్పు, అది భ్రాంతిగాని వేఱొండు కాదు. మేము ద్రవ్యార్జనము చేయుచున్నారము. అందు మేమొందు పరిశ్రమనందు మీరింటిలోఁ బొందు పరిశ్రమనందు సహస్రాంశమైనను లేదు. పరిశ్రమము లన్నింటిలో ద్రవ్యార్జన పరిశ్రమ మెక్కుడైనది. మేమార్జించి మిమ్ముఁ బోషించుచున్నారము. మేము పోషింపకుండినచో మీరు నిరాధారులును, నిరాశ్రయులునునై మననేరనివార లని పురుషులు పలుకుచున్నవారలా? వారి పలుకులు ప్రల్లదములు ప్రగల్భములు. భ్రాంతిమూలకములు. అంతియకాని వేఱొండు కాదు. ఏమి? స్త్రీలు ఆర్జనపరలు కాఁజాలరా? కాఁజాలరు? పురుషులకన్న నెక్కుడుగ నార్జనవతులు కాఁజాలరు? బాలకుల విద్యాభివృద్ధి కెంత కృషి సల్పఁబడుచున్నదో, యెంత తత్పరత్వము చూపబడుచున్నాదో యెంత ద్రవ్యము వ్యయము చేయఁబడుచున్నదో, యంత కృషి, యంత తత్పర్యము యంత వ్యయము బాలికల విద్యాభివృద్ధియందుఁ గూడఁ జూపఁబడినచో, స్త్రీలు పురుషులకంటె నధికయోగ్యతకుఁ బాత్రులై, యధికార్జనము చేయుటకు సమర్థులగుదురు. పురుషులకంటె స్త్రీలకు బుద్ధిబలమును ధారణాబలమును, నెక్కుడని గొప్పగొప్ప డాక్టరులమతము. డాక్టరుల మతమే కాదు. పండితాభిప్రాయము కూడ నట్టిదియే. పాశ్చాత్యఖండ నివాసినులు దీనికిఁ బ్రత్యక్ష ప్రమాణము. అమెరికా, ఇంగ్లండు ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, మొదలుగాఁగల దేశములలోని యువతులు యువకులకువలె విద్యాబుద్ధులు గఱతురు. తద్దేశవాసినులు తద్దేశవాసులువలె నుద్యోగములు చేయుదురు. వకాలతు సల్పుదురు. డాక్టరు పనిచేయుదురు. ఉచ్చపదవులను, నున్నతాధికారములను బడసి బహుసమర్థతతోఁ, దత్కార్యనిర్వహణము సల్పుచున్నవారు. ఇంగ్లండులో పార్లమెంటుసభలోఁబురుషులబోలె స్త్రీలును సభ్యురాండ్రుగ నెన్నుకొనఁబడుచున్నవారు. ఇంగ్లండు మాటయేల? మనదేశములో మనభారతీయ సోదరీమణు లెందఱు వకాలతు చేయుచుండలేదు. ఎందఱు డాక్టరుపనిచేయుచుండలేదు? ఎందఱు అధ్యాపికలుగ నుండలేదు. ఎందఱు వ్యవస్థాపిక సభలలో రాజకీయసభలలో సభ్యురాండ్రు కాలేదు. ఎందఱు బి. ఏ. ఎం. ఏ. వకాలతు వైద్యము మొదలుగాఁగల పరీక్షలు పాసు కాలేదు? ఎందఱు పురుషులకంటె నెక్కుడుగ రాజకీయ వ్యవహారముల యందు న్యాయము, వైద్యము, ఉపాధ్యాయ వృత్తులయందుఁ బేరుప్రతిష్ఠలు పడయుచుండుటలేదు. పురుషులకు వలె స్త్రీలకుఁ గూడ నవకాశమును సౌకర్యమును నొసంగఁబడిన యెడల స్త్రీలు పురుషులకంటె నెక్కువ యౌన్నత్యమును

బడయుదురనుట నిరభ్యంతరమును నిర్వివాదమును నగు విషయము. అందుల కనుమాన మేయును సందియము లేదు."

"సోదరీమణులారా! స్త్రీలు పురుషులకు వెనుకఁ బోఁగలవారలని నిరూపించుటకుఁ దగు పరిస్థితు లతిశయముగఁ జూపట్టుచున్న ప్రుడు మనమేల వారలకు బానిసలమై యుండవలెను? వారి వలన నదరింపులకు బెదరింపులకుఁ జీవాట్లకుఁ జెప్పుదెబ్బలకు నేలపాలగుచు, వారు పెట్టుబాధలనెల్ల సహించుచు, వారలను హర్ష చిత్తులఁజేసికొనుటకేల తత్పరలము కావలయును? రాత్రియును బవలును వంట చేయుచుఁ దిరుగలి విసరుచు, రోట దంచుచు, బుద్ధి చెఱుచుకొనుచు, సేవచేసి చేయుచు, పలు విధములయిన శ్రమలను బడుచుఁ, గడ్డు పోఁగొట్టుకొనుచు. నోడలఁ విఱుచుకొనుచు నేలఁ గష్టసహిష్ణులము కావలయును? మనమును జదువుటకును, సాయపడగలము, నేర్పఁగలము. విద్యల నభ్యసింపఁగలము. పాత్రశమల నొనరింపఁగలము. ఉద్యోగములు చేయఁగలము. పురుషులవలె సర్వకార్యములను సాధింపగలము. ద్రవ్యమార్జింపఁ గలము. పేరుప్రతిష్ఠల గడింపఁగలము. అట్టి స్థితి యందు మనమేల పురుషులకు దాసికలమయి, బానిసలమయి, ప్రవర్తించు చుండవలయును. వారి కేల లోఁబడి యుండవలయు? (వలదు; వలదు. పురుషుల కెంతమాత్రమును లోఁబడి యుండ వలదు. అను శబ్దములు) పురుషులు తాము స్త్రీలను సకల సౌకర్యముల నొడఁ గూర్చుచు సర్వవిధములఁ బోషించుచున్నవారము. లేనిచో వారు, నిరాశ్రయు లును. నిరాధారులునునై నామావశిష్టులునై యుందు రనియు, స్త్రీల యస్తిత్వమునకుఁ బురుషుల యాశ్రయమే కారణమని పలుకు ప్రగల్భములను, వారి యహంభావమును, వారి దంభమును, తృణప్రాయముగ నవలీలనేలపాలు గావింపఁగల శక్తులము"

"సోదరీమణులారా! ఎంతయని చెప్పఁగలను? పురుషులు మనయెడల నెంత యధర్మమును. నన్యాయమును, నత్యాచారమును బ్రకటించుచున్నవారలో, తద్వివరణ మును వినిపింపఁ బూనినచో దినములు, వారములు, మాసములును జాలవు. సంవత్స రములు పట్టును. మనము పురుషు లొనర్చు దుర్ణయములయొక్క దుర్వ్యవహారముల యనుభవమునకుఁ బూర్ణరూపముగ గురియగుచున్నవారల మగుటవలన నిట పోలుగఁ జేరొనుట యనవసరము.

అంత సభామధ్యమున నుండి యొక యువతి యావేశపరవశయై లేచి ముందున కరుదెంచి శైలకుమారితో "అవునమ్మా! సోదరీ! మా జీవన మెంత విపత్పూరితమై యున్నదో నీకేమి తెలియును? అది మాకే తెలియును. మేముపొందు దుఃఖములు, మేమనుభవించు కష్టములు నిట్టివని నీయూహకుఁ బొడసూప జాలవు. నీకనుమాన

మైనఁ గలిగింప నేరవు. అదిగాక నీ కట్టి యనుభవమును లేదు. నీవందులకుఁ బాలడినదానవును గావు. మా పుణ్యమువలన, మా యదృష్టమువలన నసహాయులమై విషమ పరిస్థితులలోఁ దరిఁజొరఁగ దారి తెన్నులు గానక పరితపించుచున్న మాకు సాయమొసఁగి మా విపత్తులను బాఱఁద్రోల నీ వవతరించితివి. మమ్ము నారకీయ జీవనము నుండి విముక్తులఁజేసి తత్పుణ్యమును గట్టుకొనుము. మా విముక్తికిఁ దగు నుపాయముఁ జెప్పుము. తగు మార్గముఁ జూపుము. నీకు వెయ్యివేల నమస్కారము లని పలికి తన యాసనమునఁ గూర్చుండెను. శైలకుమారి మరల నిట్లు చెప్పఁదొడంగెను.

“ సతీమతల్లులారా ! నా సోదరీమణి యిప్పుడే పలికినపలుకులు నిక్కముగ యథార్థములు. నిజముగ నిశ్చయముగ మీరొందు కష్టములయొక్క జ్ఞానము, పరిచయము నాకిసుమంతయును లేదు. కాని దృష్టివలనను, వినికి వలనను, పూర్ణముగఁ గాకపోయినను గొంతవఱకు మీ కష్టములను గ్రహించితిని. గ్రహించిన దానిని బట్టి మీ కష్టముల కింతయును గల్గించుటకు సంకల్పము నూనినదానను. అవసరమగునెడ, ప్రాణములనైన నర్పించుటకు దృఢసంకల్పమును బూనినదానను. (కరతాళధ్వనులు) పురుషసమాజము, స్త్రీ సమాజసుధారకమును గూర్చి యప్పుడప్పుడు, అచ్చటచ్చటఁ బ్రసంగములు సలుపుచున్నవారలని మీకును వినఁబడుచునే యుండును. కాని తత్ప్రసంగానుసరణముగ నెచ్చటను, నే కార్యమును నారంభించునట్లుగాని, యారంభింపనున్నట్లు లెన్నఁడును వినఁబడుటలేదు. వారి ప్రసంగములు బూటకములు, ప్రగల్భములు వ్యామోహకములు అగునవి కాని, కార్యోన్ముఖము లగునవి కావు. ఎంతవఱకు మీరు, మీ కష్టములను, బాపికొనుటకును, మీ దశను సుధారకము గావించుకొనుటకును స్వయముగ యత్నమును సలుపువారలుగాకుండునట్లు పడియుందురో, అంతవఱకు మీకు హితమలవడనేరదు. సుఖము చేకూఱనేఱదు. మీ దాసత్వము తొలఁగనేఱదు. కాఁబట్టి యింకనైనను బురుషుల తోడ్పాటు నందలి యాశఁ బెట్టుకొని కాలమును వ్యర్థపుచ్చకుఁడు. తదాశను వీడుఁడు. దాసత్వ విముక్తిఁ బడయుటకుఁ దగు యత్నమున సశీఘ్రముగఁ బ్రవృత్తులుగండు. మీ యథార్థము మీ చేతులలో నున్నది. పురుషుల చేతులలో లేదు. పురుషు లుద్ధరింతురని నమ్మకుఁడు. పురుషులైనను నెల్లరును స్త్రీ సమాజోద్ధారకమునకు సుముఖులైనవారు కారు. విముఖులు గణనాతీతులు. పక్షపాతులు స్వల్పసంఖ్యాకులు స్త్రీ సుధారకమును గూర్చి కార్యసూరులు కాకపోయినను వాక్శూరులైనను నూటికొకరైనను గానరారు. ఆ కానఁబడువారిలోఁ గ్రియాత్మకు లొక్కరును లేరు. వారు సలిపిచూపిన కార్యమేదియును లేదు. పురుషులలో నూటికిఁ దొంబదియైదుగురు స్త్రీ విద్యకుఁ బ్రతికూ

లురు. అధఃపతనమైయున్న స్త్రీ సమాజమును లేవనెత్తుటయందు ఒకవిధ్వరోధులు. అందువలనఁ బురుషుల తోడ్పాటును నమ్ముకొనకుఁడు. వారి విరోధమును బరిగణింపకుఁడు. ధైర్యసాహసములఁ జేకొనుఁడు. స్వబల నిర్భరులు గండు. స్వకార్య సాధనమునఁ బ్రవృత్తులుకండు. అంతట స్త్రీసమాజమందు నిరంకుశాధికారమును వహించి యున్న యవిద్యాదాసత్వముల ప్రభుత్వము నాశనము కాఁగలదు. దానఁ బురుష దౌర్జన్యము నశింపఁగలదు. కాఁబట్టి స్త్రీ సమాజోద్ధారకమునకు స్త్రీ సమాజము యత్నమొనరించుట యత్యంతావశ్యకమై యొప్పుచున్నయది.

సోదరీరత్నములారా! ఇతర దేశములందు స్త్రీ పురుషు లిరువురు సమానాధికారములను గలిగియున్నారు. ఈ దేశమందన్ననో పురుషుఁడు స్త్రీల నధికార దూరులఁ గావించి యుంచుటయేగాక త్రొక్కిపెట్టి దాసత్వమునకుఁ బాలుగావించి యున్నవారు. కాఁబట్టి పురుషుల కడనుండి మన యధికారములను జేకొనవలయును. మనమును పురుషులకువలె సమానాధికారములఁ గలవారము కావలయును. లేనిచో మన మెన్నఁటికిని తలలెత్తలేము. మన యధికారములను జేకొనుటకును, మన కంధరములపై నొప్పుచున్న దాస్యత్వపుఁగాడిని దింపుకొనుటకును మనము ప్రబలయత్నమును జేయవలయును. తత్ప్రయత్నమునకు ఘోరసంగ్రామ మొనర్పవలయు నవసరము లేదు. పరికరముల యావశ్యకమును లేదు. కాని, సాహసమును, సహనశక్తియును నత్యవసరములు. కాఁబట్టి వాని నలవఱచుకొనవలయును. అయ్యది యలవడిన యెడల మన యాశయము సులభసాధ్యము.

“మీరు సాహస సహనశక్తుల యమోఘ ప్రభావమును నెపుడు హృద్గ్రాహ్యమొనర్చుకొనువార లగుదురో, అపుడెంతటి ప్రబలశక్తియైనను, మీకు మీయున్నత పథగమనమున కిసుమంతయును నిరోధమును గలిగింపఁ జాలదు. అట్టిచో నిఁకఁ బురుషులమాట యొక లెక్కయా? ఎందఱెన్నికష్టముల నొడఁగూర్చినను నెన్ని విఘ్నముల నాపాదించినను, సరకుగొనక, వెనుకంజయిడక విద్యనభ్యసించుటకును, నజ్ఞానాంధకారమును దూరమొనర్చుటకును, వైదేశిక స్త్రీల ననుకరించుటకును గృతనిశ్చితలుకండు. త్వరపడకుఁడు. వెఱవకుఁడు. వెనుదీయకుఁడు. అట్టి నిశ్చయమును బూని కార్యరంగమున కరుదెంచు వారలగుదురేని పరమేశ్వరుఁడు మీ కనుకూలుఁడగును. మీకు సాయపడును. మీ యున్నతాశయము సులభసాధ్యమగును. దీనికి విఘ్నమలవసనేరదు.

గాంధి మహాత్ముఁడు చేకొనిన సత్యాగ్రహాస్త్ర మమోఘాస్త్రము. తదస్త్రమును జేపట్టుదురేని విజయమును బొందుదురు. కాఁబట్టి సత్యాగ్రహావలంబనముగ

విద్యాభ్యాసమునకుఁ బ్రవృత్తులు కండు. మీ పతులుగాని, మీ యత్తమామలు గానీ, తదితరులుగాని, మీ విద్యాభ్యాసమునకు విఘ్న మాపాదించుట కుద్యుక్తులయినయెడ, వారిని లక్ష్యము సేయక, మీ విద్యాభ్యాసమును మీరు నిర్విఘ్నముగ సాగింపుఁడు. వారు మిమ్ముల నాటంకపఱచుటయు భయముఁగొలుపుటయుఁ గఠినశిక్షల నొసంగుటయు, నాదిగాఁగల దుర్ణయములు సలుపుటకు సంసిద్ధులగుదురు. అట్టివి సంభవములగుననుటకు సందియములేదు. అట్టివి సంభవమైనను, మీరు సంకల్పమున దృఢచిత్తులైయుండి 'విద్యాభ్యాసము పాపకర్మముకాదు. అధర్మముకాదు. దోషకృత్యముకాదు. విద్యాభ్యాసమువలన మాకు జ్ఞానమలవడును. దాన మాగృహకృత్యములు మేము చక్కఁగ సానుకూలముగ నిర్వహించుకొనఁ గల్గుదుము' అని వారలకు బోధచేయుఁడు. అప్పటికిని వార లనుకూలురు కానిచో మీ నిశ్చయమున మీరు సుస్థితులైయుండుఁడురు. వారొకసారి రెండు సారులు మూఁడు సారులు మిమ్ము శిక్షించుచుందురు. మిమ్ములను ఘోరవ్యథలపాలు గావింతురు. అత్యాచారములకు లోను గావింతురు. వానికన్నింటికిని మీరు సహన మూనవలయును. మీరు సలుపునది. న్యాయ్యసమ్మతము. ధర్మబద్ధము. న్యాయధర్మముల ననుసరించువారలకు భగవంతుఁడు ప్రసన్నుఁడగును. తోడగును. వారి వర్తనము అన్యాయమును, అధర్మమునునై యొప్పుచున్నయది. అన్యాయాధర్మపరులయెడల భగవంతుఁడు కుపితుఁడగును. వారలను శిక్షించును. మీ యత్నము సఫలమగును. వారి యత్నము విఫలమగును. తుదకు స్వార్థపరులగు పురుషుల రాక్షసహస్తములు మీపై కెగురుట కసమర్థములగు !

ఈ సత్యాగ్రహాస్త్రప్రయోగము, అన్యాయులును, అధర్ములును, అత్యాచారులును నగు పురుషులపైని విజయమును స్థాపించుటకు నేకమాత్రోపాయమని నా యాశయము, ఈ యస్త్రప్రయోగము వలన మీ దాసత్వము తొలఁగుటయే కాదు. మీ కధికారము కూడఁ బ్రాప్తమగును. మీ యాధిపత్యము నెలకొనును. మీరు మీ యాధిపత్యమును బ్రతిష్ఠించిన యెడలఁ, బురుషులను దాసులుగ నొనర్చి వారిచే నన్ని కృత్యములను చేయించుకొన శక్తులగుదురు. మీరు పురుషులకు దాసురాండ్రుగ నుందురు ప్రభ్వీనులుగ నుందురు. మీకుఁ బురుషులు దాసులుగ నుందురు. మీ కనుసన్నల మెలంగుదురు. దాసత్వముకంటె హైన్యమును దైన్యమును నగు కృత్యము వేఱొండులేదని గ్రహింపుఁడు. నీచులమై బానిసలమై పశుతుల్యులమై జీవయాత్ర సలుపుకొనుటకంటె నాత్మఘాతి మొనర్చుకొనుట వేయుమడుంగులు శ్రేయ మని తలంపుఁడు. మీరు బ్రతుకఁ దలఁచిన వార లగుదురేని మానవులవలె బ్రతుకుటకుఁ

ప్రయత్నింపుఁడు. స్వాతంత్ర్యము చేకొనుటకు సంసిద్ధులు కండు. అజ్ఞానమును బాపుకొనుటకుఁ గృషి యొనర్పుఁడు. మీరు మీ స్వాతంత్ర్యాధికారములఁ జేకొనుటకు ధృఢప్రతిజ్ఞ లగుఁడు. తదేక తత్పరు లగుఁడు. పురుషులను బ్రతిఘటింపుఁడు. అస్వాతంత్ర్యా నధికార జీవనము — అగౌరవము — అమానుషము. అసార్థకము ”

కాఁబట్టి జీవన సార్థక్యముఁ బడయుటకు స్వాతంత్ర్యాధికారము లత్యావశ్యకములు గావున వానినిఁ జేకొనుట కుద్యుక్తులరై, ధైర్యసాహసములు మాని, కార్యక్షేత్రమున నుపస్థితులు గండు ” అని విరమించుచున్న దానను.

శైలకుమారి యుపన్యాసమును ముగించి తన యాసనమునఁ గూరుచుండెను. ఆమె యుపన్యాసము క్రాంతికారియు, నావేశపూరితమును నెలయొప్పుచున్న దని పలువుర యభిప్రాయము. ఆమె యుపన్యాస మాలించినంతనే యువతీమండలములో నుత్తేజ ముదయించి, సభాస్థలము నంతటను బ్రచండముగ వ్యాపించెను. నారీహృదయములు వీరరససంభరితము లయ్యెను. దానఁ గోలాహలము జనించెను. అంత నొక నారీమణి యుద్రేకపూరితయై లేచి “అవునమ్మా! ఇఁక నీవు చెప్పినట్లు చేయక తీఱదు. ఆహా! ఎంత యన్యాయము? ఎంత క్రౌర్యము? ఎన్ని కష్టములు పెట్టుచున్నారు? ఎంత యని పడఁగలము! పడఁగా బడఁగాఁ బ్రాణమునకు విసుగు కల్గుచున్నది. ఇఁకనైనఁ దెలివి తెచ్చుకొని యీ సోదరీమణి యుపదేశమును గ్రహించి యీమె చూపిన మార్గమును జేకొనవలయును? లేనిచో దరిచేరలేము.” అని పలికెను. ఇంకొక్క నారీమణి “ఇఁక నీమె చూపిన మార్గమున నడిచినఁగాని మన పురుషులకు వివేకము పుట్టదు. మన దురవస్థకుఁ దుది గానరాదు. ఆహా! వారి యిష్టము వచ్చినట్లు కాల్చుకొని తినుచున్నారుకదా? ఇఁక నెంత కాలము తినఁగలరో చూచెదముగాక!” అని పలికెను. మఱొక నారీమణి “సాగనిచ్చి నన్ని దినములు సాగనిచ్చినారము. ఇంకను సాగనిత్తుమా? నే నింటికి వెళ్లి యేమిచేయుదునో చూచెదరుగాక! తండ్రి తాతలను దలఁచుకొనునట్లు చేయుదును.” లని నిరాఘాటముగా ననెను. ఇట్లు వాక్యోపవాక్యములు ప్రవర్తిల్లుచుండెను. అంత సభానేత్రి లేచి ”శ్రీమతి రమాదేవి మీ సముఖమునం దించుక నివేదనము గావించుకొనుట కుత్సుకయగుచుండెను గాన సావధానులరై యీమె చెప్పు విషయము నాలించి యందలి మర్మమును గ్రహింపఁ గలందులకు వేఁడుకొనుచున్న దాన నని పలికి తన పీఠముపై నుపవిష్టయయ్యెను.

అనంతరము రమాదేవి సభావేదిక నలంకరించి, యత్యంత ఘృణితమును లజ్జాస్పదమును నగు భాషతో శైలకుమారి చెప్పిన విషయమును సమర్థనము గాలించి

యధిక సంఖ్యాకులగు యువతుల హృదయములలోఁ దమ పురుషులయెడ శైలకుమారి యుపన్యాసమును వినినంతనే యుదయించిన విరోధాగ్నిని బ్రజ్వలితము గావించెను. శైలకుమారి యుపన్యాసము స్త్రీలయందుఁ, బురుషులయెడఁ బ్రతికూల భావముదయింపఁ జేసెను. స్త్రీల హృదయమం దుదితమైన విరోధభావమును రమాదేవి సంభాషణము ప్రళయాగ్ని జ్వాలగఁ బరిణమిల్లఁ జేసెను. ఆమె భాషణము యువతీమణులలో నూటికిఁ దొంబదిమందిని బురుషులకుఁ బ్రతికూలవర్తనులగుటకు దీక్షాయుతులఁ గావించినది.

సభయందున్నవారిలో శైలకుమారీ రమాదేవుల సంభాషణములకు సిద్ధాంతములకు సంపూర్ణప్రతికూలురగు యువతులును బలువురు కలరు, కాని, వారిసంఖ్య స్వల్పమగుటవలన వారు తమ యభిప్రాయములను, దమ ప్రతికూల భావములను బహిర్గతమొనర్చుటకు సాహసము కలుగ కుండుట వలన నూరకుండిరి జ్ఞానవతీ దేవి శైలకుమారి యుపన్యాసము, నద్విమర్శనము, తముపదేశములు, నసంగతములనియు, నగ్రాహ్యము లనియు, నిరూపించి ఖండించుట కుద్యుక్తయయ్యెను. కాని, యించుక హృదయ దౌర్బల్యము కల దగుటవలన యువతీమణుల యుద్రిక్తభావమును గ్రహించి యీ సమయమున శైలకుమారి యుపదేశములు ప్రభావాన్వితములై సభాసదులయందుద్రేకము నుదయింపఁజేసి యుండుటవలన నిపుడు తద్వ్యతిరిక్తముగఁ బలుక నెంచుట యవమాన జనకమని తలంచి యూరకుండెను.

రమాదేవి సంభాషణము ముగిసిన పిమ్మట నింక సభాసదులలో నుపన్యసించువారెవరును బొడసూపనందున సభానేత్రి కాత్యాయనీదేవి తన యాశయమును బ్రకటించుటకు లేచి నిలిచెను. ఆమె లేచినంతనే కరతాళధ్వనులు దిక్కులు పిక్కటిల్లెను. ఆమె చేతులు జోడించి యందఱకును గృతజ్ఞతఁ జూపుచు నిట్లు పలుకనారంభించెను.

“జననీ మతల్లులారా! సోదరీరత్నములారా! ఇపుడు మన ప్రియసోదరీమణులు శైలకుమారీ రమాదేవు లిరువురును వాక్రుచ్చిన వాక్కుల నాలించినంతనే మీ హృదయము లావేశపూరితములై యున్నవి. తత్ప్రభావము తమ పదాశ్రితకర్తవ్యపాలన తత్పరత్వమున నొప్పుచుండెను. అందువలన నేఁజెప్పునది మీకు హితము కానేరదు. అయినను నేఁ జెప్పుదానిని స్వస్థచిత్తులరై యాలించి యందలి యౌచిత్యమును గూర్చి పూర్ణ విచారణమును సలుపవలయు నని మిమ్ముల నందఱను బదేపదే ప్రార్థించుచున్న దానను.

సోదరీమణులారా! నే నీ సందర్భమునఁ జెప్పనెంచిన దానికి మునుముందుగ స్త్రీస్వాతంత్ర్యమునకు విరోధమూనిన దానను గానని మనవి యొనర్చుకొనుచున్నాను.

స్త్రీ స్వాతంత్ర్యసంపాదన సాధనా సంబంధమున. మన ప్రకృతస్థితిని సుధారకము గావించుకొను విషయమును గూర్చి యొక సంగతిని జెప్పుచున్నాను. అందులకు క్షమాపణము కోరుచున్నదాన. ఏలయనఁగా, నేను జెప్పఁబోవు విషయము నాస్వసంబంధమునుగని యున్నయది. అందువలన నాత్మస్తుతి యొనర్చుకొను చున్నదానని తలంపవలదు. నా జనకుఁడు స్త్రీస్వాతంత్ర్యవిషయమున నెక్కుడు పక్షపాతమును బూనినవాఁడు. కేవలము స్త్రీసమాజసేవాభిలాషియై నాకున్నతశిక్షఁ గఱపింప నెంచినవాఁడు. కాఁబట్టి విదిచ్ఛానుగామినినైన నేను, నా జనకుని యమృతాత్మకు శాంతి నొనఁగూర్ప నెంచిన నేను, స్త్రీసమాజమున కౌన్నత్యమును జేకూర్చుటయందు, నధికారమును సమకూర్చుటయందు, నా జీవనమును గూడ సమర్పించుటకు సంసిద్ధముగ నున్నదానినని మనవి యొనర్చుకొను చున్నదానను. (కరతాళధ్వనులు) అందువలన నన్ను స్వాతంత్ర్యమునకు విరోధను గానని మీరు విశ్వసింపుఁడు. స్త్రీ స్వాతంత్ర్య సంపాదనకు నే ననుకూలనై యున్నను, శైలకుమారి విమాదేవులు సూచించిన యుపాయములకు, మార్గములకుఁ బూర్ణహృదయమునఁ బ్రతికూలమానిన దాన నని స్పష్టముగఁ జెప్పుచున్నాను. మీరు తదుపాయములను జేకొని తన్మార్గము ననుసరించుట కెట్లు సంసిద్ధులగుచుంటిరని నామన మత్యంతము విహ్వలితఁ జెందుచున్నయది. సోదరీరత్నములారా! మనలను దాసత్వమను శృంఖలాబద్ధునకు లోనొనర్చినవారలు పురుషులు కారని నే నెన్నఁడును జెప్పను. మన యీ దుస్థితికిఁ గారకులు పురుషులు కా రననేరను. కాని స్త్రీలయందు నిర్దోషత్వమును నిరూపితము గావింపఁ జాలను. పురుషులే మనలను దాసత్వమునకు లోనుగావించిన వారలని యనుకొందము. కాని మన మెన్నఁడును మన దాస్యవిముక్తికుపాయ మరసిన వారలము గాము. పురుషులు మనలను దాసికలుగఁ దలంచు సాహసమును బడయ నేరకుండు నంతటి యోగ్యతను బడయుటకు యత్నమును సలిపినవారము గాము. పురుషులు మనలను నవివేకినులని నీచముగ నెంచుచున్నారు. అందులకుఁ దోడుగ మనమును మఱింత యవివేకినులమై యధిక నైచ్యమును జేకొనుచున్నారము. (లేదు-లేదు- అను శబ్దములు) అందువలనఁ బురుషులకు మనలను తలలెత్త నీయకుండు నట్లుగ ననుకూలసమయ మసంభవమైనది. వారణఁగద్రొక్కుచున్నారు. మన మణఁగి యున్నాము.

పురుషులే మనల నీ పతనావస్థకుఁ బాలుగావించిన వారలా, లేక మనంతటమనమే పాలైతిమా యను విషయము నిర్ధారణ మిపుడు అనవసరము. అందువలనఁ బ్రయాసము. కాలయాపనము. అంతకంటె వేఱొండు ఫలము చేకూరనేరదు. మనమిట్టి దుర

వస్థాప్రాప్తికిఁ బాత్రులమగుటకుఁ బ్రధానకారణము పురుషసమాజమే యనియు, పురుషులదే యెక్కుడు దోషమనియు మొదటనే చెప్పియున్నాను. దోష మెవరిదైననేమి? మనకుఁ బతన మలవడినది. మనము పతనావస్థలోఁ బడియున్నారము. అందులకిపుడు విలపించిన నేమి లాభము? ఒలికినపాలకొఱ కేడ్చుటవంటిది! ఇపు డాలోచింపవలసినది యేదనఁగా మన పతనావస్థనుండి బయలుపడుట యెట్లు! ఉన్నతిం గనుట యెట్లు పురుషులతోఁబాటు సమానాధికారమును బొందఁ గలుగుటకు మార్గ మెద్ది యను విషయము.”

ఈ సందర్భమున శైలకుమారీ రమాదేవులు వివరించిన యుపాయముల నుచితములు. తన్మార్గము లగమ్యములు. అయ్యవి యవలంబనీయములగునవి కావు. వానిని మీ రెన్నఁడును ననుసరింపరాదు. (అవి యనుచితములు. వాని ననుసరించినఁ గాని ముక్తి యలవడదు. అను కేకలు). సోదరీమణులారా! నేను జెప్పుదానిని స్వస్థచిత్తులరై శాంతముగ నాలించి తదనంతరము మీ కీశ్వరుఁ డొసంగిన బుద్ధి నుపయోగించి, విచారణ మొనర్చి, యందలి యాథార్థ్యమును గ్రహింపుఁ డని మొదటనే ప్రార్థించియున్నవాఁడనుగదా? ఇపుడే తొందఱపడుట న్యాయమా? సావధానముగ నాలింపుఁడు. పురుషులను నుచితమార్గములోనికిఁ దెచ్చుటకును, వారి దుర్ణయములకు లోనుగాకుండ స్వరక్షణము సేయుటకును వారితోఁ బ్రతిఘటనమూనుటయే తగు నుపాయ మని కదా వారు చెప్పిరి. అయ్యది యెంత చిన్నతనపు మాటయో ఎంత యనాలోచితమైన మాటయో యించుక పరిశీలింపుఁడు. పురుషులతోఁ బోరి విజేతల మగుట యెట్లు? పురుషులకుఁ గల బుద్ధిబలమును నెదుర్కొనుటకుఁ దగు బుద్ధిబలము మీకడ శూన్యము. బలహీనులు బలవంతులతోఁ బోర నెగ్గఁగలరా? నెగ్గనేర రను విషయము విస్పష్టముగదా? అందువలన విపత్పాతమున కంటె నతిరిక్తమగు ఫల మెద్ది యలవడఁ గలదు. ఇట్టి చిన్నతనపు టనాలోచితములయిన, యప్రాజ్ఞతా సంబంధములయిన, యనుచితములయిన యుపాయముల నిట్టి విద్యావతులగు సోదరీమణులెట్లు సూచింపఁ గలిగిరో యను విచారము నా హృదయమును పీడించుచున్నయది. అంతియ కాదు. ఇంక నొకటి. సత్యాగ్రహమును బూనుఁడని చెప్పిరి. దాని వలనను సాఫల్యము కలుగనేరదు. అనర్థమే కలుగఁ గలదు. ఇట్టి యనుచితపు టుపాయముల యనుసరణ నక్కఱలేకయే సహజముగఁ బురుషులచేత మనకు హితము లగు కార్యములను జేయించు కొనుటకుఁ దగు శక్తిసామర్థ్యములు మీకడ నున్నవి. మీరు వానిని మీ స్థితిని చక్కఁగ గమనింపవలయు. అదియే ముఖ్యమగు విషయము. మీ రున్నతి నొందుటకు మీకుఁ బురుషుల తోడ్పాటు మిగుల నావశ్యకమైనను, గాకపోయినను

వారి సానుభూతి యత్యంతావశ్యకమైనదను మాట త్రోసివేయరాదు. మీ యెడ మీ పురుషులు సానుభూతి కలవారు కాకయుండునంత వఱకు వారు మీ యాచరణముల కేదో విధముగ విఘ్నములు కలిగించుటయందు వెనుదీయక యే ప్రవర్తింతురు. కాఁబట్టి మీరు కృతకృత్యలు కాఁజాలరు. అదియును గాక యువతీజనౌన్నత్య స్వాతంత్ర్యములయెడ మహానుభావులై యున్న పురుషుల సంఖ్యయుఁ గొఱఁతపడి యుండుట లేదు. సంస్కృత సాహిత్య సామ్రాట్టు కాళిదాసు. భక్తాగ్రగణ్యుఁడు మహాత్ముఁడు సూరదాసు, హిందీ సాహిత్యనిర్మాణకుఁడు తులసీదాసు మొదలగు వారి యజ్ఞానంధకారము తొలఁగునట్టుల జ్ఞానజ్యోతి నొసంగి, వారలను ధురంధరులగు పండితులను జేసి, వారి నామముల కమరత్వ మొసంగినవారలు, ఆ మహాత్ముల సతీమతల్లులని గ్రహియింపుఁడు. వారి సహధర్మచారిణులే వారలకు మార్గప్రదర్శకులైరి జ్ఞానోత్పత్తిని గావించిన వారలైరి. మీర లాదేవుల సంతానములోని వారలేగదా? ఈ విషయములు పురాణేతిహాస పత్రములలోనివి. వాని నటుంచుఁడు. ప్రకృతమునను, నెందఱు సోదరీమణులు కుమార్గవర్తనులగు దమ పతులను సన్మార్గగాములఁగ మరల్చియుండలేదు? సోదరీమణులు ఎందఱు పశుప్రాయులగు తమ భర్తలను వివేకవంతులఁజేసి మానవశ్రేణియందుఁ జేర్పలేదు. వారివంక నించుక ధ్యానముంచుఁడు. వారి కృతకృత్యతకుఁ గారణములు సౌమ్యసద్వర్తనములా? లేక ప్రతిఘటన సత్యాగ్రహములా?

సోదరీమణులారా! మీ దాస్యవిముక్తికి మీ యౌన్నత్యమునకు సాధనములు సవినయము, సహనశీలము, సద్వ్యవహారము, సద్భాషణము, కాఁబట్టి యీ సాధన చతుష్టయమును జేకొని, మీరు మీపతులను బ్రసన్నులను జేసికొనుఁడని, వారి సానుభూతికిఁ బాత్రులగుఁడని, మిమ్ము సవినయముగఁ బ్రార్థించుచున్న దానను. ఇపుడు ఆంగ్ల సభ్యతయొక్క యొడిలోఁ బెరిగిన యీ యిరువురు సోదరీరత్నములు మీ కనుకరణీయములని, యవలంబనీయములని చెప్పిన ప్రతిఘటన సత్యాగ్రహములను, కార్యరూపమునఁ బరిణమింపఁ జేయవలదని వేఁడుకొనుచున్నాను. ఆంగ్లేయుల సభ్యతయు, మనదేశరీతిని ననుసరింపవలయును గాని, వారివలనఁ బ్రవర్తించుటకు వలను పడదు. మన దేశవనితలు బెత్తముచేతఁ బట్టుకొని, తమపతులచేతఁ బనులు చేయించుకొనుటఁ గాని, వారి నవమానించుట, వారి నలక్ష్యభావమునఁ బరికించుట మొదలుగాఁ గల యసంగతవర్తనముల నెన్నఁడైన నే యవస్థయందైనఁ బ్రవర్తించినవారలని యేరివలననైన వినియుంటిరా? అట్టి వర్తనము మన కాదర్శవర్తనము కాదు. పతులను శిక్షించెడి స్త్రీలు మన కాదర్శులుగారు. మన కాదర్శులు అనసూయారుంధతులు. సీతా

సావిత్రులు. గాంధారీగార్గులు. సులోచనాసుకన్యలు. మాద్రీదమయంతులు. పద్మినీ సంయుక్తలు. పాతివ్రత్య ధర్మపరిపాలనమున ప్రాణముల నాహుతులుగఁ జేసిన వీర క్షత్రియ స్త్రీలు. ఈ దేవీమతల్లులు తమ పతులను బ్రసన్నులుగ నొనర్చుకొనుటకును, పతుల యాజ్ఞలను బరిపాలించుటకును, తమ ధర్మమును, తమమర్యాదను గాపాడు కొనుటకును నెంత యెంతలు కష్టములు సహించినవారలో పరికింపుఁడు. వారెటులు తమ జీవనముల నితరుల కాదర్శములగు నటులు నిర్వహణ మొనర్చియుండిరో, వారెట్లు తమ ప్రాణములను దృణప్రాయములుగ విసర్జించి యుండిరో వారెట్లు తమ నామ ముల కమరత్వమును జేకూర్చియుండిరో, తద్వివరణమును హృదయంగమ మొనర్చు కొనుఁడు. వారి వర్తనము, వారి యశము వారి మహాత్మ్యము, వారి యాదర్శ జీవనము ప్రపంచమందెల్లయెడల సూర్యచంద్రుల వలె విరాజిల్లుచుండెను. వాని కారణముగ నేఁడును స్త్రీ సభ్యతయందు భారతదేశము దేశేతరములలో నత్యుచ్చపదము నం దొప్పుచున్నయది. కాఁబట్టి సోదరీమణులారా! మీరు, ఆ దేవీమతల్లులు, ఆ పతివ్ర తాతిలకములు, ఆ నారీశిరోమణులు. ఆదర్శముగఁ గ్రహింపఁదగినవారు. వారి వర్తన ములే యనుకరణీయములు. అవియే శ్రేయస్కరములు. అవియే తరణోపాయములు, అవియే స్త్రీసమాజ సుధారకములు. స్త్రీస్వాతంత్ర్య సంపాదనమునకు సాధన సంపత్తులు. అవియే మన కౌన్నత్యముఁ జేకూర్చుటకు సమర్థములు. అవియే జ్ఞానద ములు. అవియే శుభప్రదములు. అవియే కామ్యార్థసిద్ధిదములు. అవియే పురుషులతోఁ దులఁదూఁగుటకుఁ దగు యోగ్యతను బ్రసాదింపఁగలయవి. తదన్యము లశక్తములు, అసమర్థములు. మనము యోగ్యతా ప్రాప్తికిఁ బాత్రులమగుదుమేని, మనలను నీచ గుణముగల వారలుగ నెన్నుటకును, పదదళితులనుగఁ జేయుటకును, బురుషు లెంత మాత్రమును శక్తులు గాఁజాలరు. వారి కట్టి సామర్థ్య మలవడనేరదు.

సోదరీమ తల్లులారా! యోగ్యతను గలిగించునది జ్ఞానము, జ్ఞానము విద్య వలనఁ గలుగును. విద్యలేనివారు జ్ఞానశూన్యులు. పశుసమానులు. మీరు విహీనలై జ్ఞానశూన్యలై ఘోరాంధకారములోఁ బడియున్నవారు. తత్కారణమున నెన్నియో దుర్గుణములు, దుర్భావములు మీలో నుదితములై పెరుగుచున్నయవి. మంచిచెడ్డలను, నుచితానుచితములను లాభనష్టములను గుర్తిడనేరక యున్నవారు. స్త్రీలకుఁ గర్తవ్య మెద్ది? వారి యధికార మెట్టిది? అను విషయమును గూడ మీరు తెలియనేరకున్నవారు. అయ్యవి విద్యవలన శిక్షవలనఁ దెలియఁదగినయవి. కాఁబట్టి విద్యాశిక్షలు అత్యవస రములు. వానిఁ బడయుట మీ కత్యావశ్యకము. ప్రథమ కర్తవ్యము. ఇపుడు పురు షులలో నూటి కేఁబదియే కాదు. అంత కెక్కుడుగనే స్త్రీవిద్యాభిమానులై తత్పక్ష

మును గ్రహించి కృషి సల్పుచున్నవారు. వృద్ధుల స్త్రీవిద్యా విరోధులు కొందఱు చూపట్టుచున్నను, వారి సంఖ్య స్వల్పమగుటచే వారి మాట పరిగణింపఁ బడుటలేదు. ఇపుడు స్త్రీవిద్య బహుజన సమ్మతముఁగని వ్యాప్తి బాహుళ్యమునఁ జెందియున్నది. నగరములలోనే, పట్టణములలోనే కాదు, గ్రామములలోను పల్లెలలోను గూడఁ గన్యాపాఠశాలలు నెలకొల్పఁ బడినవి. పురుషులు స్త్రీలను జదివించుటకు సౌకర్యముల నొదవఁ గూర్చుచున్నవారు. ప్రబంధ నిర్మాణము లగుచున్నవారు. కొందఱు వృద్ధులు కొందఱు తల్లిదండ్రులు, సంఘ విశ్వాసములుగలవారై, యవిచారులై, తమ కన్యలను, బాలశాలల కనుపుటకును జదివించుటకును నొల్లనివారు లున్నవారు అని యెఱుంగుదుము. ఉండినను నేమి? అట్టి కన్యలు తమ పతి కరిగిన పిమ్మటఁ జదువ నగును. అట్టి సౌకర్యములను జేకూర్చుకొననగును. ఒకవేళ దౌర్భాగ్యవశమున నట్టి కన్యల కట్టిదే యత్తిల్లు సంప్రాప్తమై విద్యాభ్యాసమునకు విఘ్నమును విరోధమును నుపస్థిత మగునెడల నిరుత్సాహులు గాక, ఆ యడ్డంకులకు వెనుదివియక, తమ పతుల సాయ మలవఱచుకొని చదువుకొననగును. వృద్ధులు స్త్రీవిరోధులై యున్నను, నవయువకులు విరోధులై యుండుటలేదు. వారు పక్షపాతులై యున్నవారు. వారు తమ పత్నుల కుత్సాహముతో నవశ్యము విద్యఁ గఱపుదురు. కాని, వారిలో నాసక్తియు, శ్రద్ధయుఁ బట్టుదలయు నుండవలయు. స్త్రీలు విద్యాభ్యాస నిశ్చయులు గాక యుండునంత కాలము స్త్రీస్వాతంత్ర్యము స్త్రీలయౌన్నత్యమును గలుగనేరవు. ఇది నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము.

ఈ సందర్భమున శైలకుమారీదేవి పురుషులు కారణముగ స్త్రీలు చదువుకొనఁ జాలకున్నారనియు, వారలే స్త్రీవిద్యకు స్త్రీశిక్షకు బాధకులనియుఁ జెప్పి యుండెను. అయ్యది. విశేషాంశము సత్యదూరమును దోషయుతమునునై యొప్పుచున్నయది. పురుషులు నూటికేబదిమంది స్త్రీవిద్యకుఁ బ్రాతికూల్యమూని యున్నారు. కాని ప్రాతికూల్యము స్త్రీల విద్యాభ్యాసమునకు బాధకము గలిగించునంతటి మహత్త్వమును బ్రాబల్యమును గలిగియుండునది కాదు. వాస్తవముగ స్త్రీలయందు మనోదౌర్బల్యమెక్కువ. అందువలన విద్యావిహీనులై యున్నారు. వారి విద్యావిహీనతా దోషము పురుషులపైనిడుట యసందర్భము. అసంభావ్యము. స్త్రీవిద్యాభిమానులు పలువురు పురుషులుండియు, వారలను స్త్రీవిద్యాప్రచారము సలుపుటయందును, స్త్రీలను శిక్షితలనుగఁ జేయుట యందును దగినంత ప్రోత్సాహమును జూపుచుండుట లేదనియు, జాలునంత యత్నమును జేయకుండుటలేదనియును నిందించుచున్నవారలు. వారియందు దాదోషము చూపట్టుచున్నయది. అందులకు సందియము లేదు కాని,

స్త్రీలు తమ యందుఁ జూపట్టు దోషమును గ్రహించుకొనకుండ నంతటి దోషము నంతను బురుషులపై మోపుట యనుచితము. అన్యాయము. మునుముందు మీరు విద్యాభ్యాసమునందు దృఢనిశ్చయులై కృషి యొనర్చుటకు సంసిద్ధు లగుఁడు. అట్లగుదురేని మిమ్ముల నెవరును నిరోధించుటకు శక్తులు గాఁజాలరని నిశ్చయముగఁ జెప్పుచున్నాను. ఆ నిరోధించెడి కాలము పోయినది. వృద్ధులు కొందఱు నిరోధించుటకు దొరకొనినను, వారి నిరోధములు ప్రతిబంధకమును గలిగింప నేరవు. కాఁబట్టి మునుముందు విద్యాశిక్షలఁ గ్రహించుటయందుఁ దత్పరచిత్తులరగుఁడు. ఇయ్యది స్త్రీ సమాజౌన్నత్యమునకుఁ బ్రథమ సోపానము.

ఇపుడు మీరు మీ స్వాతంత్ర్యాధికారములను, జేకొనుటకుఁ దీవ్రమనస్కలై యొప్పుచున్నటులఁ జూపట్టుచున్నారు. మీరు మీ స్వాతంత్ర్యాధికారములఁ బడయుటకు మునుముందు మీలోఁ జూపట్టు కురీతులను దూరమొనర్చుకొనుట కొక సంఘటనమును సమకూర్చుకొనుట యత్యంతావశ్యకము. ఇందుకొక సంఘమును స్థాపించుకొనవలయును. నగరములో స్త్రీలెల్లరును దత్సంఘసభ్యలు కావలయును. నెల కొక సారి తత్సంఘాధివేశనము గావించి, యందు స్త్రీ విద్యాభివృద్ధిఁ గూర్చిన విషయములను, స్త్రీలలో వ్యాప్తములయి యున్న కురీతులను దొలఁగించుటకుఁ దగు మార్గములను బ్రకటించుట తత్సంఘ కర్తవ్యముగఁ నిర్దిష్టము గావింపవలయు. తత్సంఘము క్రమక్రమముగఁ బ్రభావయుతముగను, దత్సంఘాదేశములు స్త్రీల కెల్లరకును మాననీయములగు వానినిగ జేయఁగలది యగును. అపుడు తత్సంఘము మూలముగఁ బురుషుల కడనుండి స్వాతంత్ర్యాధికారములఁ బడయుటకు స్త్రీలు శక్తులు కాఁగలరు. నగర సంస్థల ( మ్యునిసి పాలిటీల ) లో, తాలూకా జిల్లా సంస్థలలోఁ బురుషులతోఁ బాటుగ నభ్యర్థులుగ నిలుచుటకును, నిలిచిన వారలకు సమ్మతుల (Notes) నొసంగుటకును, స్త్రీ విద్య యనివార్యమగునటుల నియమబద్ధము గావించుటకును శక్తులగుదురు. ఇవి యన్నియు విద్యాబుద్ధులం గఱచి సుశిక్షితలై తగు బలమును సంఘటితము గావించుకొనిన పిమ్మట నలవడునవిగాని, లేనిచో నలవడునవి గావు.

ఇంకొక విషయము నివేదనము గావించుకొన నున్నదానను. మన సోదరీ రత్నము శైలకుమారీదేవి, పురుషులఁ బ్రతిఘటింప వలయుననియును, బురుషుల యెడల నిందిత వ్యవహారమును బూనవలయుననియును, మీకుఁ జెప్పియుండెను. అట్లెన్నఁడును జేయఁదగదు. మరచియైనను మీ రెన్నడును సలుపఁ దగదు. ఇప్పటి కాలమునఁ బురుషులు దేవతలకుఁ బోలె వ్యవహారములు సలుపనేర కున్నవారు. అని వారలను దేవతలనుగ గణియింపకపోయినను, సమ్మానితులుగ గణియించి వారి

ప్రసన్నతఁ బడయ కుండ వారితో నెగ్గుట సాధ్యపడునది కాదు. స్త్రీలు తమ పతులను దేవసములుగఁ దలంచునటులను, వారల నెన్నఁడును నవమానితులఁ జేయకుండునట్లు, మన పురాణాదర్శములు మనకు బోధించుచున్నయవి. కాని, మీరు మీ దృష్టులను బురాణాదర్శములనుండి మరల్చిన వారలైతిరి. కాని, వాని నటుంచుఁడు. వ్యావహారిక దృష్టిఁ బట్టి చూడుఁడు. ప్రకృతియే పురుషులకు స్త్రీలకంటె నుచ్చపదమును బ్రసాదించి యున్నది. అందువలన వార లుత్కృష్టులుగఁ బరిగణింపఁబడు చున్నవారు. మానవులయందే కాదు. పశుపక్ష్యాదులగఁ గల జీవజంతువులయందు వృక్షపల్లవములయందుఁ బరికించి చూడుఁడు. వాని యందును బుంస్త్వ మధిక శక్తిశాలినియై యొప్పుచున్నటులను, నెపుడును, స్త్రీత్వము పుంస్త్వరక్షణమున వఱలుచున్నటులను గానఁ బడును అందువలన మీరు పురుషుల సహాయ్యమును బడయక ప్రపంచములో నిలుచుటకు శక్తులు కాఁజాలరు. అట్టి శక్తి చేకురుట కడునసంభవము. కాఁబట్టి మీరు మీ పురుషులతోఁ గలసి మెలసి వారల కనుకూలవర్తనులై వారలను సుప్రసన్నులఁ జేసికొనుటయే మీకు శ్రేయస్కరము. కల్యాణప్రదము. కాఁబట్టి సోదరీమణులారా! మన సోదరీ రత్నములు శైలకుమారీ రమాదేవులు చెప్పిన చొప్పున నెన్నఁడును వర్తింప వలదని మిమ్ముఁ గడుంగడుఁ బ్రార్థించుచున్నదానను. వారు చెప్పినది హితకరమును సుఖదమును గాదు. అనర్థమును, దుఃఖమును జేకూర్చునది. విషమఫలము నొసంగునది. వినాలోచనముగ వారు చెప్పినచొప్పున వర్తిలువార లగుదురేని విపత్పాతమునకుఁ బాలగువారలగుదురు.

కాత్యాయనీదేవి భాషణ మింకను ముగియలేదు. ఆమె భాషించుచునే యున్నయది. కాని, తుదివాక్య మామె నోటినుండి వెలువడుటయే తడవుగఁ గొందఱుద్దండులు, నిరంకుశులు నగు యువతు లుగ్రులై లేచి నిలిచి "శైలకుమారి చెప్పిన యుపాయములు, చూపిన మార్గములు నత్యంత ప్రశంసనీయములు. వానినే యనుసరించెదము. నీ మాటలు విన నొల్లము. కాఁబట్టి నీ ముదుసలి మాటలు కష్టపెట్టుము. పురుషులు ముందు వెనుకలు చూడకుండ మమ్ము వేగించుచుండిరి. వారు పెట్టెడి కష్టములకోర్చి యోర్చి మా కాయములు గాయములు పడినవి. మా ప్రాణములు విసిగినవి. కాఁబట్టి యిఁక వారికిఁ బ్రతీకారమొనర్చుటకుఁ గంకణబద్ధ మైనారము. వెనుదీయువారము కాము. ఇంతవఱకు నీ బోటి వారి యుపదేశములను మన్నించుచుండుటవలననే యిట్టి దుర్గతికిఁబాలు గావలసిన వారల మైతిమి. ఎంతవఱ కనుభవింపవలయునో అంతవఱ కనుభవించితిమి. ఇంక భరింప లేము. ప్రాణముల నర్పింపఁ జాలము. ఇఁక నీ మాటలు మాకు రుచింపవు. కాఁబట్టి ప్రయాస మొందకుము. నీ మాటలు నీ యొద్దనే

యుండునుగాక ! మేము శైలకుమారీదేవి యుపదేశములఁ గ్రహించి తన్మూలముగ ముక్తిఁ బడయనెంచితిమి. (సభలోఁ గూర్చుండి యుండిన స్త్రీల యందలవంకఁ జరిగె) సోదరీమణులారా ! ఈ కాత్యాయనీదేవి మాటలయెడ నిసుమంతయు ధ్యాన ముంపకుఁడు. శైలకుమారి చెప్పిన చొప్పునఁ గార్యతత్పరలు కావలయు ననియుఁ మిమ్ము నందఱ నభ్యర్థించుచున్న వారము. ఆమె యొసఁగిన యుపదేశమే శ్రేయస్కర మైనది. ఆమె చూపిన మార్గమే సుఖప్రదమైనది. అందు సందియములేదని నొక్కి నొక్కి వక్కాణించుచున్నార" మని పలుకఁ జొచ్చిరి.

ఈ మాటలు వినినంతనే సభాస్థితులలో నధికసంఖ్యాకలావేశ పరవశలైరి. కాత్యాయనీదేవిని నిరసింపఁ జొచ్చిరి. ఆమె భాషణమునకు విఘ్నమాపాదింపఁ జొచ్చిరి. ఆమె వినమ్రయై ముకుళితకరకమలయై పలుసారులు పలుకఁ బ్రయత్నించెను. కాని, సభ్యులలోఁ బలువురు "చాలు, చాలు. కూర్చుండుము. కూర్చుండుము. నీ మాటలను విననొల్లము. ఇఁకఁ గట్టిపెట్టి కూర్చుండుము." అని కేక లిడుచు నామెను మాటలాడనీయ కుండుటఁ దుదకు వివశయై నిరుత్సాహయై తన భాషణమును ముగింపఁజాలక తన యాసనమును గ్రహియింప వలసిన యవసరము సంభవమయ్యెను.

సభలోఁ గలకల మధికమయ్యెను. శైలకుమారీదేవి చెప్పిన యావేశ జనిత ములును క్రాంతికారులునగు వచనములకుఁ గాత్యాయనీదేవి సౌమ్యములును, నాదర్శ నీయములును నగు పలుకులు నిర్మూల్యములయ్యె. నిష్ఫలము లయ్యెను. తుదకు మహి ళామణులు తమ పురుషులకుఁ బ్రతికూలతవహించి తద్భావములను బ్రకటించుచుఁ బతి ప్రతిఘటన విచారముల ముమ్మగుచు శైలకుమారిఁ బ్రశంసించుచుఁ గాత్యాయనిని నిరసించుచుఁ దమ తమ గృహములకు మరలఁ జొచ్చిరి.

## పదునాఱవ ప్రకరణము

మిస్టర్ హర్షదేవుని జనకుఁడు కాన్పూరులోని యొక ప్రసిద్ధుఁ డగు వైద్య శ్రేష్ఠుఁడు. మాసమునకుఁ గొంచె మించుమించుగ మూఁడువేల రూప్యములు వైద్య వృత్తివలన నాదాయము గలవాఁడు. స్వయముగ నొక వైద్యశాలను నెలకొల్పి యున్నవాఁడు. అందుఁ బెక్కండ్రు రోగులు దూరదేశముల నుండి యరుదెంచి చికిత్సలను బడసి యారోగ్యమునొందుచుందురు.

హర్షదేవుఁడు తల్లిదండ్రులకు గారాబు తనయుఁడు. ఇరువది సంవత్సరముల ప్రాయముననే ఎమ్. ఏ. చదువుచుండు కారణమున గృహములోని వారల యెల్లర

కృపాదృష్టికిఁ బాత్రుఁడయ్యెను. గృహమునం దాతఁడు చెప్పిన యది సాగుచుండెను. ఆతని కెందును బ్రతికూలము లేకుండెను. ఆతఁ డాడిన దాటయుఁ, బాడినది పాటయు నగుచుండెను. పట్టణములోఁ గూడ నాదరణమును గనుచుండె. ఆతనికి నెలకు రెండు వందల రూప్యములు స్వవ్యయమునకు జనకుఁ డొసంగుచుండెను. గాని, యాతఁ డామొత్తములోఁ దనవ్యయమును నిముడ్చుకొనఁ జాలక తదతిరిక్తముగఁ దండ్రి కెఱుక లేకుండఁ దల్లికడనుండి కొంత సొమ్మును రప్పించుకొనుచుండెను. ఆతఁడు కోరినమేరకుఁ దల్లిదండ్రులు తగిన సమయము తగని సమయమను వివక్షలేకయే సొమ్ము నొసంగుచుండిరి. నీటుగోటులతోఁ, డాబుదర్పములతోఁ గాలాను సారములగు (up to date) విలాసములతో నివసించుటకుఁ జిన్నతనమునుండియు నభ్యస్తుఁడయి యుండుటచే, నిపుడు తదభ్యస్త నివాసము పరాకాష్ఠరూపమునఁ బరిణమించెను. ఆతని వెచ్చము విలాసముల క్రింద నెక్కువ యగుచుండెను. ఆతఁడు వర్తనమునను, వ్యాయామమునను, నెట్టులుండినను, నింత దనుకఁ జారిత్రమునందుఁ గొంచె మయినను గళంకము కల్గినవాఁడు కాఁడు. కాని, శైలకుమారీ పరిచయ మలవడినంతనే ప్రవర్తనము నందలి బలమును గోలుపోయెను. అనంతరము భూపతులాలు తోడి సాంగత్య మలవఱచుకొని సంపూర్ణముగ నాతతాయియు దుర్వ్యసనియు నయ్యెను. విద్యాభ్యాసమును గూర్చిన యుత్సాహమును బరిశ్రమయును శైల పరిచయము కలిగినంతనే విడిచిపెట్టియుండెను. భూపతుని సాంగత్యము వలన మద్యపానమును, వేశ్యాగమనమును బ్రధాన కృత్యములుఁగ గ్రహించెను.

శైలకుమారి కళాశాలా విద్యార్థి భోజన గృహము (Boarding House) వీడి, స్వగృహమున కరిగిన పిమ్మట, భూపతులాలు హర్షదేవుని మనమును నామెనుండి మరలించి, వైశ్యాగమనమునందుఁ బ్రవృత్తము గావించెను. ధనవంతుని పుత్త్రుని వలలో వైచుకొని యాతనికడనుండి ధనమును సంగ్రహించుచు నాతనితోఁ బాటు భోగ విలాసములఁ బడయుచుండెను. కళాశాలా భోజన వసతి రుసుములు వృద్ధిచేయఁబడె నని సాకు చెప్పుచు నెలకు నాలుగు నూర్ల రూపాయలు తండ్రికడనుండి పడయఁ జొచ్చెను. కాని, నాలుగువందలైనను దనవ్యయమును బూర్తిగా వింపఁ జాలవయ్యెను. వేశ్యావాంఛితములను బూర్తి యొనర్చుటలోఁ బ్రతిదినమును, నాతని ప్రాణములు కంఠగతములు కాఁజొచ్చెను. ఆతని వేశ్య యాతని నొకపుడు జాకెట్టు (రవిక) కావలయుననియు, మఱియొకప్పుడు చీర కావలయుననియు, మఱి యొక్కసమయమునఁ గంఠాభరణమనియు, నొక్కొక్క సమయానఁ గాసుల

పేరనియు, నీ విధముగ నేదో యొక దానికొఱకుఁ బ్రతిదినమును బట్టుబట్టి పీడింపఁ జొచ్చెను. తన వేశ్యావాంఛితములను దీర్చుటకునై హర్షదేవుఁడు ఋణగ్రస్తుఁడయ్యెను.

రహస్యవర్తనమును దొంగతనమును రహస్యముగ నణఁగియుండునవి కావు. అవి యెప్పుడో యొకప్పుడు వీధిఁబడును. హర్షదేవుని వర్తనము బయలుపడి సర్వవ్యాప్తి గనినయది. అతని జనకుని కర్ణముల కెక్కినది. అతఁడు తన కొమరుఁడొనర్చిన విశ్వాసఘాతమునకుఁ బితృద్రోహమునకు నత్యంత దుఃఖితుఁడై యురుదెంచి యాతని బలవంతముగ వెంటఁగొనిపోయెను. హర్షదేవుఁ డొనర్చిన ఋణములఁ దీర్చుట కాతని తండ్రికిఁ బదునైదువేల రూప్యములు వ్యయమయ్యెను.

వ్యసనాసక్తులు కఠినదండనము పడయకుండ నెన్నఁడును దమ వ్యసనముల విడువనేరరు. హర్షదేవుడు తల్లి దండ్రుల మందలింపులవలనఁ బశ్చాత్తప్తుఁడగుచున్న వాని వలె నటించుచు నెట్టులో యొక నెల దినము లింటిలో నుండెను. అంతట భోపతులాలును, వేశ్యయు ప్రాయుజాబులఁ బడసియు, వారు పనుచు దూతలఁ గనియు నింట నిలువ నసమర్థుఁడై యొక నాఁటి యర్థరాత్రమున నే బదివేల రూప్యముల రొక్కమును సంగ్రహించి యెరికిఁ దెలియకయే పలాయన మొనరించి తల్లిదండ్రులను సంతప్తచిత్తులను గావించెను. పాపము హర్షదేవుని తండ్రి హర్షదేవుని గొని తెచ్చుటకుఁ బరుగిడెను గాని, హర్షదేవుఁడు తండ్రియెడ భయభక్తులు వదలి యాతనికిఁ బ్రతికూలుఁడయి తిరుగఁబడఁ జొచ్చెను. అంత నాతఁడు చేయునది నేరక యింటికి మరలి వచ్చెను.

హర్షదేవుఁడు నిరంకుశుఁ డయ్యెను. సర్వతంత్ర స్వతంత్రుఁ డయ్యెను. సత్వరగమనమునఁ బతనోన్ముఖుఁడగు చుండెను. హర్షదేవుని వలలో వైచుకొని మోహాంధునిగ నొనర్చి, యాతని చారిత్ర్యమును గళంకితము గావించి యాతని సద్వర్తనమును దుష్టమొనర్చి, యాతని సర్వస్వమును నపహరించిన వేశ్య యాతనికడ ధనాభావముఁ జూపట్టి నంతనె యాతనిఁ బోనాడి వేఱొకనిఁ జేకొనినయది. అయ్యది హర్షదేవున కసహ్యమైనది యయ్యెను. అతఁ డింటినుండి సంగ్రహించి తెచ్చిన ద్రవ్యమంతయు వ్యయమయ్యెను. అందువలన వేశ్య కంటికిఁ జులకనఁగ జూపట్టె. హర్షదేవుఁడును వేశ్యానురాగముఁ బాయుటకుఁ దద్వాంఛితముల నొడఁగూర్చుటకు సమర్థుఁడు కాఁజాలనందున నామె దుష్టవర్తనమును గూర్చి యామె నేమియు ననసేరకుండెను. కాని, తాను వలచిన వేశ్యను జేపట్టిన విటునియెడ వైరభావమాతని హృదయమున నుత్కటమైనందున నసహ్యమును బొందినవాఁడై యొక దినమున నిశీథమందు భోపతుని వెంటఁగొని, వేశ్యాగృహములోఁ జొచ్చి వేశ్యకును దద్విటునకును

నాశికాఖండన మొనర్చెను. మరునాఁ డుదయమున భోపతులాలు సహితముగ రక్షక భటులచేఁ బట్టుపడియెను. విచారణార్థము న్యాయాలయమునకుఁ గొనిపోఁబడెను.

పుత్త్రుఁ డెంతటి దుండ గీడును, నెంతటి దుర్వ్యసనుఁడును, నెంతటి దుర్వర్తనుఁడును, నయినను దల్లి దండ్రులు బోనాడఁజాలరు. తుదకుఁ దమ పుత్త్రుఁడు తమకుఁ బ్రాణఘాతకుఁడైనను నట్టి పుత్త్రునియందు వాత్సల్యదూరులు కాఁజాలరు. పుత్త్రవ్యామోహమును వీడఁజాలరు. ఆత్మజుఁడుగదా? ఎట్లు వీడఁగలరు? తమ పుత్త్రుఁడెట్టి దుష్టుఁడైనను, నెట్టి హంతకుఁడైనను, వానికి విపత్తుమూడినపుడు హృదయమును వజ్రమయముగఁ జేసిన వాఁడయ్యును, తండ్రి, పుత్త్రవాత్సల్యమును వీడఁజాలఁడు. తమ సర్వస్వమును, దన ప్రాణమును, ధారపోసియైనను, దన పుత్త్రుని విప దుద్ధరణమునకుఁ దండ్రి యుద్యుక్తుఁడగును. హర్షదేవుని తండ్రి, తన పుత్త్రుఁడు దోషియై రాజకీయభటులచేఁ బట్టుపడినవాఁ డని వినినంతనే పరుగిడి యాతనిఁ బ్రాతినిధ్య మొసంగి విడిపించుటకుఁ బలుపాట్లు పడెను. కాని విడిపింపఁజాలఁ డయ్యెను. హర్షదేవునిచే నాశికాఖండన మొనర్పఁబడిన మనుజుఁడు సామాన్యుఁడు కాఁడు. కోటీశ్వరుఁడు, మానమర్యాదలు గలవాఁడు. పలుకుబడి గలవాఁడు. స్థానీయుఁడు, రాజకీయోద్యోగుల పరిచితి గలవాఁడు అధికారుల వశమొనర్చుకొని హర్షదేవుని విడుదలకుఁ బ్రతిబంధకము కలిగించెను. రక్షణోద్యోగులు తమ దోషారోపణపత్రమునందు, (Report Charge sheet) "హర్షదేవ భోపతు లిరువురును వేశ్యయొక్కయుఁ దద్విటునియొక్కయు బ్రాణముల నపహరించుటకు సంసిద్ధులై యాక్రమణమును సలిపియుండిరి. కాని దైవప్రాతికూల్యమువలనఁ దమ సంకల్పమును బూర్తిగావించుకొనలేక పోయిరి." అని వ్రాసియుండిరి. అందువలన నాయిరువురపై హత్యాక్రమణదోషము (attept of Murder) ఆరోపితమయ్యెను. వాజ్యము ప్రబలమయ్యెను. సెషన్సుకోర్టులో హర్షదేవు భూపతుల కిరువురకు ద్వీపాంతరవాసశిక్ష విధింపఁ బడియెను అందుపై హైకోర్టున కపీలు చేయఁబడెను. ప్రతిద్వంద్విశిక్షితుల కిరువురకును, శిక్షన్యూనతగనకయుండునట్టు లమిత ధనమును వెచ్చించుటవలన హైకోర్టునందును సెషన్సుకోర్టు తీర్పు మార్పు చెందక స్థిరరూపమునే దాల్చిన దయ్యెను.

హర్షదేవుని తండ్రి హర్షదేవుని విడిపించుటకు నించుమించు రెండు లక్షల రూప్యములను వ్యయ మొనర్చెను, కాని సఫలతఁ గనఁజాలక పోయెను. కుమారునకు ద్వీపాంతరవాసశిక్ష విధింపఁబడిన దని వినినంతనే యాతఁ డర్థము మృతుఁడయ్యెను. కుమారుఁడు దుర్వర్తనుఁడైన దాదిగ నాతఁడు శోకవిహ్వలుఁడై వైద్యవృత్తిని విరమించి యున్నవాఁడు. అందువలన నాదాయము శూన్యమయ్యెను. ఇదివఱకు

నార్జించి యుంచిన దానిలో హర్షదేవుని చౌర్యమువలనఁ గొంతవఱకు నాశన మయ్యెను. మిగిలినది వ్యాజ్యమునందు వ్యయమయ్యెను. తుదకు నిర్ధనుఁడయ్యెను. పుత్త్రుఁడును, ధనమును జేజారిన కతమున హర్షదేవుని తలి దండ్రు లిరువురును నన్నవస్త్రములకైన నాధారము లేనివారైరి. తమ దౌర్భాగ్యమునకు నేడువఁదొడం గిరి. ఏడ్చి యేడ్చి కొలఁది కాలములోనే కండ్లు పోఁగొట్టుకొనిరి. అంధులై పలువె తలఁ గుందఁజొచ్చిరి.

హర్షదేవ భోపతులవంటి సుకుమారులు ద్వీపాంతరవాస శిక్ష ననుభవించుట కెట్లు శక్తు లగుదురు? అపరాధ మొనర్చుటకు శక్తులైరి గాని, తదపరాధమునకుఁ బ్రాప్తమయిన దండనము ననుభవించుటకు శక్తులు కాఁజాలకపోయిరి. ప్రకృతమున ద్వీపాంతరవాస శిక్షితులను దొరతనమువారు అండమన్సు దీవుల కనుపుచున్నవారు. అందు శిక్షితు లనుభవించునది నరకయాతనమే యనవచ్చును. దానికి సంశయము లేదు. అట్టి ఘోరశిక్ష ననుభవింపఁదగినవారు, కఠోరులు, హంతకులు, రాక్షస ప్రకృతులు గాక తదితరులు కాఁజాలరు. సుకుమార గాత్రులు, కోమల హృదయులు నగు హర్షదేవ భోపతు లిరువురును, నచ్చటి కష్టములను, నచ్చటి యాతనలను నను భవింపఁ నసమర్థులై యచిర కాలముననే యాత్మహత్య గావించుకొనిరి.

హర్షదేవుని మరణవార్త నాలించిన వెంటనే యాతని తల్లి దండ్రులు నేలఁ గూలిరి. పుత్త్రశోకమును భరింపలేక ప్రాణములఁ గోలు పోయిరి.

## పదునేఁడవ ప్రకరణము

స్వార్థాంధులు తమ స్వార్థమును బడయుట కెందఱనైన మోసముచేయుదురు. ఎందఱ కుత్తుకలనైనఁ గోయుదురు. మార్గములు కొట్టుదురు. దొంగతనములు చేయు దురు. పరులను వంచింతురు. ధన సంగ్రహణమున కెన్నియేని యనుచిత కల్పనల నొనర్చి పరగృహములఁ గూల్చుట కుద్యుక్తు లగుదురు. కాని, తమ వర్తన మెంతటి ఘోరమయినదియో, తమ యార్జన మెంతటి యనుచిత మయినదియో, తమ జీవిత మెంతటి పాపభూయిష్ఠమయినదియో, తమ చరమ దశ యేతీరునఁ బరిణమింపఁజేయు నది యగునో, యను విచారణయును, వెరవును, బరలోకచింతనమును, వీడి, తమ కాళలమునకుఁ దమలోఁ దాము మురియఁజొత్తురు. ధనసంగ్రహమునే పరమార్థ సంగ్రహముగఁ బరిగ్రహింతురు. ధనసంగ్రహమునే జన్మసాఫల్య మొనర్చు నట్టి దానినిగ నెన్నుదురు. అట్టి వారు న్యాయాన్యాయ్యములు, నుచితానుచితములు నెఱుంగలేని హీనులై ధనసంగ్రహముతోఁ బాటుగఁ బాపసంగ్రహమును గూడ

యథేచ్ఛముగఁ జేయుచుందురు. సంచితధన మొకప్పు డనుభవములోనికిఁ గొనకపో యినను, సంచితపాపము తప్పక యనుభవములోనికిఁ గొనువార మగుదుమని యెన్నఁడు గాని యే సమయమునఁ గాని తలంపరు. తాము చేసికొను కర్మమునకుఁ గలుగు ఫలమును దా మనుభవింపవలయునను విషయము వారి మనములకుఁ బొడ కట్టదు. ధనసంగ్రహాసక్తులు జ్ఞానశూన్యులై, పాపాంధులై ప్రపంచమున ధర్మవర్త నులు, పాపభీరులు, న్యాయార్జనపరులు, నేరును లేరనియే తలంచుచుందురు. ఎట్టి వారి కట్టి భావమే యుండునుగదా? దుర్వర్తనులు తమవర్తనము నిర్దుష్టమైనదని, సర్వజన సమ్మతమయినదని, సర్వజనమాన్యమని, సర్వజనాచరణీయ మిదియేయని యెన్ను చుందురు. క్షంతవ్యమనియుఁ దలంతురు. కాని, యీశ్వర సమ్ముఖమున మనుజు లొనర్చిన సుకృత దుష్కృతములు. యథార్థరూపమున విమర్శితము లగును. అందు క్షీరనీరములు, వేర్వేఱుగ నేర్పరింపఁబడును. అందు సర్వము సమత్వము, న్యాయ్యము ప్రధానము. ఈశ్వర దృష్టియందుఁ బాలక పాలితుల విభేదములేదు. ఉత్కృష్ట నికృష్టముల వివక్షతయేలేదు. కలిమిలేముల లెక్కలేదు. స్త్రీ పురుషు లను, పిన్న పెద్దలను తలంపే లేదు. ఉచ్చనీచకుల విచారణమును లేదు. ఈశ్వర పరి శోధనమునను, విచారణమునను, నిర్ధారితము లగునవి కేవలము సుకృత దుష్కృతము. పాపపుణ్యములు. తన్నిర్దిష్టానుసరణముగ నీశ్వరుఁడు సుఫల దుష్ఫలములను నొసం గును. ఇయ్యవి యనుభవైక వేద్యములు. వలదనినను వీడునవి కావు. వద్దనినను బోవు నవి కావు. రాజకీయ దండమును దప్పించుకొనుట కెన్నియేని యుపాయములు సాధనములు గలవు గాని, యీశ్వరీయ దండమును, దప్పించుకొనుటకు యుక్తి యేది యును లేదు. సాధనమును లేదు.

ధూర్తాగ్రేసరుఁడు పండిత హరదత్తుఁడు స్వార్థాంధ శిరోభూషణుఁడు. ధనాశాపీడితుఁడు. మాయామాణవకుఁడు. అతఁడు అమాయకులను బలువురను బలు విధములఁ బీడించి వారికడనుండి ధనము నాకర్షణ మొనర్చెను. కాని, తత్సందర్భ మునఁ దన భవితవ్యమునుగూర్చి యిసుమంతయును దలపోయుటలేదు. తలపోయు విచారణమును బూనుటయునులేదు. కాని యాతఁడు చేసికొనుదానికిఁ గలిగెడుఫల మనుభవములోనికి వచ్చుసమయ మరుదెంచెను. అంతట వార్ధకము సంప్రాప్తించెను. అతని పాపభాండము బ్రద్దలయ్యెను. తత్ఫలము ననుభవింపఁ దొడంగెను. ఒక్క రొవదీను మహాజనునే కాదు. అట్టి వారల నెందఱనో తన ధౌర్త్యమునకు లోను గావించి పీడితులఁజేసెను. అట్టివార లొనర్చు విలాపములే, వారొందు పరితాపములే హరదత్తుని పాపభాండమును భిన్నమును గావించెనన నొప్పును. హరదత్తున కొక్క

సారి యొక్కమని పిడుగువలె విపత్పర్వతము విఱిగి మీఁదఁబడెను. వివాహితయైన కూఁతురు మృతిచెందినది. ఆమె మృతిచెందిన పదునైదు దినములైనను గాలేదు. కోఁడలు గతించెను. కోఁడలు గతించిన వారములోపలే ఒక్కఁడే కొడుకు ప్రాజ్ఞుఁడు. ఎం. ఏ. డిగ్రీని బడసినవాఁడు. ఎల్ ఎల్. బి. పరీక్ష నిచ్చి యున్నాఁడు. రోగగ్రస్తుఁడై మంచముపట్టి కదలమెదల లేనివాఁడయ్యెను. అతఁడు రుగ్ణతనుండి బయలుపడి బట్టకట్టునని చూచిన వారి కేరికిని యాశ లేదయ్యెను. కాలమును నిరీక్షించుచున్నవాఁడని యెల్లరును దలంపఁ జొచ్చిరి. అంత హరదత్తు నకుఁ గన్నుల మూఁతలు వీడినవి. పరవంచనామూలకముగ ధనము సంగ్రహించి యిల్లు నింపినందులకుఁ గలుగు పాపము ఫలించి యనుభవమునకు వచ్చినదని యాత నికిఁ బోడఁ గట్టినయది. అంతియే కాదు. అతని చెవిలో "పలువురను మోస పుచ్చితివి. పలువురకుత్తుకల నుత్తరించితివి. నమ్మినవారికి ద్రోహమొనర్చితివి. విశ్వాస ఘాత మొనర్చితివి. ధనమునే ప్రధానముగఁ గొని యెన్నియేని యకృత్యముల నొనర్చి తివి. తత్ఫల మనుభవములోనికి వచ్చినది. అనుభవింపుము. ఇపుడనుభవించిన దానితో అంతముకాలేదు. ఇంకను ననుభవింపవలసియున్నది. నీకుటుంబము సర్వశూన్య మగును. నీవు ఘోరదుర్గతికిఁ బాలగుదువు. అసహ్యవేదనమును బడయుదువు" అని యెవరో చెప్పుచున్నటులు దోఁపఁదొడంగెను. అట్లు చెప్పు వారెరో యని నలు వంకలఁ బరికించి చూచునుగాని, ఢయెరినిఁ గనుఁగొనఁ జాలనివాఁడగు చుండెను. అంత భయమెక్కువ యగుచుండెను. ఒకవంక పుత్త్రునిదశ ప్రతినిమేషమును భయం కర రూపమును దాల్చుచు విషాదము నతిశయింపఁ జేయుచుండెను. వేఱొక వంక నశరీర వాక్కు మనమును గలగుండు వఱచుచుండెను. అంత విదీర్ణహృదయుఁ డయ్యెను. హతచేతస్కుఁ డయ్యెను. విభ్రాంతచిత్తుఁ డయ్యెను. ఒకపుడు వింధ్య వాసినీదేవికిని, వేఱొకపుడు శ్రీ కాశీవిశ్వనాథునకును, మ్రొక్కులిడుచు ముడుపులు గట్టుచుండును. ఇంకొకప్పుడు "హా! పరమేశ్వరా! ఆర్తత్రాణపరాయణా! అనాథనాథా! ఆపదుద్ధారకా! నేను మహాపాపిని. ఘోరపాతకుఁడను. నేనొనర్చిన పాతకముల గణితములు. ఎన్ని పాతకములు చేసినవాఁడనైనను నీకు శరణ్యుఁడను. నా పాతకములను క్షమియింపుము. ఓ దయామయా! నా యపరాధములను మన్నిం పుము. పరవంచనమున నార్జించిన ధనము నంతను ధర్మకార్యములందు వినియోగించె దను. ఒక చిల్లి గవ్వయైనను, నింట నుండనీయను. ఓ ఆపద్బాంధవా! ఓ యప మృత్యుహరా! నా పుత్త్రునకు జీవనదాన మొసంగుము. నేను శాప కర్హుఁడను. అప రాధిని. దండనార్హుఁడను. నీ యిష్టము వచ్చిన దండనము నొసంగుము. నీ యిష్టము వచ్చిన దుర్గతిని బ్రసాదింపుఁడు. మనఃపూర్వకముగఁ జేకొనెదను. మహానందముతో

ననుభవించెదను. కాని, యీ వృద్ధిని, నీఁచీకును, నూతకోలనుగాఁ జేకొనకుము. అని పరిపరి విధముల భగవంతునిఁ బ్రార్థించును. కనఁబడిన దేవతలకు మ్రొక్కును. ఎన్ని దేవతలకు మ్రొక్కినను నేరను నడ్డుపడఁగలరు? అపరాధి క్షేరడ్డు పడుదురు? ఎన్ని చికిత్సలు చేసినను, ఎన్ని ముడుపులు కట్టినను, ఎన్ని మ్రొక్కులు మ్రొక్కినను, సార్థకము లేకపోయెను. ఎన్ని చేసినను హరదత్తుని పుత్త్రునకుఁ బ్రాణరక్షణ మలవడినది కాదు. అతఁడొక నాఁటిరేయి యిహలోకమును వీడి పరలోకమున కరిగెను.

పతి, ధనము నింటికిఁ గొనితేవ నత్యానందముతో నాతనికిఁ బక్వాన్నములతో భోజనమిడి, యా యన్యాయార్జితవిత్తముతో నిత్యము నూతనాభరణములను జేయించుకొని, వానితో నొడలు నింపుకొని, యానంద మొందుచుండెడి హరదత్తుని యర్ధాంగి స్వర్ణలతకుఁ దదానందమున కిపుడు సహస్ర గుణాధికమగు దుఃఖము సంప్రాప్త మయ్యెను. కాని, యామె తనభర్తవలె మానసిక వేదనమువలన వేధింపఁబడుటలేదు. ఆమెకుఁ గూఁతురు, కోడలు కొడుకు, మువ్వురు నొకరివెనుక నొకరుగ మరణము నొందుటవలనఁ గలిగిన దుఃఖ మమిత మయ్యెను. అసహ్య మయ్యెను. కుమార్తె మరణదినము మొదలుగ నామె యన్నపానముల యందు మనసుఁ జొనుపనియ్యనిదయ్యెను. దానఁ గోడలి మరణము సంభవించెను. తర్వాతఁ గొడుకు మరణము కొండవిఱిగి మీఁదబడినట్లు సంప్రాప్తించెను. పుత్త్రశోకమును భరించు శక్తి యామె యందు శూన్యమయ్యెను. పుత్త్రుని మృతదేహమును వెంబడించి శ్మశానవాటిక కరిగి తత్సమీపవర్తి యగు గంగానదిలోఁ గూలి ప్రాణత్యాగము చేసెను.

* * * *

హరదత్తుని పరివారము అతనితో నైదు ప్రాణులు. అందు అతఁడు తక్క తక్కిన నాలుగు ప్రాణులు కడతేఱినవి. ఇఁక నాతని యింటికి మిగిలినవాఁడు హరదత్తుఁ డొక్కఁడే. అతనికి నింటిలో నేవంక చూచిన నావంక రామదేవి ప్రసిద్ధ నారాయణుని పత్ని రామదీను మహాజనుని పుత్త్రిక కరాళరూపము ధరించి వికృతవదనయై చూపట్టఁ జొచ్చెను. అద్దానిని జూచి యాతఁడు భయకంపితుఁడగుచు రెండుచేతులు శిరమున నిడుకొనుచుఁ గన్నులు మోడ్చుకొని యొకచోఁ గూలబడుచు "తల్లీ! రామదేవీ! నన్ను క్షమింపుము. నేనే నీ మరణమునకుఁ గారకుఁడను. నేనే యథార్థముగ నిన్ను సర్వనాశన మొనర్చినవాఁడ. అందులకు సందియము లేదు. కాని, నన్ను నీవు విడువలేదు. నాకుఁ దగు ఫలమొసంగితివి. నా యిల్లు గూల్చితివి. నా కుటుంబమును గడుపునఁ బెట్టుకొంటివి. ఇఁక నైన నన్ను విడువుము. నన్ను బ్రతుకనిమ్ము." అని గొణుగుకొనుచు లేచి నిలుచుచుండును. అంత వెనుకనుండి కాళ్లు

పట్టుకొని వెనుకకీడ్చుచున్నట్లయి గుభాలున ముందునకుఁ గూలఁబడుచుండును. చేతనముఁ గోలుపోవుచుండును. చేతనమును గొనిన పిదప నిటునటు చూచినంత మరల నదే దృశ్యమాతని కట్టెదుటఁ బొడసూపుచు విభ్రాంతిని కలిగించు చుండును. ఆతఁడు రాత్రులందు నిద్దురయే యెఱుఁగఁడు. ఎన్నఁడైన నించుక నిద్రపట్టిన దుస్స్వప్నములవలన నులికిపడి లేచుచుండును. ఆతఁ డీవిధముగ వేధింపఁ బడుచు నొకనాఁటి నిశీథమున నా యన్యాయార్జిత విత్తమును, నా పాప పంకిలమగు ద్రవ్యమును నింటనుండి వెడలఁ జేసినఁగాని యీ వేదనమున కంతము గలుగఁ జాలదని తలంచి, ద్రవ్యమును బూడ్చి యుంచిన స్థలమున కరిగి, త్రవ్విచూడ, రూప్యములు కాసులు, మొహరీలు, ఆభరణములు మొదలగు వానితో నింపియుంచిన బిందె లిపుడు ఉముకతోను, బొగ్గులతోను నిండియుండెను. అయ్యది చూచినంతనే యాతనికిఁ దల గిఱ్ఱునఁ దిరిగెను. కన్నులు చీఁకట్లు గ్రమ్మెను. మతి చెడెను. నేలఁ గూలఁ బడెను. కొంత తడవునకుఁ దెలి వొంది భగవదాగ్రహము, దైవప్రాతికూల్యము, అందు వలన నిట్లయ్యెను అని నిశ్చయించి ప్రాప్తఫలము ననుభవింపఁ జొచ్చెను. పాపోపశమనార్థము, భయాపహరణార్థము, గాయత్రీ మంత్రమును, వీరాంజనేయ మంత్రమును జపింపఁ జొచ్చెను. ఈశ్వరారాధనమును జేయఁజొచ్చెను. కాని, మనస్సునకు శాంతి కలుగుటకుఁ మారుగ మనస్తాపము ప్రజ్వలితము కాఁజొచ్చెను. మనశ్శాంతి నభిలషించి త్రిరాత్రదీక్షితుఁడై, గాయత్రీజప మీశ్వరార్చనముల నొనర్చెను. కాని, యయ్యది వ్యర్థమయ్యెను. మానసిక వేదనము, హృదయ సంతాపము. మిక్కుటమయ్యెను. ఇహ జన్మమున మనశ్శాంతి యలవడ నేరదని మదినెంచి, యాత్మఘాత మొనర్చుకొనుటకుఁ గృత నిశ్చయుఁడై, సోలెడు నూనెలో నాలుగు తులముల నల్లమందును గలిపి యద్దానిఁ ద్రావి శాశ్వతనిద్రఁ బడయ నుత్సుకుఁడై శయనించెను.

హరదత్తుఁడు మరణాభిలాషియై నల్లమందు నూనె త్రాగి మృత్యుదేవతకు నిమంత్రణ మొసఁగెను. కాని యాతఁడు చేసికొనిన దుష్కర్మకుఁ దగు ఫల మింకను ననుభవశేషమయి యుండుటవలన మృత్యుదేవత యాతఁ డొసంగిన నిమంత్రణమును గ్రహించి యాతనికడ కరుదెంచినయది కాదు. ఆతఁడు రాత్రి యంతయుఁ గదలక పడియుండెను. ప్రాతఃకాలమగుడు బాధోద్రేకమున నాక్రోశ మొనరింపఁ జొచ్చెను. సోలెడు నూనెను నాలుగు తులముల నల్లమందును సేవించినను, నాతనికి మృతి లభించినది కాదు. మృత్యువున కీపాపాత్ముని దగ్గఱఁ జేర్చుటకు సిగ్గుకలిగెను కాఁబోలు! మరణమెట్లు గల్గును? వాని యనుభవమున కింకను నంతము కలుగుట లేదు. ఇంకను ఘోర యాంత్రణ మనుభవింపవలసి యున్నది. ఇంతవఱ కాతనిని

మానసిక వేదనము మాత్రమే వేధించుచుండెను. గాని, యిపుడు శారీరక పీడనము కూడ వికటరూపమున నలముకొని పీడితునిఁ గావింపఁ జొచ్చెను. కాలు సేతులు నిర్బలములై పటుత్వము తప్పి కదలక యుండెను. నల్లమందాతని ప్రాణాపహరణము నకు శక్తికలది కాకపోయినను, దన ప్రభావముఁ జూపి, యాతని దేహబలమును శూన్యమొనర్చి, నఖశిఖపర్యంతము శరీరము బాధకు లోనుగావించెను. అతఁడు శరీర పీడనమునకు సహింపనేరక కాలు సేతులు నేలవేసి కొట్టుకొనఁజొచ్చెను. నల్లమం దును దినుటవలన నుత్పన్నమైన యతిశయోష్ణ మాతని కుత్తుక నార్పివై చెను. విదాహ మును బుట్టించె. దాహ ముపశమించుటకై జలపానము నాశించుచుఁ బెదవులఁ దడుపుకొనుచు నాలుకఁ బైకిఁ జాచుచుండెను. కాని యాతనిఁ జూచువారలును నోటిలో నీరుపోయువారును నింటిలో నేరున్నారు? ఏరునులేరు. ఇరుగు పొరుగు వారలను బిలుచుటకు నోటమాట రాదు.

హరదత్తుఁడు తన యింటిలోఁ గదలమెదలలేక నోటమాటలేక దుర్గతికుఁడై దుర్భరపీడితుఁడై పడియుండెను. అతనికట్టి దురవస్థాస్థితియందు నాలుగైదు దినములు గడచెను. అంత నిరుగు పొరుగు వారలు, నాలుగైదు దినములుగ హరదత్తుని జాడ గాని యలికిడిని గనుఁగొననివార లైనందున నాతని యుదంత మారయనెంచి యాతని యింటి కరుదెంచి చూచిరి. ద్వారములోన నుండి బంధితమయి యుండెను. ఎవఁడైనను, నెట్టి దుష్కార్యుఁడైనను, విపద్దశకులోనై సంకటములు గుడుచు చునుండు నపుడు వాని వంకకు లోకుల సానుభూతి పరుగిడకుండ నుండనేరదుగదా? ఆత్మీయులెల్ల రొక్కసారిగ మృతులైన కతమునఁ, దద్దుఃఖమునకు వివశుఁడై యన్న పానములులేక హరదత్తుఁ డింటిలోఁ బడియుండఁ బోలునని తలంచి, యాతని దుఃఖోపశమనమును గలిగించుటకుఁ బలువు రాతని యింటి కరుదెంచి తలుపుఁ దట్టిరి. తలుపుఁ దెరువుమని హరదత్తుని బిగ్గరగఁ బిలిచిరి కాని, లోననుండి ప్రత్యుత్తరము రాదయ్యెను. తలుపు తెరువఁబడ దయ్యెను. తెఱచువారెవ్వరు? ఉన్నవాఁ డొక్కఁడే. ఆ యొక్కఁడును, గదల మెదలలేక పడియున్నవాఁడు. ఎంతకును లోననుండి ప్రత్యుత్తరము రాకుండుటచేతను, దలుపు తెఱువఁబడ కుండుటచేతను, నావచ్చినవారు సంశయమనస్కులై తలుపుఁ బగులఁగొట్టి లోనఁజొచ్చిరి. దౌడలు దగ్గఱఁగబడి, పండ్లు బిగిసి, కండ్లు గాజువాఱి, కదలమెదలలేక, నోటమాటలేక, మలమూత్రములలోబడి దొరలుచు, నాలుకను బైటకుఁజూపి, యున్న హరదత్తునిఁ జూచిరి. అతని కడనుండి దుస్సహమును గడపులోని ప్రేవులు తెగి బైటబడునట్లు చేయు దుర్గంధము కొట్టుచుండెను. అందువలన నాతని దగ్గఱఁజేరుట కేరును దొర

కొనకుండిరి. చూచువార లెల్లరును, నాతఁడు మరణించెననియే తలంచిరి అతనిఁ దాకుటకేరును నిచ్చుపడకుండిరి. కాని, యందొక వృద్ధుఁడు దయార్ద్రహృదయుఁ డాతని దగ్గఱి నాడిఁ బరీక్షించిచూచి "ఇంకను బ్రాణమున్నది. బ్రతికియే యున్నాఁడు" అని పల్కెను. అంత వారిలో నొకఁడు డాక్టరును గొనితెచ్చి చూపుట మంచి దని పల్కుచు, డాక్టరును బిలుచుకొని వచ్చుటకు బయలు దేఱెను. హారదత్తుఁడు వలదని చేతులతో సంజ్ఞచేయుచు వారించెను. ఏరికిని జూపవలదని సూచించెను. ఇంకొకరు, ఇక నెవరిని గొనితెచ్చినను, నేరికిఁ జూపినను, బ్రయోజనము లేదు. ముఖము కళాశూన్యమయ్యెను. కన్నులు తేజోరహితమయ్యెను. శరీరము శవాకారము దాల్చెను. బ్రదుకువాఁడు కాఁడు. కాలము కొఱకు వేఁచి యున్నాఁడు. అని పలికిరి. వారి మాటలందఱును నిక్కము లని తలంచిరి. ఇంక హారదత్తుఁ డెంతోకాలము బ్రదుకఁడని నిశ్చయించిరి. అతఁడు బ్రతికి యున్నంత వఱకు నాతని దగ్గఱ నొకరు కనిపెట్టి యుండి వలయునది యొసంగుచుండ వలయునని యను కొనఁ జొచ్చిరి. కాని యాతని కడఁ బుట్టుచుండు దుర్గంధమును భరించుచు నాతనిఁ గని పెట్టుకొని యుండుటకేరును సిద్ధులు కాఁజాలకుండిరి. అందు సహనశీలుఁ డగు నొక యువకుఁడు తత్కార్యకమును సహర్షమున శిరమున నిడుకొనెను. పరోపకార పరాయణులకు దుర్గంధము దుర్భరమగునది యగునా!

హారదత్తున కలవడిన దుర్దశ యిట్టిదట్టి దని యేరును జెప్పఁజాలరు. ఆట్టి యవాచ్యదశయందుఁ బదిదినములు బడియుండి, పదునొకండవ దినమున సాయాహ్నమునఁ బ్రాణములను వదలెను. అతఁడీ పది దినములు నారకీయ యాతనము నే యనుభవించెనని స్పష్టముగఁ జెప్పవచ్చును. మనుజుఁడు తాను జేయు కర్మమునకుఁ దగు ఫలమును దన జీవిత కాలములోనే యనుభవించు ననుదానికి హారదత్తుఁడే సాక్షిభూతుఁ డని హారదత్తుని జీవిత చరిత మెఱింగిన వారెల్లరును దలంపఁ జొచ్చిరి.

## పదునెనిమిదియవ ప్రకరణము

రాత్రి సగ మతిక్రమించెను. చలి ప్రచండరూపమును ధరించి యుండెను. ముసుఁగులోనుండి చేతులు బైటఁబడిన యెడలఁ గొంకర్లు పోవుచుండెను. వేసవి రాత్రి రెండు యామము లతిక్రమించెనను నిసుక జైచిన నేలఁబడకుండు నంతటి సమ్మర్దముగ మనుజుల రాకపోకలతో నుండు నట్టి బాటయుం దిపుడు శునకమైనను జనలే కుండెను. ప్రకృతి నిశ్శబ్దమును బూనియుండెను. కాని, నడుమ నడుమ సృగాలారావములు మిక్కుటముగ నా నిశ్శబ్దతను భేదించుకొని, యానిశీథ సమయమున

స్వప్నములనుండి వెలువడి, జాగ్రదవస్థం గనినవారల హృదయములకు భయమును గొలుపుచుండెను. నిశానాథుండు పూర్ణకళా విలాసితుండై యంధకారముపై విజయమును బడసి, తన యమృతకరములను సర్వత్ర ప్రసరింపం జేయుచుండెను. గాని, పొగమంచు, తత్ప్రసారమున కవరోధమును గలిగించుచుండెను. నాండు చంద్రదేవుడుం షోడశకళాపరిపూర్ణుండై ప్రకాశించుచుండినను, రేవెలుంగు హిమాచ్ఛాదితమై మాలిన్యమును బొందియుండెను. వృక్షములు, మేడలు, గోపురములు, ప్రాకారములు మొదలగు సమస్త వస్తువులు హిమావృతములై యుండెను. ముందు మార్గము గోచరముగాక యుండెను. ఎదుటవచ్చువ్యక్తి కినంబడనట్లుగా నుండెను.

ఆ సమయమున నొక మార్గమున నొక గుఱ్ఱపుబగ్గీ దట్టముగ నలుముకొని యున్న పొగమంచును జీల్చుకొనుచుం బరుగుపరుగునం జనుచుండెను. బగ్గిని తోలు నట్టి వాని నల్లనిమీసములు మంచుపడి తెల్లనివయ్యెను కోచివాండు శీతబాధకై కంపించుచుండెను. కాని, బగ్గిలోం గూర్చుండియున్న యిరువురు రమణులు శీతబాధ యొక్క భీషణానుభవమున కించుకంతయును గదలచివారుగ నుండిరి. వారు తమ శరీరములను నఖశిఖాపర్యంతము ఉన్ని దుస్తులతో నలంకృతములం గావించి, పైన కాశ్మీర శాలువలను గప్పియుండిరి. వారిరువురును సమాన వయస్కులు. రూపరేఖలయందును, నీటుగోటులయందును నొకరికొకరు వెనుదీయని వారలని చెప్పనొప్పును. ఇరువురి దేహములు దుస్తులతో సంపూర్ణముగ నావృతములయియుండెను. ముఖములు మాత్ర మనాచ్ఛాదితములై చూచువారలకు వారి గాత్రములు సుమకోమలములనియు, సుసౌష్ఠవము లనియు, యౌవన మదభరితములనియుం జాటి చెప్పుచున్నట్లున్నయవి. వారి యిరువురి లోచనములు రోల్డు గోల్డు చట్టమునం గూడియుండిన సులోచనములతో నలంకరింపంబడి యుండినవి. వారు సలుపు ఆంగ్లభాషా భాషణములు వారికిం గల యాంగ్లభాషా పాండిత్యమును విశదపఱచుచుండెను. ఇరువురును నుచ్చశిక్షాపతులని వారి భాష వ్యక్తము చేయుచుండెను. వారి హస్తపరిచాలనమును, వాటి దుశ్చాపల్యమును, వారల నత్యంత చపలచిత్త లని పరిచయము చేయుచుండెను. ఆ యిరువురలో నొక యువతీమణి, నోట సిగరెట్టునుంచి వెలిగించి యా ధూమమును బీల్చి వెలికి విడిచి "ఇప్పు డేమయినది? ఇంక ముందున్నది ముసల్లపండుగు. అప్పుడు చూడుము. సతులను తమ పతులచేం బాదరక్షలను దుడిపించుకొను నంతటి వారల నుగం జేయకుండిన నా పేరు శైల కాదు. నన్ను శైల యని పిలువకు" మని పలికెను. అంత రెండవ సుందరి "నేను నాటక దర్శనమున కరుదెంచు నపు డాత్రండు (పతి) నేండు పోవల దని పల్కెను. అంత నా కొడలు మండి యాతనిం గసరి కొట్టి

తిని. తూల నాడితిని. ఇట్లెపుడును బలుక వలదని కఠినముగ శాసించితిని. అంత నాతఁడు నా తీవ్రతఁ జూచి బిక్కమొగమువైచి నోరు మెదల్పలేకపోయెను. స్త్రీలు సర్వతంత్ర స్వాతంత్ర్యమును బడయవలయును. పురుషులను దృణప్రాయులనుగఁ బరిగణింపవలయును. అపుడు గదా పురుషు లణఁగియుండుట సంభవమగును. అపుడు గదా పురుషులు తమ స్త్రీల నేమియు ననఁజాలక వారియెడ భయభక్తులు ప్రదర్శింప వలసిన వార లగుదురు" అని పలికెను. అంత బగ్గీ నిలిచెను. ఒక యువతి బగ్గీలోనుండి దిగి తన యింటిలోని కరిగెను.

ఈ యిరువురి రమణులలో నొక రమణి శైలకుమారి యని యా యిరువురి ప్రసంగసందర్భమువలనఁ దెల్లం బయ్యెను. రెండవరమణి బాబూ ఆనందస్వరూపుని ప్రియమిత్రుడు బాబూవినయ కుమారుని స్త్రీరత్నము రమాదేవి. ఇరువురును నాటక సందర్శనమున కరిగిరి. వారు మరలి వచ్చుచున్నపుడు మార్గమధ్యమున నా యిరువురకును బ్రవర్తిలిన తత్సంభాషణముఁ జదివితిరిగదా?

'శైలకుమారి వ్యాఖ్యానము స్త్రీలయం దత్యంత ప్రభావమును గనినయది. వారి వర్తనమును బరివర్తనము గావించిన యది. వారిని స్వాతంత్ర్య సంపాదనోన్మత్తులఁ గావించి తమ పతులతోఁ బ్రతిఘటింపఁ జేసినయది. తన వ్యాఖ్యానము యువతీజన మండలమున నాందోళన ముదయింపఁజేసి తన మనోరథమును ఫలోన్ముఖమునకుఁ దెచ్చెనని గ్రహియించి శైలకుమారి మహానందభరిత యయ్యెను. అభిమాన పరవశ యయ్యెను. ఆమె హృదయమున నొక విధమగు నహంభావమును నావేశమును నుత్పన్నము లయ్యెను. తాను చెప్పిన విషయముల నెల్లను స్త్రీ సమాజము అత్యంతానురాగముననను, నత్యంతాదరముననను శిరోధార్యమొనర్చునను విశ్వాసము ఆమె మనస్సున దృఢమయ్యెను. తద్విశ్వాసానుసరణముగ నామె తన కర్తవ్యమున మఱింత యుత్సాహమును దీవ్రతయు, సత్వరగమనమును బూనఁజొచ్చెను. ప్రతి సప్తాహముసను శైలకుమారి తన భవనమున మహిళాసభను సమకూర్పఁ జొచ్చెను. ఒక్కొక్క దిన మొక్కొక్క వీధిలో మహిళాసభను సమకూర్చుచు నగరములోని యెల్లర స్త్రీల హృదయములలోఁ దన విషపూరిత భావ విచారములను, నాటి ప్రవృద్ధములు గావింపఁ దొడఁగెను.

పాఠశాలలో, సర్వకళాశాలలో, విశ్వవిద్యాలయములలో, ఆంగ్ల విద్యాభ్యాసినులగు యువతీమణులు, తమకు వలయు నాయికామణి, మార్గప్రదర్శిని, యభినేత్రి, యలవడి నందులకుఁ గడుఁ బ్రసన్నులైరి. శైలకుమారి యధినాయకగ నెన్నుకొనఁ బడియెను. ఆమెకుఁ బార్శ్వవర్తినులై యామె యాదేశముల ననుసరించి

మెలఁగఁ దొడంగిరి. ఆమెతోఁబాటు స్త్రీస్వాతంత్ర్యసంపాదనాందోళనమును బహు తీవ్రముగ సాగింపఁ జొచ్చిరి.

శైలకుమారి ప్రచారమొనర్చిన స్త్రీస్వాతంత్ర్యసంపాదనాందోళనము వలనఁ దలఁచుకొనిన విషఫలము ఫలియించెను. అనుకొనిన యనర్థము సంప్రాప్తమయ్యెను. సాధారణపుఁ గుటుంబములలోని స్త్రీలు సహజముగనే వివేకహీనలై యుందురు. వారికేది చెప్పినను మనసున కెక్కను. అట్టి సమయమున విద్యావతులు, చతురలు, యుక్తియుక్తముగ బోధించి చెప్పిన విషయములు హృదయాంకితములు గాకుండ నుండునా? ఆ చెప్పునట్టి విషయములైనను నెట్టివి? వారిపక్షము గ్రహించి వారి కనుకూల మొడఁగూర్పనెంచి, చెప్పెడి విషయములు. అయ్యవి శ్రేయోదాయకము లని చెప్పుటవలన వానిని విశ్వసించిరి. మాన్యములని నిశ్చయించిరి. ఆచరణములని నిశ్చయించిరి. ఆచరణములో నిడ మొదలిడిరి. స్త్రీలు స్వతస్సిద్ధములుగ మూర్ఖలు. ఉద్దండులు. కలహప్రియులు. పతి, అత్త, ఆఁడుబిడ్డ మొదలగు వారితో నిష్కారణముగఁ గలహమునకు డీకొనుచుందురు. మంచిచెడ్డలు తెలియనేరకుందురు. లాభనష్టములు గుర్తిడజాల కుందురు. అందులకుఁ దోడుగ విదుషీరత్నములని పేరొందిన స్త్రీలు పతితో నీవిధముగ వ్యవహారము బూనుఁడని చెప్పుచున్నపుడు వారు చెప్పిన చొప్పున వ్యవహరించుటకు సందియమును భయమును జెందువార లగుట యెట్లు? ఏ వస్తువుయొక్కగాని, యే విషయముయొక్కగాని, గుణగ్రహణమునకు మునుముందుగఁ దదవగుణమును దద్దోషమును గ్రహించుట మనుజులకు సాధారణము సహజము. దోషానుగమనము మానవస్వభావము. సామాన్యపరిస్థితుల నుండు స్త్రీలు, శైలకుమారి మొదలుగాఁ గల యాందోళన ప్రచారకురాండ్రగు యువతుల యొక్క శిక్షాగుణమును గ్రహించినవారు కారు. వారికి విద్యవలనను శిక్షణము వలనను బ్రాప్తమయిన గుణమును గ్రహించి వారివలె విద్యావతులును శిక్షితలును గావలయునను తలంపు వారి మనములఁ బొడచూపుటలేదు గాని, వారివలె వేషములతో, నీటుగోటులతో నుండుటకు, శృంగారములకుఁ గాను ద్రవ్యమును విచ్చలవిడి వెచ్చించుటకును, నందుతోఁబాటు స్వేచ్ఛాచారిణులై చరిత్రమునకుఁ గళంకమాపాదించుటకును, బతుల నలక్ష్యము చేయుటకును, దృఢప్రతిజ్ఞలనూనిన వారలైరి. దుర్వర్తన దురాచార పారదర్శినులైరి.

* * * *

సాధారణముగ విద్యాశిక్షితలగు స్త్రీలు స్వాభిమానపూరిత లగుదురు. అందు నున్నతమగు నాంగ్లభాషా శిక్షఁబడసిన వారలసంగతి వేఱ చెప్పవలయునా? వారలకు స్వాభిమానముతోఁ బాటుగ నిర్భీకత్వము గూడ మిక్కుట

ముగానగు. అట్టివారు సర్వతంత్రస్వతంత్ర లగుదురు. పతులను లక్ష్యము చేయరు. వారి మాటను బరిగణింపరు. విద్యావిహీనలును, శిక్షారహితలును, నగు నెంతటి యవివేకము గల స్త్రీలయినను, నెంతటి మూర్ఖత గలవార లైనను, నెంతటి యుద్ధతస్వభావము గల వారలయినను, దమ పతులయెడఁ బూర్ణముగఁ గాకపోయినను, గొంతవఱకైనను, భయమును, భక్తిని, లక్ష్యమును బూనియుందురు. ఉన్నతమగు నాంగ్లవిద్యాభ్యాసము పడసిన స్త్రీలు సుగుణములను బెద్దలగువారియెడఁ జూపవలసిన మర్యాదలను విడనాడి నిరంకుశ వర్తనము గలవార లగుచుందురు. అట్లని స్త్రీలకు నాంగ్లవిద్యాభ్యాసము పనికిరాదని, ఆంగ్లశిక్ష తగదని, చెప్పబూనుటలేదు. స్త్రీలకుఁ గూడ నాంగ్లవిద్యాభ్యాసము, నాంగ్లశిక్షణము ముఖ్యములే. కాని, యనుచిత మగు రీతిని గఱపఁబడు చున్నవి. దుర్గుణపూరితములును, దుర్భావజనకములును నగు నాదర్శములు సమ్ముఖమున నుంపఁ బడుచున్నవి. దానఁ దత్ప్రణాళిక దోషభూయిష్ఠమయినది. తత్కారణమున నాంగ్లవిద్యాభ్యాసినులకుఁ దత్ప్రభావమువలన హృదయములు విపరీతభావపూరితము లగుట యనివార్యములగు చున్నయవి. విద్యావిహీనలును, నశిక్షితలును నగు స్త్రీలు మాత్ర మీ దోషములకు దూరగతులై యుందురని యనుకొనుటకు సందియము లేదు. వారిలోను నొకప్పుడు ఇట్టి దోషము గలవార లున్నవారలని యనుకొన్నను, వారి హృదయములు నిర్దోషము లయిన వగుట వలన నీ వ్యవహారమును నిందితమని తలంచుచు నేయుందురు. కాని, శిక్షితలు మాత్రము సముచితమని సమ్మతమని తలంతురు. అట్టి వ్యవహారము వలన ఘనత గౌరవము గలుగు నని యెన్నుదురు.

శైలకుమారి యుపన్యాసముయొక్క ప్రభావ మాంగ్లవిద్యాశిక్షిత లగు స్త్రీలయందు నెలకొనిన విధమున నశిక్షిత స్త్రీలయందు నెలకొన నేలకుండుట కిదియే కారణము. శైలకుమారి యాంగ్లశిక్షితల కార్యదర్శవర్తిని యయ్యెను. ఆమెను జూడ నరుదెంచు స్త్రీలు, ఆమె తనపతితో నెట్లు వ్యవహరించుచుండునో దానిని గ్రహించి యాదర్శమున నిడుకొని తద్విధముగనే వ్యవహరింపఁ బ్రారంభించుచుండిరి.

శైలకుమారి తన యాందోళనము ప్రచార బాహుళ్యము గనుటకై "మహిళ ఉత్తేజక" నామక సమాచారపత్రిక నొకదానిని బ్రకటింపనారంభించెను. ఆపత్రికకు సంపాదకురాలుగాఁ దానేయుండెను.

ఒకనాఁడు కొందఱు యువతీమణులు శైలకుమారిని జూచుట కామె భవనమున కేతెంచిరి. ఆసమయమున శైలకుమారి "మహిళా-ఉత్తేజక" పత్రిక కొక ప్రధాన వ్యాసము వ్రాయుచుండెను. కాని, తల్లేఖనమునకుఁ దన నవమాసముల

ప్రాయముగల చిన్నికొమరుఁడు విఘ్నము కలిగింపఁ జొచ్చెను. అకారణమున నామె పుత్రలాలనమునకంటెఁ బత్రికా ప్రధానలేఖన మత్యావశ్యకమని తలంచి భర్తను బిలిచి "పత్రికకుఁ బ్రధాన వ్యాసమును వ్రాయుచున్నదానను. ఈబుడుతఁడాటంకమును గల్గించుచు వ్రాయనీయ కున్నవాఁడు. కాఁబట్టి వీని నావలకుఁ గొంపోయి యాడింపుఁడు" అని యాజ్ఞాపించుచుఁ బుత్త్రు నాతని కొసంగెను. తదాజ్ఞానుసారముగ నాతఁడు పుత్త్రునిం గొని విహారవనముప్రక్కకరిగెను.

శైలకు నానందునకు వివాహమయి మూఁడు సంవత్సరములు కావచ్చెను. ఈ మూఁడు సంవత్సరములలోను, వారికుటుంబమునందేమి, వారి వ్యవహారములందేమి? వారి యైశ్వర్యమునందేమి, పలువిధములగు పరివర్తనములు సంఘటితములయ్యెను. శైలకుమారి యత్తింట నడుగిడిన ముహూర్తబల మెట్టిదియో కాని, యాఱుమాసములలోనే యత్తమామ లిర్వురును బరలోకమున కరిగిరి. ప్రధానోద్యోగి యగు వింధ్యవాసినీ ప్రసాదుకూడ నాకస్మికముగ మరణము పాలయ్యెను. అందువలన వర్తక వ్యాపారమునకు నష్టము సంప్రాప్త మయ్యెను. ఆనందస్వరూపుఁడు తన తండ్రి స్వర్గస్థుడైన పిమ్మట, వ్యవహారము నంతయును వశము గావించుకొని, యథాపూర్వకముగ సాగింపనెంచెను. కాని, యయ్యది యసంబద్ధమయ్యెను. తమ ప్రధానమిత్త్రుఁడు ప్రసిద్ధనారాయణుఁడు విభ్రమచిత్తుడై పలాయతుఁ డగుటవలనలసఁ గలిగిన వైకల్యము వలనను, బ్రధానోద్యోగియగు వింధ్యవాసినీ ప్రసాదుఁడు పుత్త్రశోకమువలన వివశుఁడై యస్వస్థచిత్తుఁ డగుటవలనను, దాను వ్యవహారజ్ఞాన శూన్యుఁడగుట వలనను, వర్తకవ్యాపారమంతయు నెచ్చట దచ్చటనే యంతరించెను. అయినను, 'చాప చినిగినను చదరంత మిగులు' ననునదిరిత్తకాదుగదా? ఆనందస్వరూపుఁడు తన కౌశలమువలన నున్నదానిని బదిలపఱచుకొని, తనవేషభాషల కనురూపమగు జీవనమును నెఱపుకొనఁ జొచ్చెను. అతఁడు తండ్రి జీవితకాలములోనే వకాలతు వృత్తిని గైకొని యుండెను. అందుఁ బ్రతిభగాంచుటకు లగ్నచిత్తుఁడయ్యెను. అతని కొకపుత్త్రుడుఁ జనించెను.

ఆనందస్వరూపుఁడు కాలవంచితుఁ డయ్యెను. అందువలనఁ దండ్రి వైభవము నిలువరించుట కసమర్థుఁడై, నత్యధికముగ గుంచితుఁడయ్యెను. అతఁడు న్యాయవాదవృత్తియందు లగ్నచిత్తుఁడై వ్యాపారమును దగ్గించిన వాఁడని నగరవాసులు తలంపఁజొచ్చిరి. కాని, కాలవంచితుఁడని యెఱుఁగ గ్రహింపలేకుండిరి. మధ్యశ్రేణిలోని వారివలె జీవయాత్రను సాగింపసాగెను. కాని, నాగరకుల గౌరవదృష్టులకు నందు బడనివాఁడై ప్రవర్తించుచుండెను. అతఁడవసరము ననుసరించి సేవకులను నియ

క్తులఁ గావించెను, గాని, మానమర్యాదల నభిలషించి నియుక్తులఁ గావించినవాఁడు కాకుండుటచే గృహమునందు సేవకులసంఖ్య తక్కువయ్యెను.

సేవకుల పాలనమునందుఁ బెరిఁగిన పసిపిల్లలు తదను కరణముగల వారును, దత్స్వభావాంకితులును నగుదురని యానందస్వరూపుని యాశయము. అక్కారణమునఁ దనపుత్త్రుని సేవకుల వశమున నిడుటకు విముఖుఁడగుచుండెను. శైలకుమారి యును, గొంత్రవఱకు నానందుని యాశయమునే కలిగి యున్నయది కావునఁ దన పుత్త్రుని సంరక్షణభారము సేవకులపై నిడక తానే స్వయముగ గ్రహించెను. కాని యప్పుడప్పుడు పత్రలేఖనమునందుఁ గలుగుచుండు విఘ్నమునకుఁ దత్కారకులగు పతిపుత్త్రులపైఁ గినియుచుండెను. పుత్త్రలాలనమానంబున కనివార్యమయిన దానిని గఁ జేయుచుండెను. దానఁ దాను వ్రాయుచుండు మహిళోత్తేజక పత్రికయొక్క ప్రధాన వ్యాసమునకుఁ బ్రతిబంధకమును గలిగించుచున్న తన పుత్త్రుని నావలకుఁ గొనిపోయి యాడించు కృత్యమునకుఁ దనపతిని నియోగించెను.

ఆనందస్వరూపుఁ డేడ్చుచున్న బాలుని నోదార్చుటకు శక్తుఁడుకాఁడు. అతఁడట్టి పని కెన్నండును నలవాటుపడినవాఁడు కాఁడు. కాని, పాపము! వివశుఁ డైనాఁడు. ఏమి చేయఁగలఁడు? మాఱుపలికిన శైలి కసరివేయునుగదా యని భయము. ఆమె యాతనిపై సంపూర్ణాధికారము వహించియుండెను. ఆమె యెడ నాతనికి భయమెక్కువ. ఆమెమాట కెదురాడ వెఱచును. ఆమె చెప్పిన పెల్లను జేయుటకు సంసిద్ధుఁడగుచుండును.

ఆనందస్వరూపుఁడు బాలునిఁ గొని చని, రెండు గడియ లాడించె. కాని, బాలుఁడు రోదనము మానఁడయ్యెను. ఎన్నిపాట్లుపడినను నూఱకొనఁడు ఎత్తుకొని యిటునటు ద్రిప్పఁజొచ్చెను. ఇది యది చూపఁజొచ్చెను. కాని, పసి బాలుఁడు పాలు త్రాగువాఁడు. ఆఁకలి గొని యుండెను. పాలు త్రాగుటకుఁ దత్తఱ పడుచుండెను. అట్టివాఁడు తల్లికి దూరగుఁడై యూఱకుండఁ గలఁడు. ఎంత త్రిప్పి నను, నే పుష్పముల జూపినను, నే చెట్టుకొమ్మల నాడించి నవ్వింపఁ జూచినను, నూఱకుండుట లేదు. ఏడుపు మానలేదు. బాలుని రోదనము చెవునఁ బడినయెడల శైల కోపించునేమో యను భయమున నాతఁ డా యేడ్చుచుండిన బాలుని వేటొక వంకకుఁ గొనిపోయెను. కాని, యాఁకలిచేఁ బీడితుఁడగు బాలుఁడు క్షీరపానము చేసిననే యూఱకుండును. ఊరక త్రిప్పినను, నాటలాడించినను నెట్లు నెమ్మది నొంది యేడ్వకుండఁ గలఁడు? అనందున కాబాలు నోదార్చుటకు సాధ్యము కాద య్యెను. అంతకంత కెక్కుడుగఁ బోరుపెట్టసాగెను. గంటల కొలఁది బాలుని

నెత్తుకొని త్రిప్పుచుండిన యానందునకుఁ గాళ్లు లాగఁజొచ్చెను. చేతులు నొప్పు లెత్తుచున్నవి. ఏమిచేయఁగలఁడు? తుద కుద్విగ్నుఁ డయ్యెను. పులిచెంత కరుగు మేకపిల్ల వలె భయకంపితుఁడై కాలుసేతులు తొట్రుపడుచుండ, శైలకుమారిని దగ్గఱి గద్గదకంఠముతో "కాలుసేతులు నొప్పు లెత్తినవి. ఎంత త్రిప్పినను నెంత యాటలాడింపఁ జూచినను, నేడుపుమానక యున్నాఁడు. ఆఁకలి గొని నట్లు లున్నాఁడు. పాలుత్రాగక యెట్లు నెమ్మది నుండఁ గలఁడు. ఇఁక నాదగ్గఱ నుండఁడు. నేను వీని నోదార్పలేను. నీవు వీనిని గైకొనుము. కొంచెము శాంతింపఁ జేయుము" అని పలికెను. ఆ మాటల నాలించి శైలకుమారి తోఁక త్రొక్కిన నాగుఁ బాము వలె లేచి యెగిరిపడుచుఁ గోపారుణిత నేత్రయై "తెలివి తక్కువ. (Nonsense) నీవొక మనుష్యుఁడవా? నీదొక బుద్ధియా? పరీక్షలు ప్యాసయిన లాభమేమి? ఎంత తెలివి గల్గిన నేమిఫలము? ఏడ్చుచున్న పసిబాలుని నూఱడింప లేక యున్నావు. ఇట్టి వాఁడవు న్యాయవాది వృత్తి నెట్లు నిర్వహించు చున్నవాఁడవో తెలియఁ జాలక యున్నదానను. నే నిప్పు డొక గూఢ విషయమును గూర్చిన లేఖను లిఖించుచున్నాను. నీవు పానకములోని పుడకవలె నీ బాలునిఁ గొనితెచ్చి యడ్డుతగిలి విఘ్నము (disturb) చేయుచున్నావు. ఇది మంచిపనిగాదు. దీనికి నేను సహింపఁ జాలను. కాఁబట్టి వెంటనే యీ బాలుని నావలకుఁ గొనిపోయి యొకింత తడ వాడింపుము" అని తీవ్రముగ శాసించెను.

ఆ మాటల నాలకించి పాప మానందుఁడు నిర్విణ్ణుడై క్రింది పెదవి మీది కెత్తక బాలుని గొని యావలి కరిగెను. ఏమనిన నెటు వచ్చునో యని యాతని భయము.

శైలకుమారిని జూడ వచ్చిన యువతు లామె వర్తనమును బరికించి యయ్యది సభ్యవర్తన మని తాము కూడఁ దమ పతులతో నట్టి వర్తనమును బూనుటకు దృఢ సంకల్పలై గృహోన్ముఖ లగుచుండిరి.

శైలకుమారి విద్యావతి. పట్టమును (Degree) బడసిన యువతి స్త్రీస్వాతంత్ర్య సంపాద నాందోళన కర్త్రి. స్త్రీసమాజమున కధినేత్రి. సమాచార పత్రికా సంపాదకురాలు. ఆ కారణమున నగరమునందలి నారీమణు లామెనుజూచుట కెప్పుడును గుంపులు గుంపులుగఁ జుట్టుకొని యుందురు. ఉదయ మేడు గంటలనుండి రాత్రి పదిగంటలవఱకు నామె కూపిరి విడుచుటకైనను విశ్రాంతి యలవడదయ్యెను. ఒక్క నిముసమైనను నేకాంతము చేకూఱ దయ్యెను. ఎల్లపుడును పది పదు నైదుగురు యువతులు పరివేష్టించియే యుందురు. వచ్చువారలకును, బోవువారలకును చెఱపి

యుండదు. వారల కామె. “పతుల యందలి లక్ష్యమును వీడుఁడు. వారలకు భయ మొందకుఁడు. వారితోఁ బ్రతిఘటింపుఁడు. మీ స్వాతంత్ర్యమును మీరు చేకొనుఁడు. వారితో సమానముగ వ్యవహారమును సల్పుఁడు. అవసరముగఁ దోఁచిన యెడల ధిక్కరింపుఁడు” అను వాక్కులను వేదవాక్కులనుగ నుపదేశించుచుండును. శైలకుమారి కేవలము వాగ్రూపమున నుపదేశ మొసఁగి యితిశ్రీ చెప్పుచుండుట లేదు. వారి సమక్షమునఁ దాను దనపతితోఁ దానుపన్యసించినరీతి వ్యవహరించి చూపుచుఁ బతులకడఁ బత్నులు మెలంగు విధమును గ్రియాత్మక రూపమునఁ బ్రదర్శించును. పత్నులు పతులచేతఁ బనులు చేయించుకొను రీతులను బోధించుచుండును. తాను దన పతిని నెట్టి దృష్టిని జూచుచుండెనో యట్టి దృష్టినే వారు వారి పతులను జూడవలయు నని వారలకుఁ బ్రోత్సాహ మొసంగు చుండును. పురుషులకు స్త్రీలు కొఱఁత పడిన వారలని యెన్నఁడును దలంపకుఁడు. సృష్టికర్త స్త్రీ పురుషుల నిరువురను నొక తీరుననే యొక చేతితోనే సృజించుచున్న వాఁడని యెఱుంగుఁడు. పురుషులవలె స్త్రీలును మానవజాతిలోని వారలుగనే పరిగణింపఁబడుచున్న వారు. ఇరువురు సమాన దృష్టితోనే చూపబడు చున్నవారు. అందొకరి కెక్కువ లేదు. ఒకరికి దక్కువయు లేదు. అట్టియెడ స్త్రీలు పురుషులకేల యణఁగి యుండవలెను ? పురుషులు స్త్రీలకేల యణఁగి యుండరాదు.” అని పలుకుచుండును.

శైలకుమారి చెప్పిన పాఠమును గ్రహించి యువతులు “నిజము. నిజము. అవు నవును. మనము పురుషుల కణఁగి యుండ నవసరము లేదు. మన మణఁగుచుండిన కొలఁదిని మఱింత నణఁచిపెట్టుచున్నారు. పగలంతయు బానిసలవలె నింటి పనులు సమస్తము చేయు చుండినను మనలను జూడరు. మనలను లక్ష్యము చేయరు. మనలను గౌరవింపరు. ఉన్నామా తిన్నామా యని యడుగనైన నడుగరు. మనలను బురుషులెట్లు చూచుచున్నారో అటులే మనము కూడఁ బురుషులను జూడవలయును అదియే వారికిఁ దగినమందు. అమందు దిపుడు దొరికినది. అమందు నుపయోగించిన మనచేత వార లెట్టిపనులను జేయించుకొను చుండిరో యట్టి పనులనే వారి చేత మనము చేయించుకొనవలయును.” అని తమలోఁ దామనుకొనిరి.

ఇట్టి విచారములు యువతీమణుల హృదయములలో నుత్పన్నములై వారి మస్తిష్కముల నాక్రమించెను. శైలకుమారిఁ జూడవచ్చిన యువతు లెల్లరును నామె యుపదేశించు మహామంత్రమును గ్రహించి, తదుపదిష్ట మార్గమున నడుచుటకుఁ గృతనిశ్చయులై తమ గృహములకు మరలు వార లగుచుండిరి.

* * *

రమాదేవి, బాబూ ఆనందస్వరూపుని మిత్రమండలిలోని వినయకుమారు సతీమణి. ఆమెయు శైలకుమారితోఁ బాయిగ స్త్రీ సమాజమునం దాందోళనమును గలిగించుచుఁ దానును నొక నాయక యని మెలంగుచుండును. ఆమె యాంగ్లభాషా పరిచితిని గలిగి సభ్య స్త్రీలలో మెలఁగు చుండును. ఆమె యేపరీక్షల యందును నుత్తీర్ణతఁ గనియుండలేదు. భాషాపాండిత్యమును బడసియుండలేదు. ఆంగ్లభాషలో నిర్దుష్టముగ నాలుగు మాటలు మాటలాడలేదు. నాలుగు పంక్తులును వ్రాయలేదు. కాని పదిమందిలో నిలిచి, విషయ నిర్ధారణములేకపోయినను, కర్త, కర్మ క్రియల నిరూపణము శూన్యమైనను, నదరు బెదరులులేక వినువారి చెవులు గింగురుమనునటుల మాటలాడఁగలశక్తి యామెకడ నద్వితీయము. అందువలన శైలకుమారి కేవిధమునను గౌరవపడి యుండినటులఁ దలఁచుటలేదు. సరియేకదా? ఆమెకంటె నెక్కువయోగ్యతఁ గలిగియున్నటుల భావించుకొనుచుండును. వేషములందును, వర్తనమునందును, ఉనికియందును, శైలకుమారికి శతగుణాధికయై యొప్పుచుండును. వాస్తవముగఁ బాండిత్యమును, సామర్థ్యమును, యోగ్యతయును, గలవారు, అభిమానులై, యహంభావులై, సీటుగోటులు, డంబము, దర్పము, గలిగియుండువారు గారు. వారికడ వినయ వివేక శీలము నెక్కుడుగఁ గనపట్టును. ఎవరియందు, వాస్తవమునిక్కువము, యథార్థము, చూపట్టదో వారియందాత్మాభిమానము, అహంభావము, మిక్కుటముగఁ గనఁబడును. కొంచెపు వెలగల వస్తువునకుఁ దళుకెక్కువ. 'కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగఁదు' అను వాక్యము రమాదేవియందు సార్థకములగుచుండెను. ఆమె శైలకుమారిని మీఱయుండుటకుఁ బ్రబలప్రయత్నము లొనర్చుచుండును. అభ్యస్తులు సహజులను మీఱనెంచుట మానవ స్వాభావికము. కాఁబట్టి రమాదేవి శైలకుమారిని మీఱయుండుటకుఁ బలుప్రయత్నములు సలుపుచుండును. శైలకుమారి వ్యాఖ్యానమొసంగుట కెందరిగినను నామె ననుసరించి యరుగుచుండెను. ఆమె చెప్పిన మాటలనే మరల మరలఁ ద్రిప్పి త్రిప్పి చెప్పుచుండును. ఆమె వలనే నేతృత్వమును వహించుటకువ్విళ్లూరు చుండును. స్త్రీ సమాజమున కధినేత్రిణియని యగ్రగామినియని యనిపించుకొనవలయునని యామె వాంఛితము. తద్వాంఛా పూర్తిఁ బడయుటకునై శైలకుమారిని నిరంతరము ఛాయానుసరణముగ ననుసరించి వర్తిలుచుండును.

శైలకుమారి స్త్రీ స్వాతంత్ర్యసంపాదన విషయమునుగూర్చి యథాశక్తిగఁ గృషిచేయుచుండెను. కాని, రమాదేవి శైలకుమారి ననుసరించుటకంటె వేఱుకృషి సలుపుచుండుటలేదు. స్త్రీ సమాజసుధారక విషయమున నామె పేరొక్కనఁదగు

యత్నమును దేనిని జేయనేరకున్నను, దత్కర్తృత్వభారము తన శిరముననే యున్నట్లు తలంచి, దినమంతయు నిటునటు తిరుగుటయందు వ్యతీత మొనర్చుచుండును. ఊపిరి గొనుటకైనను విరామము చిక్కకుండెను. అని పరులతోఁ బలుకుచుండును. నిత్యము నియమానుసరణముగ "నేఁడు ఆచోటనుపన్యాసము, రేపు మఱొకచోట నుపన్యాసము, మఱొక్కదినమున నొకసభాప్రతిష్ఠాపనమును జేయవలయును. అది నాచే జరుపఁబడవలసియున్నది. ఇదియు నేనే చేయవలసియుండును." అని పతికడఁ బ్రగల్భములు పలుకుచుండును. వినయకుమారుఁడు తన సతిపలుకు ప్రగల్భములు నాలించి యూరకయుండును. అతఁడు మొదటినుండియు సతికి గడగడలాడుచుండువాఁడు వంటవాండ్రు రానినాఁడు మిష్టర్ వినయకుమారుఁడు వంటయింటఁ బ్రవేశింపవలయునేగాని మెసర్స్ వినయకుమారుఁడు ప్రవేశించుట యెన్నడునులేదు.

శైలకుమారీ రమాదేవుల యుపదేశములు యువతీహృదయముల యందంకితములై కలవర ముదయింపఁజేసెను. వారిమస్తిష్కములయందు క్రాంతిభావము దావానలమువలెఁ బ్రజ్వలితమగుచుండెను. వారు నిరంకుశవర్తనులైరి, పతులను నిర్భీకులై ప్రతిఘటింపఁ జొచ్చిరి, భీషణరూపధారిణులై వారితో సమ్ముఖసమరమునకు డీకొన దొడంగిరి. వారి దౌష్ట్యమును, వారి యుద్ధండవర్తనమును, నుచ్ఛస్థితియందుఁ దాండవించుచుండెను. ఈకల్లోలమును జూచి పురుషులధికాంశులు తల్లడిలసాగిరి. అట్టి సమయమున వినయకుమారుని పరిస్థితి యెట్టిమార్పుగని యుండునో వేఱచెప్పవలయునా? అతఁడు రమాదేవి వర్తనమున కిసుమంతయు బ్రతిబంధకమును బ్రకటింప నేరఁడు. ఆమె ప్రాతఃకాల మాఱుగంటలకు తేనీరుత్రాగి యిలువీడి చనుచుండును. అందువలనఁ బ్రతిదిన మాసమయమునకుఁ దేనీరు సిద్ధము చేయవలయునని సేవకులకు కఠినముగా నాజ్ఞయిడెను. వెయ్యిపనులను జెడఁ గొట్టినను సరియేకాని, రమాదేవి యాజ్ఞాపాలనమున విలంబనము సలుపరాదు. ఒకవేళ విధివశమున నెన్నఁడైన రమాదేవి సమయమునకుఁ దేనీరు సిద్ధముగ నుంపబడనిచోఁ దదపరాధమునకు వినయకుమారుఁడు గుఱియై యామె పలుకు నిష్ఠురోక్తులను సహించుచుఁ దలవాల్చుకొనుచుండును. అందువలన నాతఁడు తేనీరు సమకూర్చు విషయమున నత్యంతజాగరూకత గలిగి మెలంగవలసిన వాఁడయ్యెను. సేవకులు రానినాఁడు తేనీరు సిద్ధపఱచు భారమును వినయకుమారుఁడు గ్రహింపవలయునే కాని, సేవకులు రాలేదని చెప్పుట వలనుగాకుండెను. ఒకనాఁడు సేవకులు రానందున నాతఁడే తేనీరు సిద్ధముచేయుటకు సంసిద్ధుఁడయ్యెను. కాని, నిత్యమును సమకూర్చువాఁడు కానందునఁ దత్పదార్థము లుండు స్థానములకుఁ బరిచితుఁడు కాఁడు. ఏవస్తువెచటనుండునో వెదకి

తెలిసికొనవలయును గాన దాన సమయాతిక్రమణము కలిగెను. ఈవల రమాదేవి వేషభూషణాలంకృతయై, సులోచనములు ధరించి తేనీరుఁ ద్రావుటకై బల్లకడ కరుదెంచి కూర్చుండెను. అరునన్నఱ గంటలయ్యెను. నియతకాల మతిక్రమించెను. తేనీరు మేజాబల్లపైకి రాలేదు. ఇంతటవచ్చును. అంతట వచ్చును. అని యెదురు చూచుచుండెను. అయిదు నిమిషములు దాఁటెను. పదినిమిషములు గడచెను. తేనీరు వచ్చుజాడ కనఁబడలేదు. రిస్టువాచి వంకకు దృక్కులు సారించెను. గడియారము లోని ముల్లు పదునైదు నిమిషములు తక్కువగ నేడుగంటలుగ నుండెను, ఇఁక నిరీక్షణము దుర్భరమయ్యె. క్రోధోద్రేకయై "నేఁడింత యాలస్యమైనది. ఇఁక తేనీరు త్రాగను. ఏల యింత యాలస్యమైనదో కనుగొనియెద" నని పలుకుచు నందుండి లేవ నుద్యుక్తయయ్యెను. అంత వినయకుమారుఁడు తేనీరు గొనివచ్చి యామె కట్టెదుట నిలిచెను.

కాలాతిక్రమణ మైనందున రమాదేవి క్రోధ మున్నతస్థాన మలంకరించి యుండెను. ఆమె తేనీరు గొనితెచ్చి తన యెదుట నిలిచి యున్నవాఁడు తనపతి యైనను గమనింపక యాతనిపై రూక్షవీక్షణములఁ బఱపుచు "నేఁడింత యాలస్య మగుటకుఁ గారణమేమి ? ఇందులకు సహింపఁ జాలను" అని నిష్ఠురముగఁ బలికెను. అంత వినయకుమారుఁడు తడఁబడుచు "నేఁడు సేవకు లేరును ఢాలేదు.... దాన నేనే – సిద్ధము చేయ – వలసి – వచ్చినది.... ఆకారణమున నాలస్యమైనది" అని ప్రత్యుత్తర మొసంగెను. రమాదేవి యాతని మాటలను విని కండ్లెఱ్ఱచేసి, "నాకీమాటలు పనికిరావు. సేవకులు రాకపోయిన, నీవు వేళకు సిద్ధము చేయవల యును. ఆసంగతి నీకుఁ దెలియదా ? ఇఁక ముందిట్టి యాలస్యమునకు సహించు దానను గాను. జ్ఞాపకముంచుకొనుము. నాకుఁ బ్రతినిత్యమును ఉదయము సరిగా నాలుగంటలకు తేనీరు సిద్ధముగనుండవలయును. లేనినాఁడు నీగౌరవమును నిలుపు దానను గాను" అని గద్దించి పలికెను. పాపము! వినయుని వివశత్వమును రమాదేవి గమనింపని దయ్యెను. అతని దైన్యహైన్యము లామెకు హర్షదము లయ్యెను. అనంత రము రమాదేవి తేనీటి పానీయమును జేకొని, ముఖమును జేతి రుమాలుతోఁ దుడుచు కొని, రెండంగుళముల యెత్తు మడమలుగల బూట్సుల జోడును ధరించి టక్ టక్ మను శబ్దమును వెలువరించుచు శైలకుమారి గృహమున కరుగు మార్గము ననుసరించి వెడలెను.

* * *

ఆంగ్లవిద్యాభ్యాసినులు మొదటనుండియుఁ బతులపై శాసనమును జూపుచునే యున్నవారు. అద్దానిని ఫేషనుగ పరిగణించుచునే యున్నవారు. అందుపై శైల

కుమారి యాందోళనము తలసూపినది మొదలు ప్రచండశాసనులు యువతులు కాఁజొచ్చిరి. పతులను శాసన బద్ధులుగఁ జేయవలయునను నియమము కేవలము శిక్షితలలోనే యిమిడియుండలేదు. అశిక్షితలయందును నియ్యది వ్యాప్తిగని భీషణరూపమును దాల్చిన యది. శైలకుమారీ రమాదేవులు తమవాఖ్యానములలోఁ బురుషులను దూషించుచు సతులపై శాసనమూనును పతులను దూలనాడుచు, వారివర్తనము నింద్యవర్తనమునుగ నిరూపించుచుఁ బలికిన పలుకులు, సలిపినసంభాషణములు, స్త్రీల నుద్రేక పూరితలఁ గావించి యున్నందున వారివర్తనమునకు విరోధమును బ్రకటించుటకుఁ గాని, యందు హస్తక్షేపమిడుటకుఁగాని, పురుషులు కాజాల కుండిరి. ప్రస్తుతము స్త్రీలయాందోళనము ప్రజ్వలితమై యుండుటవలన వారివర్తనమునందుఁ బ్రతిఘటనమూనుట వలన గాని, నేదైనఁ బ్రతిచర్య పూనుటవలనఁ గాని, పరిస్థితులు, విషమయములను, విపన్నాలకములను, నగుటకంటె వేఱొండు లాభము చేకూర నేరదని, కొందఱు సహిష్ణులై వెతలఁగుడుచు చుండుటకు సంసిద్ధులగుచుండిరి. మఱి కొందఱు వికలచిత్తులగుచుండిరి. పురుషుల వివశత్వమును దిలకించి యువతులు నిరంకుశలై స్వేచ్ఛావర్తనలై తమకుఁ దోఁచినరీతిని నిర్నిరోధలై ప్రవర్తింపఁ దొడఁగిరి.

పరిస్థితులు వికటరూపధారిణులయ్యెను, స్త్రీ సమాజము విశృంఖలమైన దయ్యెను. తద్వర్తనము వినువీధుల కెక్కుచుండెను. పురుషులు కర్తవ్యశూన్యులై పరితపింపఁజొచ్చిరి. సతులు పతుల నాజ్ఞాపింపసాగిరి. శిక్షితులు, అశిక్షితులు, కులహీనులు, కులీనలు, శ్రీమంతులు, శ్రీహీనలు, అను విభేదములను బరిగణింపక యెల్లరు యువతులు తమ తమ పతులచేత వలయురీతిని సేవలు చేయించుకొనుటయందుఁ దత్పరలు కాఁజొచ్చిరి. తమతమ పతులచేత నెంత నీచకృత్యములను జేయించుకొనిన నంత మానదమని తలంపఁదొడఁగిరి. ఇద్దఱు స్త్రీ లొకచో నెపుడు చేరిన నపుడు వారిలో వారు తమపతులచే నీపనులు చేయించితిమి, ఆపనులు చేయించితిమి, అని ముచ్చటగఁ జెప్పుకొనఁ జొచ్చిరి. ఏసతి తన పతిచేత నెంతటి నీచకృత్యమును జేయించుకొనునో యాసతి యంతటి స్వాభిమానమును సమ్మానమును జేకొనఁ జొచ్చెను. ఒకరుకాదు, ఇద్దరుకాదు, పదిమంది కాదు, వేలకొలఁది స్త్రీలు తమపతులచేత వివరించుటకు నలవికాని యకార్యములను జేయించుకొనుచుండిరి. ప్రవర్తిత శిక్షాప్రణాళికాను సరణముగ నాంగ్లభాషా శిక్షితలగు యువతుల వర్తన మెంతటి దుష్టమును, ఘృణితమునునగు రూపమును ధరించుచుండెనో పరిశీలింపుఁడు ”

మి॥ నరనాథుఁ డను యువకుఁడు బి. ఏ. చదువుచుండెను. అతని సతి రూపవతి ఎంటరెన్సు పరీక్షయందు త్తీర్ణ యయ్యెను. వారి పరివారమునం దాసతిపతులిరువురు కంటె నెక్కువగ వేఱుగ నెవ్వరును లేరు. నరనాథుఁడు చాలినంత పైతృక

సంపత్తిఁ బడసినవాఁడు. సంపన్న గృహస్థులలో లెక్కింపఁ దగినవాఁడు. అయినను సేవకులచేతఁ బనులు చేయించుకొను స్వభావము గలవాఁడు కానందున గృహకృత్యములను నాదంపతులు స్వహస్తములతో నిర్వహించుకొనుచుందురు. నరనాథుఁడు స్త్రీ సముదాయమునకు శిక్షా స్వాతంత్ర్యముల నొసంగవలయునను వారిలోనివాఁడు. యవనికాప్రథను దిరస్కరించువాఁడు. తన సతిని తన ప్రక్క బగ్గీలోఁ గూర్చుండఁబెట్టుకొని వాయుసేవనమున కరుగుచుండును. తన సతికి సర్వస్వాతంత్ర్యము నొసఁగియుండెను. కాని, రూపవతి తనకుఁ బతియొసంగిన స్వాతంత్ర్యమును, సమతను దురుపయోగ మొనరించుచుండెను. అంతలో స్త్రీ స్వాధీనతాందోళనము బయలువెడలెను. దాన నామె వర్తనము మఱింత యౌద్ధత్యమును దాల్చెను. ఇంతదనుక నేనో యొక విధముగ గృహకృత్యములను నిర్వహించుచుండెను. ఇపుడు విరమించెను. రూపవతి తన పతిని బిలిచి "నీయింట నడుగిడిన దాదిగ నేఁటివఱకు నేనే నీకు నిత్యమును వంటచేసి భోజనము నమర్చుచున్నదానను. కాని, యిటుపయిని నీవు వంటచేసి పెట్టుము. ఎల్లపుడు నేనే చేయవలయునా యేమి? నీవును కొంతకాలము చేయుము." అని శాసించి చెప్పెను. మునుముందు నరనాథుఁ డామె శాసనమును బరిహాసముగఁ బరిగణించెను గాని, తుదకు శిరోధార్య మొనరింపవలసినవాఁడయ్యెను. ఇఁక రూపవతికి విశ్రాంతి కొనుటకుఁ దక్క వేఱొండు వ్యాపకము లేదయ్యెను. ప్రాతస్సాయంకాలములయందు, నరనాథుఁడు గృహకృత్యములయందుఁ జొరఁబడుచుండెను. రూపవతి వాయుసేవనమున కరుగుచుండెను. రాత్రులందుఁ దఱచుగ సినిమాలప్రదర్శనముల దర్శనమున కేగుచుండెను. నరనాథుఁడు ప్రకృతము బి. ఏ. పరీక్షనిచ్చి విశ్రాంతిఁ గొనుచున్నవాఁడు. వేసవిసెలవులు. కాలేజీ మూయఁబడియుండెను. దానఁ బనినావశ్యకతలేక సుఖజీవనము నెఱపుచుండెను. అతఁడు మొదటినుండియు సతి శాసనమునకును, సేవకును, నభ్యస్తుఁడై యున్నవాఁడగుటవలనఁ బ్రకృతశాసన మాతనికి వికృతముగఁ గనఁబడలేదు. రూపవతి నరనాథుని స్త్రీ పురుషులు స్వాతంత్ర్యాధికారములయందు సమానులను సూత్రమునఁ గాలు సేతులు కదల్పలేకుండు విధమున దృఢతమముగ బంధించియుంచెను. అతఁడు తద్బంధనమునకు లోనయి వర్తించుచుండెను. నేఁటి పరివర్తనమువలన నరనాథుఁడు రూపవతి పరిచారకుఁడుగఁ జూపట్టఁజొచ్చెను గాని, పతిగఁ జూపట్టకుండెను. ఒకనాఁటి రాత్రి సతీపతు లిర్వురును నాటకప్రదర్శనమును జూడఁబోయి తెల్లవాఱు జామున నాలుగుగంటల కింటికి మరలివచ్చిరి. అదిమొదలు రూపవతి తెల్లవాఱిజాము ప్రొద్దెక్క వఱకుగుఱ్ఱుపెట్టుచుండెను. అనంతరము లేచి కాల్యకృత్యములు తీర్చుకొని

స్నానపానములు గావించుకొని మరల మంచ మెక్కి మేనుప్రాల్చుచు "మై డియర్ నరనాథ్ ! రాత్రి నిద్ర లేనందున మిగుల బడలికగానున్నది. పండుకొనుచున్నాను. సాయంకాలము మీటింగునకు వెళ్లవలయు. కాబట్టి నా బూట్సు పాలిషు చేసి యుంపుము. మరువవలదు సుమా! నేను మీటింగున కరుగునపుడు తొడుగుకొనవల యును" అని చెప్పెను. నరనాథుఁ డామె యాదేశము శిరోధార్య మొనర్చెను.

ప్రకృత కాలము రూపవతి వర్తనమునకుఁ బరిహాసముఁ జూపుటకుఁ దగిన కాలము గాదు. పరితాపముఁ జూపుటకుఁ దగిన కాలము. ప్రవర్తితశిక్షాప్రణాళిక కారణముగ మన సోదరీమణులు మన పుత్రీకారత్నములు పలువురు మనదేశము యొక్క నిర్దుష్టమును, నిరుపమానములును నగు నాదర్శములను సరకుగొనక, వైదేశిక దుష్టములును, దూషితములును నగు నాదర్శములఁ గొని, విచారహీనులై, పతితలును, కళంకితలును, భ్రష్టలును నగుచు, దేశసభ్యతను రూపుమాపుచున్నారు. కాఁబట్టి మన సోదరీమణులను, మన కన్యారత్నములను మన మాతృభూమి యొక్క స్వర్గీయాదర్శముల యెడ నిశ్చలధ్యానమిడు వారలనుగఁ జేయుట కనువగు రీతిని శిక్షాప్రణాళికను నిర్దుష్టమగు దానినిగ సంస్కరించుటకుఁ దగు కాలము! ఈ కాలము పరిహాసము చేయుటకుఁ దగిన కాలము కాదు. పరివేదనముఁ జెందుటకుఁ గాలము.

## పందొమ్మిదవ ప్రకరణము

కాల మొక్కరీతిగా నుండఁజాలదు. నిరంతరభ్రమణమే దానికిఁ గల వ్యవస్థ. ఈ కథా కాలమునఁ గొంత వడికి సమయము సంకటముల కాల వాల మయ్యెను. వాతావరణము ప్రచండరూపమును దాల్చెను. విపత్ప్రాతము మెండయ్యెను. విషమ పరిస్థితులు సంప్రాప్తము లయ్యెను. అబలాహృదయములు క్రాంతి భావోద్దీపనము వలనఁ బ్రబలము లయ్యెను. పురుషులును, బుణ్యస్త్రీలును, వృద్ధవనితలును, యువతీ మణుల యనాదరణములకు నలక్ష్యములకు నత్యాచారములకు భాజనులైరి. శైలకు మారి నాయకత్వమున బయల్వెడలి ప్రచారముగాంచిన స్త్రీ స్వాతంత్ర్య సంపాద నాందోళనము స్త్రీలయందు. నిరంకుశత్వమును, నిర్భీకతయును, నుదయింపఁజేసి వారల నుద్దండవర్తనమునకు లోను గావించుటయే గాక విలాసప్రియులఁజేసి, తత్కర్తవ్యనిష్ఠలఁ గావించి మించెను. ఇట్టి నిందితాశయములను నిట్టి యవినీతి విచారము లను నాదర్శమున నిడుకొని యిట్టి క్రాంతికారియు నరిష్టదమును నగు ప్రబలాందోళ నమును బయలుదేర్చి ప్రచారముఁ గావింపక యుండినచో! ప్రకృతమున దేశము నందుఁ బ్రాప్తమయిన ప్రళయరూపమగు నీ మహాభయంకరపరిణామ ముత్పన్నమగుట

కవకాశము సంప్రాప్తము కాక యుండెడిది. స్త్రీసమాజమం దొక్కసారిగ నిట్టి యుద్రేకమును జనింపఁజేయుటకు మారుగ మునుముందు యువతులను సుశిక్షితలను జేయుట కనువగు ప్రయత్నములు సలిపి యనంతరము సక్రమాందోళనమును బయలు వెడల్చినచో నిక్కువముగ స్త్రీసమాజము, ఉద్ధారమును, ఉత్థానమును గనఁగలిగి యుండెడిది. కాని, యయ్యది యట్లు జరుగక విపరీతమార్గమునఁ బ్రవర్తిల్లినది యగుటవలనను, దదనుగుణమగు వైపరీత్యమును విపత్పూరితమును నగు ఫలము సంప్రాప్తమయ్యెను.

స్త్రీలు పూనిన నిరంకుశవర్తనమును, నిందితవ్యవహారమును, దేశమందెక్కువ యసంతోషమును, అశాంతియును జనింపఁజేసెను. పురుష సమాజమం దొక్కసారిగఁ గలవర ముదయింపఁజేసెను. పురుషులలో ననుభవజ్ఞులును, విద్యాధికులును, సాత్త్వికస్వభావులును నగువారలు తమ స్త్రీ లొనర్చు దుర్వ్యవహారములకు సహనము జూపుచుండిరి కాని, స్వభావముగ నుద్దండులును, స్త్రీల నస్వతంత్రురాండ్రనుగ నుంపవలయునను తలంపుగలవారును, స్త్రీ లొనర్చు దోషములు గోరంతలు కొండంతలుగఁ బరిగణించు తీవ్రస్వభావులును క్రోధోద్రిక్తులగుచుండిరి. అట్టివారు తమ స్త్రీ లొనర్చు దుర్వర్తనమునకు దుర్వ్యవహారమునకు సహన మూనువారు కాఁగలరా ? ఎన్నఁడును గాఁజాలరు. వారు సహజముగనే యుగ్రరూపులు. ఉద్దండ స్వభావులు. వారు తమ స్త్రీల యనుచిత వర్తనములకు సహింపనేరక వారల నుచిత మార్గమునకుఁ గొని తేచ్చుటకుఁ గ్రమక్రమముగ సామ దాన భేదోపాయములను బ్రయోగించి చూచిరి. కాని, విఫలతఁ గని తుదకు దండోపాయమును చేఁగొని యుగ్రరూపమునఁ బ్రయోగింప దొరకొనిరి. ప్రతి దినము నెందఱెందఱి స్త్రీ శిరములో వ్రక్కలు కాఁజొచ్చెను. ఎందఱెందఱో యాత్మహత్య గావించుకొనఁ జొచ్చిరి. ఎన్ని సంసారములో యనైక్యమునకు లోను గాని వయ్యెను. అసౌఖ్యమునకుఁ బాలు కాఁజొచ్చెను. ఎన్ని గృహములో ఘోరవిపత్తుల కాలవాలములయ్యెను.

దేశము విప్లవ భూయిష్ఠ మయ్యెను. ఎచ్చటఁ జూచినను స్త్రీపురుషులఁ బ్రబల సంఘర్షణములు జరుగసాగెను. అందుఁ బెక్కండ్రకు హాని కలుగుచుండెను. కొందఱు వికలాంగులగుచుండిరి. కొందఱు గృహత్యాగము చేసిన వారగుచుండిరి. బలవంతులు విజయముఁ బొందుచుండిరి. కాని, యేమి ప్రయోజనము ? రాజకీయులూరకయుందురా ? శాసకులీ విప్లవమునకు మూలకారణమును గ్రహింపవలయు నను తలంపును గొనుటలేదు గాని, తమ యధికార ప్రాబల్యమును జూపుచు రక్షకభటుల సాయమున మనస్సునకుఁ దగినవారల నెల్లరను బంధించి కారాగారములఁ జేర్పఁ దొడంగిరి. శాసనము ప్రచండరూపమును ధరించి తాండవమాడఁ జొచ్చెను,

పరిస్థితులు దిన దినమునకును భయానకము లగుచుండెను. స్త్రీపురుషుల కిరువు రకును ప్రాణధారణము దుస్సహమగుచుండెను. ఈ భీషణ పరిస్థితిని, ఈ ఘోరోపద్ర వమును, వీక్షించి కాత్యాయనీదేవి, తదాదర్శ వర్తినులగు జ్ఞానవతీదేవి మొదలగువారు శోకసంతప్తహృదయులు కాఁజొచ్చిరి. ఈ యుపద్రవము నుండి మరల్చుటకుఁ బలు యత్నములు సలుపఁ బూనిరి. అనేక పర్యాయములు సార్వజనిక సభలను సమకూర్చి యందు శైలకుమారీ రమాదేవుల సిద్ధాంతములు వారు చూపిన మార్గములు దేశనాశ కము లని నిరూపించుటచే నందుండి స్త్రీల హృదయములను మరల్చుటకుఁ గడుం గడు మిక్కుటములగు యత్నములు చేసిరి. కాని, శైలకుమారీ రమాదేవుల మతాను యాయినులు బహుళ సంఖ్యాకు లగుటవలన వారలు కాత్యాయనీ జ్ఞానవతీదేవులను సభలలో నోరు మెదల్పనీయక యల్లరులు చేయసాగిరి.

కాత్యాయనీ జ్ఞానవతులు ప్రస్తుతాందోళకుఁ ప్రబల విరోధులు. అందువలన వీరు తమయెడ ననుకూల భావముల నొసంగు వారు కారని యెల్లరు నెఱుంగుదురు. కావున సభలలోఁ గాత్యాయనీ జ్ఞానవతులను మాటలాడనీయఁ జాలకుండిరి. ప్రతి సభయందును వారి యుపన్యాసములకు విరోధమును విఘ్నమును గలుగుచునే యుం డెను. వారు ప్రతి సభనుండియు విఫలమనోరథలును, విహ్వల మనస్కలును నగుచు మరలుచుండిరి. కాని, తత్సమాజము నితాంతముగ నధఃపతనమున కున్ముఖ మగుచుం డుట గని కాత్యాయనీదేవి సహింపనేరని దయ్యెను. తాటస్థ్యమూననేరని దయ్యెను. కర్తవ్యవిముఖతఁ బూనఁజాలని దయ్యెను. వారి దూషణములకును దిరస్కారము లకును విరోధములకును, విఘ్నములకును నిసుమంతయు సరకుఁ గొనక, వెనుదీయక సమాజసుధారవ్రతమును కర్తవ్యముగఁ గొని, పురుషసమాజము యొక్క సానుభూతిని, సాయమును నభిలషించి తను రూపయత్నముల నొనరించు చుండెను. శిక్షితులును, ప్రతిష్ఠితులును, దూర దర్శకులును నగు పురుషులను బెక్కండ్రను దన గృహమునకు రావించి యొక సభను సమకూర్చెను.

ఈవిప్లవమువలన విపరీత పరిస్థితులవలనఁ బురుషులత్యంతవ్రస్తులగుచుండిరి. కాత్యాయనీదేవి ప్రస్తావమున కందఱును నామోదమును బ్రకటింపఁ జొచ్చిరి. నగ రములోని పురుషపుంగవులు నిమంత్రితులును, ననిమంత్రితులును, నెల్లరును నుద్విగ్న చిత్తులై సభాసమయమునకు ముందే కాత్యాయనీదేవి నిలయమునకు నరుదెంచి యుప స్థితులు కాఁదొడంగిరి. తమతమ సతుల యుద్ధతవర్తనముల వలనఁ ద్రసిత మనస్కులై యున్న యానంద స్వరూప వినయకుమారు లిరువురును మిత్రులును సభాకార్యము లయందు సంలగ్నహృదయులైయుండిరి.

సభోపస్థిత విషయ మత్యంతము నిబిడము నిగూఢము. మహత్వపూరితము. అందు గంటల కొలఁది వాదోపవాదములు తర్క వితర్కములు ప్రవర్తిల్లినయవి. తుదకు స్త్రీసమాజమును నష్టమును భ్రష్టమును నొనర్చినయది ప్రస్తుతపు శిక్షాప్రణాళిక. వర్తమానమున విద్యాశిక్షలఁ గఱపు విధానము ననుసరించి స్త్రీలు విద్యాశిక్షలఁ గఱచుట వలన నేఁడీభీషణ పరిస్థితి యుత్పన్న మగుటకు నవసరము కల్గినది. కాబట్టి యీ శిక్షాప్రణాళికను బరివర్తన మొనర్చుటకుఁ దగుయత్నమును సలుపుట ప్రథమ కర్తవ్య మని నిర్ధారితమయ్యెను.

అంత నొక మహనీయుఁడు “శిక్షాప్రణాళికా సుధారక ప్రయత్నమును సలిపినంత మాత్రమునఁ బ్రస్తుతము దేశమును గలగుండు పఱచుచున్న యీ భీషణ పరిస్థితి సుధారకము కానేరదు. ముందు సలుపవలయు దానిని విచారింపుఁడు. ప్రస్తుతము ప్రబలియున్న విషమపరిస్థితిని, అసంతోషమును దొలఁగించి శాంతిని నెలకొల్పుటకుఁ దగు యత్నమత్యంతావశ్యకము. అయ్యది ప్రథమ ప్రయత్నము. ప్రథమ కార్యము. ప్రథమ కర్తవ్యము” అని ప్రతిపాదన మొనర్చెను. అద్దానిని మఱొక మహనీయుఁడు సమర్థనము గావించుచు “స్త్రీసమాజమునందు శాంతిని నెలకొల్పు కార్యమును శ్రీమతి కాత్యాయనీదేవి వశ మొనర్పవలయును.” అను ప్రస్తావమును సభాసమ్ముఖము నందిడియెను. ఈప్రస్తావమును బాబూ ఆనందస్వరూపుఁడు మహత్త్వపూరిత మగు వ్యాఖ్యాన మొసంగుచు ననుమోదమును సూచించెను. అంత నీప్రస్తావము సర్వజన సమ్మతముగ నంగీకృత మయ్యెను. అంతఁ గాత్యాయనీదేవి “ఈ కార్యమును మీ యాదేశమును నిరీక్షింపకయే యిదివఱకే యనేక పర్యాయములు బహుయత్నములు సలిపియుంటిని. కాని, స్త్రీసమాజము మొదటినుండియు నాయెడ నప్రసన్నతను గని యుండుటవలన నా మాటలను జెవులఁ జొరనిచ్చుటకైన నొడఁబడ దయ్యెను. నాకు మాటలాడుట కవకాశమైన నీయ దయ్యెను. అందువలన శాంతిస్థాపనము దుర్ఘట మని తలంచి మీ సానుభూతిని మీ సాయమును నభిలషించితిని. కావున నిపుడు మీరు స్త్రీసమాజమున కొక్కించుక యైన నధికార మొసంగుటకు వాగ్దాన మొసంగుదు రేని, నేను యువతీమణుల సమ్ముఖమునఁ బురుషులు మీ కించుక నధికారమొసంగుటకు సంసిద్ధులై యున్నవారలని చెప్పుటకు అవకాశము కలుగును. అంతట వారు సంతుష్టులై నా చెప్పు మాటలను సాదరముగ నాలకించుట కియ్యకొనఁ గలవార లగుదురు. నేఁ జెప్పుమాటలలోని యుచితానుచితములు, లాభనష్టములు, కర్తవ్యాకర్తవ్యములు, చక్కఁగ విచారణము గావించుట కొడఁబడుదురు. దానసత్వరముగ శాంతి స్థాపనము నిర్విఘ్నముగ నెఱవేఱఁ గలదు.” అను ప్రస్తావమును గావించెను.

అంతఁ బలువురు మహాశయులు ఒక్కసారిగఁ గాత్యాయనీదేవి ప్రస్తావనమునకు విరోధమును జూపుచు, ఇంతట స్త్రీల కివ్విధమగు నధికారమును నీయరాదు. ప్రస్తుతమున వారి కీవిధ మయిన యధికారమును లేక పోయినను వారింతటి గాలివాన బెట్టిరి. ఇఁక నధికారమునే యొసంగుదుమేని పురుషులను బ్రపంచమున నెచ్చటను నిలువనీయరు. కాఁబట్టి స్త్రీలు శిక్షితలై విద్యావతులై, గ్రహణశీలలై యధికారముఁ బడయుట కర్హత గలవారలై తిరని తెల్లము కాకుండునంత దనుక వారి కెంత మాత్రమును, నేవిధమగు నధికారమును నొసంగరా' దని పలికిరి.

అందుమీఁద బాబూ చాందనారాయణుఁడు కాత్యాయనీదేవి ప్రస్తావమును యుక్తియుక్తముగ సమర్థనముఁ గావించుచుఁ బైవారి వాక్యములకుఁ బ్రబల విరోధమును బ్రకటించుచు "వాస్తవముగ నిష్పక్షపాతబుద్ధితో విచారణము సలిపి చూచినచోఁ బురుషుల యొక్క దురాచారము, దుర్వ్యవహారముల, నిష్ఠురవర్తనములు, స్త్రీలలో నసంతుష్టి యుదితమై ప్రబలవ్యాప్తి కనఁగల్గుటకుఁ గారణము లని విస్పష్టము కాఁగలదు. నిజముగ స్త్రీల యెడఁ బురుషులు, అమితములును, అవర్ణ్యములును నగు దురాచారములు పెక్కులు సలుపుచున్నవారు. ఇది నిశ్చయము. అందువలన నీ సమయమున స్త్రీల కించుక యధికార దాన మొసంగుట యత్యావశ్యకము. స్త్రీలు సమానాధికారముఁ బడయుటకుఁ దగు యోగ్యతఁ బడసి యున్నవారు కారని తలంతురేని వారియెడఁ బ్రదర్శితము లగు దురాచారములు, దుర్వ్యవహారములు, నిష్ఠురవర్తనములు నిఁక ముందుఁ బ్రదర్శితములు గావనియు, వారియెడ మానవోచిత వ్యవహారము సూపఁబడుననియుఁ బలుకనగుఁ గదా? అదియైనను భగవంతుని ముఖముచూచి, హృదయపూర్వకముగఁ బలుకుఁడు" అని పలికెను.

ఈ విషయమును బలువురు మహాశయులు సమర్థనముఁ గావించిరి. తుదకుఁ బురుషులు స్త్రీల కించుక యధికార మొసంగుదు రనియు, వారియెడ నెవ్విధమైన యన్యాయమును జూప రనియు, దుర్వ్యవహారములు సలుప రనియు, వారిని సగౌరవముగ సాదరముగఁ బరికించుచుందు రనియు వారు విద్యాశిక్షలఁ బడసి సుగుణులగుచుండిన కొలఁది నధికారములు కూడ నెక్కువగ నీయఁబడుచుండు ననియుఁ, దదాశయములు పురుష సమాజపక్షమునఁ బ్రతినిధిరూపమునఁ బ్రకటితముఁ గావించు నధికారమును గాత్యాయనీదేవి కొసంగుటకు సిద్ధాంతము చేయఁబడినది. ఈ విధముగ స్త్రీసమాజమందు శాంతిస్థాపన మొనర్చుటయు, యువతులను సుధరులనుగఁ జేయుటయు నను కార్యద్వయ నిర్వహణము కాత్యాయనీదేవి వశ మయ్యెను.

అనంతరము బాబూ ఆనందస్వరూపుఁడు, వర్తమాన శిక్షాప్రణాళికను బరివర్తనము గావించుటకును, శిక్షాప్రణాళికా సుధారక విషయముఁ గూర్చి దొరతనము

వారితో బత్రవ్యవహారములు సలిపి, తద్విషయమును శాసనసభలలో నుపస్థితము గావించి భారతీయాదర్శాను గుణముగ శిక్షాక్రమమును గొనసాగఁజేయునట్టు లొక చట్టమును నిర్మించుటకు దొరతనమువారిని బాధ్యులనుగఁ జేయుట కొక సంస్థ (Committee) ను నేర్పరింప వలయునను ప్రస్తావనము నుపపాదించెను. ఈ ప్రస్తావము సర్వజనాంగీకృతిఁ బడసిన దయ్యెను. ఈ మహత్త్వపూర్ణ కార్యసంపాదనమునకు శ్రీమతి కాత్యాయనీదేవి, బాబూ చాందనారాయణుఁడు, బాబూ ఆనంద స్వరూపుఁడు మతి యిరువురు సజ్జనులును, నొకసంస్థగ నేర్పఱుపఁ బడియెను. తత్సంస్థకుఁ గాత్యాయనీదేవి ప్రధాన మంత్రిగ నియుక్త యయ్యెను.

* * * *

శైలకుమారి, తాను బయలువెడల్చిన యాందోళనము వలన నిట్టి విపరీత పరిణామము సంప్రాప్తమయ్యెనని గ్రహించి కడుగండు లజ్జితయయ్యెను, స్త్రీసమాజమున కలవడిన దుర్గతింగని పరితపించెను. పరిస్థితి భీషణరూపముఁ దాల్చినంతనే యామె కాత్యాయనీదేవి కడ కరిగి తన కారణముగ స్త్రీసమాజమున కలవడిన దుర్గతికిఁ బశ్చాత్తాపముఁ బ్రకటించుచు, నామెను స్త్రీసమాజ సుధారక కార్యభారమును స్వయముగఁ జేకొని, యువతీహృదయములయందు శాంతి జనియింపఁ జేయుమని ప్రార్థించుట కెన్నియోపర్యాయము లుద్యుక్తయయ్యెను. కాని, లజ్జయు నాత్మాభిమానమును నామె నట్లుచేయ నీయకుండెను. అంతటఁ గాత్యాయనీదేవి గృహమున జరిగిన సభలో పురుషులు స్త్రీలకుఁ గొంతవఱకు నధికార మిచ్చుటకు సమ్మతిఁ బ్రకటించుటయుఁ, దద్విషయమును గాత్యాయనీదేవి మహిళా సభలోఁ బ్రకటింప నున్నదనియు మొదలగు విషయములు వినినంతనే కాత్యాయనీదేవి కడ కరిగి తాను జేసిన తప్పుల నన్నింటిని గ్రహించి, పశ్చాత్తాపముఁ బ్రకటించుచు క్షమింపుమని వినయవినమ్రవదనయై యామెను బ్రార్థించెను. ఆమె మనఃస్ఫూర్తిగ నిష్కల్మషచిత్తముతోఁ గాత్యాయనీదేవి యాశయముల ననుసరించి స్త్రీసమాజ సుధారకమును గూర్చి తత్పరచిత్తయై కృషిసల్పుటకు దృఢప్రతిజ్ఞఁ గైకొనియెను.

కాత్యాయనీదేవి శైలకుమారి యెడఁ గడుంగడుఁ బ్రసన్నచిత్తయయ్యె. ఆమె విశదకథనమునకును, నపరాధగ్రహణమునకును, మహానందభరితయయ్యెను. ఆమె చెందు పశ్చాత్తాపముఁ జూచి కరుణార్ద్రహృదయ యయ్యెను. ఆమె శైలకుమారిని దనహృదయమునఁ జేర్చుకొనియెను. ఇరువురును నిర్మల హృదయములతో, నిశ్చల ప్రేమతో, నత్యంతప్రీతితో, నతిశయవాత్సల్యముతో నొకరినొకరు కౌగలించుకొనిరి. వారి మనములు నిష్కలుషములయ్యెను. వారి మైత్రి యతిగరిష్ఠమైనదయ్యెను.

ఈఘటనము సంఘటిల్లిన మరుదినమునఁ గాత్యాయనీ శైలకుమారులిరువురును మహిళాసభను సమకూర్చుటకుఁ గృతనిశ్చయులైరి. కాని, సమయము వికటరూపము దాల్చి యుండినందున, నంతకుమునుపు జరిగిన సభల పరిణామములను బరికించి యుండుట వలనను, గొందఱు పురుషులు తమ స్త్రీలను సభకనుపుటకుఁ బ్రబల విరోధమును బ్రకటింపఁజొచ్చిరి. ఆకారణమునఁ బ్రస్తుతసభ స్త్రీసుధారకమును గూర్చిన విషయమును జర్చించుటకునై సమకూర్పఁ బడుచున్నదని యెల్లరకును సుస్పష్టము గావించుకొనుటకునై "స్త్రీలు గృహిణశక్తిదూరలు, విచారశూన్యలు, అవివేక వర్తినులును నగుట కారణముగ సమాజమందు భీషణములను, నసంతోషము, నశాంతి యనైక్యము, ఘోరానర్థములును నుత్పన్నములై ప్రబలుచున్నయవి. వానిని దొలఁగించుట కనువగు నుపాయముల నరయుటకును, స్త్రీల కుచితమార్గములు ప్రదర్శించుటకును బురపతనమందిరమున నేఁడు సాయంకాలము మూఁడు గంటలకు మహిళాసభ సమకూడ నున్నయది. సభలో నాదర్శవర్తినియును, సాధ్వీశిరోమణియు, స్త్రీసమాజమునకు ముఖ్యసేవికయునగు శ్రీమతి కాత్యాయనీదేవియును, మఱికొందఱు సుయోగ్యలగు సతీమతల్లులును, మహత్త్వపూరితములును, నుపయోగకరములును నగు నుపన్యాసముల నొసంగుదురు. కాఁబట్టి నగరనారీమణులెల్లరును సభకరుదెంచి తదుపన్యాసములనాలించి, తల్లాభమును గ్రహింపఁబ్రార్థితలు. అని ప్రకటన పత్రికలలోఁ బురుషలెల్లరును దమ స్త్రీలను సభకనుపుట కంగీకృతులగుటకునై స్త్రీస్వాంతంత్ర్యమునకు బ్రబల విరోధులగు మహనీయుల హస్తాక్షరము లనుపఁబడియుండెను.

స్త్రీ స్వాతంత్ర విరోధులు పలువురు సభాసమావేశము నందుఁ గృషిసలుపుచుండుటయు, నమితోత్సాహముతోను, నాదరముతోను నుండుటఁ గని నేఁటి సభ మునుపటి సభలఁబోలు నది కాదనియు, మహిమావంతమును, హితకరమును నగునది యనియుఁ దలంచి, నియమిత సమయమునకు స్త్రీలు బహుళ సంఖ్యాకులు సభాస్థలము నందు సమకూడిరి. ఆనాఁటి సభ ప్రప్రథమమున శైలకుమారీ భవనమునందుఁ గూడిన మహిళాసభ కంటె నాలుగురెట్లు మిక్కుటముగ నుండెను. ఎందఱో పురుషులు తమ స్త్రీలను సభలోఁ జేర్చుటకుఁ దోడ్కొని వచ్చిరి.

నిర్ణీత సమయమున సభాకార్యక్రమము ప్రారంభ మయ్యెను. సభానేత్రి పదము శ్రీమతి జ్ఞానవతీదేవి గ్రహించి, సభాశయముల నెల్లర కెఱింగించెను. అనంతరము శ్రీమతి శైలకుమారి తన యపరాధమును స్వీకరించుచుఁ, బశ్చాత్తాపమును బ్రకటించును క్షమాపణమును యాచించుటకునై లేచి నిలిచెను. కాని యామె చెప్పిన యాదర్శముల ననుసరించిన కారణమునఁ బలు వెతలకుఁ బాలై పరితపించు

చున్న యువతు లప్రసన్నలై యాగ్రహమును జూపుచుండిరి. ఆమె తన యాసనము నుండి లేచి నిలిచినంతనే నలుదిక్కులనుండి యొక్క మాఱుగ "ఆమెను గూర్చుండఁ బెట్టుఁడు. ఆమె చెప్పుమాటలను విననొల్లము. ఆమె మాటలను విని నందులకును, ఆమె చూపినమార్గమున నడిచినందులకును దగినఫల మనుభవించితిమి." అనియును, "సమాజమున కింత యనర్థమును సమకూర్చినందులకు సిగ్గు పొందక మరల నేమని సభలో ముఖము నెత్తుటకు సిద్ధమగుచున్నది యీ శైలకుమారి. సిగ్గు. సిగ్గు. చాలు, చాలు." అను దూషణములు కేకలు బయట వెడలెను.

శైలకుమారిం గూర్చిన దూషణ తిరస్కారపూరిత వాక్కులతోఁ గేకలతో సభాస్థలము పరిపూరిత మయ్యెను. శైలకుమారి చేతులు జోడించుకొని, శిరము వంచుకొని, కడు భిన్నహృదయయై యా కేకలనెల్ల నాలించుచు నోర్చుకొని నిలుచుకొని యుండెను. అంతఁ గాత్యాయనీదేవి లేచి "మన ప్రియసోదరి శ్రీమతి శైలకుమారీదేవి, స్వయముగఁ దన యపరాధమును గ్రహించి తనవలన సమాజమునకు ముప్పు కలిగె నని తలంచి పరితపించుచుఁ దాను జెప్పినమాటలకును, జూపినమార్గములకును గడు దుఃఖితయు, లజ్జితయు నగుచున్నది. మీ క్షమను నభిలషించు మీ సముఖమున వినయ వినమ్రవదనయై నిలిచియున్నది. ఆమెను మన్నించుట మీకుఁ గర్తవ్యము. స్త్రీ సమాజము నందు, నామెను బోలు శిక్షితయును, సుయోగ్యవతియు నగు యువతీరత్నము చూపట్ట దనుటకు సందియ మావంతయును లేదు. అట్టి సోదరీరత్నమును నిట్లవమానము జేయఁగడంగుట లజ్జాజనకమగు విషయము గాని శోభించు కాదు. మనుజుల కపరాధములు సహజములు ధీమంతులు సహితముగ ప్రమాదమునకు లోనగుదురు. దోషము లెల్లరకును గలుగును. అది పరిగణింపఁ దగినయది కాదు. ప్రథమమున నామె సిద్ధాంతములు ఆమెకు సమంజసములుగఁ దోఁచెను. సత్ఫలదములగునవియు నగు నని విశ్వాసముఁ గొలిపెను. అందువలనఁ దదనుగుణములగు మార్గములఁ జూపెను. పర్యాయమున నామె చూపిన మార్గములు వంకరటింకరలుగను, మిట్టపల్లములుగను, కంటకావృతములుగను, కష్టప్రదములుగను, దుఃఖాకరములుగను, ప్రతీతములై యొప్పినందున నయ్యవి యగమ్యములని గ్రహించెను. అందువలన నామె మిమ్ములను దన యపరాధమును మన్నించి క్షమింపుఁడని వేఁడుకొనుటకై మీయెదుటి కరుదెంచి నిలిచియున్నది. కాఁబట్టి యీమె యుపన్యసించు వాక్యములను శాంతచిత్తులరై యాలింతురని నమ్ముచున్నాను." అని పలికి తన పీఠముపైనధివసించెను.

అంత శైలకుమారి "శ్రీమతీ! సభానేత్రీ! సభాస్థితలగు సతీమతల్లులారా! సోదరీరత్నములారా! దయయుంచి యవధరింపుఁడు.

నేఁడు నేను కడుంగడు లజ్జితనైతిని. లజ్జా జనితభార మతిశయ మైనందున నా నోటమాట వెడలకున్నయది. నా హృదంతరమునఁ బ్రజ్వలిత మగుచున్న పరితాప జ్వాల నా శరీరమును దహించుచున్నయది. యథార్థముగ మిమ్ము పలువిధము లగు ఘోరకష్టములకుఁ బాలు గావించితిని. అట్టి సమయమున మిమ్ము నేనే మొగముతో క్షమాపణమును యాచింపఁ గలను? ఇఁక నెక్కుడుగ నా ముఖమును మీ యెదుట నుంచి మీ మనములను గలంచుట కియ్యకొనదానను గాను. కాని, నా యపరాధములను క్షమింపుఁ డని మిము నందఱను బ్రార్థించుచు మీ కివె (చేతులు మోడ్చి) వేనవేలు నమస్కారముల నర్పించు చున్నదాన నని పలికి కూర్చుండెను.

శైలకుమారి వినయము, వినమ్రతయు, సభలోనివారి కెల్లరకు సమ్మోహనాస్త్రముగ నయ్యెను. ఎల్లరును మంత్రబద్ధము లగు కాలసర్పముల వలె నుండిరి. ఎల్లరు కొక్కసారిగ "శైలకుమారీదేవికి జయము" అని నలుదిక్కులుఁ పిక్కటిల్లునట్లు గగనమండలము భేదిల్లునట్లు పలుకఁ జొచ్చిరి. అంత సభాస్థలమునం దొక విధ మగు విచిత్రమును, ఆశ్చర్యకరమును నగు ప్రహర్ష భావము వ్యాపించెను. విలక్షణపరివర్తనము దృగ్గోచర మయ్యెను. ఈ విధముగ స్త్రీలలో నూతన పరివర్తన ముత్పన్నమైన పిమ్మట కాత్యాయనీదేవి. దిక్కులు ప్రతిధ్వను లీనునట్లు. కరతాళధ్వనులు చెలరేగు చుండ నుపన్యాస మొసంగుటకు లేచి నిలిచెను. అంత "కాత్యాయనీదేవికి జయము. భారతమహిళామణులకు జయము." అను శబ్దములు, హర్షధ్వనులు చెలరేగెను. అనంతరము కాత్యాయనీదేవి యుపన్యసింప నారంభించెను.

"జనులారా! సోదరీ తిలకములారా! పరమపితయగు పరమేశ్వరునకు అనేక సాష్టాంగ నమస్కృతులు. ఆ లోకపూజ్యుని కృపాతిశయముననే మనకు నేఁడు సుబుద్ధి యలవడినది. ఇంతకు రెండు గంటలకు ముందు స్త్రీ సమాజమునందు విద్యమానమైయున్న నారకీయదృశ్యమును, నిప్పు డీ విధముగఁ గనఁబడుచున్న స్వర్గీయ దృశ్యముగఁ బరిణత మగుటకుఁ గారణ మా యార్యజనరక్షకుని, నా దీనశరణ్యుని నా లోకహితకరుని, మహానుగ్రహ ప్రభావ జనితము గాక వేఱేమనఁ గల్గుదుము! మీ విచారశూన్యమును, విప్లవపూరితమును నగు నింద్యవర్తనము వలన మీ కలవడిన విషఫల మెంతటి భీషణమైనదియో యయ్యది మీ స్వానుభవమువలన గ్రాహ్యమగుచునే యున్నది. కావున దానినిఁ గూర్చి చెప్పనవసరము లేదు. అందువలనఁ గాలయాపనము కాక వేఱేమియును జేకూఱనేరదు. ఇపుడు మన మాలోచించునది యేమనఁగా నిఁక ముందుఁ జేయవలసినది యేమి యున్నది? ఎట్లు ప్రవర్తింపవలయును? స్త్రీ సమాజ మేతీరున సుధరమగును? పురుషుల కడనుండి యధికారమును గ్రహించు

విధ మేది ? అను విషయములఁ గూర్చియుఁ, దత్సంబంధములగు నూతన విషయములను గూర్చియు, విచారణము సలుపుట యత్యంతావశ్యకము.

సోదరీ మణులారా ! మీకిదివరకే యుపన్యసించి యున్నాను. సమాజమున కౌన్నత్యమును గలిగించుటకును, బురుషుల దుర్ణయమునకు లోనుగాక యుండుట కును, సమానాధికారముఁ బడయుటకును, మునుముందు శిక్షితలగుట యత్యంతావశ్య కము. ఆవిషయముననే యిపుడు ద్విరావృతమును గావించుచున్నాను. ఇప్పుడు కొందఱు యువతులు, పాఠశాలలలోను, గళాశాలలలోను, శిక్షితలగుచున్న వారు· కాని. వారి సంఖ్యకడు నల్పము. అంగుళులమీఁద లెక్కించుటకే యిమిడియున్నది. అయ్యది లేమికి సమమని చెప్పనొప్పును. యోగ్యులు. విద్యాసంపన్నులు, సర్వత్ర పూజ్యులగుదురని సర్వజన సమ్మాన్యులగుదురనియు, మూర్ఖులు, అయోగ్యులు, నిరాద రులగుదురనియు, నింద్యులగుదురనియు నెల్లరెఱింగిన విషయమేకదా ? అయ్యది వేఱుగఁ జెప్పనేల ? ఇపుడు పురుషులు కూడ స్త్రీ శిక్షావశ్యకతను జక్కఁగ గ్రహించి యున్నారు. అయ్యది హర్షదము. శుభసూచకము. స్త్రీశిక్షావశ్యకతను గూర్చి సూచించు లేఖలు పత్రపత్రికలలో బహుతరముగఁ బ్రకటితము లగుచున్నయివి. అందు వలన స్త్రీశిక్షావశ్యకము నిర్వివాదముగ సిద్ధమగుచున్నది. స్త్రీ శిక్ష యనివార్యమగు దానినిగఁ జేయుట కాందోళనము గావింపఁబడుచున్నయది. స్త్రీలకు శారీరక మాన సిక వికాసములు చేకూర్పఁబడును. సుధారకము లగుమార్గములు ప్రదర్శితములు కావింపఁబడును. శిశుపోషణము, కళాకౌశలము, సంగీతశాస్త్రము, నీతిశాస్త్రము, ఇతిహాసము మొదలగు విషయములందు యోగ్యత సమకూర్పబడును.

స్త్రీ శిక్ష యావశ్యకమనియు ముఖ్యమయిన దనియు, ననివార్యమైనవనియు సిద్ధమగు చున్నయది. ఇఁక నేవిధముగ శిక్షితలఁ జేయవలయునో, యేతీరునయోగ్యత గలుఁగ జేయవలయునో, యను విషయములు విచారణీయములు. ప్రకృతమున యువ తులు శిక్షఁబడయు చుండినను, బశ్చాత్తాపరూపమున నశిక్షిత స్త్రీలకు శిక్షితలఁ జేయుటయందుఁ బరాఙ్ముఖత్వమూని ప్రయత్నముసలుప కుండుటకును నున్నవారు. అయ్యది స్త్రీల దోషము కాదు. పురుషుల త్రుటి. ఇందుకు సందియము లేదు. కాని యాపని మీయది. మీరు చేయవలయునది మీకుండు తొందఱ. యభిలాష వారి కుండనేరదు. కందకు లేనిదురద బచ్చలికి నెక్కడనుండి వచ్చును. కాఁబట్టి పురుషు లీవంక ధ్యానముంచవలసిన యవసరము గలవారు కారు. మీ మోకాళ్ళ మీఁద మీరు నిలిచి మీశిక్షణమునుగూర్చి మీరుత్సాహపూరితులై తీవ్రరూపమునఁదృష్టి సలుపుట కుద్యుక్తలు కావలయును. అంతియ కాని, పురుషులు ప్రయత్నములు సలుపుటలేదని

మహతోత్సాహులై చేతులు ముడుచుకొనుచు నూరక యుండుట సమంజసము కాదు. మీరీ విధముగ దీక్షను వహించి ప్రయత్నోన్ముఖులగు వారలగుదురేని పురుషులు మీకు తోడ్పడుచున్నవారై మీయత్నమును సఫలమగుదానినిగఁ జేయుటకు ముందంజ యిడువారలగుదురు. దాన మీయుద్దేశము సహజముగఁ బూర్ణసిద్ధిగనఁగలుగఁనది కాఁగలదు.

శిక్షాసంబంధమగు విషయము కడుమహత్త్వపూరితము. అందుమన మవశ్యము ధ్యానము నుంచవలసియున్నారము. అయ్యది ప్రాముఖ్యము. ప్రకృతమునఁ బ్రచలితమైయున్న శిక్షాప్రణాళిక దోషపూరితము. అందువలన స్త్రీలకొసంగఁబడుచున్న శిక్ష దూషితరీతిఁ గనియున్నయది. తత్కారణముగ నిపుడు సంఘటితమయిన యనర్థమును మీరు కన్నులారఁ గాంచుచునే యున్నారు కదా? నేఁటి బాలికలు చంచల లని కొందఱు తలంచుచున్నారు. కాని యయ్యది నిర్మూలము. భ్రమమాత్రము. వాస్తవముగ నాంగ్లభాషాశిక్షితులగు యువకులు చంచలచిత్తులగునట్లుగ, నశిక్షితలగు యువతులు కాఁజాలరు. నిజముగ యువతులను, చాంచల్యము చారిత్రకళంకము స్వాభిమానము, స్వేచ్ఛావిహారము, నిరంకుశవర్తనము మొదలుగాఁగల దుర్గుణములతో భూషింపఁబడిన వారినిగఁ జేయునది ప్రస్తుతము ప్రచలితమగు శిక్షాప్రణాళికయే గాని వేఱుగాదు. ఈమాటలు రాధారములును, ననోచితములును, నగునవి కావు. స్వానుభవమువలనఁ జెప్పబడు చున్నయవి. వలయునెడల యథార్థముగ నిరూపితము చేయబడును. ఇందులకొక యుదాహరణము నొసంగుచున్నాను. దాన మీ సందియము నివారితమగును, ప్రస్తుతము, యువతులను, యువకులను, భారతీయసభ్యత, భారతీయధర్మము, భారతీయాదర్శము, భారతీయవిచారము, మొదలగు వాని యందెల్లప్పుడును ననభిజ్ఞులుగనునిచి వారికి విదేశీయుల సభ్యత, యాచారము, వర్తనము, విహారము, మొదలగువాని ననుసరించి శిక్షితులుగఁ జేయుచున్నారు. వారి పాఠ్య విషయములలో రామ, కృష్ణ, భీష్మ, మహారాణా ప్రతాపసింహ, ఛత్రపతి శివాజీ, మొదలుగాఁగల మహనీయుల యొక్కయు, సీత, అనసూయ, సావిత్రి, పద్మిని, అహల్యాబాయి, మొదలగు సాధ్వీశిరోమణుల యొక్కయు, ఆదర్శములు, జీవిత చరిత్రములు, హృదయాంకితములగు వానినిగఁ జేయుటకు నియమింపక, షేక్స్పియరు మిల్టను, మొదలగువారి నాటకములు, కుయుక్తులు, వంకరటింకర మార్గములు పఠితములుగఁ గావించి భారతీయ యువకులమేను, యువతులమేను, చరిత్రకళంకమును గలిగించుచున్నవారు. పశ్చిమదేశములయందుఁ బరపురుషులతోఁ బ్రేమానులాపమైనర్చుటకును, వారితో విహరించుటకును, నింతియేగాక యంతకంటెమిక్కుట

ములగు ప్రవర్తనములకును నలవాటు పడుటయేగాక తద్వర్తనములు సర్వజనసమ్మతములుగ మాన్యములుగఁ బరిగణింపఁ బడుచున్నయవి. ఫేషనులుగ నొప్పుచున్నవి. అయ్యవివి మన భాగతదేశమందు వ్యభిచారములుగ లెక్కింపఁబడుచున్నయవి. అయ్యవి యందఱ కెఱిఁగిన విషయమేకదా? అందు వివాహములకుఁ బూర్వము వధూవరులు కోర్టుషిప్పు సదాచారముగ నుండును. అయ్యది మనదేశములో నిజ స్త్రీతో ప్రేమాలాపముఁ బోలెఁ బరిగణింపబడుచున్నది. ఈవిధముగ నాదేశ సభ్యత. యాదేశాదర్శము, మనసభ్యతకు, మనయాదర్శమునకుఁ బ్రతికూలము లగుచున్నవి. అందువలనఁ దద్దేశాదర్శసభ్యతలఁ బ్రమాణముగఁగొని తదనుసరణముగ మనసోదరీమణులను, మనబాలికలను, వర్తిలఁజేయుట యనర్థదాయకము గాక మత్రేమగును. కాఁబట్టి మనదేశమునకు మనదేశ సభ్యతకు ననుగుణమగునటులు పాఠ్యవిషయములు నిర్ణీతములు గావింపవలయును. అందుతోఁబాటు యువతులకును యువకులకును ధార్మిక శిక్ష యనివార్యమగునటులు నియమము (చట్టనిర్మాణము) నుగావింపవలయును. ప్రకృత కాలములోఁ బాఠశాలలలోను, కళాశాలలలోను, విద్యార్థులకు ధార్మికశిక్ష గఱపని కారణమున వారలు ధర్మకర్మములయందు ఇసుమంతయైనను జ్ఞానము గలవారలుగ నుండలేదు. అది కారణముగ మనదేశములోని యువకులకును, యువతులకును. భారతీయ భావపూరితులుగాక వైదేశికాచారవ్యవహార విచారప్రభావములకు లోనగుచున్నవారు. అందువలన ధార్మికశిక్షావిషయక పాఠ్యవిషయముల ననివార్యములుగఁ జేయవలయును. ఈనియమము నిర్ధాంతమైన దైనయెడ యువతులును, యువకులును, నున్నతశిక్షఁ గఱచుట కర్హతగడించుటకుఁ బూర్వముననే వైదేశికాచారవ్యవహారముల, వైదేశిక సిద్ధాంతముల ప్రభావములు వారిహృదయాంకితములుగాక యుండునంతటి భారతీయాదర్శములవిషనాడఁదీయకుండు నంతటి ధార్మిక జ్ఞాన ముదయించుటకనువగునటుల ధార్మిక శిక్ష గఱపుట నియమబద్ధము కాలయు.

సోదరీ మణులారా! స్త్రీల కాంగ్లవిద్యఁగఱుపరాదని కొందఱు చెప్పుదురు. కాని, యయ్యది సమంజసమైనదికాదు. వాస్తవముగ నాంగ్లభాషయందు దోషమేమియును లేదు. కాని, ఉన్నదోషము శిక్షగఱపు విధానమున నున్నది. శిక్షాప్రణాళికను రూపాంత మొందింపవలయును. పాఠ్యవిషయములను బరివర్తనము గావింపవలయును. విద్యార్థులకు ధార్మిక శిక్షఁగఱపి, వారిహృదయములు, వారిభావములు ఆంగ్లేయ ప్రభాభాసురములు గాకుండనుండునటుల వారిచేత భారతీయపౌరాణికాదర్శములను మననమున నియింపవలయును. ఈవిధముగ శిక్షాప్రణాళిక సుధారకము గాంచు నదియైనచో, నాంగ్లభాషాభ్యసనము వలన మనయువతుల యందును, యువ

కులయందును, దుర్గుణములు, దుర్భావములు చూపట్టనేరవని నావిశ్వాసము. భాషా పరిజ్ఞానముమాత్రమే యలవడును. ఇంగ్లీషు ప్రస్తుత కాలమందు సభ్యభాషయై యున్న యది. రాజభాషయై వఱలుచున్న యది. ప్రపంచవ్యవహారములన్నియు, ఆంగ్లభాష మూలకముననే వ్యవహృతములగుచున్నయవి. నడుపఁబడుచున్నయవి. అందువలన నాంగ్లేయభాషాపరిజ్ఞానము మిగుల నావశ్యకము. అట్టి భాషాజ్ఞానము లేకుండుట శోచనీయమే కాదు. హానికరము. కావున స్త్రీలకుఁ గూడ నాంగ్లభాషాపరిజ్ఞాన మత్యవసరమని నాయుద్దేశము. ఈవిధమున స్త్రీ లుత్తమశిక్షను బడసినవారలైనచోఁ బూర్ణయోగ్యతను బడయఁగలవా రలగుదురు. అంతఁ బురుషసమాజము స్త్రీలకును దగునధికారమును నొసంగుటకును, వారితో సమతారూపమున వ్యవహారము సలుపుటకును నెవ్విధమగు నాటంకమును జూపుటకు సాహసమూనఁ గలవారు కాజాలరని నావిశ్వాసము.

సోదరీ రత్నములారా! ఇపుడు మీలో నంకురితములై యున్న దుర్గుణములను, దుర్భావములను సత్వరముగ బహిష్కృతములు గావింపవలయును. అయ్యది యత్యావశ్యకము. మీలో నాంగ్లభాషాభ్యాసినులగు వారిలో దుర్గుణములు దురభ్యాసములు చూపట్టుచున్నవి. కాని వారి యందుఁ గనంబడు భాషాపాండిత్యము గ్రహణశక్తి మీ యందుఁ జూపట్టుట లేదు. అశిక్షితలును గూడ వారిని జూచి దుర్వృత్తములను జేకొనుచున్నారు. గృహకృత్యములయందు ఘృణితలగుచున్నారు. దుర్వ్యసనముల కభ్యస్తలగుచున్నవారు. తద్విషయమున ద్రవ్యమును దుర్వ్యయము చేయుచున్నవారు. పతి, అత్తమామలు మొదలగు పూజనీయులయెడ ననాదృతియు నగౌరవమును జూపుచున్నారు. ఈ దుర్వృత్తములు సాధారణమగు స్త్రీలలో నెల్లను గానఁబడుచున్నయవి. అందు ఇంగ్లీషు చదివిన స్త్రీలయం దెక్కువగఁ జూపట్టుచున్నది. దీనికి ముఖ్యకారణము విదేశీయవనితల వర్తనము ననుకరింపవలయు ననునభిలాషమును బూర్ణరూపమునఁ బూని యుండుటయే కాని, యా విదేశీయులగు స్త్రీల దినచర్యల నెఱింగినవారు మాత్ర మిందేరును లేరు. ఆంగ్ల మున్నగు విదేశ వనితలు తమ సమయమును గ్రంథపఠనమునందును, ఉన్నిపనులు, కుట్టుపనులు, ఆల్లిక పనులు, మొదలగు వాని యందును వినియోగ పఱచుచుందురు. ఒక్క నిముస మేనియు వ్యర్థముగఁ గడుపరు. ఇంటి పనులను, నితరకార్యములను నన్నింటిని వారే నిర్వహింతురు. అందుఁ బురుషులకుఁ బ్రమేయము గలుగనీయరు. వారి కార్యక్రమము నియమ రూపమును సమయబద్ధమును గని యుండును. కార్యసమయము నతిక్రమింపక కార్యమును జరపుదురు. విహారసమయమున విహారమును సలుపుదురు.

మన సోదరీమణు లాంగ్లవనితల గృహముల కరిగి వారు చేయుపనులను జూచుటకుఁ దగు నవసరము నెన్నఁడును గనినవారు కారు. వారల నుత్సవములలోను, నాటకశాలలలోను, దమ పురుషులతోఁ గూడ విహారములు సలుపు సమయములలోను జూచుట మాత్రమే సంభవమగు చున్నయది. అక్కారణమున వారలను సుఖోపభోగు లనియు, కార్యవిరతలనియు స్వేచ్ఛాపరతంత్ర లనియుఁ, దలంచుచున్నవారు. అట్లు తలంచుట కేవలము పొరపాటు. అయ్యది పట్టి భ్రమ మాత్రమే. వారెప్పుడును కార్యతత్పరులై యుందురు. అంతియకాని యలసులై యెన్నఁడును నుండరు. ఆంగ్లవనితలు గృహకృత్యములయందు హస్తక్షేప మిడువారు కారనియే తలంతము. అయినను వారి దేశపరిస్థితులు వారి యాచార విచారములు, వారివర్తనము, వారి యునికి, మొదలగు నవి వేఱు విధములుగా నుండును. వారి దేశములో వారు నిర్దుష్టము లని సభ్యము లని తలంచు సిద్ధాంతములు ఆచారములు మన దేశములో మనము దుష్టములుగను, నసభ్యములుగను, బరిగణించు చున్నవార మని యిదివఱకే చెప్పియున్నదానను. వారి యాచరణములు వారల కుచితము లయియున్నను మన కనుచితములు. నింద్యములు. కళంకితములు. మన యాదర్శములు వేఱు, మన యాచారములు వేఱు, మన దేశములందుఁ బతిప్రేమను, బతిభక్తిని బ్రపంచమునకు నుదాహరణముగ నాదర్శముగఁ జూపిన దేవీరత్నములు సాధ్వీమణులు, సతీమతల్లులు నెంద ఱుద్భవించి యుండిరో పరికింపుఁడు. అత్త, మామ, మొదలగు వృద్ధ జనాదరణము నందు, స్వావలంబనమునందు, మానరక్షణమునందుఁ, గష్టసహిష్ణుతయందు, మన దేశ స్త్రీలు సుప్రసిద్ధలు. అగ్రగణ్యులు. ఇంతకంటె నతిరిక్తముగ మన దేశముయొక్క యార్థికదశ వంక ధ్యాన ముంచిన యెడ యూరోపుఖండముఁ బోలె మన దేశమిపుడు గృహకార్య నిర్వాహణమునకు సేవకుల నియమించు కొనుటకుఁ దగినంత ధనవంతమైనదిగఁ దగి యుండలేదు. అని విస్పష్టమగుచున్న యది. మనలో నూటి కెనుబదిమంది వఱకు దారిద్ర్యదేవతకు గురియై కడుపునిండఁ దిండిలేక ఒంటినిండ బట్టలేక పరితపించు చున్నవారు. వారు సేవకుల నునుచుకొనుట యెటులో మీరే విచారింపుఁడు. ఇట్టి నిరర్థకదేశమునందు, నిట్టి దారిద్ర్యావస్థయందు, నొకరిఁ జూచి యొకరు స్త్రీలు కడునలసులై, వేషములకు లోనై "మేము గృహకృత్యముల సలుపనొల్లము. సేవకుల నియమించుకొనుఁడు" అని పురుషుల నిరోధించుట యుచితవర్తన మగునా? ఇక్కారణముననే పురుషులు స్త్రీలను శిక్షితలను గావించుట కియ్యకొన కున్నవారు. అందులకుఁ గారణము స్త్రీలను శిక్షితలఁజేసిన వారు గృహకృత్యములయందు ఘృణిత లగుదురు. ఏ పనిని

ముట్టరు. క్లేశముల కలవడుదురు. ద్రవ్యము నపవ్యయమును జేయుదురు. భయభక్తులను వీడుదురు. అదుపునకును, నాజ్ఞకును లోను గారు. అని తలంచి యున్నవారు. కాఁబట్టి యట్టి యరిష్టములనుండి రక్షితులగుటకునై స్త్రీలనుశిక్షితలను గావింపకుండ నునుచుటయే శ్రేయస్కరమని యుచితమని వారు తలంచు చున్నవారు.

సోదరీ రత్నములారా! పాపము! పురుషులేమి చేయఁగలరు? దారిద్ర్యమునకుఁ బాల్పడి పరితప్తు లగుచున్నవారు. ఏమి చేయుటకును నేరక వివశులగుచున్నవారు. అందువలన స్త్రీ విద్య నరికట్టుటకుఁ బాల్పడుచున్నవారు. కాఁబట్టి మీరందఱు నిట్టి యరిష్టమునకుఁ బ్రధాన కారణము లగు దుర్భావములను, చెడ్డయలవాటులను, దూరముచేసి విద్యాభ్యాసమునకు దొరకొనుఁడు. సుశిక్షిత లగుటకు యత్నములు సలుపుఁడు. యోగ్యతఁ బడయుటకుఁ గఠిన పరిశ్రమచేయుటకును సుస్యక్తుల రగుఁడు. అంతియ కాదు. ధనసంచయమున కను వగునటులు సాధ్యమయినంతవఱకు మీ పనులను మీ చేతులతోఁ జేసికొనుటకు సంసిద్ధుల రగుచుండవలయును. సంలగ్నుల రగుచుండవలయును. సేవకులను మాటను దలఁపనైనఁ దలఁపరాదు. ధనసంచయమును బ్రధానకృత్యముగ నెంచి పరిశ్రమము చేయవలయును. అట్లు పరిశ్రమపూర్వకముగ సంచితమైన ధనమును మూలధనముగ నిడి పురుషులచే నేదైన లాభదాయక మగు వర్తకమును జేయింపవలయును. దాన మీ కుటుంబమునకు నాదాయము హెచ్చును. మీరు సమృద్ధిగలవార లగుదురు. ధనసంపన్ను లగుదురు. అపుడు ఒక్క సేవకుని గాదు. పదుగుర సేవకుల నుంచుకొనుటకు శక్తు లగుదురు. అపుడైనను శరీరసౌఖ్యమునకుఁ జూడరాదు. పరిశ్రమమునకు వెనుదీయరాదు. పరాధీనమందు నిలిచియున్న దేశమునకునై పతితావస్థయందు నున్న సమాజమునకునై ప్రతిస్త్రీకిని, ప్రతి పురుషునకును, దేశోద్ధారమును సమాజోద్ధారమును నవశ్యకర్తవ్యములై యొప్పుచున్నయవి. గాన నా సమయమునందుఁ గూడ మన దేశమునకును, మన సమాజమునకును గల్యాణ మొనఁగూర్చుటకై ధ్యాన ముంచవలయును. మీరు సుధరులై మీ కుటుంబములను సుధరములను గావించుకొనిన పిమ్మట, మీరు మీ తనుమనోధనములతో దేశసమాజములను సుధారకము గావించుట కగ్రేసరులు కావలయును.

సహోదరీమ తల్లులారా! మీ రెపుడు సుధరు లగుదురో, అపుడన్నియును సంభవము లగును. అంతకు లోపల సంభవములుఁ గాఁజాలవు. కావున నేఁ జెప్పు విషయముల యందలి యథార్థమును జక్కగ గ్రహించి. మీ కల్యాణమును నభిలషించుచు దేశక్షేమమునకు సమాజహితమునకును ననువగు రీతిని బ్రవర్తింపుఁడని మిమ్ముఁ గూర్చి సవినయముగ జేతులు జోడించి ప్రార్థించు చున్నదానను.

సోదరీమణులారా! మీసమయమును విశేషముగఁ జేకొని మీయెడ ధార్ష్ట్య మొనర్చితినని మిగులఁ బరితపించుచున్నదానను. కాబట్టి నన్ను క్షమింపవలయును. క్షమింతురుగాక! మిమ్ముల నొక ప్రశ్న మొసంగి దానికిఁ దగు మీయుత్తరమును గ్రహించి నాభాషణమును సమాప్త మొనరించు చున్నదానను. "నేను గావించిన యీసంభాషణములకు మీరెల్లరును గోపించి యుందురు. ఇంతకుముందు నేను గావించిన యుపన్యాసములకు సంపూర్ణముగాఁ గుపితమనస్కులై యుండిరి. అప్రసన్నతను జూపియుంటిరి. ఆకారణమున నిపుడు నామాటలు హితకరముగ మీకిపుడు తోఁచినవా? ఆమాటలను వ్యవహారమునందును ననుష్ఠానమునందును నుంచుటకుఁ గృపసేయుదురా? అని ప్రశ్నింపవలసివచ్చినది. కావున నామాటలను బాటించుట మీకు శ్రేయస్కరమని తోఁచిన యెడల ననుకూలముగను, లేనియెడలఁ బ్రతికూలముగను, స్పష్టముగ నిర్దాక్షిణ్యముగఁ బ్రత్యుత్తర మొసంగుదురుగాక యని మిమ్ములఁ బ్రార్థించుచున్నదానను." అనిపలికెను. అంతసభాస్థలమందుండిన స్త్రీలందఱును జేతులెత్తి యైక కంఠ్యముగ దిక్కులు పిక్కటిల్లునట్లుగను, గగన మండలము భేదిల్లునట్లుగను "మేమెల్లరము మీమాటలకు సంతుష్టినొందినారము. తదనుసరణముగ వర్తిల్లుటకు దృఢప్రతిజ్ఞలమై యున్నారము" అని ప్రత్యుత్తర మొసంగిరి. ఈప్రత్యుత్తరమును విని కాత్యాయనీదేవి యత్యంతానంద భరితయయ్యెను. గద్గద కంఠయయ్యెను. అశ్రుపూరితనయనయై "సోదరీరత్నములారా! మీవలన నీప్రత్యుత్తరమును బడసినంతనే నాఁకు గల్గిన యానందమును బోలిన యానందమింతకు మున్నెన్నఁడును గల్గియుండలేదు. మీకు దేశసమాజోద్ధారకముల నొడఁ గూర్చుటకుఁ దగు శారీరక మానసిక శక్తులను బ్రసాదించుటకుఁ బరమేశ్వరునిఁ గడుభక్తితోఁ బ్రార్థించుచున్నదానను" అని పలికి యాసనయయ్యెను.

కాత్యాయనీదేవి తనభాషణమును ముగించిన పిమ్మట సభానేత్రి జ్ఞానవతీదేవి సభాసదుల కెల్లరకును ధన్యవాదముల నొసంగి సభను పూర్తిచేసెను. పిమ్మట సభ కరుదెంచిన స్త్రీలెల్లరును "భారతమాతకు జయము, కాత్యాయనీదేవికి జయము" అని దిశలు ప్రతిధ్వనించునటు లుచ్చరించుచుఁ గర్తవ్యనిశ్చితలై నూతనోత్సాహము గలవారై తమ తమ గృహముల కరిగిరి.

## ఇరువదియవ ప్రకరణము

స్త్రీ సమాజము శాంతిభూయిష్ఠమైనదయ్యెను. సన్మార్గప్రవర్తనమును జేకొనియైను. స్త్రీ పురుషులన్యోన్యానుకూలమున మెలఁగుచుండిరి. అద్దానిని గలిగినంతనె

కాత్యాయనీదేవి కలవడిన సంతసమెంతని చెప్పనగును. ఒకనేత తన విశ్వాసమును, సిద్ధాంతమును ననుసరించి జనతా సుధారకమును గావించియుండ మఱియొకనేత మొదట నేతయొక్క విశ్వాసమునకు, సిద్ధాంతమునకుఁ బ్రాతికూల్యమాని, వేఱొక మార్గమాని సుధారకము గావింప నెంచును. అంతాయిరువురలో నేనేత కార్యక్రమము జనతాను కూలమును హితకరమును నైనది సిద్ధియగునో, ఆనేత కలవడు నానంద మపారమైన దగును. అవిధముగనే కాత్యాయనీదేవి తన కలవడిన విజయమున కపారానందమును, నానందముతోఁ బాటుగ స్త్రీసమాజము భీషణ పరిస్థితి యందుండి బయలు వెడలి సుధరతఁగనినందులకు నమిత హర్షమును బొందఁజొచ్చెను. ఒక్క కాత్యాయనీదేవియే కాదు. ఎల్లరును సంతుష్టాంత రంగులు కాఁదొడఁగిరి. ప్రతి స్త్రీయును, బ్రతిపురుషుఁడును, గాత్యాయనీదేవికిఁ గృతజ్ఞత గలవారలై యామె చూపిన మార్గమునఁ గండ్లు మూసికొనియే నడచుకొనుట కుత్సుకులైరి. ఉద్యుక్తులైరి. సమాచార పత్రము లైక కంఠ్యముగ కాత్యాయనీదేవి కార్యక్రమమును సమర్థనము గావించెను. ప్రతిష్ఠితవ్యక్తులెల్లరును సమాచారపత్రికలమూలమునఁ గాత్యాయనీదేవి ప్రశంసనము నమితముగఁ గావింపసాగిరి. జనతానురాగమును బ్రతిష్ఠితవ్యక్తి సమర్థనమును దత్సహయోగమును బడసి కాత్యాయనీదేవి యానందము ద్విగుణితమైన దయ్యెను. ఆమె కార్యసాధనమున ద్విగుణితోత్సాహమును బూనినదయ్యెను.

స్త్రీసుధారక కార్యమును విస్తృతరూప మొనర్చుటకునై కాత్యాయనీదేవి 'మహిళాసేవక సమాజము' అను పేరున నొకసంఘమును నెలకొల్పెను. ప్రతిష్ఠితులగు పురుషులు, స్త్రీలు, నెల్లరును, నీసంఘమునసహయోగులైరి. ఈసంఘమును కాంగ్రెసు సంస్థవలె దేశవ్యాపక సంస్థను గావించుటకును, స్త్రీ పురుషులెల్లరును సంఘసభ్యులుగఁ జేయుటకును, స్త్రీలను సుధారకము గావించుటకును. స్త్రీల కధికారములఁ జేకూర్చుటకును, నీమహిళాసేవకసమాజముఖమున నాందోళనము వెడలించుటకును నిశ్చితమయ్యెను.

కాత్యాయనీదేవి కార్యక్రమ ముదారమును సర్వప్రియమునునై యుండెను. స్త్రీపురుషు లెల్లరును మహిళాసేవకసమాజమున సభ్యులఁ జేర్చుటకును, సమాజమును లోకసానుభూతిప్రాప్తిఁ గను దానిగఁ జేయుటకును ప్రయత్నములు గావింపఁ జొచ్చిరి. కొలఁది కాలముననే దేశమందంతటను, మహిళాసేవక సమాజముయొక్క సభ్యుల సంఖ్య యెక్కుడుగఁ జూపట్టఁ జొచ్చెను. దేశమందలి స్త్రీ లెల్లరును నీ సమాజమును దమకుఁ బ్రతినిధి సంస్థగ భావింప సాగిరి.

మహిళాసేవక సమాజముయొక్క ప్రధాన కార్యకర్తలలో శ్రీమతి కాత్యాయనీదేవి, శ్రీమతి శైలకుమారీదేవి, శ్రీమతి జ్ఞానవతీదేవి, శ్రీమతి రమాదేవి,

బాబూ ఆనందస్వరూపుఁడు, శ్రీ చాందనారాయణుఁడు, వినయకుమారుఁడు మొదలగు పరిచితవ్యక్తులే కాక పలువురు సజ్జనులు కూడ నియుక్తులై యుండిరి. కాని, పరిచితవ్యక్తులే కర్తలు. ధర్తలు. వారు చేయు కార్యములు సర్వజనాంగీకృత ములు. వారేపని చేసినను సార్వజనిక హితదృష్టిఁ జేయుదురని యెల్లరకును విశ్వాసము. అయినను, మహిళా సేవక సమాజముయొక్క మహాసభను సమకూర్ప వలయుననియు, నందు, సర్వజన సమ్మత మగు విధమునఁ గార్యక్రమమును నిర్దిష్ట మొనరించి తదను సరణముగఁ గార్యమును సలుపుటకుఁ గృతనిశ్చయులైరి. ఈ నిశ్చయము ననుసరించి కాత్యాయనీదేవి గృహమునందు సమాజాధివేశ మొందు సమకూర్పఁబడియె. అందు సర్వజన సమ్మతముగ, ప్రకృతము ప్రచలిత మగుచున్న శిక్షాప్రణాళిక యందలి దోషములను దూర మొనర్చి, స్త్రీలయందు విద్యాప్రచారమును దీవ్రముగ సాగింప వలయు నని నిశ్చయింపఁబడినది. అయ్యది యేతీరున సాగింపవలయునో దానిని నిరూపించుటకుఁ బైపరిచితవ్యక్తు లొకసంస్థగ (Committee) నేర్పఱుపఁ బడిరి. ఆ సంస్థకుఁ గాత్యాయనీదేవి యధ్యక్షురాలుగ నియమిత యయ్యెను.

ఈ సంస్థ సుదూర విచారమును సుదీర్ఘపరామర్శ యొనర్చి ప్రస్తుతము శిక్షిత లగు స్త్రీలలో నంకురితములై ప్రవృద్ధిఁ గనుచున్న దుర్భావములను దూర మొనర్చి, వారి హృదయములు భారతీయాదర్శ భారతీయవర్తన, భారతీయ విచారములయందు, సంలగ్నము లగు నటులఁ జేయుటయును, వర్తమానశిక్షాప్రణాళిక యందలి దోష ములను దొలఁగించుటయును, నావశ్యక విషయములయి యున్నందునఁ గాత్యాయనీ దేవి పరివీక్షణమున నాదర్శమహిళా విశ్వవిద్యాలయ మొందు స్థాపిత మొనర్చి, యందు భారతదేశీయ పరిస్థితుల కనుకూల మగు విధమున శిక్షాప్రణాళిక నేర్పఱిచి, తదను సరణముగ విద్యాశిక్షలఁ గఱపుటకు నిశ్చిత మయ్యెను. అంతియకాక కేవ లము పుస్తక శిక్షయే కాకుండ నైతిక కాయిక మానసిక శిక్షలఁ గూడ నొసంగి స్త్రీలను బూర్ణవిదుషులుగను సుదక్షగృహిణులుగను సుయోగ్యమాతలుగను, జేయుటకుఁ గూడ విశేషధ్యాన ముంచుటకును, దేశసమాజ పరిస్థితుల గ్రహించి తత్సమయానుకూల సేవాతత్పరు లగు వారినిగఁ జేయుటకు నిర్ణయ మొనర్చెను. సదా చార నిరతలుగను, బతులకు యథార్థరూపమున సహధర్మిణులుగను, సహయోగులు గను నగు వారలఁ జేయ నెంచెను. భారతీయ యువతులను సర్వవిధముల దేశేతర యువతుల కాదర్శనీయులుగఁ జేయ సమకట్ట నెంచెను. ఇట్టి యాదర్శ విశ్వ విద్యా లయ మొందు స్థాపితమైన పిమ్మట, దానిని సమాజ సమ్ముఖమున నుదాహరణముగ

నిడి, తదనుసరణ వర్తనమునకుఁ బాధ్యము గావించుచు వర్తమానప్రణాళి సుధార కముఁ గూర్చి, తీవ్రాందోళనము గావించుటకు నిర్దిష్ట మయ్యెను.

సంస్థానిర్ణయము ననుసరించి రాష్ట్రీయ మహిళా విశ్వవిద్యాలయ నామక విశ్వవిద్యాలయ మొండు సంస్థాపిత మయ్యెను. అందుల ప్రధానాధ్యక్షపదవి కాత్యాయనీదేవి కొసఁగఁబడెను. అయ్యది విద్యాలయము కాదు. ప్రత్యక్ష స్వర్గ సదనమన నొప్పును. అందు బాలికలు మొదలు తరుణుల వఱకును, బరస్పరము చూపట్టు ప్రేమానురాగములు, స్నేహవాత్సల్యములు, చూపఱ హృదయముల కానందమును నాశ్చర్యమును గలిగించు చుండెను. పఠనసమయమునకుఁ బూర్వము విద్యాలయమునందలి విశాలాంగణము (Hall) నందు విద్యార్థినులును, నుపాధ్యాయినులును, నెల్లరును జేరి యీశ్వరవందనము, భగవత్ప్రార్థనమును గావింతురు. అనంతరము కాత్యాయనీదేవియుఁ, దదితరులును, సుయోగ్యులగు యుపాధ్యాయినులును, విద్యార్థినులును, సదాచారము, బ్రహ్మచర్యము, శీలము, నమ్రత, పాతివ్రత్యము, గురుజనపూజనము, గృహప్రబంధము గార్హస్థ్యధర్మము మొదలగు మహత్వపూర్ణము లగు విషయములఁ గూర్చియు, స్త్రీజాతికి, స్త్రీసమాజమునకు నున్నతిఁ గూర్చు విషయములఁ గూర్చియు, నుపదేశము లొసంగుచుందురు. కేవలము వాగ్రూపమున నుపదేశ మొసంగుటయే కాదు. అందలి యధ్యాపిక లెల్లరును, దమ తమ వర్తనములను వ్యవహారములను విద్యార్థినుల సమ్ముఖమున నుదాహరణములుగ నిడి, వారలను దదనుసరణలగునటుల బాధ్యులఁ గావించుచుందురు. ఒకరిని మించిన వారింకొక రగు సుయోగ్యలు, సుదక్షలు, తమతమ పాఠ్యవిషయములలో నత్యంత నిపుణమతులును, ననుపమానలును, సదర్మసదాచారవర్తనముల యందద్వితీయులును, నాదర్శలును నగు నధ్యాపిక లను వెదకి వెదకి కొనితెచ్చి, విద్యాలయమునందు నియమితలఁ గావించిరి. ఆంగ్లము, అర్థశాస్త్రము, విజ్ఞానము, దర్శనము, ఇతిహాసము, రాజనీతి, గణితము, కళాకౌశలము, సంగీతము, వాణిజ్యము, చికిత్సాశాస్త్రము, మొదలగువిషయములయం దద్వితీయ లగువారలేయధ్యాపికలుగ నియమితలై యాయా విషయములఁ గూర్చిన శిక్షను యువతుల కొసంగు చుండిరి. ఈ విద్యాలయమునందు యువతులకుఁ బ్రతివిషయము నందును, సర్వశ్రేష్ఠమగుశిక్ష యొసంగఁబడు చుండెను. శిక్షతోఁబాటు, కుట్టు పనులు మొదలగునవి నేర్పఁబడు చుండెను. భారతీయ విచారములను, ఆచారములను, ఆదర్శములను సభ్యతను ననుకరించు వర్తనము గఱపఁబడు చుండెను.

రాష్ట్రీయ మహిళా విశ్వవిద్యాలయము నందలి పాఠ్యవిషయములలో భారతీయ భావమును నుత్పన్న మొనర్చు పుస్తకములు పఠనగ్రంథములుగ నిర్ణీతములగు

చుండెను. ఒక్కొక్క తరగతియందును, నొక్కొక్క శ్రేణియందును, భారతీయా
దర్శదేవీమణుల కీర్తి చరిత్రముల వర్ణనలుగలవి. భారతీయ వీరాంగనల వీరతయుఁ బతి
పరాయణతయు, నాదర్శములుగ నిడి, తమ సతీత్వమును, తమధర్మమును సంరక్షించు
కొనుటకుఁ దమసర్వస్వమును దుదకుఁ బ్రాణములనుగూడ నాహుతుల కావించిన
సతీమతల్లుల చరిత్రములు, భారతీయ విదుషీమణుల చరితములు, భారతీయదేశసమాజ
సేవికామహిళారత్నముల చరితములు, వారు సలిపిన మహత్కార్యముల వివరణములు
యథార్థరూపమున వర్ణితములైన పుస్తకములు పఠనీయములు నిర్దిష్టములుగా నగు
చుండెను, ప్రతివిషయమునందును నుత్తమోత్తమైన గ్రంథము పఠనీయముగ నిరూపింపఁ
బడుచుండెను. సాహిత్యమునందు షేక్స్పియరు, మిల్టనుల యశ్లీలములు, శృంగార
రసపూరితములునగు దూషితపుస్తకములు నిర్ణీతములుఁ గాఁబడుటలేదు - విశ్వవిద్యా
లయమునందలి పాఠ్యపుస్తకములలో శృంగార ప్రేమ రసోద్బోధకము లగు పుస్త
ములకు స్థానమలవడుటలేదు. మహారాణి అహల్యాబాయి, మహారాణి లక్ష్మిబాయి,
మహారాణి పద్మినీబాయి, మొదలుగాఁగల వీరాంగనల వీరత్వము నిజరూపమున
సంకీర్తితములైన పుస్తకములు నిర్ణీతములయ్యెను. భారతీయేతిహాస గ్రంథములలో మహా
రాణా ప్రతాపసింహుని "దోపిడిగాఁ" డని వీరశిరోమణి ఛత్రపతి శివాజీని
"కొండయెలుక" యని, మహారాణి లక్ష్మిబాయిని "విద్రోహి" యని నిందిం
చుచు వారలను నీచతకుఁ బాలుగావించిన గ్రంథ మొక్కటియుఁ గానరాదు. ఏ
గ్రంథములయందు భారతీయ వీరత, భారతీయసభ్యత, ప్రాచీన భారతీయసామాజిక
పరిస్థితి మొదలగు వానినిఁ గళంకితములుగను, నింద్యములుగను, త్యాజ్యములుగను
వర్ణింపబఁడియున్నదో, ఎందు క్లైవు, వారన్ హేస్టింగ్సు, డల్ హౌసీ మొదలగు వారు
ప్రశంసింపఁ బడియున్నారో, యాగ్రంథములు పాఠ్యగ్రంథములుగా నుంపక
బహిష్కృతము లయ్యెను. భారతీయేతిహాసము నిజరూపమున నున్నది యున్నయట్లు
వర్ణింపబడినట్టి గ్రంథములు, భారతవీరులు, వీరాంగనలు, శూరత, ధర్మపరాయణత
సత్యసంధత, కార్యనిపుణత, నీతికుశలత, నిజరూపమున వర్ణితములైనవియును, సత్య
దూరములుగను, నతిశయోక్తి పూరితములును కానట్టివియును, నగు గ్రంథములే
పాఠ్యములుగ నిర్ణయింపఁబడినవయ్యెను.

విశ్వవిద్యాలయమునందుఁ బాఠ్యవిషయక పుస్తకపరివర్తన మొనర్చుట కతిరి
క్తముగ విద్యార్థులకు ధార్మికశిక్ష నొసంగుటయందు విశేషధ్యాన మొసంగఁబడు
చుండెను. చారిత్రక బలమునందును. సదాచార నిష్ఠయందు, ఆదర్శనుల గావించు
టయే రాష్ట్రీయమహిళా విశ్వవిద్యాలయమునకుఁ బ్రధానలక్ష్యమయి యుండుటవలన

నం దెవ్విధమయిన త్రుటియుఁ గలుగుట కవకాశముగలుగకుండునటులు తగుప్రయత్న ప్రబంధము నిర్మింపఁబడియెను. కాత్యాయనీదేవి స్వయముగ విద్యార్థినుల చరిత్రమందు వర్తనమునందు, సదాచారమునందు, నెట్టి విచ్ఛిత్తియుఁ గలుగకుండునట్లు చేయు యత్నమున లగ్నచిత్తయై యుండెను. తమపూర్వుల శీలవర్తనము ధర్మనిష్ఠ, యౌదార్యము, స్వార్థత్యాగము మొదలుగాఁగల సద్గుణములను మననము గావించుచుఁ దదనుకరణమునందుఁ బ్రోత్సాహ మొనరించుచుండెను.

విశ్వవిద్యాలయమున కనుబంధముగ వసతిగృహము, భోజనశాలయుంపఁబడి యుండెను. తత్పరిశీలనమును గాత్యాయనీదేవియు, నామెకు విశ్వాసపాత్రురాలును నగు జ్ఞానవతీదేవియుఁ బలుతెఱంగుల జూచుచుండిరి. జ్ఞానవతీదేవి యనుమతిని బడయక ఛాత్రాలయములోని కరుగుటకుఁ బురుషులకేరికిని నవకాశము లేకయుండెను. విద్యార్థినుల తండ్రులుగాని, యన్నదమ్ములగాని, యితరసమీపబంధువులుగాని, తమ బాలికలఁ జూడవలయునని జ్ఞానవతీదేవి యనుమతిఁ బడయుచుందురు.

భోజనశాలయందు విద్యార్థినుల మనోరంజకమునకుఁ బూర్ణప్రబంధములు నిర్మితములయ్యెను. సర్వసౌకర్యములు చేకూర్పఁబడినవి. సంగీతము, చిత్రలేఖనము, నేర్పబడును. పుష్పవాటికానిర్మాణము, వృక్షదోహదము, మొదలగునవి నేర్పఁబడును. అన్నిపనులయందును బ్రతివిద్యార్థినియు, నభ్యస్తకావలయునను నియమము తప్పనిసరియయిన దయ్యెను. విద్యార్థినులందఱును, అన్నిపనులయందును, పిన్నలనియును, పెద్దలనియును, ఉచ్చనీచశ్రేణులనియును, నంతరము లేకయుండఁ గలిసిమెలిసి వర్తిలుచుండుటవలన వారిలో భేదభావములు లేక యన్యోన్యము మైత్రియుఁ బ్రేమయు, సానుభూతియు, బ్రవృద్ధములగుచుండెను.

విద్యార్థినుల కందఱకును గృహకృత్యములయందు నైపుణ్యమును గనుట కవకాశ మీయబడుచుండెను. పాకశాస్త్రమునందుఁ బ్రావీణ్యము కనుటకుఁ దగిన యేర్పాట్లు చేయబడుచుండెను. సర్వవిధములగు పక్వాన్నములు, పిండివంటలు సిద్ధముచేయు విధమందఱకును గఱపబడుచుండెను. భోజనశాలయందు వంటచేయుటకు సేవకులను నియమించుటలేదు. విద్యార్థినులే వంతులవెంబడి వంటచేయవలయు ననునియమము దాఁటరానిదిగ నుండెను. అనివార్యముగను నుండెను. దాన విద్యార్థినులందఱును బలువిధములగు వ్యంజనములు, వివిధములగు వంటకములు సిద్ధముచేయఁగల జ్ఞానము సంపూర్ణముగఁ బడయగలవారలగుచుండిరి. అంతియగాక పలువిధములగు కుట్టుపనులు, అల్లికపనులు, శిశుపాలనము, గృహప్రబంధము, మొదలగు నావశ్యకవిషయములు కన్యలకును, యువతులకును, నిర్బంధరూపమున నేర్పబడుచుండెను.

కాత్యాయనీదేవి మస్తిష్కభూజమందుత్పత్తిల్లిన యీసత్ఫలమును నీవిశ్వవిద్యాలయప్రతిష్ఠాపనమును బరికించి సమాజమంతయు విస్మితమయ్యెను. ఆమె భారతీయ సభ్యత, భారతీయాదర్శస్వచ్ఛస్వరూపము. రాష్ట్రీయ మహిళావిశ్వవిద్యాలయమునం దుపస్థితము గావించి యెల్లరను జకితహృదయములఁ గావించెను. అందు శిక్షా ప్రాప్తిగని, బయలువెడలిన మహిళావతంసములు, కాత్యాయనీదేవి యొక్కయు, నామెతోఁబాటు విశ్వవిద్యాలయము యొక్కయుఁ గీర్తిగేయములను దేశవిదేశముల యందుఁ బ్రతిధ్వను లీనుటులు పాడఁజొచ్చిరి. కాత్యాయనీదేవి రాష్ట్రీయమహిళా విశ్వవిద్యాలయములయొక్క చర్చయుఁ బ్రశంసయు సమస్త దేశములయందును బ్రతిధ్వను లీనఁజొచ్చెను. ఆమెసమాజసుధారకమునందు, నూతనోత్సాహము నూతన కార్యక్రమమును నుత్పన్న మొనరించెను. రాష్ట్రీయ మహిళా విశ్వవిద్యాలయ శిక్షా ప్రణాళిక ననుసరించి వర్తమాన శిక్షాప్రణాళిని సుధరము గావించుట కాయోజనము సలుపబడసాగెను. దొరతనమువారి మూలముగ నీశిక్షాప్రణాళి ప్రచరితము గావింపఁ బడుట కాందోళనము జరగుచుండెను. చట్టనిర్మాణసభాసభ్యులు ఈవిశ్వవిద్యాల యము నుదాహరణముగ నిడి, తదనుసరణముగ శిక్షాప్రణాళిని నేర్పఱించుటకు దొర తనము వారిని నిర్బంధింపఁ జొచ్చిరి.

ఇది యిట్లుండ వేటోళవంక సంపత్తిశాలురు, సమాజసేవాతత్పరులు, స్త్రీ శిక్షాభిమానులు. స్త్రీసమాజ సుధారాభిలాషులు, సజ్జనులు, స్వయముగ వ్యయభా రముగ్రహించి స్థానస్థానములయందు నీవిశ్వవిద్యాలయమున కంతర్గతములుగ ననుబంధ ములుగ బాలికాపాఠశాలలు, మహిళాకళాశాలలు నెలకొలుపఁజొచ్చిరి.

కాత్యాయనీదేవి సమాజమును నొక్కసారిగ పరివర్తనము గావించెను. సన్మార్గమునునుంచెను. వైదేశిక శిక్షాప్రణాళిని వైదేశికాచారములను, వైదేశిక జీవన వ్యవహారములను, నాదర్శములుగఁ జేకొనిన యెడల, నధఃపతనమును, మనదేశసభ్యత మనదేశాచారములు, మనదేశవిచారములు, మనదేశ జీవనవ్యవహారములు, మనదేశ శిక్షాప్రణాళినాదర్శముగ గ్రహించిన యెడల నౌన్నత్యము గలుగునని ప్రత్యక్షరూప మునఁ బ్రమాణపూర్వకముగ సిద్ధిలునట్లు చేసెను.

## ఉపసంహారము

కాత్యాయనీదేవి కార్యకలాప మచిరకాలముననే యామె పితృవ్యునకు మహే శ్వరనాథునకుఁ గండ్లు తెఱచునట్లు చేసెను. అతనికిఁ దానొనర్చిన సోదరవంచనము నకును, దా నవలంబించిన యనుచితవర్తనమునకును, దాను జేకొనిన లోభగుణము

నకును, స్వార్థచింతనమునకును, బశ్చాత్తాపమునుగలిగించెను. ఆవేదనము నుదయింపఁ జేసెను. అతఁడు కాత్యాయనీదేవి కడ కేగి తానొనర్చిన కుత్సితమును, నన్యాయ పూరితమును, నగు వ్యవహారమునకు క్షమాప్రార్థనమును జేయవలయు నని తలంపఁ జొచ్చెను. కాని, యామె యెదుటికరగుటకుఁ దగు సాహస మాతనికిఁ బొడసూప దయ్యెను. అతని హృదయమం దుదయించిన యాత్మగ్లాని యనుదావానలము దిన దినము ప్రజ్వలితమైన యాతని శరీరమును లోలోన దహింప సాగెను.

ఒక దినము ప్రాతస్సమయము. ప్రిన్సిపల్ కాత్యాయనీదేవి నిత్యకృత్యములు నిర్వర్తించుకొని తన కచేరీగదిలోఁ గూర్చుండి తపాలా బంట్రోతు తెచ్చియిచ్చిన జాబులు విచ్చి చూచుచుండెను. ఆ సమయమున ద్వారపాలకుఁ డొకఁ డరుదెంచి సవినయముగ వందన మాచరించి యామెతో "తమ దర్శనము నభిలషించి యొక సజ్జనుఁడు వేఁచి యున్నాఁడు" అని మనవిచేసెను. అతనిని లోనికిఁ గొని రమ్మని ద్వారపాలున కాజ్ఞ యొసఁగెను. ఆజ్ఞ యలవడుటయె తడవుగ ద్వారపాలుఁ డాతనిఁ గాత్యాయని యున్న యెడకుఁ గొని తెచ్చెను. అంతఁ గన్నుల నీరు కార్చుచు నొక కాషాయాంబరధారి యగు సన్న్యాసి యరుదెంచి యామె పాదప ద్మముల మీఁద వ్రాలి, శిరమును మోఁదుకొనుచు, తల్లీ! క్షమాప్రదాన మొసంగు మని విలపింపఁ దొడఁగెను. ఈ సంఘటనమువలనఁ గాత్యాయనీదేవికిఁ గలిగిన శోక సంతాపములకు మేర కానరాదు. ఆమె తన పాదములపై వ్రాలియున్న యా జీర్ణ దేహుని, సుష్కశరీరుని, నస్థిచర్మావశిష్టుని, లేవనెత్తి పరికించి నంతనే యాతఁడు తన పినతండ్రి యని గుర్తించెను. అంతఁ గాత్యాయనీదేవి ధైర్యము గట్టుతెగి పలు వంకలఁ బాఱఁజొచ్చెను. ఆమె కమల సదృశము లగు నేత్రములనుండి యవిరళముగ నశ్రుధారలు ప్రవహింపఁ జొచ్చెను. ఆమె యాతని పాదములపై వ్రాలి వెక్కి వెక్కి యేడువఁ దొడంగెను. మహేశ్వరనాథుఁ డామెను లేవనెత్తి యక్కునఁ జేర్చెను. కాత్యాయనీదేవి రుద్ధకంఠ యయ్యెను. అతని ముఖమును తదేకధ్యానమునఁ బరికింపఁ జొచ్చెను, ఎంత ప్రయత్న మొనరించినను నామె నోటమాట వెడల దయ్యెను. దాన నవనతవదనయై క్రిందుఁ జూచుచుండెను. అంత నొక పెద్ద కాగితపు సంచి యామె దృష్టికి గోచరించెను. అద్దాని నెత్తి చూడఁగా నందుఁ దన చిరు నామా వ్రాయఁబడి యుండుటఁ గాంచి చకిత యయ్యెను. ఆ సంచిని విప్పెను. దాని యందుండు పత్రమును జదివెను. తన పినతండ్రి తనకు వ్రాసి యిచ్చిన దానపత్రము. రిజష్టరు చేయఁబడి యుండినది. అతఁడు తన సర్వస్వమును దత్పత్రమూలకముగఁ గాత్యాయనీదేవి వశ మొనర్చెను. అద్దానిఁ జూచి కాత్యాయని విలపించెను. ఆమె కన్నులెఱ్ఱనయ్యెను. ముఖము కందిపోయెను. అంతఁ గొంతవడికిఁ గాత్యాయనీదేవి

పినతండ్రి మహేశ్వరనాథుఁడు ఇంచుక ధైర్యముఁ దెచ్చుకొని, తడఁబడుచు నామెతోఁ, బుత్రీ! నేను మహాపాపిని. ఘోరపాపిని. నన్ను క్షమింపుము. క్షమింపవేని నా యాత్మగ్లానిని నేను సహింపఁ జాలను. దాన నాత్మహత్యకు బాధ్యుఁడను గావలసిన వాఁడ నగుదును. నా హృదయము సంసారము నందుండి విసరి చెందినయది. ప్రాయశ్చిత్తస్వరూపముగ నా జీవనశేషమును సన్యాసినై ర్యతీతము గావింప నిశ్చయించితిని. నాకడ నున్న దాని నంతను విక్రయించి తల్లభ్య ముక్తి ఎనుబది లక్షల రూప్యములను నీ పేర ఇంపీరియల్ బ్యాంకిలో నిలువచేసితిని. ఆయ్యది నీ ధనము. దానిని నీ యిచ్ఛ చొప్పున వ్యయము చేయుము. నిన్నుఁ బర మేశ్వరుఁ డెల్లప్పుడును సకుశలముగ నునుచుఁ గాత! అదియే యీ సన్న్యాసి కామితార్థము.

అతని మాటలు విన నిఁకఁ గాత్యాయనీదేవి సహింపఁ జాలని దయ్యెను. ఆమె వెక్కి-వెక్కి యేడ్చుచు, "మీరు నాకుఁ బినతండ్రులు, పితృసములు. నేను మీకు క్షమాప్రదాన మొసంగుట కర్హతగల దాననా! బిడ్డలు తండ్రులకు క్షమా దాన మొసంగుట యెన్నఁడైన నెందైన నుండెనా! మీరు నా కేమియు ననర్థమును నన్యాయమును జేకూర్చియుండలేదు. సరియే కదా! నాకు మేలొనర్చితివి, సౌభా గ్యమొదఁ గూర్చితివి. నాకుఁ బూజ్యవరునిఁ గూర్చి వివాహ మొనర్చితిరి. నేను పతిప్రేమను రాగములఁ బడసినదాన నగుటకుఁ గారకులు మీరు గాక మరెవరు? నాకుఁ గావలసినది దానికంటె వేరెక్కుఁడైనదెద్ది! అట్లుగాక, నన్నొక ధనవంతున కిచ్చి పెండ్లిచేసిన వారలైతిరేని, యాతఁడు ధనమదాంధుఁడై, నాయెడ నిరాదరముఁ జూపువాఁడగు నెడ నేనేమయి పోయియుందునో? ధనసంపత్తి లేకపోయినను బోఁ౯ందు. విద్వత్సంపద, గుణసంపద గల పతిఁ బడసిన తత్సేవవలన నేను బొందు సంతృప్తిని సంతోషమును నేరు గ్రహింపఁ గలరు? తండ్రీ! ధనలోభము మహాపురు షులఁ గూడ డోలాందోళితులఁ గావించును. అయ్యది మనుజులను దురాశాపీడితులు గను, దుర్గుణసంపన్నులుగను, దుర్వర్తనులుగను, మాయాజాలప్రస్తారులుగను జేయును. తండ్రికొడుకులకు, అన్నదమ్ములకు, విరోధమును గలిగించుట యద్దానికి సహజ కృత్యము. అద్దాని ప్రభావము మీఁపైఁబడినపుడు అందు మీ దోసమేది? ఆదోషము ధనము ననుసరించినయది కాదా?

మీ కృపాకటాక్షమునఁ గొద్దిగొప్ప సమాజసేవ సలుపుటకు సామర్థ్యము సంప్రాప్త మయ్యెను. అధవాధన సంపత్తి కధికారిణి నైతినేని నీ సమాజసేవ నీ మాత్రమైనను సలుపుటకు శక్తి కలదానను గాకుండ నుండి యుందును. ప్లీ

పక్క మొదలగు క్షుద్రజంతువులఁ బోలెఁ, గుక్షింభరినై మానవ జన్మమును గళంకితము గావించిన దాన నగుదును. తండ్రీ! మీరు నాకు సర్వవిధముల శ్రేయమొనర్చియుంటిరి. మీ వలన నౌన్నత్యమును గనఁగలిగితిని. మీ వలననే యించుక జ్ఞానప్రాప్తి గలదాననైతిని. మీ వలననే నాకు మహదైశ్వర్యము సంప్రాప్త మైనది. మీరు నా సౌభాగ్యమునకుఁ బ్రధాన కారకులు. మీ కెంతయుఁ గృతజ్ఞురాలను. అట్టి సమయములో నన్ను క్షమాయాచన మొనర్చుచు నన్ను వ్యర్థముగ నిర్ణిమిత్తముగఁ జేయువారలు... ... ...

కాత్యాయనీదేవి మాటకు మహేశ్వరనాథుఁడు అడ్డమువచ్చి "కాత్యాయనీ! నీవు మానవ స్త్రీవి కావు. సాక్షాత్పరదేవతవు. పరమాత్మ నినుఁ బోలు సతీమతల్లులను దేశమం దుదయింపఁ జేయునేని దేశక్షోభరహితమును, సంపత్సమృద్ధమును గని సర్వవిధముల భాగ్యవంతమైన దగుటకు సంధియము లేదు. కాని, పుత్రీ! కాత్యాయనీ? ఒక్కసారి, కేవలము, ఒక్కసారి, నీ నోటి క్షమ నొసంగితిననుము. పుత్రీ! నీ పితృవ్యుఁడు నేఁడు నీ కట్టెదుట చేతులు జోడించి నిలిచి క్షమాభిక్ష దేహి యని యాచించుచుండఁ దద్భిక్ష నాతనికొసంగ మనసుగొలుపుటలేదా? అతనిని క్షమింప నొల్లదా! నా ప్రియపుత్రీ! మరల నిదె చేతులుజోడించి యాచించు చున్నవాఁడను. నన్ను క్షమింపుము. నా హృదయము విదీర్ణమగు చున్నది. నా యాత్మగ్లాని నా శరీరమును, అరణ్యమును గార్చిచ్చు దహించునటులు దహించు చున్నయది. రోమకూపములనుండి యగ్నిజ్వాలలు వెడలుచున్నయవి. ఏమి? నా హృదయమునకు శాంతి నొసంగ నొల్లరా? చల్లఁదనమును గలిగింపఁ దలంపరా? నా యందుఁ గనికరముఁ జూపరా? అని పలికెను.

మహేశ్వరనాథుని మాటల నాలించి కాత్యాయనీదేవి "బాబూజీ! నా క్షమ మీకు సంతుష్టి కలుగఁ జేయునది యగునెడ, మీకు సౌఖ్యమును జేకూర్చునది యగునెడ, మీకు మనశ్శాంతి కలుగుటకుఁ గారణ మగునది యగునెడ, మీ సోదర పుత్రి, మీ ప్రసన్నతకొఱకు, మీ యాజ్ఞాపరిపాలనము కొఱకు. మీరు పూజ్యులని మది నెన్నుచు, ననుచితమైనదైనను, మీకు క్షమాదాన మొసంగుచున్నయది." అని డగ్గుత్తికతోఁ బలికెను. ఆ పలుకుల నాలించి మహేశ్వరనాథుఁ డానంద పరవశుఁ డయ్యెను. అతని మానసిక వేదన మొక్కుమ్మడి విలోపముఁ జెందెను. ఒక విధమగు నపూర్వమగు తేజ మాతని ముఖమునఁ జూపట్టఁ జొచ్చెను. అతఁడు ప్రసన్నహృదయుడై "పుత్రీ! నేఁడు నా భారము చులకన యైనది. ధన్యుఁడ నైతిని. నేను మనఃపూర్వకముగ నిర్మలాంతః కరణముతో నాశీస్సుల నొసంగు చున్నాఁడను.

నీవు దేశములో దేవీసమముగఁ బూజింపఁ బడుదువు. నీవలన మహాత్కార్యములు పెక్కులు సుసాధితము లగును. నీ యశఃకీర్తనములు ప్రపంచమం దంతటను సర్వ జనులు కర్ణపేయముగ గానముచేయువారలగుదురు. ఆహా! సోదరా! ఋషీశ్వరా! ఇట్టి సద్గుణ సంపన్నయగు పుత్త్రికను గనుట కెన్ని నోములు నోచితివోగదా! ఎన్ని పుణ్యకార్యముల నొనర్చితివో కదా! తల్లీ! కాత్యాయనీ! నీవు; నీ జనకుని వాంఛిత ములయెడఁ జూపిన మన్ననయు; దత్సంపాదనమందుఁ బ్రకటించిన కౌశలము, పరాకాష్ఠ, భారతీయ మహిళా రత్నముల సమ్ముఖమున నొక యాదర్శ చిత్రముగ నుపస్థితమై యాచంద్రతారార్కముగ వెలయుచుండునది యగుఁగాత! హరిఃఓమ్. తత్సత్. అని పలికెను.

మహేశ్వరనాథుఁడు "హరిఃఓమ్, తత్సత్" అని పలికిన పలుకువలన నుత్పత్తిర్లిన ధ్వనివలన నా విశాలభవనము కంపింపఁ జొచ్చెను. అతఁడు ఆశీస్సుల నొసంగు చుండెను. కాత్యాయని తన ముఖమును వస్త్రాచ్ఛన్నము గావించి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఆమె యేడ్పున కంత మలవడుటయే లేదు. "హరిఃఓమ్, తత్సత్" అను శబ్దము లామె కర్ణములఁ జొరఁబడి యామె ముఖమును నావరించి యున్న వస్త్రాచ్ఛాదనమును దొలఁగించెను. ఆమె కన్నులను విచ్చునటులు చేసెను.

కాత్యాయనీదేవి కన్నులు విప్పి నలువంకలు కలయఁ జూచెను. కాని, మహేశ్వరనాథుఁ డగుపడలేదు. అతఁడు "హరిః ఓమ్. తత్సత్" అని పల్కుచు నందుండి యదృశ్యుఁ డయ్యెను. అతఁ డేవంక కేఁగినదియు, నెందేఁగినదియు నామె తత్తర మందుచు సింహద్వారము కడ కరుదెంచి నలుదిక్కులు వీక్షించుచు, మహేశ్వరనాథుని యుదంతమును గూర్చి పలువురను బ్రశ్నించెను. అంత నొక ద్వార పాలకుఁ డామె యెదుటి కరుదెంచి చేతులు జోడించి నిలిచి "హరిః ఓం తత్సత్, హరిః ఓం తత్సత్" అని పలుకుచు నొక వ్యక్తి లోనుండి యరుదెంచి యావంకఁ బరుగిడుచుఁ బోయెను." అని పలికెను. ఆ పలుకుల నాలకించి, కాత్యాయని, మహేశ్వరనాథుని యుదంతము నారయ నలువంకలకు సేవకులను బంపెను. పలువిధ ములగు ప్రయత్నము లన్నియు విఫలములయ్యెను. అతని యుదంత మలవడదయ్యెను. అతఁ డంతర్ధానము నొందెనో లేక విలుప్తుఁ డయ్యెనో యెరుగను నిర్ణయింప నేర కుండిరి.

కాత్యాయనీదేవి తనపినతండ్రి మహేశ్వరనాథుని యుదంత మారయుటయందు విఫలమనోరథ యయ్యెను. తన పినతండ్రి తనకు దానపూర్వకముగ నొసంగిన సంపత్తు నంతను బతియనుమతిఁ గొని, రాష్ట్రీయమహిళా విశ్వవిద్యాలయమున కొసంగెను.

విశ్వవిద్యాలయ సంచాలనకర్తవ్యమును పంచాయతి (Trust) వశమొనర్చెను. పంచాయతి యందుఁ బలువురు మహనీయులు నియమితులైరి. అందు గణ్యులును మాన్యులును, వదాన్యులును, విద్యాధికులును నగు పురుషులును స్త్రీలునుసమాన సంఖ్యలుగ నుండిరి. కాత్యాయనీదేవి పంచాయతికి మంత్రిణిగను, చాందనారాయణుఁ డధ్యక్షుఁడుగను నెన్నుకొనఁ బడిరి. కాత్యాయనీదేవి రాష్ట్రీయమహిళా విశ్వవిద్యాలయ సంచాలనమునకునై విరాళముగ నొసంగి పంచాయతీ వశ మొనర్చిన ధనము వలన నెలకు నేఁబదివేల రూప్యముల వృద్ధి రాఁదొడఁగెను. తన్మూలమున విద్యాలయ సంచాలనము సుచారు రూపమున విద్యాహితము కా సాగెను.

భారతదేశమందు రాష్ట్రీయ. మహిళా విశ్వవిద్యాలయముయొక్క శాఖోపశాఖలు ప్రతిపట్టణమునందును, ప్రతినగరమునందును, ప్రతిపల్లెయందును నెలకొలపఁ బడియెను. అందు బాలికలు యువతులు బహుళసంఖ్యాకులు వాస్తవికశిక్షఁబడయుచు, నాదర్శవర్తనలై దేశసమాజ సేవాతత్పరలు కాఁదొడగిరి.

నేఁడు కాత్యాయనీదేవి తన జీవన చరిత్రమువలనఁ బ్రకటించిన, శీలవర్తనము, స్వార్థత్యాగము, కార్యకౌశలము మొదలుగాఁగల సద్గుణములు భారతీయ రమణీమణులకుఁ గ్రొత్తలుగావు. అయ్యవి వారలకు సహజములు జన్మసిద్ధములు. శైలకుమారీ రమాదేవులును సంపూర్ణసుచరితలై విద్యాసంస్థయందుఁ బ్రధానులైరి. కాత్యాయనీదేవి జీవనచరితమందు మనసోదరీమణులు ధ్యానమిడువారలగుదురేని కాత్యాయనీదేవి సలిపిన త్యాగమును, గార్యమును మించిన యనుపమములును, మహత్త్వపూరితములును నగు ఘనకార్యముల నెన్నింటినో సాధించుచు, దేశోద్ధారమును సహజముగ సమకూర్చుటకు సామర్థ్యమును బడయఁగలవారలగుదురనుట కిసుమంతయును సందియములేదు. స్త్రీ లెల్లరును, బురుషులును సుస్వభావమును బడసి సుఖముగఁ గాలమును గడపి తమచరిత్రము నాచంద్రతారార్కముగ నెల్లరకుఁ గీర్తినీయముగఁ గావించిరి.

సర్వేజనాస్సుఖినోభవంతు సన్మార్గము జయించుఁగాక: